దేవల మహర్షి చరిత్ర

# దేవాంగపురాణం

(వచనం)

- కడెము వేంకట సుబ్బారావు

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్



Like us to follow

@mohanpublications

ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

ప్రచురణ : మే 2016
ప్రతులు : 1000
మూల్యం : **అమూల్యం**



ప్రతులకు :
**చల్లా మల్లేశ్వర శాస్త్రి సన్స్**
పురోహితులు
శివాలయం వద్ద, **రావూరిపేట గ్రామం**
వేటపాలెం (పోస్టు) మండలం
ప్రకాశం జిల్లా. పిన్ : 523 187
ఆంధ్రప్రదేశ్.

పబ్లిషర్స్ :
**చల్లా మల్లేశ్వర శాస్త్రి సన్స్, వేటపాలెం.**

డిటిపి మరియు ముద్రణ :
విజయ ప్రింటర్స్, వేటపాలెం.






అధ్యక్షులు
**శ్రీ మాచర్ల వెంకటేశ్వర్లుగారు**
Rtd. Superintending Engineer



కార్యదర్శి
**శ్రీ పింజల లలితప్రసాద్‌గారు**



కోశాధికారి
**శ్రీ దోగుపర్తి సుబ్రహ్మణ్యంగారు**

దేవాంగపురాణ గ్రంథాన్ని ఎంతో వ్యయ ప్రయాసలకోర్చి ఎన్నో సంస్కృత గ్రంథాల మూలాలను సేకరించి, దేవాంగ కులరత్న అయిన చల్లా రామారావుగారు ఈ గ్రంథాన్ని రచించినారు. ఈ గ్రంథమువలన దేవాంగబాంధవుల కుల విశిష్టత ఏమిటో ప్రపంచానికి తెలియజేసినారు. సమస్త మానవజాతికే కాకుండా దేవతలకుసైతం వస్త్రదానం చేసిన దేవాంగబాంధవుల దైవం దేవలమనుబ్రహ్మగూర్చి విపులంగా తెలియజేసినందులకు ధన్యవాదములు తెలియజేస్తూ........

ఇట్లు,
అధ్యక్షులు
**మాచర్ల వెంకటేశ్వర్లు**
Rtd. Superintending Engineer
దేవల మనుబ్రహ్మ దేవాంగ సంక్షేమ సంఘము
వేటపాలెం, ప్రకాశం జిల్లా.

## శ్రీ పసుమర్తి వెంకటసుబ్బారావుగారు

శ్రీ పసుమర్తి వెంకట సుబ్బారావు గారు దేవాంగ కులస్తులలో ఐకమత్యమును పెంపొందించుటకు ఎంతగానోకృషిచేయుచున్నారు. మన కులస్తులు రాజకీయ చైతన్యం సాధించటానికి, మన సమస్యలను మనమే పరిష్కరించు కొనుటకు 2010 వ సంవత్సరములో హస్తినాపురం నుండి పందిళ్ళపల్లి వరకు గల గ్రామ సేనాధిపతుల నందరిని ఏకతాటిపైతీసుకువచ్చి సంఘీయు లందరిని ఐకమత్యముగా ఉండాలని కోరినారు. దానికి ఉదాహరణగా ఆణుమల్లి పేటలోని ఆణుమల్లమ్మ గ్రామదేవత గుడికి సంబంధించిన స్థలం దురాక్రమణ దారులనుండి విడిపించటానికి అనేక కష్టములను ఎదుర్కొని విజయాన్ని సాధించినాడు. ఆయన విజయం స్థిరంగా ఉండుటకు దేవాలయ నిర్మాణమును గ్రామస్తుల ద్వారా నిర్మింపజేయుటలో సఫలీకృతులైనారు. గ్రామస్తులయందు ఐక్యత సాధించటానికి రాజకీయ చైతన్యం కలిగించటానికి శ్రీ వెంకట సుబ్బారావు గారు ఎటువంటి కృషి చేసినారో 2012వ సంవత్సరములో రాజమండ్రినందు జరిగిన దేవాంగ మహాసభలు కూడా అదే స్ఫూర్తిని ఇచ్చినవి. వీరికి అన్నదానము చేయటమంటే చాలాయిష్టము. అందువలన ఈ ప్రాంతములో జరుగు దైవిక కార్యక్రమములు గాని, సాంస్కృతిక కార్యక్రమములకు గాని "నేనూ ఉన్నాను" అను రీతిలో యధాశక్తి విరాళములు ఇవ్వటమే గాకుండా అన్నదాన కార్యక్రమము జరిగే విధముగా ప్రోత్సహించుచున్నారు. ఈ దేవాంగ పురాణ గ్రంథావిష్కరణ కార్యక్రమములో ప్రముఖ పాత్ర వహించుటమే కాకుండా భూరి విరాళములు ఇచ్చినారు. అందులకు వారికి కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

ఇట్లు
**చల్లా రామారావు**
గ్రంథకర్త.



## అంకితం

నేటి దేవాంగ వంశమునకు ఆదిపురుషుడు దేవల మను బ్రహ్మ. శివాజ్ఞ ప్రకారము వస్త్ర నిర్మాణ కార్యములో నిమగ్నమై ఉండగా వజ్రముష్ట్యాది పంచ రాక్షస రాజులచేత తీవ్రముగా బాధింపబడుచున్న సమయమునందు త్రిలోకేశ్వరి మరియు జగజ్జనని అయిన పరాంబికా నీవు అచ్చట చౌడేశ్వరీదేవిగా ఆవిర్భవించి పంచరాక్షసరాజులను వధించి దేవల మనుబ్రహ్మకు పునర్జీవనం ప్రసాదించినావు. నేసిన వస్త్రములు ఎప్పటికి తరగకుండ అక్షయప్రదమై ఉండుటకు నీ చేతి దివ్యకంకణమును వరముగా ప్రసాదించి సకల లోకముల వారికి వస్త్ర ప్రదానము జరుగుటకు తోడ్పడినావు. దేవాంగ వంశస్థులందరికి కులదేవతవై సర్వ సుఖములు, భోగములు, జ్ఞానమును నిత్యము ప్రసాదించుచున్నావు. నీ దయవలన మా వంశ ఆది పురుషుడు పునర్జీవింపబడినాడు. తద్వారా దేవాంగ వంశము ఏర్పడినది. అందువలన వస్త్రసూత్ర నిర్మాణం నిరాటంకంగా కొనసాగినది. నేటికి కూడా కొనసాగుచు మా వంశం వారందరికి జీవన వృత్తిగా ఉన్నది. నీయొక్క కరుణా కటాక్షములతో మా అందరికి విద్యాబుద్ధులు కలిగించుచున్నావు. నీయొక్క మానస పుత్రుని గురించి తెలిపే ఈ దేవాంగ పురాణమును యావత్తు దేవాంగ జనులందరి తరపున నీకు అంకితమిచ్చుచున్నాను జననీ.

ఇట్లు,
గ్రంథకర్త,
**చల్లా రామారావు.**

# తొలిపలుకు

దేవాంగ వంశ చరిత్రను తెలిపే బ్రహ్మాండ పురాణములోని అంశములు, తాళ పత్రములలోను, వ్రాతపతులలోను వున్నటువంటి వాటిని సేకరించి, ముద్రించుటద్వార ప్రజలందరికి అందుబాటులో వుండు విధముగా చేయుట జరిగినది. ముద్రించకపోతే చరిత్ర శిధిలమై నశించేది. ఇటువంటి బృహత్కార్యాన్ని దేవాంగ వంశోద్ధారక సమాజము, మద్రాసువారు సాధించినారు. ఈ దేవాంగ వంశోద్ధారక సమాజమువారు తాళ పత్రములను, ప్రాచీన వ్రాతప్రతులలోను వ్రాయబడియున్న బ్రహ్మాండ పురాణములోని బ్రహ్మనారద సంవాదక ఉత్తర ఖండమునందు (రెండవ భాగము) ఉన్న దేవాంగ చరిత్రను తెలుపు సంస్కృత శ్లోకములను అన్నింటిని సేకరించి, వాటికి తెలుగు తాత్పర్యము వ్రాయించాలని సంకల్పించినారు. ఈ సమాజము వారు ఆనాటికి చెన్నపట్టణము (మద్రాసు) నందు నివసించు వారిలో ప్రముఖ సంస్కృత పండితుడు బ్రహ్మశ్రీ పురాణం సూర్యనారాయణ తీర్థులవారిని సంప్రదించి తెలుగు తాత్పర్యము వ్రాసిపెట్టమని కోరినందున శ్రీ పురాణం సూర్యనారాయణ తీర్థులవారు దేవాంగ చరిత్రను అధ్యాయాల వారీగా 29 అధ్యాయాలు తెలుగులో వ్రాసినారు. ఈ విధముగా వ్రాయబడిన తెలుగు దేవాంగ పురాణమును 1913 వ సంవత్సరములో ముద్రిపించినారు. ఆ విధముగా దేవాంగుల చరిత్రను శాశ్వతము చేయుటకు దేవాంగ వంశోద్ధారక సమాజమువారు పాటుపడినారు. దీనిని వాణీ నిలయం ప్రెస్సువారు ముద్రించినారు. దీనిలో సంస్కృత శ్లోకములను ప్రింటు చేయలేదు.

1914 వ సంవత్సరములో శ్రీ గోమేధికం ఓం శంకరస్వామి, సంతపేట, నెల్లూరువారును, గోదావరి జిల్లా, శ్రీ మల్లక్ష్మీ శ్రేష్ఠి – కాళహస్తి సిద్ధాంతిగా పేరుబడసిన వీరు పుల్లేటికుర్తి వాస్తవ్యులు వీరిద్దరూ కలసి దేవాంగ పురాణమును ప్రింటు చేయించినారు. అయితే ఈ గ్రంథంలో సంస్కృత శ్లోకాలకు తాత్పర్యము వ్రాసి ప్రకటించినారు. అందువలన బ్రహ్మాండ పురాణంలోని మూల సంస్కృత శ్లోకాలనుకూడ ప్రింటు చేయుటవలన దేవాంగ చరిత్రకు ప్రామాణ్యమును తీసుకు వచ్చినారు. ప్రమాణమైన శ్లోకం దానికి తాత్పర్యము ఉండుటవలన దేవాంగ చరిత్ర ఊహాజనితమైనది కాదు. ఇది బ్రహ్మాండ పురాణము లోనిదే అని స్పష్టపరచి దేవాంగలోకానికి మహోపకారము చేసినారు. అయితే దీనిలోని భాష గ్రాంధికములో ఉండుటవలన దానిని ఈ వర్తమాన కాలములోనివారు సులువుగా అర్థంచేసుకోలేక పోవుచున్నారు. విషయం బోధపడుట లేదు. ఆ పుస్తకములు నేడు అందుబాటలో లేవు.

1924 వ సంవత్సరములో శ్రీ బొగ్గర ఆదినారాయణగారు **వేదోక్త మూలస్తంభనము** అను గ్రంథమునకు ప్రతి పదార్థముతో కూడిన తాత్పర్యము వ్రాసి దేవాంగ వంశంవారికి మహోపకారము చేసినారు. ఆ తరువాత కృష్ణా జిల్లా బందరు వాస్తవ్యులు శ్రీ కూర్మా గంగయ్యగారు శ్రీ గురుజ్ఞాన సుధార్ణవము అను రజతాచల ఖండము అను గ్రంథమును ముద్రిపించినారు. ఈ గ్రంథము స్కాంధ మహాపురాణములోనిది. తాళ పత్రములలో ఉండిన దానిని కుల గురువులు శ్రీ రుద్రమునిగారు తన దేశ సంచార సందర్భముగా ఈ గ్రంథమును సేకరించినారు. దీనికి ఆకులమన్నాడు వైఖానస ఆగమ పాఠశాలవారు విశేషముగా వ్యాఖ్య వ్రాసినారు. తరువాత 1895 లో దేవల ధర్మశాస్త్రము ప్రింటుకాబడి వున్నది. అయితే పైన పేర్కొన్న గ్రంథములన్నియు పూర్తిగా జీర్ణమై పోయినవి. దేవాంగ సాహిత్యము అందుబాటులో లేకుండా నేడు వున్నది.

ఇటువంటి సమయములో ప్రకాశం జిల్లా చీరాల ప్రాంతములోని హస్తినాపురమునుండి పందిళ్లపల్లివరకు ఉన్న దేవాంగ కవులు తమదైన శైలిలో దేవాంగ సాహిత్యమును సృష్టించినారు. వీరిలో మొదటగా చెప్పుకోదగ్గవారు శ్రీ బండ్ల సుబ్రహ్మణ్యం కవిగారు సంస్కృత శ్లోకములలో ఉన్న "శ్రీ దేవల స్తోత్ర సార సంగ్రహః" అను పుస్తకాన్ని ఈనాటి కాలానికి తగిన వ్యాకరణ రీత్యా దానిని సంస్కరించినారు. వీరు రావూరిపేట వాస్తవ్యులు. రావూరిపేటలో నివసించిన విద్వాన్ శ్రీపింజల సోమశేఖరరావుగారు తన సహోద్యోగి శ్రీయుత కడెం వెంకట సుబ్బారావుగారి సహాయం తీసుకొని దేవాంగ పురాణము అను గొప్ప పద్య కావ్యమును రచించినారు. ఇది బృహత్ గ్రంథము. ఇది పండితులకు మాత్రమే అనగా కావ్యజ్ఞానము కలిగిన వారికే ఉపయోగపడును. సామాన్య ప్రజలకు ఉపయోగకరముగా లేనందువలన వచనములోకూడ దేవల చరిత్ర అను దేవాంగ పురాణమును వ్రాసినారు. పందిళ్లపల్లి వాసులు శ్రీ కడెంవెంకట సుబ్బారావుగారుకూడ నూతన పంథాలో దేవాంగ పురాణము వ్రాసినారు.

ఇవి ఈ కాలములో లభ్యం కావడం లేదు. అంతేకాకుండా దేవాంగ సాహిత్యములో వివిధ ప్రక్రియలలో అనేక రచనలు చేసినారు ఈ ఇద్దరు కవులు. అవి నేటికి అందుబాటులో లేకుండాపోయినవి.

దేవాంగ చరిత్రను తెలిపే గ్రంథములు మృగ్యము అవుచున్న తరుణములో విశాల భావాలు కలిగిన శ్రీయుత దోగుపర్తి బుచ్చయ్యగారు పందిళ్ళపల్లి వాస్తవ్యులు. వీరు తూర్పుగోదావరి జిల్లా పెద్దాపురంలో స్థిరపడినారు. వీరు 1914లోసంస్కృతశ్లోకాలకు తాత్పర్యముతోకూడి ప్రచురింపబడిన దేవాంగపురాణము అను గ్రంథము కాపి ఒకటి ఆయనవద్ద ఉండుటవలన సంస్కృత శ్లోకాలు లేకుండా తెలుగు తాత్పర్యము ఉన్నదానిని యదావిధిగా ప్రింటును 2015వ సంవత్సరములో చేసినారు. వీరు అనారోగ్యముతో ఉన్నను కులాభిమానంతో దేవాంగ పురాణమును 100 సంవత్సరాల తర్వాత మరల ప్రింటు జరిగే విధంగా చేసినారు. అభినందించదగిన కార్యమును చేసినారు. కాని పుస్తకములో వున్న సంస్కృత శ్లోకాలు లేకుండా ప్రింటు చేయడం వలన దేవాంగ చరిత్రకు ఉన్న ఏకైక ప్రమాణ గ్రంథముకూడ నేడు అందుబాటులో లేకుండా పోయినది. దీనిలోని భాష గ్రాంధికము అగుటవలన ఈనాటి చదువరులకు అసౌకర్యంగా ఉ ండిపోయినది. ఏమైనను శ్రీయుత దోగుపర్తి బుచ్చయ్యగారిని అభినందించవలసియున్నది 100 సంవత్సరాల కాలంనాటి పుస్తకాన్ని మరల ప్రజలవద్దకు తీసుకు వచ్చినందులకు.

1913లో ప్రింటుకాబడిన దేవాంగ పురాణము వచన కావ్యం శ్రీయుత బ్రహ్మశ్రీ పురాణం సూర్యనారాయణ తీర్థులవారు తెలుగుభాషలో వ్రాసినారు. దానిని వాణి నిలయంవారు ప్రచురించినారు. ఈ పుస్తకములు అందుబాటులో లేవు. కాపీలన్నియు మృగ్యమైనవి. దేవాంగ వంశ చరిత్ర నశించు తరుణంలో మరొకవిశాల హృదయులు మద్రాసులోని గుమ్మడిపూడి వాస్తవ్యులు శ్రీ నాప బాలసుబ్రహ్మణ్యంగారు ఈ దేవాంగ పురాణమును మరలా ప్రింటు చేసి ప్రజల వద్దకు దేవాంగ చరిత్రను తీసుకు వచ్చినారు. ఇది 2015వ సంవత్సరములో తెలుగు, తమిళ భాషలలో దేవాంగ పురాణమును ప్రచురించినారు. దేవాంగ వంశస్తులకు మహోపకారము చేసినారు.



1861వ సంవత్సరమునందు దేవాంగ కులగురువులు ఓం శ్రీ సాంబలింగమూర్తి స్వాములవారి పర్యవేక్షణలో నందవైదీక వార్తాకవి కుప్పయ్యగారు శ్రీ చూడాంబికా దండకమును రచించినారు. ముద్రణనుఒగ్గలూరు వేణుగోపాలనాయునివారి సూర్యాలోక ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.

కన్నడభాషలోని దేవాంగ సుధ అను పుస్తకమును శ్రీ చింతగింజల మల్లేశ్వరరావుగారు తెలుగులో అనువాదం చేయగా దానిని శ్రీ దేవాంగ కల్ప వృక్షము అను పేర దేవాంగ సంక్షేమ సంఘం, ప్రొద్దుటూరువారు 2011వ సంవత్సరములో ముద్రించినారు. వీరందరి కృషి ఫలితముగా దేవాంగ కుల సాహిత్యము ప్రజలకు అందుబాటులోకి వచ్చినది. అందువలన వీరందరికి మనసారా కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

అయితే శ్రీ నాప బాలసుబ్రహ్మణ్యం గారు ప్రచురించిన 1913 నాటి దేవాంగ పురాణం 2015లో ముద్రణ చేసినారు. కాని దానిలో కుల చరిత్రకు అవసరమైన ప్రామాణ శ్లోకములు లేవు. అందువలన అన్య వర్ణములవారి విశ్వాసము పొందలేము. వారికి దేవాంగ చరిత్ర మూల గ్రంథమైన బ్రహ్మాండ పురాణంలోని సంస్కృత శ్లోకాలు ఉన్నదానిని వారికి చూపించుట ఉండదు. అందువలన వారు మనం అప్రాకృత బ్రాహ్మణులము అను మాటను విశ్వసించుటలో సందేహాస్పదులు అవుతారు. కాని శ్రీ దోగుపర్తి బుచ్చయ్యగారు ప్రచురించిన 1914 నాటి దేవాంగపురాణంలోని మూల సంస్కృత శ్లోకాలు లేకుండా వున్నవి. అందువలన మన దేవాంగ వంశాధి పురుషుడు దేవలుని చరిత్ర సందేహాస్పద మవుచున్నది. ఈ లోటును తీర్చడానికై 1914 నాటి దేవాంగ పురాణంలోని సంస్కృత శ్లోకములను సేకరించినాను. వాటి భావాన్ని అధ్యాయాల వారీగా మిక్కిలి సులభశైలిలో అవసరమైన అన్ని సందర్భాలలో మరల మరలా వివరణ ఇస్తూ వ్రాసినాను. భావనలు స్పష్టముగా అర్థమగు రీతిలో వ్రాసినాను. నేటి విద్యార్థులకుకూడ సులభంగా అర్థము చేసుకొను విధముగా ఈ పురాణ గ్రంథము వ్రాయబడినది.



**శ్రీశ్రీశ్రీ దయానందపురి మహాస్వామీజీ**

దేవాంగకుల గురువులు,

గాయత్రీ మహాపీఠము, **హంపి హేమకూట,** కర్నాటక.

## మంగళాశాసనములు

ప్రేమస్వరూపులయిన ఆత్మీయులారా! దేవల మహర్షి వంశీయులారా! శ్రీమత్ చౌడేశ్వరీదేవి పదపద్మ సమారాధకులారా! విశ్వవ్యాప్త దేవాంగ మహా ప్రజలారా!

దేవాంగ వంశాధి పురుషుడు శ్రీ దేవల మనుబ్రహ్మ. ఈతని ద్వారానే దేవాంగ వంశం ఏర్పడినది. దేవలబ్రహ్మ సృష్ట్యాదిలోని సమస్త లోకములలో వున్న దేవతలకు, మానవులకు వున్న దిగంబరత్వ దోషాన్ని పోగొట్టి నాగరికతా సౌందర్యముతో శోభిల్లునట్లుగా వన్నెచిన్నెల జలతారు వస్త్రాలను పడుగు పేకలు కల్పించినేసి నయన కళావిజేతలై పరోపకారంతో సర్వలోక ప్రజల మన్ననలను పొందిన మాననీయ “దేవాంగ” కులము మనది. వేదోక్త క్రియాలాప సమున్నతా చార పరంపరలచే ప్రత్యేకత కల్గి సభ్య సమాజములో అప్రాకృత బ్రాహ్మణులుగా పేరుపొందిన మహనీయ “దేవాంగ” జాతి మనది. పరమ శివుని ఫాల నేత్రోద్భవుడైన దేవల మహర్షి వంశంలో పుట్టి చతుషష్ఠి విద్యల చిత్‌శక్తి – జ్ఞానశక్తి మహామాత శ్రీ చౌడేశ్వరీదేవి అనుగ్రహముతో మహా జ్ఞానాన్ని పొంది దేవీబ్రాహ్మణులుగా పిలువబడుటయేగాక, వస్త్ర నిర్మాతలుగా – వస్త్ర ప్రదాతలుగా – గాయత్రీ సూత్ర కర్తలుగా – గాయత్రీ సూత్రప్రదాతలుగా వారసత్వ మహిమను దేవల మహర్షిచే పొందిన మాననీయ సువిమల చరిత మనది.

ఇటువంటి మహోత్కృష్ట చరితను తెలిపేది బ్రహ్మాండ పురాణాంతర్గతమగు శ్రీ దేవాంగ పురాణము. ఈ దేవాంగ పురాణమును అత్యంత సులభశైలిలో శ్రీ చల్లా రామారావుగారు రచియించినారు. ఈ గ్రంథం అత్యంత విపులముగా విశ్లేణతో వ్రాయబడినది. అనేకానేక రహస్య విషయములను తేటతెల్లంగా వివరించినారు. ఈ గ్రంథం చదివితే మన దేవాంగ వంశ విశిష్టత మరియు ఔన్నత్యము కరతలామలకంగా తెలుసుకోగలరు. దీని ద్వారా మన దేవాంగజాతి కీర్తిప్రతిష్టలు ఇనుమడింపబడును. ఇటువంటి ఉత్తమ శ్రేణిలో దేవాంగ పురాణమును రచించిన శ్రీ రామారావుగారికి దేవల మనుబ్రహ్మ మాతా చౌడేశ్వరీదేవిలు ఆయురారోగ్య ఐశ్వర్యములు సదా కలుగజేయాలని ప్రార్థిస్తున్నాను.

మన్మథ ఫాల్గుణ పూర్ణిమ.

Shri Shri Dayanandapuri

శ్రీశ్రీశ్రీ దయానందపురి మహాస్వామిజీ

## సందేశం



**శ్రీ కాలెపు సత్యనారాయణమూర్తి**

ప్రధాన కార్యదర్శి,

**రాజమండ్రి దేవాంగ సంక్షేమ సంఘం**

దేవాంగ సోదర, సోదరీమణులారా!

దేవల మనుబ్రహ్మ సంతతియైన మనమందరమూ దేవాంగులుగా చెప్పు కుంటున్నామే కానీ, మనలో చాలామందికి దేవాంగుల చరిత్ర గురించిగానీ, దేవల మనుబ్రహ్మ గురించిగానీ తెలియదు. ఇటువంటి విషయములు సంఘీయులకు తెలియజేయుటకు రూపొందించబడినవే దేవాంగపురాణములు. అర్చక ప్రవర శ్రీ చల్లా రామారావు గారు రచించిన దేవాంగ పురాణము బహు ప్రశంసనీయము మరియు ఆదర్శనీయము. ఎందుచేతనంటే దేవాంగ పురాణములు ఇంతకు పూర్వము కొందరు రచించినప్పటికినీ వీరు తెలిపినంత విపులముగా, సవివరముగా ఏ రచయిత తెలియజేసి యుండలేదు.

శ్రీ రామారావు గారు రచించిన దేవాంగ పురాణములో అసలు దేవాంగుడు అంటే ఎవరు ? దేవాంగుడు ఎలా ఉద్భవించాడు ? ఆషాఢ అమావాస్య ప్రాధాన్యత, శ్రీమత్ చౌడేశ్వరీ మాత ఆవిర్భావము, ఆరాధన, దేవలుని జన్మవృత్తాంతము, జీవనశైలి, నేతసామాగ్రి తెచ్చుకొనుటకు మయుని చేరుట, అష్టదిక్పాలకులకు వస్త్ర ప్రదానము, దేవలోక నర్తకి రంభ శాపము, పరమ శివునికి తలపాగ నేయుట, దేవాంగ వంశవృక్షము, దేవాంగ అష్టోత్తరము, ఇత్యాది అంశములను కళ్ళకుకట్టినట్లుగా రచించియున్నారు. ఈ గ్రంథములో దేవల బ్రహ్మ అవతారము అయిన దేవదాసు శ్రీ శ్రీశైల మల్లిఖార్జునస్వామికి సమర్పించిన తలపాగా అలంకరణ ఘట్టమును అద్భుతరీతిలో వర్ణించియున్నారు. ఇదే ఆనవాయితీ నేటికీ శ్రీశైల మహా క్షేత్రములో కొనసాగుచూ సనాతన సాంప్రదాయముగా వర్ధిల్లుతున్నది.

ఇక ఈ పురాణములోనే ఇప్పటివరకూ ఎవరికీ తెలియని అనేకానేక క్రొత్త విషయములను పరిశోధనాత్మకంగా, విశ్లేషణాత్మకంగా రచించియున్నారు. ఈ పురాణమును పరికిస్తే ఇది నిజంగా వీరికి మాత్రమే సాధ్యమైనట్లుగా గోచరిస్తోంది. ఇంకా ఈ పురాణములో దేవాంగ చరిత్రను భావితరాలకు సైతం అర్థమయ్యేలా సరళపదాలతో తేటతెల్లముగా రచించియున్నారు. ఈ సందర్భంగా మన సంఘీయులను కోరేదేమిటంటే, ప్రతి దేవాంగుడు తప్పనిసరిగా ఈ దేవాంగ పురాణమును చదివి, మన కులవిశిష్టతను, ఔన్నత్యమును తెలుసుకోవాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ దేవాంగపురాణము మన దేవాంగ జాతి కీర్తి ప్రతిష్టలను ఇనుమడింపజేస్తుందని చెప్పడంలో ఏ మాత్రం సందేహం లేదు.

ఇంతటి మహోత్కృష్ట రచనగావించిన శ్రీ రామారావుగారు ధన్యజీవులు. వీరు భవిష్యత్తులో మరిన్ని మంచి రచనలు చేయాలని, ఆ శ్రీశైల మల్లికార్జునస్వామి, భ్రమరాంబ అమ్మవార్ల ఆశీస్సులు మెండుగా కలగాలని కోరుకుంటున్నాను.

భవదీయుడు,

(కాలెపు సత్యనారాయణమూర్తి)

# ఈ గ్రంథం ఎందుకు చదవాల్సి ఉంది



సజ్జా వెంకటేశ్వర్లు,
వేటపాలెం.
9951169967

ఇవాల్టి ప్రపంచీకరణ పరిణామాల తరువాత ఈ జీవనస్థితిగతులు రూపురేఖలు వేగవంతముగా మారిపోయాయి. అందులో మన సంప్రదాయాలు, సంస్కృతులు నామ మాత్రపు స్మరణగా మిగిలిపోయాయి. కుల వృత్తులను బట్టి కులాన్ని ఆచారాల్ని గుర్తుపట్టే పరిస్థితి చేయిదాటిపోయింది. ధ్వంసమైన వృత్తులతాలూకు సమూహాలు చిన్నాభిన్నమై వలస బాటలు వేసుకుపోతున్నారు. అలా పోయినవిపోగా కొనఊపిరితో కొట్టుకు మిగిలియున్న చేనేత రంగం మనది. కళకళ విరిసిన చేనేతలు బహుశా తన చరిత్రను తానుకోల్పోతున్న ప్రమాదస్థాయికి చెరుకుంది. మగ్గాల చప్పుడులతో తెల్లవారే జీవనశైలి రానురాను కంటికి కనిపించని వాస్తవ పరిస్థితులను ఎదుర్కొంటుంది. ఎన్నో చేదు అనుభవాలతో మగ్గం బతుకు మూలుగుతుంది. చిట్టచివరి నేతగాణ్ణి ఇవాళ మనం చూస్తున్నాం. దీనికి వారసత్వం – జవసత్వాలు ఎవరూ పంచిపెట్టే స్థితి కన్పించటం లేదు. పూర్తి స్థాయిలో కోల్పోవడం కనిపిస్తున్న కాలంలో మనం మిగిలున్నాం. ఇలా మనం ఎందుకు మిగిలాం? చరిత్రలో మనల్ని మనం ఎలా కోల్పోయాం. మన పూర్వీకులనుండి అందిపుచ్చుకున్న నైపుణ్యం, కళా సంస్కృతులు, వాటిని నడిపిన ఆధ్యాత్మిక భూమికనుండి వీరశైవంలో ఉద్భవించిన “దేవాంగ” కమ్యునిటికిగల ప్రత్యేకతలు అవి ఎలా కనుమరుగైపోయాయి. ఎవరు మన దేవాంగ కమ్యునిటి అస్తిత్వాల్ని గురించి తిరిగి నిలబెట్టేదిశలో మార్గదర్శనం చేస్తారు.

తరతరాలుగా దేశ సంస్కృతిలో ప్రధాన భాగమైన సంప్రదాయ వృత్తిగా వెలుగొందిన చేనేత అందులో ఒక ప్రధాన స్రవంతిగా నడిచిన “దేవాంగ” కమ్యునిటి వుంది. దేశ వ్యాపితంగానే వెనుకబడిన కులాల జాబితాలో అన్నీ రాష్ట్రాలలో జీవిస్తూనే వున్నారు. గడచిన మన చరిత్రను మనం చదువుకోవాల్సిన అవసరం ఇవాల్టి నేపధ్యంలో మనందరిమీద ఉంది. మన దేవాంగ మహాసభలు కుల చైతన్యాన్ని నిలిపే దిశలో నడుపుకుంటే అది మరింత ప్రయోజనకరంగా ఉంటుంది.

ఇదిగో అటువంటి ధృక్పధాలకు మనతరం ప్రతినిధిగా చల్లారామారావు గారు ఈ గ్రంథ రచన ద్వారా తెలియజేస్తున్నారు. దేవాంగ కులాన్ని దాని అస్తిత్వాన్ని, ఆధ్యాత్మికాన్ని దాని పూర్వ నేపధ్యాన్ని చేనేతరంగాన్ని పురాణాలలో దాగిన దాని స్థానాన్ని రామారావుగారు తన విస్తృత అధ్యయనం ద్వారా ఆధారాలను సేకరించుకొని వాటిని ఇవాల్టి మనతరం వారందరికి సులభశైలిలో, మన వాడుక భాషలో అందించడం ఒక గొప్ప పరిణామం. సంప్రదాయ బద్ధమైన కుటుంబంలో పుట్టి, పౌరోహితం చేస్తూ తన తండ్రిద్వారా అందిన జ్ఞానాన్ని తను ద్విగుణీకృతం చేసుకుని, తన దేవాంగ కమ్యునిటికి తన వంతుగా చేసిన ప్రయత్నం హర్షదాయకం. దేవాంగ కులం వున్నంత కాలం శ్రీ రామారావుగారి ఈ కృషి నిలిచి ఉంటుంది. ఈ గ్రంథంలోని విశ్వాసాలు హేతుబద్ధమైన తర్కానికి నిలవక పోవచ్చు. అయినా విశ్వాసం వెంట సమూహం నడచిన తీరుకు ఇదో మంచి నిదర్శనం. చీకటి రోజుల్లో మానవ నాగరికత వెల్లివిరిసే క్రమంలో మగ్గం చేసిన క్రియాశీలత ఈ గ్రంథంలో ఆధ్యాత్మిక భూమిక నుండి కనిపిస్తుంది. దానికున్న గౌరవాన్ని అది అందిపుచ్చుకుంది. దేవల మనుబ్రహ్మ రూపంలో దేవాంగ కులం మొత్తంగా ఒక విశిష్ట నైపుణ్యత కలిగిన జాతిగా పరిగణించటం అనివార్యం. దేవతలకు వస్త్రాలిచ్చే సత్ సంప్రదాయమునుండి దేవాంగజాతి సమాజాన్ని తనతో పాటుగా కలిసి నడిచిన చరిత్ర దాగివుంది. ఆధ్యాత్మికం, అభివృద్ధి నవ నాగరికతలు మానవ పురోగమనానికి దారి చూపాలి. కానీ రాజకీయ చట్రంలో అన్నీ ఇమిడిపోతున్నాయి. మన నమ్మకాల్ని విశ్వాసాల్ని మోసగించే రాజకీయ గుంపు తయారై ఉంది.

ఇలాంటి మారిన పరిణామాల్ని అర్థం చేసుకుంటూ “దేవాంగ” కమ్యునిటి ఒక్కటిగా ఉండాలని ప్రతిఇంట ఈ గ్రంథం ఉండాలని ప్రతిఒక్కరు తప్పక చదవాల్సిన అవసరం ఉందని తెలియజేస్తున్నాను.

చివరిగా శ్రీ చల్లా రామారావుగారు ఈ గ్రంథ రచన చేసి దేవాంగ కులానికి తిరిగి జవసత్వాల్ని అందించారనే నమ్మకంతో వారి ఈ పనిని అభినందిస్తూ పాదాభివందనం చేస్తూ.......... ఇక చదవండి.

28-3-2016,
దేశాయిపేట.

సజ్జా వెంకటేశ్వర్లు
9951169967

## శ్రీ విద్యోపాసకులు
## శ్రీ చల్లా రామారావుగారు



దేవాంగుల మూలపురుషుడు దేవల మనుబ్రహ్మ. ఈ దేవల మనుబ్రహ్మయొక్క ప్రస్తావన లేక చరిత్ర వేదోక్తమూలస్తంభనములో మరియు బ్రహ్మాండపురాణములో మనకు లభ్యమగుచున్నది. 20వ శతాబ్దం ప్రారంభంనుండే దేవల మనుబ్రహ్మ చరిత్రను అనేకమంది కవులు. రచయితలు పద్య, గద్య కావ్యాలలో మనకు అందిస్తూవస్తున్నారు. ఇది ముదావహమైన విషయం. దేవల మనుబ్రహ్మ దేవ మానవగణానికి వస్త్ర, సూత్రాల (యజ్ఞోపవీతాలను) ను అందించడమేగాక రాజ్యపాలనంకూడా చేశాడు. బ్రహ్మాండ పురాణంలో దేవల మనుబ్రహ్మను పరమశివుని ఫాలనేత్రోద్భవునిగా వర్ణిస్తే, వేదోక్తమూలస్తంభనంలో పరమశివునిగా వర్ణించబడింది. తదనంతరకాలంలో దేవాంగులు వస్త్ర, సూత్ర రచన చేయడమేగాక, బ్రహ్మజ్ఞాన సంపన్నులై, గాయత్రీపీఠాధిపతులై బ్రాహ్మణ్యాన్ని, సామంతరాజులుగా, సైనికులుగా యుద్ధాలు చేయడమేగాక, కులదేవతయైన చౌడేశ్వరీదేవి జ్యోతిర్మహోత్సవాలలో ఖడ్గాలతో రక్తాన్ని చిందించి ఆత్మబలిదానం చేసుకుంటూ క్షాత్రాన్నికూడా పండిస్తున్నారు. అందుకే దేవాంగులు బ్రాహ్మణ్యం, క్షాత్రం మూర్తీభవించినవారు. దేవాంగ పురాణాలు చదవడంవల్ల దేవాంగులకు గొప్ప సాంస్కృతిక వారసత్వ సంపద ఉందని తెలుసుకోవడమేగాక, తమ వ్యక్తిత్వాలను వికసింపజేసుకోవడానికి అవకాశం ఉంటుంది.

ఆత్మీయ మిత్రులు శ్రీ చల్లా రామారావు గారు వచన దేవాంగ పురాణాన్ని వెలుగులోకి తెస్తున్నందుకు వారిని అభినందిస్తున్నాను. రామారావుగారు వృత్తిరీత్యా ఉపాధ్యాయులైనా, ప్రవృత్తిరీత్యా బ్రహ్మజ్ఞాన సంపన్నులు. వీరు తండ్రిగారైన బ్రహ్మశ్రీ చల్లా మల్లేశ్వరరావుగారి నుండి పౌరోహిత్యాన్ని, బ్రహ్మజ్ఞానాన్ని పుణికి పుచ్చుకున్నారు. వీరిని వీరి సోదరులను తండ్రిగారు శ్రీ విద్యోపాసకులుగా తీర్చిదిద్దారు. వీరికి అమ్మవారి అనుగ్రహం మెండుగావుంది. వీరు జ్యోతి శాస్త్రములో యం.ఎ. పట్టాను పొందారు. జ్యోతిశాస్త్రంలో సమాజం గర్వింపదగ్గ పాండిత్య ప్రకర్షులు శ్రీకృష్ణుడు. శ్రీరామచంద్రుడు, పాండవులు మొదలైన వారి జన్మదినాలను నిర్ధారించటమే గాక వారి వారి గ్రహ స్థితులను చక్కగా విశ్లేషించారు. వీరు దేవాంగ కులరత్న , జ్యోతిర్విజ్ఞాన కులరత్న , జ్యోతిర్విజ్ఞాన భాస్కర, గణిత విద్వద్వరేణ్య, శ్రీ విద్యోపాసక చూడామణి, మంత్ర మాతృకార్చన విశారద మొదలైన బిరుదములతో సమాజంలో గొప్ప పేరు ప్రఖ్యాతులు గడించారు. వీరికి మన దేవాంగ కులగురువులు, హంపి హేమకూట గాయత్రీ పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ దయానందపురి మహాస్వామీజీ గారి దివ్య ఆశీస్సులు సంపూర్ణంగా ఉన్నాయి.

ఇంతటి మేధా సంపత్తి, దివ్యశక్తిగల శ్రీ చల్లా రామారావుగారు దేవాంగ పురాణాన్ని సులభగ్రాహ్యంగా, సులభశైలిలో అందించటం మన అందరి అదృష్టం. వీరు జ్యోతిర్విజ్ఞాన భాస్కరులు కావటం వల్ల దేవల మనుబ్రహ్మ ఉద్భవించిన సమయంలో మరియు శ్రీ చౌడేశ్వరీదేవి అమ్మవారు ఆవిర్భవించిన సమయంలో ఉన్న గ్రహ స్థితులను చక్కగా విశ్లేషించారు. ఈ విశ్లేషణ జ్యోతి శాస్త్రంలో వీరికున్న పరిజ్ఞానానికి అద్దం పడుతుంది.

శ్రీ సుబ్రహ్మణ్య స్వామికి శంభుమూర్తి ఉపదేశించిన సనత్కుమారునికి నందీశ్వరుడు ప్రభోదించిన దేవల మనుబ్రహ్మ మహాత్మ్యానికి సంబంధించిన వేదోక్త మూలస్తంభనములోని శ్లోక తాత్పర్యాలను మరియు

నెల్లూరుజిల్లా సంతపేట వాస్తవ్యులు శ్రీ గోమేధికం ఓం శ్రీ శంకర స్వాములవారు మరియు గోదావరి జిల్లా పుల్లేటికుర్తి వాస్తవ్యులు శ్రీ మల్ల క్ష్మీశ్రేష్టిగారు సంకలన పరచగా 1914లో శ్రీ పమ్మిశెట్టి త్యాగరాయ శెట్టిగారు తన ప్రెస్‌లో అచ్చు వేయించిన మూలబ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరిత మందలి సంస్కృత శ్లోకాలను శ్రీ రామారావుగారు ఈ దేవాంగ పురాణము చివర అనుబంధంలో అచ్చు వేయించటం వల్ల దేవల మనుబ్రహ్మ చరిత్రతో పాటు ఆ చరిత్ర యొక్క ప్రామాణికతను కూడా లోకానికి అందించిన వారయ్యారు.

ఈ గ్రంథాన్ని శ్రీ చౌడేశ్వరీ అమ్మవారికి అంకితమివ్వటం వలన శ్రీ రామారావు గారికి అమ్మవారిపై ఉన్న ప్రగాఢమైన భక్తి ప్రపత్తులు వ్యక్తమవుతున్నాయి. వీరిని వీరి కుటుంబ సభ్యులను అమ్మవారు సదా కాపాడాలని మనసారా ప్రార్థిస్తున్నాను. దేవాంగ కుల బంధువులు ఈ గ్రంథాన్ని చదివి తమజాతికున్న సాంస్కృతిక వారసత్వాన్ని ఆకళింపు చేసుకొని, తమ సంస్కృతీ వైభవాలను చాటుకుంటారని ఆశిస్తున్నాను.

ఇట్లు

28-3-2016,
దేశాయిపేట.

- సత్రం మల్లేశ్వరరావు

శ్రీ అరుళానంద ట్రస్టు అధిపతులు
శ్రీశ్రీశ్రీ రామానంద సరస్వతీ స్వాములవారి శిష్యులు
ధారణావధాన బ్రహ్మ
**డా॥ వొలుకుల శివశంకరరావు,** ఎం.ఏ.పిహెచ్‌డి.



## 'అభినందన చందనం'

'దేవాంగ కులరత్న' శ్రీమాన్ చల్లా రామారావుగారిచే ఆంధ్రీకృతమయిన 'దేవాంగ పురాణము' సమగ్రముగా పరి శీలించటం జరిగినది.

విశ్వ సాహిత్యంలో దేవల మహర్షి పాత్రకు ఒక విశిష్టస్థానం వుంది. శివాద్వైత తత్వాన్ని సర్వ సమగ్రంగా లోకానికి చాటి చెప్పిన మనుబ్రహ్మ కులాభరణుడు దేవలుడు.

దేవాంగ వంశానికి మూలపురుషుడు ఈ దేవలుడు. ఈతని చరిత్ర లోకంలో బహుళ ప్రచారం కావలసిన అవసరం ఎంతయినా వుంది. లోకోపకార ప్రదాతకు ఆద్యుడుగా – వస్త్ర నైపుణ్యాలకు నిలయుడుగా – సూత్రకర్తగా – యజ్ఞోపవీత ప్రదాతగా ఎన్నెన్నో విశిష్టతలు ఈ పాత్రలో వున్నాయి.

దేవాంగులకు కులదేవత శ్రీ చౌడేశ్వరీ మాత. ఈ అమ్మవారిని గురించి పరిశీలించిన ఎన్నెన్నో విశేషాలు మన సంస్కృతీ పరమయినవి చాలా తెలుస్తాయి. "తెలుగు సాహిత్యంలో చౌడేశ్వరీ దేవి చరిత్ర" అనే పేరుతో డా. అల్లమరాజు విజయేంద్ర నాధరావు"గారు పరిశోధన గ్రంథం వెలుగులోకి తెచ్చారు. దానిలోని విశేషాలు లోకం తెలుసుకొని అబ్బురపాటు చెందుతూ వుంది. ఒక కులదేవతపై పరిశోధన గ్రంథం మరియు 33 గ్రంథాలు చౌడేశ్వరీ అమ్మవారిని గురించి వుండటం చాలా అరుదైన విషయం– ఆదికవి నన్నయ్యగారు కూడా చౌడేశ్వరీ విలాసం అనే ప్రబంథం వ్రాశారు.వీనిని ఆధారంగా చూసి పరిశీలిస్తే దేవాంగ వంశీయులయిన దేవాంగుల కుల పావిత్ర్యత చాలా గొప్పదని అందరూ ఒప్పుకోక తప్పదు.

బ్రాహ్మణ్య అధిపులనీ – గర్భ బ్రాహ్మణులనీ – దేవాంగ బ్రాహ్మణులనీ – అప్రాకృత విప్రులనీ – వీరికి సాహిత్యంలో స్థిరమైన పేర్లు వున్నాయి.

పై పదాల విశ్లేషణ ఒక రమణీయ చారిత్రకాంశములను లోకానికి వివరిస్తాయి.. గాయత్రీ సూత్ర కర్తగా – సూత్ర ప్రదాతగా – వస్త్ర నిర్మాతగా– సర్వలోక వస్త్ర ప్రదాతగా – గాయత్రీ పీఠాధిపతిగా – శ్రీ గురుపూజ్యనీయుడై సాత్విక గుణ సామగ్రితో – బ్రహ్మతత్వము మూర్తీభవించిన పరమాత్మగా దేవల మనుబ్రహ్మ మనకు సంస్కృతాంధ్ర సాహిత్యంలో దర్శన మిస్తారు.

అటువంటి ఉత్తమోత్తమ చరిత్ర దేవాంగ పురాణంలో వుంది – బ్రహ్మాండ పురాణాంతర్గత ఈ దేవల మనుబ్రహ్మ చరిత్రను శ్రీ రామారావుగారు అనువాదం చేశారు.

అందుకు పాఠక లోకం వీరిని బహుదా ప్రసంశించాలి. అంతేగాక సంస్కృతంలోని ఆ దేవాంగ పురాణాన్ని కూడా ఇందులో ముద్రించారు.

'వేదోక్త మూలస్తంభన'మనే మరొక గ్రంథాన్ని కూడా ఇందులో ముద్రించారు. ఈ రెండు విషయములు కూడా లోకం హర్షించే విధంగా వున్నాయి.

అనువాదము మూలానుసరణ మయిననూ – కొన్ని కొన్ని సందర్భాలలో వారు చేసిన విషయ విశ్లేషణ పాఠకులను బాగా ఆలోచింప చేస్తూవుంది. ఇందుకు కారణం వారు విద్యావేత్తయే గాక అర్చక ప్రవరులుగా పేరుపొందిన వారు. జ్యోతిష శాస్త్ర పారంగతులూ మరియు శ్రీ విద్యోపాసక చూడామణి. అందుకే విషయ వివరణ సర్వ సమగ్రంగా తెలియజేస్తూ రచన కొనసాగింది.

అనువాద గ్రంథం వ్రాయడంలో చాలా ఇబ్బందులు వున్నాయి. శ్రీనాధుల వారు కూడా నైషధాంధ్రీకరణ విషయంలో శబ్దంబనుసరించియు, అర్థంబు ఉపలక్షించియు ఔచిత్యంబాచరించియు –అనే చిత్రంబు పరిహరించియు – అలంకారంబు భూషించియు ఇత్యాదిగా ప్రణాళికా బద్ధంగా అనువాదం చేశారు. అలాగే శ్రీ రామారావుగారు కూడా ఈ గ్రంథాన్ని అనువాదం చేయటంలో జాగ్రత్తలు తీసుకున్నారు.

ఇది సామాన్య జనులకు ప్రధానంగా లక్ష్యంగా పెట్టుకొని వారి కర్థమయిన భాషలో గ్రంథం వ్రాయాలి అనేది ముఖ్యంగా పాటించటం జరిగింది.

పాఠకులు కథలోని యదార్ధాన్ని గ్రహించాలనీ – పండితుల కొరకు, జిజ్ఞాసా పరులకు యుక్తంగా సంస్కృత ఆధార గ్రంథాలు రెండు కూడా ఇందులో పొందుపరచటం జరిగింది.

ఉపయుక్త గ్రంథంలోని వేదోక్త మూలస్థంభనము నందలి విషయాలు ఈ పేజీలోనివి అందరూ తప్పక చదవాలి. పేజి నెం, 326,–329, 285, 287, 290, 291, 297,303, 304, 311, 312, 314,316, 317, 331, ఈ పదిహేను పేజీలు దేవల మహర్షి ప్రాధాన్యతను విశదంగా తెలియజేస్తాయి.

ఇక అనువాద విధానాన్ని గమనిద్దాం

అనువాద విధానం:- దేవలోక వస్త్ర ప్రదానం - అష్టమాధ్యాయం సంస్కృత శ్లోకాలు.

తతో సౌ దేవల శ్రీమాన్
రచయన్ కేశలం స్వకం
నానావిధాణి వస్త్రాణి
వయతిస్మ మహోపతిః
నేత్ర బంధావళీం చైవ
హంస బంధావళీం తథా
హంస పూజావళీం చంద్రావళీం
తారావళీం శుభాం- చంద్ర తారావళీం
రమ్యాం చారు మేఘావళీం తథా
ఇత్యాద్యా బహుదా రమ్యా
నిర్మితా స్తేన వర్ణకాః
శభ్రాణ్యా పిచ కృష్ణాని పీతాని హరితానిచ
రక్తానిచ విచిత్రాణి వేత్వా నేత్రాణి దేవలః

తరువాత కథను సూతులవారు చెప్పుచున్నారు.

అప్పుడు సకల సంపదలు కల దేవలుడు తన నేర్పరితనముతో మనోహర మగునట్లు పలువిధములయిన వన్నెలుగల వస్త్రములను నేసెను.

అవి నడుమ కన్నుల వంటి పూలుకలుగు వన్నెకు చెందినవియు - హంస వన్నె కలిగియుండు వానిని - హంసలవంటి పూలు కలిగియుండు వానిని - చంద్రుని వన్నెలుగల వానిని - నక్షత్రములవలె పూవులుండు వానిని - చంద్రుని వంటి పూలు - మరియు నక్షత్రపు పూలు - ఏడువన్నెలు కలవియును, ఈ విధముగా పలు విధములుగ మనస్సును ఆహ్లాదపరచు చిత్ర విచిత్ర వర్ణములతో వన్నెలు దేవలుడు కల్పించినాడు.

తెల్లనివి, నల్లనివి, పసుపువి, పచ్చవన్నెవియు, ఎర్రనివి చిత్ర విచిత్ర వర్ణములు గలవి అగు వస్త్రములను మిక్కిలి నేర్పరితనముతో దేవలుడు నేసి అనేక వస్త్రములను ఎత్తుకొని దేవలుడు విష్ణు సమీపమునకు పోయి..... ఇలా పొడవుగా ఇంకా వాక్యము దీర్ఘముగా అనువాదం చేయడం జరిగింది. మూలంలోని విషయములు అర్థవంతంగా చిన్న చిన్న వాక్యములుగా రచన కొనసాగించ వలసి వుంది. అలా అయితే పాఠకులకు సులభంగా వుండేది. ఇక్కడ "వన్నెలు" కలవి అనుపదము పలురంగులతో శోభించేవి అనే అర్థాన్ని ఇవ్వాలి - కాని వన్నె పదము చేనేత కులవృత్తి వారికే తెలుస్తుంది కానీ - మిగిలిన ప్రజలకు తెలియదు. ఇక్కడ వివిధ వర్ణములు కలవి అని సామాన్య వాక్యార్థ పదమునే వాడినట్లయితే అనువాదం రమ్యంగా వుంటుందని నా అభిప్రాయం.

ఆనాటి రంగుల పేర్లు.

నేత్ర బంధావళి, హంస బంధావళి, హంస పూజావళి - చంద్రావళి -తారావళి - చంద్ర తారావళి - చారు మేఘావళి -అనేపేర్లు శ్రవణ శుభగమైన లక్షణాలు గలవి - వానిని ఆ పేరులు గల రంగులతో ప్రకాశించేవి. అనే అనువాదం రమ్యంగా వుంటుంది. రచయిత - వానిని వివరించి వ్రాయడం ఇక్కడ మనం గమనించవచ్చు - మూలాన్ని వున్నది వున్నట్లుగా అనువాదం చేస్తే అది మరలా కఠినమవుతుంది. సామాన్య పాఠకులకు - ఆ దృష్టితో వివరణ కూడా అవసరమే అని అనిపించక మానదు - ఇలా ఈ గ్రంథంలో రచన కొనసాగింది.

**దేవలుని ఆవిర్భావానికి వున్న గ్రహస్థితులు -** జ్యేష్ఠ పూర్ణిమ. జ్యేష్టా నక్షత్రం జనన కాల బుధ మహాదశా శేషం "దేవాంగ పురాణం 7వ పేజీలో ఈ జ్యోతి శాస్త్ర విషయం - రచయిత బహుముఖ ప్రజ్ఞానాన్ని స్పష్టంచేస్తూ వుంది. ఇది సిద్ధాంతరీత్యా వారు వివరించి వ్రాయడం లోకం హర్షించే విషయం. అయితే ఇది వీరికి మాత్రం చాలా శ్రమ చేస్తేనే వ్రాయడం సాధ్యమవుతుంది. ఈ సందర్భంలో వారి విశేష కృషి బహుదా ప్రశంసనీయం.

శ్లోకం:- విద్యానేవ విజ్ఞానాంతి విద్య జ్ఞాన పరిశ్రమమే - నహివంధ్యా విజానాతి మహతీ ప్రసవ వేదనాం అనే సూక్తికి ఉదాహరణగా ఈ ఘట్టం నిలుస్తుంది.

విశ్వ సాహిత్యంలో దేవలుని పాత్ర చాలా విశేష విజ్ఞాన సంభరితమై వుంది. ఈ విషయ పరిశోధనకు ఇటువంటి గ్రంథాలు ఎన్నో రావలసిన అవసరం చాలావుంది. ఆ ప్రయత్నంలో రచయిత చేసిన కృషిని అందరూ మెచ్చుకుంటారు. అందరూ సత్కరిస్తారు

- తథాస్తు -

శ్రీయుత మహా దేవాంగ పురాణ గద్య
వచనా ప్రవీణులగు

# శ్రీ చల్లా రామారాయ వరేణ్యులకు



మాడా సుబ్బారావు సిద్ధాంతి

కం॥ శ్రీయుత చల్లారామా
రాయాభిఖ్య ప్రసిద్ధ ప్రముఖులు మరియున్
ధీయులా మహితుని దా
క్షాయణి కాపాడు గాత, కరుణా స్పదయై

సీ॥ వ్యాస ముఖోద్భూత-మష్టాదశ పురా
ణాం తర్గతంపు- బ్రహ్మాండ మనెడు
సత్పురాణము మధ్య సాగెడు దేవాంగ
ప్రధిత పురాణమ్ము వచన రీతి
వ్రాసినాడవు భళీ, భళియను పండితుల్
ముచ్చట దారంగ మెచ్చినారు,
వస్త్ర నిర్మాణ సు- ప్రదీతులై దేవలా
న్వయ కీర్తి వెలసి విశ్వమ్ము నందు

గీ॥ వేద వేదాంగముల యందు విస్తృతంపు
యశము నార్జింతావు చల్లాన్వవాయ
సాగరోద్భవ పరిపూర్ణ చంద్ర సౌమ్య
రామ రాయాఖ్య విదిత సర్వజన ముఖ్య!

గీ॥ మంగళ మఖిల జనాలికి
మంగళ మవతార సప్తమగు ధీరునకున్
మంగళ మర్పించెద, దే
వాంగ కులోద్భవుల కెల్ల ఆనందముగా.

సహజకవి-వాస్తు రత్న సిద్ధసుకవి
**మాడా సుబ్బారాయ సిద్ధాంతి**
**మురమండ**
కడియం మండలం, తూ॥గో॥ జిల్లా

శ్రీ దేవల మహర్షిభ్యోన్నమః
శ్రీ చౌడేశ్వర్యైనమః



శ్రీ దంతంశెట్టి వీరబాబు
సిద్ధాంతి, పురోహితులు

అష్టాదశ పురాణాలలో ప్రసిద్ధమైన బ్రహ్మాండ పురాణంలో ఉత్తర ఖండంలో ప్రకాశించే దేవాంగ పురాణమును, మన "దేవాంగ కుల రత్న" ప్రసిద్ధ జ్యోతిష ఆగమ శాస్త్ర పండితులు శ్రీ చల్లా రామారావు గారిచే అత్యంత వివరణాత్మకముగా పండిత పామరులకు అర్థమయ్యే రీతిలో శ్రీ దేవాంగ పురాణమును వ్రాయబడినది. ఈ గ్రంథము చూడగానే గ్రంథకర్త ఎంతో శ్రమించి భక్తి భావముతో శ్రీ చౌడేశ్వరీ అమ్మవారియందు శ్రీ దేవల మహర్షియందు శ్రద్ధాభక్తులు కలిగి వారి కృపవల్లే ఇంతటి మహత్కార్యాన్ని పరిపూర్ణం చేయగలిగినారు. గత కాలంలో కూడా ఈ దేవాంగ చరిత్రను అనేకమంది పండితులు, కవులు, మహానుభావులు కూడా వ్రాయటం జరిగింది. సంస్కృత శ్లోక పురాణమును శ్రీ పురాణం సూర్యనారాయణ తీర్థులు వచనంగా ఆంధ్రీకరించారు. ఇది సుమారు 1913 సం॥రంలో ముద్రితమైనది. 1914లో శ్రీ గోమేధికం శంకరస్వామి వారు టీక. తాత్పర్య సహితముగా వ్రాశారు. సుమారు 16వ శతాబ్దంలో భద్రకవి, లింగకవి, కూడల సంగమ క్షేత్రం, దేవాంగ పురాణం ఏడు శ్వాశాల ద్విపద కావ్యం వ్రాసినట్లుగా చరిత్ర వలన తెలియబడుచున్నది. చీరాల వాస్తవ్యులు పూజ్యులు శ్రీ కడెము వెంకట సుబ్బారావుగారు దేవల మహర్షి చరిత్ర, చౌడేశ్వరీ సుప్రభాతం వ్రాశారు. గత 20 సంవత్సరముల క్రితం కూడా మండపేట వాస్తవ్యులు (దేవాంగ) పురాణ వాచస్పతి శ్రీ బళ్ళ బసవలింగభాగవతారచే
దేవాంగ పురాణమును వచన రీతిలో వ్రాయబడినది. కాని, ప్రింటింగ్ కాలేక రాజమండ్రి గౌతమి గ్రంథాలయంలో ఇవ్వడం జరిగింది. ఇలా ఎంతో మంది ఆ దేవాంగ పురాణమునును, చౌడేశ్వరీ అమ్మవారి చరిత్రను వ్రాయడం జరిగింది. గత 2012 వ సంవత్సరములో కూడా నాచే ఆ చౌడేశ్వరి పూజావిధానము గ్రంథంగా వ్రాయబడింది. నేటి కాలంలో ఈ దేవాంగ పురాణం ఎంతో వివరణాత్మకంగా గ్రంథకర్త సందర్భాను సారంగా తెలియని ఎన్నో శాస్త్ర విషయములు ఈ గ్రంథంలో వెదజల్లినారు. దేవల మహర్షి యొక్క ఔన్నత్యమును వారి ఆవిర్భావమును దేవతలకు దేవలఋషికి ఉన్న సంబంధము, శ్రీ చౌడేశ్వరి అమ్మవారి యొక్క ఆవిర్భావము అప్పటి కాల గ్రహ కుండలి సిద్ధాంతరీత్యా లెక్కను గ్రంథకర్త తమ జ్యోతిష పాండిత్యము ద్వారా ఎంతో వివరణాత్మకంగా పొందుపరచినారు. చేనేత వస్త్రోత్పత్తికి మూలపురుషునిగా దేవతలకు మానవులకు వస్త్రములు యజ్ఞోపవీతములు ఇచ్చి అందరి మన్ననలు పొందిన దేవల చరిత్ర ప్రశంసనీయము.

కేవలము దేవాంగపురాణమందే గాక ఇతరములైన నారద సంహిత, తత్వనిధి, ఋగ్వేదమునందు- సామవేదమునందు -యజుర్వేదమందు- అధర్వణ వేదమందు- మహోపనిషత్ - నిరాలంబోపనిషత్ - జాబాలోపనిషత్ - రుద్రయామిళ -కాత్యాయినీ స్మృతి - ముండకోపనిషత్ - తత్వ ప్రకాశిక- కఠోపనిషత్- నిగమ రహస్యము- వివేక సింధువు- అగస్త్య సంహిత సిద్ధాంత చంద్రిక- సిద్ధాంత తత్వ ప్రకాశిక మొదలైనవి ఇలా అనేక గ్రంథములందు ప్రమాణములను గ్రంథకర్త ఎంత ప్రయత్నము చేసి సంగ్రహించి- దేవల మహర్షి యొక్క ఔన్నత్యమును విశదీకరించారు. ధర్మ శాస్త్రమందు కూడా దేవల మహర్షిది. అగ్రస్థానముగా చెప్పబడినది. ఈ నాటికి కూడా లభ్యమగు ముఖ్య ధర్మశాస్త్ర గ్రంథములు అగ్రగణ్యమైన ధర్మ సింధు నిర్ణయ సింధునందు కూడా అక్కడక్కడ దేవలుని ప్రస్తావన కన్పించుచున్నది. ఇట్టి ప్రామాణిక దేవాంగ పురాణ గ్రంథరాజము ప్రతి గృహమునందు వుండవలసినది.

సామ వేదోక్త మూలస్తంభనము వల్ల దేవల మహర్షి యొక్క దేవలోపనిషత్ సర్వం దేవల మహర్షిగా ప్రామాణికతను తెలియబడుచున్నది. సదాశివుని ఫాలనేత్రం ద్వారా ఆవిర్భవించిన దేవల మనుబ్రహ్మ సాక్షాత్ పరమ శివుడేయని దేవాంగుడుగా , గర్భ బ్రాహ్మణుడుగా , సప్తావతార విరాజితుడుగా, లోక కళ్యాణ కారకుడుగా, దేవాంగ కులస్తులకు మూలపురుషుడుగా, బ్రహ్మాండ పురాణ వచనంగా, గ్రంథకర్త పండితులకు శ్లోక రూపంలో, పామరులకు వచన రూపంలో వ్రాయుటలో ఎంతో శ్రద్ధ వహించిరి. ఈ నాడు మనకుల ప్రాశస్త్యం తెలియకుండా వున్న తరుణంలో ఈ మూలగ్రంథము ద్వారా నేటితరం వారికి , భావితరం వారికి ఈ దేవాంగ పురాణము ప్రామాణికమై వెలుగొంద గలదు. ఈ గ్రంథమందు సందర్భాను సారముగా దేవల మహర్షి చరిత్ర ద్వారా శ్రీ చౌడేశ్వరీ దేవియొక్క మహిమలు ఆమెయొక్క స్తోత్రములు దేవల మహర్షి స్వరూప ధ్యానము, దేవలుని నిత్యార్చన విధానము, దేవల మహర్షి జన్మ నక్షత్ర గ్రహగతులు, వివాహ సమయ గ్రహస్థితులు కూడా ఎక్కడా చూడనివి ఈ గ్రంథమందు నిక్షిప్తం చేశారు. ఇటువంటి పవిత్రమైన దేవాంగ పురాణమును ఎంతో శ్రమించి దేవాంగులకు ప్రామాణిక గ్రంథమును సంకలనము చేసిన (రచించిన) శ్రీ దేవాంగ కులరత్న జ్యోతిష విజ్ఞాన భాస్కర, గణిత విద్వద్వరేణ్య, శ్రీ విద్యోపాసక చూడామణి, మంత్ర మాతృకార్చన విశారదులు శ్రీ చల్లా రామారావుగార్కి అభివందన నమస్కృతులు.

శ్రీ భద్రకాళీశ్వర వాస్తు జ్యోతిర్విద్యా నిలయం
గురుశ్రేష్ఠఅవార్డు గ్రహీత శ్రీ విద్యోపాసకులు
దంతంశెట్టి వీరబాబు సిద్ధాంతి, పురోహితులు

# కృతజ్ఞతలు

కవిరాజు శ్రీ కడెం వెంకటసుబ్బారావు గురువుల ఆశీస్సులతో ఈ గ్రంథ రచన ప్రారంభించినాను. దేవాంగ పురాణము ముద్రణా ఖర్చులు భరించిన శ్రీయుత H.K. గోవిందప్పగారికి మనసారా కృతజ్ఞతలు తెలుపుచున్నాను. ఈ పుస్తకానికి మంగళ శాసనములు పంపిన శ్రీశ్రీశ్రీ దయానందపురి స్వామీజీ వారికి నమస్సుమాంజలులు తెలుపుకొనుచున్నాను. రాజమండ్రి దేవాంగ సంక్షేమ సంఘం కార్యదర్శి శ్రీ కాలెపు సత్యనారాయణమూర్తిగారు తమ అమూల్యమైన సందేశాన్ని పంపించినారు. నాకు చాలా సంతోషము కలిగినది. వారికి కృతజ్ఞతలు. డా॥ సత్రం మల్లేశ్వరరావు, రిటైర్డ్ ప్రిన్సిపాల్‌గారు గ్రంథంపై అభిప్రాయం ఇచ్చినారు. వారికి కృతజ్ఞతలు. అభినందన చందనం అని విశేష అభిప్రాయము ఇచ్చిన శ్రీ వొలుకుల శివశంకరరావుగారికి కృతజ్ఞతలు. విప్లవ సాహిత్య కవి శ్రీసజ్జా వెంకటేశ్వర్లుగారు ఈ గ్రంథం ఎందుకు చదవాలి అని తన అభిప్రాయము పంపినందులకు ధన్యవాదములు. సహజ కవి శ్రీ మాడా సుబ్బారాయ కవిగారు 97 సంవత్సరాల వయో వృద్ధులు. వారు ఆశీపూర్వకంగా పద్యత్రయం వ్రాసి పంపినందులకు ధన్యవాదములు. శ్రీ వీరబాబు సిద్ధాంతిగారు అమూల్యమైన అభిప్రాయాన్ని పంపి ఆనందపరచినందులకు వారికి కృతజ్ఞతలు. ఈ గ్రంథ ఆవిష్కరణకు సంబంధించిన బాధ్యతను సంతోషంగా స్వీకరిస్తామని తెలియబరచిన శ్రీ పసుమర్తి వెంకటసుబ్బారావు, మాజీ ZPTC వేటపాలెంవారు మరియు శ్రీ దేవల మనుబ్రహ్మ దేవాంగ సంక్షేమ సంఘం వారు ఈ గ్రంథ ఆవిష్కరణకు మంచి తోడ్పాటు అందించడానికి అంగీకరించినారు. వారికి కృతజ్ఞతలు. ఈ పురాణము రచనలో విశేష ప్రోత్సాహము అందించిన చిరంజీవులు చల్లా నాగలింగేశ్వరరావు, చల్లా మల్లికార్జునరావు, మాచర్ల భరత్‌భూషణరావులను మరువలేను. ఈ గ్రంథాన్ని అతి తక్కువ వ్యవధిలోనే DTP మరియు ప్రింటింగ్ చేసి ఇచ్చిన విజయ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ వారు టంగుటూరి ప్రభాకరరావు, నాగలక్ష్మి దంపతులకు పైన తెలిపిన వారందరికి మనసారా కృతజ్ఞతలు తెలుపుచున్నాను.శ్రీ చౌడేశ్వరీమాత వీరందరికి దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగజేయాలని ప్రార్థిస్తున్నాను.

**చల్లా రామారావు**
రచయిత



## "పురోహిత రత్న"
## శ్రీ చల్లా మల్లేశ్వరరావు ( శాస్త్రి ) గారు

**రావూరిపేట, వేటపాలెం. ప్రకాశం జిల్లా.**

శ్రీ చల్లా మల్లేశ్వర రావుగారు ప్రకాశం జిల్లా వేటపాలెం మండలం రావూరిపేట గ్రామంలో 1935 వ సంవత్సరంలో శ్రీయుత చల్లా బాల గంగాధరరావు, కోటినాగమ్మ పుణ్య దంపతులకు ప్రథమ సంతానముగా జన్మించినారు. వీరు ు.ు.ు.జ.పరీక్షయందు ఉత్తీర్ణులై కొంతకాలం ప్రభుత్వ ఉద్యోగం చేసినారు. వీరు ప్రసిద్ధ పౌరాణిక సాంఘిక నాటకములందు నటించినారు. మంచి గాయకులు. కవితా మనస్సు గలవారు. సంగీత సాహిత్యమన్న మిక్కుటమైన మనస్సు గలవారు. హిందీ సాహిత్యంలో విశారద పరీక్షయందు ఉత్తీర్ణత పొంది రాత్రి పాఠశాల ఏర్పరచి, ఎంతోమందిని అక్షరాస్యులుగా చేయుటయే గాక విద్యావంతులుగా కూడా తీర్చుదిద్దినారు. వీరి వాక్కు ప్రవాహము వలె సాగును. సుస్పష్టమైన వాక్కు కలిగియుండుట వీరి అదృష్టము. శ్రావ్యమైన తన కంఠస్వరంతో ప్రేక్షకులను ఉ ర్రూతలూగించినారు. వీరు పశువైద్యంలో +ూ.ఎ.జ.. డిగ్రీ పొంది అనేక సంవత్సరాలపాటు పశువైద్యంలో కూడా రాణించినారు.

వీరు యోగాశ్రమమును ఏర్పరచి ఎంతోమందికి ఉచితముగా ఆసనములయందు శిక్షణ ఇచ్చినారు. వీరు 108 ఆసనములను ఒక గంట కాలములో ఏకధాటిగా సంపూర్ణముగా వేసి ప్రజలను అబ్బురపరచినారు. అందువలన "ఆసనవీర" అని ప్రజలు స్తుతించినారు. ఆనాటి ప్రసిద్ధ దినపత్రికలు వీరిని గూర్చి ప్రచురించినాయి.

వీరి హస్తవాసి ప్రముఖమైనది. వీరు 1962 వ సంవత్సరము నుంచి పురోహితం చేయటం ప్రారంభించినారు. వీరు శ్రీ పృధివి పాపయ్యగారివద్ద పురోహితంలో ప్రాథమిక పరిచయం ఏర్పరచుకొని తన స్వయంకృషితో ఎదిగి పురోహితం అన్న పదానికి నిర్వచనంగా నిలిచినారు. వీరి తన చివరి క్షణం వరకు పురోహిత వృత్తిలోనే జీవించినారు. వేద మంత్రోచ్ఛారణలో వీరి వాక్కు స్పష్టత, వాక్శుద్ధి గురించి ఈ ప్రాంత ప్రజలు గొప్పగా చెప్పుకొనేవారు.వీరు అర్చకునిగా, పురోహితుడుగా పందిళ్ళపల్లినుండి ఆమోదగిరిపట్నం వరకు గల 12 గ్రామాల్లో ప్రముఖ పురోహితుడుగా వెలుగొందినాడు. శ్రీ రామే రామలింగేశ్వర స్వామి కులగురువులవారు వీరి పురోహిత పాండిత్యం పరిశీలించి "పురోహిత రత్న" మరియు "శాస్త్రి " అని సంభోదించుట ద్వారా వీరు చల్లా మల్లేశ్వరశాస్త్రిగా పేరు బడసినారు. వీరు యజ్ఞ యాగాదులు చేయించుటయందు కడు నేర్పరులు. వీరు చండకాత్యాయనీ దేవిని ప్రసన్నం చేసుకొనిన మహిమాన్వితులు. వీరు దేవాంగులకే గాక ఇతర వర్గాల వారికి కూడా పురోహితమును చేసినారు. తన వృత్తిని దీక్షాదక్షలతో నిర్వర్తించుట ద్వారా ఈ ప్రాంత ప్రజల మన్ననలను పొందినారు. వీరికి రత్నత్రయములాంటి పుత్రులు కలరు. వారు బాలగంగాధరరావు, రామారావు, లక్ష్మణరావు.



## శ్రీ చల్లా బాలగంగాధరరావుగారు

**దీ.జశీఎ.,(దీ.ూ.) జూ××దీ**

వీరు పురోహిత రత్న శ్రీ చల్లా మల్లేశ్వర రావుగారికి ప్రధమ పుత్రుడుగా హేవళంబి సం।। వైశాఖ పూర్ణిమ 13-5-1957 న ప్రకాశం జిల్లా వేటపాలెం మండలంలోని రావూరిపేట గ్రామమునందు జన్మించినారు. వీరు తన 12 వ ఏటనుంచే పురోహితము వృత్తి చేయుచున్నారు. పురోహిత రంగంలో గణనీయమైన అనుభవం కలవారు. వీరు సిండికేట్ బ్యాంకునందు 30 సంవత్సరముల పాటు సర్వీసుచేసి ఆఫీసరుగా పదవీవిరమణ చేసినారు. వీరు వాస్తు శాస్త్రమునందు సలహాలను ఇచ్చుచుందురు. 1972 వ సంవత్సరంలో వేటపాలెంనందు విశ్వకళా భారతిని స్నేహితులతో కలసి ఏర్పాటుచేసి నాటక పోటీలను నిర్వహించినారు. దేవాంగ సంఘం హైద్రాబాద్ రాష్ట్ర కమిటికి వైస్ ప్రెసిడెంట్ గాను, మరియు సెక్రటరీగాను పనిచేసి యున్నారు. వేటపాలెం ఎంప్లాయిస్ వెల్ఫేర్ అసోసియేషన్‌ను హైదరాబాదులో స్థాపించి గత 30 సంవత్సరాలనుండి సేవ చేయుచున్నారు.

రచయిత

**శ్రీ చల్లా రామారావుగారిచే వ్రాయబడిన**

**దేవాంగకుల సాహిత్యముపై**

**పరిశోధనా వ్యాసములు**



1. 195 కోట్ల 88 లక్షలనాటి శ్రీ దేవదత్త దేవాంగ వివాహ ముహూర్త నిర్ణయము పరిశీలన
2. అప్రాకృత బ్రాహ్మణులు - దేవాంగులు
3. దేవాంగ వంశస్థులు శాపగ్రస్తులా?
4. దేవల మత మాహాత్మ్యము
5. పవిత్ర అవతార పురుషుడు దేవలుడు
6. వేదశాస్త్ర పరిరక్షకుడు, సంస్కృత భాషా పితామహుడు - దేవలుడు
7. శ్రీదేవాంగ వంశ వృక్షము
8. శ్రీదేవల మహర్షి జనన తిథి నక్షత్ర నిర్ణయము
9. శ్రీ దేవదత్త దేవల వివాహ మహోత్సవము
10. అలనాటి ఆమోదగిరి పట్టణమే నేటి రామేశ్వర క్షేత్రము
11. దేవాంగ వంశస్థులు లింగ ధారులు కారా?
12. శ్రీ దేవాంగ సప్తావతారములు
13. శ్రీ దేవాంగ అష్టోత్తర శత నామావళి
14. ఆమోద పట్టణము విశ్లేషణ
15. ఇదా మన సంప్రదాయము



## శ్రీ చల్లా లక్ష్మణరావుగారు

అర్చక ప్రవర

వీరు పురోహిత రత్న శ్రీ చల్లా మల్లేశ్వర రావుగారికి తృతీయ పుత్రులుగా 21-6-1962 న ప్రకాశం జిల్లా వేటపాలెం మండలం రావూరిపేటనందు జన్మించినారు. వీరు తన 12 వ యేటనుంచే పురోహిత వృత్తిని స్వీకరించి నేటికినీ నిర్వహించుచున్నారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం తొలిసారిగా నిర్వహించిన అర్చక ప్రవర (వైదికాగమమునందు) పరీక్షను 1988లోనే రాష్ట్రంలో మొదటి వ్యక్తిగా ఉత్తీర్ణులైనారు. వీరు వైదిక విద్యలయందు, ఆగమ శాస్త్రమునందు నిత్య విద్యార్థిగా వుండి అనేక అమూల్యమైన గ్రంధసేకరణ చేయుచు వాటిని అధ్యయనం చేయుచు ఎప్పటికప్పుడు విద్యను నిత్యనూతనంగా చేసుకొని దేవాలయాది ప్రతిష్ఠలు యజ్ఞయాగాలు సమర్ధవంతంగా నిర్వహించుచున్నారు. ఈ రంగంనందు నిత్య పరిశోధకులుగా వుంటున్నారు. వీరు అనేక మంది శిష్యులకు పురోహిత విద్యను నేర్పినారు. వీరు శ్రీవిద్యయందు దీక్షాపరులు. వీరి దీక్షానామము ప్రకాశానందనాథులు. పురోహితుడుగా, ఆలయ అర్చకులుగా, ఆగమశాస్త్ర పండితుడుగా ఈ ప్రాంతమునందు మంచిపేరు పొందినారు.



**శ్రీ నిమ్మల క్రిష్టప్పగారు,** వీ.ా.

కన్వీనర్,

**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర దేవాంగ సంఘం, అమరావతి.**



**శ్రీ చందన రమేష్‌గారు**

గౌరవాధ్యక్షులు

**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర దేవాంగ సంఘం, అమరావతి.**



**శ్రీ బొమ్మన రాజ్‌కుమార్‌గారు**

అధ్యక్షులు

**అఖిల భారత దేవాంగ మహాసభలు, రాజమండ్రి.**



**శ్రీ కాలెపు సత్యనారాయణమూర్తిగారు**

ప్రధాన కార్యదర్శి

**రాజమండ్రి దేవాంగ సంక్షేమ సంఘం**



**శ్రీ మావూరి వెంకటరమణగారు**

కన్వీనర్,

**అఖిల భారత దేవాంగ మహాసభలు, రాజమండ్రి**



**శ్రీమతి సజ్జా హేమలతగారు**

ఛైర్మన్,

**మున్సిపాలిటి, పొన్నూరు.**

# విషయసూచిక



-/-/-/-/-/-

## శ్రీ బ్రహ్మాండ పురాణములోని ఉత్తరఖండమునందలి బ్రహ్మ నారద సంవాదములోని దేవాంగ చరిత్రము ప్రారంభము

# దేవాంగ సంభవము

## ప్రథమాధ్యాయము

పూర్వకాలమునందు మునులయందు శ్రేష్టుడుగానున్న నారద మహాముని బ్రహ్మదేవుడు నివసించు సత్యలోకమునకు వెళ్ళి అచ్చటవున్న చతుర్ముఖ బ్రహ్మను చూచి నమస్కారము చేసినాడు.

బ్రహ్మా! ఎవని ఆజ్ఞచే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు లోకములను సృజియించుట, పాలించుట, సంహారము చేయుట అను క్రియలు నిర్వర్తించుచున్నారో అదే విధముగా ఈ సకల ప్రపంచములయొక్క పుట్టుకను నిలకడను, ప్రళయమునకు కర్తవ్యమును నిర్వర్తించు పురాణపురుషుడు, శుభములను కలుగజేయునట్టి ఆత్మ స్వరూపుడు ఎవరు? ఏ కథ వింటే సమస్త పాపములు తక్షణమే పటాపంచలగునో, పుణ్యము మిక్కిలి వృద్ధిచెందుచుండునో, నిరంతరము సుఖసంతోషములు కలుగజేయునో మిక్కిలి శుభములు కలుగజేయుచుండు అతి రహస్యమైన అనగా మోక్షజ్ఞానమును తెలుపుచుండెడి పరమ పవిత్రకరమైన కథను నాకు తెలుపుము ఓ బ్రహ్మదేవా! అని నారదులవారు మిక్కిలి కుతూహలముతో వుండి తెలుసుకొనవలెనను ఆతురతకల్గి, పితామహుడిని ప్రార్థించినాడు. అప్పుడు సృష్టికర్తయైన బ్రహ్మదేవుడు నారదా! వినుము వినుము మహా రహస్యమైనది, మిక్కిలి సంతోషమును కలిగించునదియు, మహా ప్రాచీనమైనదియు, మిక్కిలి శుభములు కలిగించునదియును, శివుని మహిమను దివ్యముగా వర్ణించునది అయిన మంగళకరమైన, పరిశుద్ధమైన దేవాంగ మహాముని కథను చెప్పెదను. మిక్కిలి భక్తి శ్రద్ధలతో వినుము నారద మహామునీ! అని బ్రహ్మదేవుడు పలికినాడు. ఈ దేవాంగ మహాముని కథ వినుట వలన మిక్కిలి అధికమైన పుణ్యమును పొందగలరు. వారికిగల సకల పాపములను నశింపజేసి వారికి సుకృతములు కలిగించునట్టి కథ ఇది. కావున నీవు వినవలసిన కథ ఇది. సకల చరాచర



ప్రపంచమునంతటిని వ్యాపించియుండు వాడును ఈతనికి ముందు ఎవ్వరును, ఏదియును లేకుండా వుండి అద్వితీయమైన అఖండానంద శక్తి కలిగినవాడును, సచ్చిదానంద స్వరూపుడును, అనంతుడునై నిర్వికల్ప కోటి సూర్య కాంతిని మించిన ఒక దివ్యజ్యోతి సృష్టి ఆరంభమునకు పూర్వము అఖండమై దేదీప్యమానముగా ప్రకాశించు చుండెను. ఆజ్యోతినే పరంజ్యోతి అని పిలిచెదరు. ఆ పరంజ్యోతి అనంతకాలం నుండి ప్రకాశిస్తూ ఒకానొక సమయమునందు తనకు ఆనందము కలిగించుటకొరకై తననుండి ఒక జ్యోతిని బయటకు వెడలించెను. ఆ కాంతిపుంజము ఒక దివ్య పురుష రూపము ధరించెను. ఆ దివ్య పురుషుడిని సదాశివుడు అని అందురు. ఆ సదాశివుడు తనలోని కొంతశక్తిని బయటకు వెలువరించగా అది కాంతిపుంజముగా ప్రకాశిస్తూ ఒక దివ్య స్త్రీరూపముగా ప్రభవించెను. ఆ దివ్య స్త్రీరూపమును ప్రకృతి శక్తి అని మాయాశక్తి అని అగ్ని, వాయు, జలము, భూమి, ఆకాశము అను పంచమహా భూతములతో అనగా ఏవి లేకపోతే ఈ ప్రపంచమునుగడ లేకుండా వుంటుందో అటువంటి ప్రాథమిక శక్తులను మహాభూతములు (ELEMENTS ) అని పిలిచెదరు. అటువంటి ఐదు మహా భూతములతోనుండు ఈ ప్రపంచము సకల జీవరాశులతోను సకల చరాచర జగత్తుగాను త్రిగుణములు అనగా సత్వ, రజో, తమోగుణములతోను మేళవింపు కలిగివున్నది. ఆ ప్రకృతి మహాశక్తినుండి రజోగుణ సంబంధముగ నేనును అనగా బ్రహ్మదేవుడు సత్వగుణ ప్రధానమై లోకములను పాలించుట, నిలుపుట, రక్షించుటకొరకై నారాయణుడును తమోగుణ ప్రధానమై సంహారశక్తి కలిగినటువంటి వాడైన కాలరుద్రుడునుఅను మేము ముగ్గరము ఉద్భవించినాము. పరంజ్యోతి స్వరూపమునుండి ఆవిర్భవించిన ప్రప్రథమ పురుష రూపశక్తి అయిన సదాశివుడిని వ్యావహారికముగా శివుడు అని భావన చేయుదురు. ఆ సదాశివుడు ఆవిర్భావానికి ముందున్న దివ్య పరంజ్యోతి స్వరూపము ఆసదాశివుని సహస్రార కమలమునందు ప్రవేశించి ప్రభవించుచున్నది. అనిబ్రహ్మదేవుడు చెప్పగా నారదులవారు బ్రహ్మదేవుడిని అడుగుచున్నాడు. సకల లోకాధీశుడు మహోన్నతమైన స్థానమునందున్న ఆ దేవదేవుడగు సదాశివుని దివ్యశక్తి అయిన ప్రకృతిశక్తినుండి ఆవిర్భవించిన మీరు ఏకార్యమును చేయ తలపెట్టితిరి. మీ మనసులో కలిగిన ఆలోచనలు ఏమిటి? ఈ ప్రపంచమును ఏ విధముగా

సృష్టించితిరి. ఈ వృత్తాంతమంతయు నాకు విపులముగా చెప్పవలసినదిగా నారదులవారు ఆచతుర్ముఖ బ్రహ్మను ప్రార్థించినాడు. అప్పుడు బ్రహ్మదేవుడు నారదా ! నీవు మిక్కిలి బుద్ధి కౌశలము కలవాడవు. సమయాసమయ జ్ఞానవిచక్షణయందు మిక్కిలి నేర్పరివి. కావున నీవు మంచి ప్రశ్న అడిగినావు. దానికి సంబంధించిన విషయమంతయు నీకు వివరముగా తెలిపెదను అని బ్రహ్మ ఈవిధముగా చెప్పటం మరల ప్రారంభించినాడు.

## బ్రహ్మదేవుడు సృష్టి చేయుట ప్రారంభించుట

ఆ తరువాత నేను దేవతలకెల్ల దేవుడు మహాదేవుడు పరమేశ్వరుడే అని నామనస్సున నిశ్చయించుకొని ఆ పరమేశ్వరుడైన శంకరుడిని గూర్చి తీవ్ర తపస్సు చేసితిని. అంత నేను చేసిన తపస్సుకు మెచ్చి ఆ పరమేశ్వరుడు ప్రత్యక్షమైనాడు. అప్పుడు నేనుఆనంద భాష్పములలో కన్నుల నిండుగా వుండి ఆ శివుడుని ఈ విధముగా స్తుతించినాను.

శ్లోకం నమస్తె దేవదేవేశ నమస్తె పార్వతీ పతే।
నమస్తె నీలకంఠాయ నమస్తె శూలపాణయే॥
నమస్తె నాగభూషాయ నమస్తె చంద్రమౌళీయే।
నిత్యాయ నిర్వికారాయ సదానందాయ ధీమతే॥
వేదవేదాంత వేద్యాయ నమస్తె పరమాత్మనే।

దేవదేవులకు ఈశుడా నీకునమస్కారము, పార్వతీ వల్లభుడా నీకునమస్కారము. నీలమురంగు కలిగి వున్న కంఠము కలవాడా నీకు నమస్కారము. శూలమును చేతియందు ధరించి వున్నవాడా నీకునమస్కారము. సర్పములను ఆభరణములుగా అలంకరించుకున్నవాడా నీకు నమస్కారము. చంద్రుడిని తలయందు ధరించినవాడా నీకు నమస్కారము. నిత్యుడుగాను, వికార రహితుడుగాను ఎల్లవేళలయందు ఆనందముతో నుండువాడుగాను, మహాజ్ఞానము కలవాడవుగావుండి వేదములు, వేదాంతములు మొదలగు పవిత్ర గ్రంథములు చదివిన వారిచే తెలియబడినవాడా, పరమాత్మ స్వరూపుడవు అగు పరమేశ్వరా నీకునమస్కారము. అని ఈ విధముగా స్తోత్రము చేసిన పిదప ఆ సర్వేశ్వరుడు మిక్కిలి ఆదరముతో నాకుచెప్పిన మాటలు



నీకుచెప్పుచున్నాను. నారదా! వినుము శివుడు ఈ విధముగా చెప్పినాడు. ఓ మిక్కిలి అదృష్టము గల బ్రహ్మదేవుడా నీవుచేసిన తపస్సుకు చాలా సంతోషించితిని. మహాఆనంద పడితిని. బాగుబాగు. కావున నీమనస్సులో వున్న కోరికను కోరుకోవయ్యా! దానిని నీకు ప్రసాదించెదను అని శంకరుడు ఆ బ్రహ్మదేవునితో చెప్పెను. అంతట బ్రహ్మదేవుడు మిక్కిలి సంతోషము చెంది శంకరుడిని ఈ విధముగా స్తుతించినాడు.

మహాదేవ దయాసింధో పురాణ పురుష ప్రభో।
జగత్స్రష్టా భవిష్యామి శంకరాహంత వాజ్ఞయా॥

దయాసముద్రుడును, పురాణఅనగా ఈ సృష్టి కంతటికి ప్రప్రధమంగా ఆవిర్భవించి వున్నవాడు అయిన పురాణ పురుషుడవు ప్రభువగు ఓ మహాదేవుడా, నీ ఆజ్ఞచేతనే లోకములన్నియు సృజింపవలయునని కోరిక కలవాడనైతిని, కావున నాకు ఈ సమస్త ప్రపంచములోని చరాచర జగత్తునంతను అనగా స్థావర జంగమాత్మకమైన సకల జీవరాశులతో కూడివుండే విధముగా విశ్వమును సృష్టింప వలయునని బహుకుతూహలముగా వున్నది. కావున ప్రభుడా నీవు అనుగ్రహించి దానికి సంబంధించిన శక్తి సామర్ధ్యములను నాకు ప్రసాదించగలవాడవు నీవుఅని బ్రహ్మదేవుడు అడుగగా ఆపరమేశ్వరుడు వెంటనే నీమనోభీష్టము ప్రకారము సకల లోకాలను, జీవరాసులను నాఅనుగ్రహముచేత సృజించగలవు. అందువల్ల నీవు జగత్తుకు స్రష్టవు. అనగా సృష్టించినవాడవు కాగలవు అని చెప్పి అదృశ్యుడాయెను పరమేశ్వరుడు. అంతట నా మనోభీష్టము ప్రకారము సకల లోకములను, జీవరాసులను సృష్టించితిని. అయితే నేను సృష్టించిన జీవరాసులన్నియు దిగంబరముగా నున్నవి. మానవులు, దేవతలు మొదలగు జాతుల వారందరు శరీరమునకు ఆచ్ఛాదన అనగా వస్త్రములు లేకుండుటచేత వారివారి దేహావయవములు కాపాడుకొను శక్తిలేనివారై మిక్కిలి సిగ్గుతో దిగంబరులుగా వుండి మిక్కిలి వేదన చెందినవారై తమ మానములను కాపాడుకొనుటకై చెట్ల ఆకులను, తాడులను, జంతు చర్మములను, చర్మములయందలి బొచ్చును మొదలగువాటిచేత తమమర్మాంగములను ఆచ్ఛాదించుకొనుచుండిరి. మిక్కిలి సిగ్గుతో అలమటించుచుండిరి. వారి దయనీయమైన స్థితిని చూచి నేను మిక్కిలి క్రుంగిపోయినాను. సకల జాతుల

వారందరికి మానములను కాపాడుటకు అనగా ఆచ్ఛాదనకు కావలసిన వస్త్రములను సృష్టించుటయందు నేను అసమర్థుడను అయితిని. దీనిని నివారించుటకు వస్త్రములను తయారు చేయవలెను. వస్త్రములు వాటిని తయారు చేయుటయందు నాకు శక్తి సామర్థ్యములు లేకపోవుటచేత గదా ఈ మానవ దేవజాతుల వారందరు దిగంబరులై గోవులుగా తిరుగుతున్నారు. కావున వీరికి కలిగిన సిగ్గును తొలగించి వారి మానములు కాపాడుటకై ప్రయత్నం చేయుదును.

## వస్త్ర నిర్మాతను సృష్టించమని బ్రహ్మ వేడుకొనుట

తనకు సృష్టిని చేయు శక్తినిచ్చిన ఆ పరమేశ్వరుడువుండు కైలాసమునకు బ్రహ్మదేవుడు తనతోటి వారితో కలసి వెళ్ళి పరమేశ్వరునిగురించి ప్రార్థించినాడు. ఆ కైలాసమునందు వజ్ర సింహాసనమందు ఆసీనుడైవున్న పరమేశ్వరుడిని జంతువుల బొచ్చును, జంతు చర్మములను, ఆకులతోను, తాడులతోను తమ శరీరములను కప్పుకొని వున్న ప్రమథుల చేతను, దేవతల చేతను, గంధర్వుచేతను, ఇంద్రునిచేతను, రాక్షసులు, కిన్నరులు,కింపురుషులు, యక్షులు, గరుడులు, సిద్ధులు, చారణులు, విద్యాధరులు, ఆదిత్యులు, వసువులు, ఉగ్రమూర్తులైన రుద్రులచేతను సేవింపబడుతున్న అవ్యయుడు, అనంతుడు అయిన ఆశంకరుడిని గాంచిన బ్రహ్మదేవుడు ఈవిధముగా స్తోత్రము చేసినాడు.

నమస్తె దేదేవేశ నమస్తె విశ్వమూర్తయే।
నమస్తె జ్ఞాన గమ్యాయ నీలకంఠాయ శంభవే।
పురాతనాయ నిత్యాయ నిరాంతకాయ ధీమతే।

సర్వజగములకు శుభకరుడు అయిన శివుడిని మిక్కిలి సంతోషముతో ఈ విధముగా స్తుతించినాడు.

దేవదేవులకు ప్రభుడువా నీకు నమస్కారము.జగదాకారుడా నీకు నమస్కారము. జ్ఞానముచేతనే తెలియబడినవాడా నీకు నమస్కారము. నీలము రంగు కంఠము కలవాడవు. సకల శుభములను కలిగించుటకు మూల కారణమైనవాడా నీకు నమస్కారము. సృష్టికంతటికిని ప్రప్రథ పురుషుడవైన ఓ పురాణ పురుషుడా, నిత్యుడవు అనగా శాశ్వతుడవు అయి నిర్భీకుడవును,



జ్ఞానవంతుడవు నీకు నమస్కారము అని బ్రహ్మ స్తుతించగా అందులకు మిక్కిలి సంతోషముచెందిన ఆ శంకరుడుచతుర్ముఖ బ్రహ్మను చూచి నీవు క్షేమమేకదా. నీవు సృష్టించినలోకములన్నియు క్షేమమేకదా. స్థావర జంగమాత్మకమైన ప్రపంచమును సృష్టించినావు. అందున్న సకల జాతులవారు క్షేమమేనా అని పరమేశ్వరుడు అడుగగా దానికి తమరి అనుగ్రహము వలన అంతయు క్షేమముగానే యున్నది. కాని నేనుసృష్టించిన దేవజాతులు, మానవులు తమ మర్మాంగములకు ఆచ్ఛాదనలేక మిక్కిలి సిగ్గుచెంది మహాదైన్యమును చెందుతున్నారు. వారికి కలిగిన ఈ కష్టమును తొలగించుటకై నాకు శక్తి చాలదు. మీరే ఈ సమస్యకు పరిష్కారము చూపవలెను మహాదేవ అని బ్రహ్మదేవుడు విన్నవించెను. అందులకు పరమేశ్వరుడు ఈ సృష్టికార్యము నంతయు దిగ్విజయముగానెరవేర్చినవాడవు. వస్త్రములను సృష్టించి అందరికి ఇచ్చి వారి మానమును కాపాడవచ్చుగదా! ఎందులకు ఈ పని నిర్వర్తించలేక పోవుచున్నావు. దీనికిగల కారణమేమిటి అను విషయములను పరమేశ్వరుడు అడుగగా బ్రహ్మదేవుడు వినమ్రతతోకూడి చేతులు జోడించి పూర్వకల్పములో (అనగా ఇది వరకు జరిగిన సృష్టిలో అనగా 432కోట్లమానవసంవత్సరాల కాలము1200 సంవత్సరాలు దేవతలకు అగును. ఈ కాలాన్ని మానవ కల్పము అందురు. మానవునకు ఒక సంవత్సరము కాలము దేవతలకు ఒక రోజుతో సమానము.) పూర్వ సృష్టియందు దేవ మునీశ్వరుడు అగు **మనువు** అను నతడు వస్త్రప్రదానము చేసియున్నాడు. అతడు పూర్వ సృష్టి కల్పాంత కాలములో నీ సాయుజ్యముపొందెను. వస్త్రములను నిర్మించు శక్తి అతనికితప్ప ఇంకెవ్వరికి లేదు. కాబట్టి నీయందే సాయుజ్యంపొందివున్న వస్త్ర ప్రదాత అయిన **మనువును** తిరిగి సృష్టింపుము. అతనికే ఈ వస్త్ర నిర్మాణ శక్తి వున్నది. కావున మీరు ఈ విషయమై ఆలోచించండి అని బ్రహ్మదేవుడు పరమేశ్వరుడికి చెప్పినాడు.

## దేవాంగుడు ఆవిర్భవించుట

అప్పుడు శంకరుడు అర్ధనిమీలిత నేత్రములతోకూడి మనస్సునందు ధ్యానించగా శివుని ఫాలలోచనమునుండి ఒక అద్భుత కాంతి పుంజము వెలువడినది. అది కోటి సూర్య ప్రభాజనితమైన వెలుగుతో ప్రకాశించుచూ కొంతసేపటికి ఒక దివ్య పురుషరూపమై వెలుగొందుచుండినది.

## దేవలుని ఆవిర్భవానికివున్న గ్రహస్థితి

| మధ్య గ్రహాలు | | | | | మందోచ్చులు | | | స్ఫుట గ్రహాలు | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| గ్రహము | భగణములు | రాశి | భాగ | లిప్త | రాశి | భాగ | లిప్త | రాశి | భాగ | లిప్త |
| రవి | 4153 | 2 | 27 | 43 | - | - | 8 | 2 | 25 | 53 |
| చంద్ర | 55523 | 8 | 2 | 40 | - | - | - | 7 | 21 | 40 |
| కుజ | 2208 | 2 | 17 | 33 | - | - | 4 | 2 | 14 | 56 |
| బుధ | 17244 | 7 | 23 | 11 | - | - | 8 | 2 | 2 | 38 |
| గురు | 350 | 1 | 19 | 16 | - | - | 18 | 2 | 0 | 44 |
| శుక్ర | 6751 | 2 | 10 | 30 | - | - | 11 | 3 | 25 | 44 |
| శని | 140 | 11 | 28 | 15 | - | - | 01 | 11 | 28 | 2 |
| రాహువు | 223 | 3 | 18 | 54 | - | - | - | 8 | 11 | 6 |
| కేతువు | 223 | 9 | 18 | 54 | - | - | - | 2 | 11 | 6 |

అహర్గణం : 15 16 999 వారం : ఆదివారం

### జ్యేష్ట పూర్ణిమ జ్యేష్టా నక్షత్రం
### జనన కాల బుధ మహాదశాశేషం

సం నెల రో

10 9 6

| | | | |
|---|---|---|---|
| శ | | | ల ర కే బు గు కు |
| | రాశి | | శు |
| | | | |
| రా | చ | | |

| | | | |
|---|---|---|---|
| శ | | ర | |
| కు శు | నవాంశ | | రా |
| కే చ | | | |
| | | బు గు | |



## దేవలుని రూపము

జటిలో వల్కలధరో దండాజిన కమండలుః
బిభ్రాణ పటుతేజస్వీ దర్భయుక్తాంగులి ప్రభుః॥
రుద్రాక్ష కృత కేయూర హార కంకణ శోభితః।
వినీతి ర్విమల జ్ఞానోమేధావీ విజితేంద్రియః।
సూర్యకోటి ప్రతీకాశ తేజసాభాసయన్ దిశః॥
యజ్ఞోపవీతం బిభ్రాణ సర్వకర్మ సుసాధనంః।
ఉదార గుణ సంపన్న స్సత్యవాదీ దృఢవ్రతః।
చాతుర్య యుక్తినిపుణ కుశలీకీర్తిభూషణః॥

ఆ దివ్య పురుషుడు జడలుదాల్చుకొని నార వస్త్రములు ధరించి దండమును, కృష్ణాజినము (జింక చర్మము), కమండలమును ధరించి మిక్కిలి తేజస్సుతో ఒప్పుచూ చేతివ్రేళ్ళకు దర్భలను ధరించి ఎల్లకార్యములు చేయుటకు శక్తి కలిగినవాడై రుద్రాక్షములనే హారములుగాను, భుజకీర్తులుగాను, కంకణములుగాను ధరించి శోభిల్లుచూ మిక్కిలి నీతి కలిగి విమలమైన జ్ఞానముకలిగి మిక్కిలి మేధస్సుతో వుండి జితేంద్రియుడై కోటి సూర్యులతో సమానమైన తేజస్సుచేత దిక్కులకు ప్రసరింపచేయుచూ శ్రౌతస్మార్త కర్మములైన సకల కర్మలకు ముఖ్యమైనదియు అగు యజ్ఞోపవీతమును ధరించి గంభీరమైన గుణములతో వుండి సత్యమును పలుకువాడును, వ్రతములయందు దృఢ దీక్షకలవాడుగాను, చమత్కార యుక్తులు కలవాడుగను, కుశలముతో వుండువాడును అనగా నిత్య సంతోషిగా చిరునగవు మొఖముతో తేజస్సుతో కూడియుండుటయేగాక కీర్తి ప్రతిష్టలచే ప్రఖ్యాతిగాంచివాటిచేఅలంకృతయుడై వుండి చూచుచున్న చూపరులకు మిక్కిలి ఆశ్చర్యము కలుగజేయునట్లుగా ఆ దివ్య పురుషుడు వుండెను. అంతట ఆమహాదేవుడగు శివుడు తన కొలువులో వున్న వారందరు వినునట్లుగా గంభీరమైన స్వరముతో ఈ దివ్య పురుషునకు "దేవల" అని నేను నామకరణము చేయుచున్నాను. అందువలన ఇకనుంచి అందరూ "దేవల" పేరుతోనే ఈ దివ్య పురుషుడుని పిలువవలెను అని శివుడు పలుకగా అప్పుడు ఆ దివ్య పురుషుడైన దేవలుడు రెండు చేతులతో నమస్కరించి పరమేశ్వరుని ఈ విధముగా ప్రార్థించినాడు.

## దేవలుడు చేసిన స్తోత్రము

నమస్తె దేవదేవేశ నమస్తె చంద్రశేఖర।
నమస్తె ఫాల నేత్రాయ నమస్తెస్తు కపర్థినే॥
నమో గంగాధరాయాస్తు నమస్తె నాగకుండల।
నమస్తె నీలకంఠాయ నాగహారయతె నమః ॥
ఖట్వాంగ ధారిణే తుభ్యం నమస్తె శూలఫాణియే।
పృథువక్షాయ దివ్యాయ యోగినే దీర్ఘ బాహవే ॥
యోగీశ్వరాయ యోగ్యాయ నిత్యాయ జినవాససే ।
శుద్ధ స్పటిక రూపాయ సోమ సూర్యాగ్ని చక్షుషే।
నిర్మల జ్ఞాన గమ్యాయ సచ్చిదానంద రూపిణే।
నమో వేదాంత వేద్యాయ శంభవె పరమాత్మనె॥
యజ్ఞాంగాయచ యజ్ఞాయయజ్వనె చాష్ట మూర్తయె।
నమోస్తుహవ్యవాహాయ పురాణ పురుషాయ చ।
నమో దురితదూతాయ సత్య సందాయతే నమ ॥
నమస్తె ధర్మ రూపాయ నమస్తె నగకార్ముక ।
నమస్తె నిగమాశ్వాయ రుద్రాయామిత తేజసె॥
నమస్తె పశూనాం పతయే కోటి సూర్య ప్రభాయ చ।
నమస్తె సూక్షరూపాయ నమస్తే నంత మూర్తయె॥
నమస్తె పార్వతీనాథ నమస్తే మారఘాతినె।
అజ్ఞాన ఘోర తిమిర భాస్కరాయ నమస్తుతే॥
సర్వేశ్వరాయ సర్వస్మై నమస్తే విశ్వమూర్తయె।
దక్ష యజ్ఞ వినాశాయనమస్తేనిర్మలాత్మనే॥
భక్తాధీనాయ ధీరాయ శాంబరాయ నమోస్తుతే॥
పవిత్రమూర్తయె తుభ్యం సర్వ గోప్త్రె నమోస్తుతే॥

శివుడి మనస్సునుంచి జన్మించినందున శివమానస పుత్రుడు అని దేవలున్ని పిలిచినారు. ఆ శివమానస పుత్రుడుచే అనగా సాక్షాత్తు దేవలునిచే స్తుతింపబడిన ఈ స్తోత్రము పరమపావనమైనది. మహిమాన్వితమైనది, పరి శుద్ధమైనది, అమిత శక్తి కలిగినటువంటిది. అది దేవదేవులకు ఈశ్వరుడవైన



నీకు నమస్కారము. చంద్రుడుని శిరస్సునందు ధరించినవాడా నీకు నమస్కారము. నొసట కన్ను కలిగిన (ఫాలనేత్రం, జ్ఞాననేత్రం) వాడా నీకు నమస్కారము. జటాజూటము కలవాడా నీకు నమస్కారము. గంగను శిరస్సునందు ధరించినవాడా నీకు నమస్కారము. సర్పములను కుండలములుగా ధరించిన (అనగా చెవులకు అలంకారముగా) ధరించినవాడా నీకు నమస్కారము. నీలిరంగు కంఠము కలవాడా నీకు నమస్కారము. పాములను హారములుగా భూషణములుగా ధరించినవాడా నీకు నమస్కారము. మంచపుకోడును హస్తమునందు ధరించినవాడా నీకు నమస్కారము. సత్వ రజో తమో గుణములను అదుపులో వుంచుటకొరకై త్రిశూలమును చేత ధరించినవాడా నీకు నమస్కారము. గొప్ప విశాలమైన రొమ్ములు కలిగినట్టియు, దివ్యయోగియై వున్నటువంటివాడా, ఆజాను బాహువులు గలవాడా, యోగులకు రారాజువైనవాడా, యోగ్యుడవై, నిత్యుడవై, జంతుచర్మమును ధరించినవాడా, నిర్మలమైన స్పటికమును బోలిన రూపముగలవాడును, సూర్యుడును, చంద్రుడును, అగ్నియను వాటితో సమాన ప్రకాశముగలిగి మూడునేత్రములు గలవాడా, నిష్కలంకమైన జ్ఞానము మాత్రము చేతనేతెలియదగిన జ్ఞానస్వరూపుడా, సచ్చిదానందరూపుడా, వేదవేదాంతములచే తెలియదగిన వాడును. పరమాత్మ స్వరూపుడును అగునట్టి శంభువు కొరకు నేను నమస్కరించుచున్నాను. యజ్ఞమునకు అంగము అయినట్టియును, యజ్ఞస్వరూపమే కలిగిన దేహము కలవాడును, యజ్ఞముల కంతటికి కర్తయును, అష్టమూర్తులుగల అగ్నిహోత్ర స్వరూపుడును, పురాణపురుషుడైన నీకు నమస్కారము. పాపములకు దూరముగానున్నవాడును, సత్యమగు ప్రతిజ్ఞగలవాడవగు నీకు నమస్కారము. కొండనువిల్లుగా (బాణంగా) ధరించినవాడా నీకు నమస్కారము. వేదములను గుర్రములుగా చేసుకొనినవాడా రుద్రస్వరూపము గలవాడా నీకు నమస్కారము. పశువులకు పతివైనవాడా నీకు నమస్కారము. కోటిసూర్యులు కలసివుంటే ఎంతటి ప్రకాశము కలుగునో అంతటి ప్రకాశశక్తి కలిగినవాడా! నీకు నమస్కారము. సూక్ష స్వరూపముతోనుండువాడా! నీకు నమస్కారము. అనంతమైన రూపము కలవాడా! నీకు నమస్కారము. పార్వతీదేవికి ప్రీతిపాత్రుడవైన పార్వతీ రమణుడా! నీకు నమస్కారము. మన్మధుని భస్మము చేసినవాడా! నీకు నమస్కారము.

అజ్ఞానమనే గాఢాంధకారమును మిక్కిలి వేగముగా తొలగించువాడా! నీకు నమస్కారము. సర్వ సమస్తమునకు ప్రభువైనవాడా! నీకు నమస్కారము. సర్వస్వరూపుడును ప్రపంచమే మూర్తిగా గలవాడా! నీకు నమస్కారము. దక్షునిచేతచేయబడే యజ్ఞమును ధ్వంసంచేసినవాడా! నీకు నమస్కారము. నిర్మలమైన ఆత్మ కలవాడా! నీకు నమస్కారము. భక్తులకు సులభముగా ఆధీనుడవై వుండువాడా! నీకు నమస్కారము. మిక్కిలి ధైర్యమును కూడియుండువాడా మాయను ఆధీనమునందు వుంచుకొనినవాడా! నీకు నమస్కారము. పరిశోధకమగు మూర్తిగలవాడా! సర్వ రక్షకుడా! నీకొరకు నమస్కారము అని దేవలుడు పరమేశ్వరుడిని ఈ విధముగా స్తుతియించి పరమేశ్వరుడితో దేవలుడు ఈ విధముగా పలికినాడు.

## దేవలుడు నన్ను ఎందుకు సృష్టించినావు అని అడుగుట

శంకరా! నన్ను ఎందులకు సృష్టించితివి, నా పుట్టుకకు కారణమును, నేను చేయవలసినకార్యము ఏది? నాకు కరుణతో తెలుపుము స్వామీ? భక్తులకు పరమప్రీతిని కలిగించు దేవా! నేనునీలోసాయుజ్యం పొంది దివ్యానందంతో వుంటిని. నన్ను మరలా దేహధారిని చేసినావు. ఈ దేహ స్వభావముచైతన్యములేక జడముగావుండును. నిత్యము నశించు స్వభావము కలది. అనేక దుఃఖములు ఈ దేహమువలన అనుభవించవలసి వుండును. ఈ దేహము పంచభూతములైన పృథ్వి, అగ్ని, వాయువు, జలము, ఆకాశము అను వాటియొక్క సంమిశ్రమముతో వుండి పంచ వాయువులైన ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన అను వాయువులతోకూడి ఈ దేహము వుండును. దీనికి పది ఇంద్రియములు అనగా కన్ను, ముక్కు, చెవి, నోరు, నాలుకవాటితో కూడి వుంటుంది. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అను వాటితోనిండివుండినది ఈ దేహము. 24 తత్త్వములయొక్క రాశిస్వరూపము. ఈ దేహముపై 25వ తత్త్వముగల జీవుడు చైతన్యుడు, తేజస్వరూపుడు అయినపురుషుడు అజ్ఞానపాశముతో బంధింపబడినవాడై ఈ దేహమునందుండి నిత్యము దుఃఖపడుచుండును. వర్ణించడానికి వీలుపడనిది అగు అజ్ఞానము వలన అవివేకము జనియించును. ఈ అవివేకమువలన అభిమానము పుట్టును. దానివలన కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యములనే అరిషడ్వర్గములును ఈర్ష్యాదులును అయిన



పదియునువీటిద్వారా పుట్టును. వీనికి త్రికరణములైన మనస్సు, వాక్కు, చిత్తము అను త్రికరణములు కర్తృత్వమునుపొంది వివిధ కర్మలు అయిన ప్రారబ్ధ ఆగామి, సంచిత కర్మలను భూత, భవిష్య, వర్తమానములయందు దేహి అనుభవించుచుండును. ఇట్టి అనివార్యమైన ఈ కర్మ సంబంధ చక్రములోనికి ప్రవేశించిన వారికి ఈ సంసార సాగరమునుదాటి ఒడ్డున పడుట మిక్కిలి కఠినమైనటువంటిది. ఇది ఒక చక్రమువలె నిరంతరము దానికి బంధింపబడి తిరుగుచుండును. ఈ సంసార సాగర చక్రమునుండి విముక్తిపొందుట దుస్సాధ్యమైనటువంటిది. ఈ దేహము మాయా శక్తి ప్రభావానికిలోనై తనను తాను మరచిపోవుట జరుగుచుండును. అందువలన వివేకవంతులైనవారు దేహధారణయందు నిర్లిప్తత కలిగియుందురు. ఈ దేహధారులకు నిత్య సుఖమైన నిరతిశయానందం లభించుట కలలోని మాట. కావున పరమేశ్వరా! నన్ను దేహధారుడును చేసినావు అంటే ఈ జగత్తుకు మిక్కిలిఅత్యవసరమైన కార్యము ఉంటేనేగాని సాయుజ్య స్థితిలోనున్న నన్ను జన్మింపనీయవు. కావున నేను చేయవలసినటువంటి కార్యము ఏదయా! నేను ఏదేశములో ఏ పట్టణమునందు నివసించాలి. నా వంశము వారు ఏ విధముగా నడచుకుంటారు మొదలగు విషయములు దయతో నాకు తెలుపుము దేవా! పరమేశ్వరా! అని దేవలుడు మిక్కిలి వినయముతోకూడి అడిగినాడు అని చతుర్ముఖ బ్రహ్మ నారదునితో చెప్పినాడు. అప్పుడు నారద మునీంద్రుడు బ్రహ్మదేవునిగురించి ఈ విధముగా అడిగినాడు. మరి పరమేశ్వరుడు దేవలునికి చెప్పిన విషయము ఏమిటి? చెప్పుము. మిక్కిలి కుతూహలముతో తెలుసుకోవాలని వున్నది అని అడుగగా దానికి పరమేశ్వరుడు దేవలునికి చెప్పినవిషయమును బ్రహ్మదేవుడు నారదునికి ఈ విధంగా చెప్పసాగెను.

## శివుడు దేవలుడు చేయవలసిన కర్తవ్యమును తెలుపుట

ఓయీ! దేవలా! వినుము అని శివుడు ఈవిధముగాచెప్పెను. ఓ మహానుభావుడైన దేవలా! నీవు దేహధారివి అయినందులకు విచారము చెందవద్దు. సాయుజ్య స్థితిలో ఉన్నటువంటి నిన్ను దేహధారునిగా చేయుటయందు మిక్కిలి విశేషమైన కార్యము అనగా సకల లోకాలకు ఆత్యవసరమైన పనిని నీద్వారా చేయ సంకల్పించినాను. అది ఏమిటంటే

వస్త్రములను నిర్మించి సకల లోకములవారికి అందజేయుము. దేహధారులయొక్క మానమును కాపాడి వారినందరిని సంతోషపెట్టుము. ఈ పవిత్రమైన కార్యము నెరవేర్చుటకొరకు నిన్ను జన్మింపజేసితిని. నీవు ఇంకా ఆరు జన్మలు పొంది మిక్కిలి శక్తివంతమైన మంగళకరమైన పనులు చేయుటద్వారా నీ కీర్తి ప్రతిష్టలు దశ దిక్కులయంతటను వ్యాపించును. ఏడవ జన్మమున నీవు తిరిగి నాయందు సాయుజ్యం పొందుదువు. సృష్టి కార్య నిర్వహణలో నీవు వస్త్రములను సృష్టించి, మను బ్రహ్మగా, వస్త్ర నిర్మాతగా కీర్తిని పొందెదవు. నీవు సృష్టించిన దివ్య వస్త్రములతో దేవతలు తమ శరీర అంగములను అలంకరించుకొందురు గాన నీవు **దేవాంగుడవు** అని ప్రసిద్ధి చెందుతావు. నీవు దేవల, దేవాంగ అను రెండు పేర్లతో ప్రఖ్యాతి వహించెదవు అని పరమేశ్వరుడు దేవలునితో చెప్పినాడు.

## దేవాంగ వంశస్థుల గుణగణములు

దేవలా! నీ వంశము వారు ఏ విధముగా నడచుకొందురని అడిగితివి కదా! వినుముచెప్పెదను అని నీ వంశమునందు జన్మించిన వారు గంభీరమైన బుద్ధి కల్గిన వారు గాను, సత్యము పలుకువారును, పరోపకారము చేయుటయందు మిక్కిలి శ్రేష్టులైన వారుగాను ఉందురు. మంచి మేధస్సు కలిగిన వారు, మంచి నడవడిక కల్గి అందరిచే శ్లాఘింపబడు వారుగాను, దేవతలయందును, బ్రాహ్మణులయందును భక్తి కలవారుగాను, మిక్కిలిపరాక్రమవంతులుగాను, సదాచార సంపన్నులుగాను, చతురత కల్గిన నేర్పరులుగాను, ఉదార స్వభావ సంపన్నులుగాను ఉండెదరు. అందువలన నీ వంశము మిక్కిలి కీర్తి ప్రతిష్టలతో ఉండును దేవలా అని పరమేశ్వరుడు దేవలునితో చెప్పినాడు.

## నారాయణునివద్దకు వెళ్ళి తంతువులను సంగ్రహించుమని శివుడు చెప్పుట

శివుడు దేవలునితో నీవు ప్రస్తుతము చేయవలసిన ఒక మహత్కార్యము ఉన్నది. దానిని చెప్పుచున్నాను వినుము. పూర్వము నా వలన వేదములు పుట్టినప్పుడువాటితోపాటే సర్వ లోకములకు అలంకారములను ఇచ్చునటువంటి తంతువులు (దారములు) నుగూడ పుట్టినవి. అప్పటినుండి అవి శ్రీ విష్ణువుయొక్క



నాభి కమలమునందు ఉంచబడినవి. నీవు ఆ విష్ణువువద్దకు వెళ్ళి, ఆ తంతువులను స్వీకరించినీనేర్పుకొలది వాటితో దివ్య వస్త్రములుగా నేసి దేవతలకు అలంకారముగానుండు విధముగా నైపుణ్యతతో నేసి వారికి ప్రదానము (ఇచ్చుట) చేయవలయును అని పరమేశ్వరుడు దేవలునితో చెప్పిన విషయమును బ్రహ్మదేవుడు నారద మునీంద్రుల వారికి చెప్పెను. పరమేశ్వరుడు దేవలునితో నీవు నివసించుటకు సర్వ రత్నమయములతోను, సకల భోగములకు ఆటపట్టును, సర్వ ఓషధములచే అలరారుచుండు మహా వృక్షములతో కూడినటువంటియు, అనేక పర్వతములు నక్షత్రములను తాకువంటి ఎత్తైనవియును, మహాపొడవుగా వ్యాప్తిని చెందిన మహా నదులతోను, సకల ధాన్యములు పండు సస్యశ్యామలమైన సారవంతమైన భూములతోను వ్యాపించి వున్నటువంటివి అయిన ఏడు ద్వీపములతోను, తొమ్మిది ఖండములుగా వ్యాప్తి చెందినటువంటి భూమికలదుకదా! దానిలో జంబూద్వీపమనికలదు. అందు సకల దేవతలందరికి నివాసయోగ్యమైన మేరు పర్వతము అనునది కలదు. ఈ మేరు పర్వతము ఉమ్మెత్త పువ్వువలె బంగారు రంగులో వుండును. దాని ఔన్నత్యము అనగా ఎత్తు 32 లక్షల యోజనములు. అనగా 256 లక్షల మైళ్ళు వ్యాపించి వున్నది. పాతాళమునందు 128 లక్షల మైళ్ళ వరకు వ్యాపించియున్నది. దానికి దక్షిణము వైపున భరత ఖండము కలదు. అందు సర్వ సౌఖ్యములకు ఆలవాలమైయున్న సగర దేశము వున్నది. ఆదేశములో బహు విస్తారముగల ఆమోద పట్టణముకలదు. అది స్వర్గము అయిన ఇంద్రుని అమరావతిని మించి వున్నప్పుడు దానిని వేరుగా వర్ణింపవలెనా? నీవు ఆపట్టణమునకు రాజువై రాజ్యమేలుతుండుము. ఈ విధముగా శివుడు ఆజ్ఞాపించగా మంచిది అని పలుకుతు అతనికి నమస్కరించి దేవలుడు విష్ణుమూర్తిని చూచుటకై క్షీరసాగరమునకు బయలుదేరెను.



# చౌడేశ్వరి వర ప్రసాదము, రాక్షసోపాఖ్యానము

## ద్వితీయాధ్యాయము

మిక్కిలి తేజస్సంపన్నుడైన దేవలుడు పాల సముద్రమువద్దకు పోయి దాని ఒడ్డున ఒక సొగసైన బంగారపు ఆశ్రమమును ఏర్పరచుకొని దానియందు నివసించుచుండెను. ఆఆశ్రమము తియ్యని మామిడిపండ్లను ఇచ్చు చెట్లను, ఏపి చెట్లను, తక్కోల వృక్షములు, కానుగ చెట్లను, టెంకాయ మ్రానులను, గోరింట చెట్లను, ఏడాకుల అరటి చెట్లను, మద్ది చెట్లను, పనస చెట్లను మరియు పలువిధములైన అనేక వృక్ష సంపదలతో మిక్కిలి శోభాయమానముగా ఆశ్రమ పరిసరములు వుండినవి. నాలుగు దిశలనుండి తుమ్మెదలు ఝంకారములు చేయుచుండెను. కోకిలములు తమ మధురమైన కూతలతో అలరారుచుండెను. అంతేగాక ఆ ఆశ్రమము పాల సముద్రము ఒడ్డున వుండుటవలన సముద్ర తరంగములచేత ఆ ప్రదేశము చల్లగా నుండెను. అందువలన ఈ ఆశ్రమమునందు తపస్సు చేసికొనుటకు అర్హతమైనదిగా దేవలుడు నిశ్చయించుకొనినాడు. అయితే ఆ క్షీర సాగరముయొక్క లోతును వింధ్య పర్వతాధీశుడు కనుగొనజాలడు. దాని వెడల్పు ఎంత అని గరుత్మంతుడుకూడ కనిపెట్టలేడు. క్షీర సాగరమందు నాచు పాచియుండును. అది పచ్చిక మొలచినదా అను తలంపు కలుగుచుండును. ఆ సాగర గట్టున పడియున్న నురుగుదొబ్బలను చూచినచో మరలా దేవదానవులు తనను మధింతురను భీతితో సముద్రము తనకు ఒక కోట కట్టుకొనినట్లు తోచుచుండును. చేపల రెక్కలు త్రాకుడుచే ఎగిసి ఆకాశము తాకబోయి క్రిందకుపడుచున్న ఉదక బిందువులను చూడ దేవతలు సముద్రముమీద పూజార్థము చల్లునట్టి ముత్యములు అని తోచుచున్నది. మిక్కిలి ఎత్తైన అలలతో వుండగా పూర్వము అగస్త్యుడు తనను త్రాగెనను కోపమున అతనిని పట్టుకొనుటకు తన బాహువులను చాచుచున్నట్టులను అచ్చటచ్చట జల జంతువులు తమ తలలను కనిపింపగా ఇంతకంటె గొప్ప వస్తువులు నాలో లేవనియును దేవతలకు తమయందున్న వస్తువుల ప్రమాణమును తెలుపునట్లుండులాగున వుండెను.



అంతట రాజ హంసల చేత శోభిల్లుతున్న ఆ పాల కడలివద్ద తన తపస్సు చేయుటకు మిక్కిలి అనువుగా వున్నది అని దృఢ నిశ్చయము కలిగినాడు దేవలుడు. ఆ ఆశ్రమమునందు దృఢ ప్రజ్ఞుడై నిశ్చల చిత్తము కలిగి జితేంద్రియుడైయుండి యోగాసనమున కూర్చుండి తన మనస్సును శ్రీ విష్ణుమూర్తియందు నిల్పి యోగశ్రీ సంపన్నుడై యమనియమాది అష్టాంగ యోగములచే విష్ణువుయెక్క అనుగ్రహమును పొందగోరి తపస్సును చేసెను.

### నారాయణుడు దేవలునికి తంతువులను ఇచ్చుట

అతని తపస్సుకు మిక్కిలి ప్రీతిచెంది దేవలునికి ప్రసన్నుడాయెను విష్ణువు. అంత దేవలుడు తనకు ప్రసన్నుడైన శ్రీ హరిని ఈ విధముగా స్తోత్రము చేసెను. దేవదేవులకు ప్రభువైన వాడా! నీకు నమస్కారము. భక్తులయందు పరమ ప్రీతికలవాడా! నీకు నమస్కారము. తామరపూవులవంటి నేత్రములు కలస్వామీ! నీకు నమస్కారము. మధువు అను రాక్షసుడిని వధించిన ఓ స్వామీ!నీకు నమస్కారము. లక్ష్మీపతివై అనంతుడవైన ఓస్వామీ! నీకు నమస్కారము. పురుషోత్తముడా! నీకు నమస్కారము. సకల లోక నాయకా! నీకు నమస్కారము. నారాయణుడా! నీకు నమస్కారము. నాలుగు భుజములు కలిగిన దేవుడా! నీకు నమస్కారము. శార్ఙ్గ శాపమును ధరించినవాడా! నీకు నమస్కారము. కౌస్తుభాభరణమును, శంఖమును, చక్రమును, గదను ధరించినవాడా! నీకు నమస్కారము. గరుడ వాహనము కలిగియున్నవాడా! నీకు నమస్కారము. లక్ష్మీకాంతుడు, ఎల్లవారిచేత సేవింపదగినవాడును, పుణ్యమైన సుందరాకార విగ్రహము కలిగినవాడా! నీకు నమస్కారము. పాపములను భస్మీపటలము చేయువాడా, రాక్షసుల గర్వమును అణచివేసినవాడా! నీకు నమస్కారము. వేదములు, వేదాంతములు చదివిన వారిచే తెలియబడువాడా, జ్ఞానముచే మాత్రమే ఎరుగదగినవాడా! నీకు నమస్కారము. ఇంద్ర నీలము కాంతి వంటి దేహము కలవాడా! నీకు నమస్కారము. దీనులను రక్షించుటకు బద్ధ కంకణము ధరించినవాడా! భుక్తి, ముక్తి రెండును ఇచ్చువాడవు అగు ముకుందా! నీకు నమస్కారము. పరబ్రహ్మస్వరూపము గలవాడా! విశ్వాకారుడా! నీకు నమస్కారము. ఈ విధముగా దేవలుడు నారాయణున్ని స్తుతించెను. అంతట ఇంద్రనీలపు

కొండమీద వెన్నెల ఉదయించునట్లు చిరునగవుతో వున్న శ్రీహరి దేవలుడితో ఈ విధముగా అనినాడు.బాగు బాగు మిక్కిలి అదృష్టవంతుడవు అయిన దేవలా! నీవు చేసిన తపస్సు మిక్కిలి సంతోషము కలిగించినది నాకు కావున నీకిష్టమైన కోర్కెను కోరుకొనుము. దానిని నేను నెరవేర్చెదను అని నారాయణుడనగా అంతట దేవలుడు నారాయణునితో ఈ విధముగా చెప్పినాడు. ఓ దేవదేవుడా! జగత్స్వామీ! లక్ష్మీవల్లభుడా, దయానిధీ నీవు ప్రసన్నుడవు అయినావు. నాకు చాలా సంతోషమైనది. నేను కృతార్థుడైతిని. సర్వేశ్వరుడు ఆజ్ఞ ప్రకారము వస్త్రములను నేయుటకొరకై మీవద్ద వున్న తంతువులను తీసుకొని పోవుటకొరకు మీ వద్దకు వచ్చినాను. కావున తంతువులను ఇవ్వుము. హృషీకేశుడా! నీ దర్శనము చేతనే నా కోరిక ఫలించినది అని ఈ విధముగా దేవలుడు అనగా విష్ణువు తంతువులను ఇచ్చుటకు అంగీకారమును తెలిపినాడు. తన నాభి కమలము(బొడ్డు) నందుంచుకొనిన **తంతువులను దేవలునికి నారాయణుడు** ఇచ్చెను. దేవలునితో మహావిష్ణువు ఈ తంతువులు జగత్తు పుట్టినప్పటి నుండి వానిని నేనే కాపాడుచున్నాను. దేవలుడా! నీ చేత వాటికి ఉపయోగము ఇప్పుడు కలుగుతున్నది. వీటిద్వారా వెల లెక్కించడానికి వీలుపడనటువంటి వస్త్రములను నీ నైపుణ్యముతో అందరూ మెచ్చునట్లు నిర్మింపుము. వాటిని దేవతలందరికి ఇచ్చి వారికి అలంకారమును కల్పింపుము అని శ్రీ విష్ణువు చెప్పినాడు. మిక్కిలి సంతోషముతో వుండి తన సుదర్శన చక్రమునుండి ఒక చక్రమును సృష్టించి దేవలునకు ఇచ్చినాడు. దేవలుడు విష్ణునివలన చక్రమును తీసుకొని సంతోషము పొంది తన రెండు చేతులతో దోసిలిగా జేసి, దేవదేవుడును లోకములకు గురుడును అగు విష్ణువుతో ఇట్లనెను. మీరు నన్ను ఎంతో అభిమానించి, గౌరవించి మాటలాడినారు. మీ అనుగ్రహమును పొందుటవలన మిక్కిలి సంతోషపడుచున్నాను. మీ అనుగ్రహమువలన వస్త్రములును నేసెదను. మీరు చెప్పిన రీతిగా దేవతలందరికి వస్త్రములను ఇచ్చెదను అని పలికి భక్తితో నారాయణునకు ప్రణమిల్లినాడు దేవలుడు. కొంతసేపు రెండు చేతులు కట్టుకొని నారాయణుని చెంత నిలిచినాడు. అంతట విష్ణుమూర్తి నేను చెప్పినట్లుగా చేయుమని చెప్పి అంతర్హితుడు అయినాడు.

## దేవలుడు రాక్షసుల మాయా ఆశ్రమములోనికి ప్రవేశించుట

పాలసముద్రము నుండి జంబుద్వీపానికి దేవలుడు బయలుదేరినాడు.



మార్గమధ్యములో లవణ(ఉప్పు) సముద్రము వద్ద ఒక అద్భుతమైన ఆశ్రమాన్ని చూసినాడు. ఆ ఆశ్రమము రకరకాల వృక్షజాలముతో నిండియుండెను. తియ్యని మామిడిపండ్లు వున్న మామిడిచెట్లు, పనస వృక్షములు, వేపచెట్లు, వెలగ, రేగు,నేరేడు, గిచ్చిలి, నిమ్మ మొదలగు వృక్షములతో ఆ ఆశ్రమము అలరారుచుండెను. మకరందముతో కూడిన పువ్వులను పూచునట్టి బహు విధ వృక్షములచేతను జాజి, మల్లి, గురిగింజ మొదలగు తీగల చేతను దిరిశిన చెట్ల చేతను, మొగిలి చెట్లచేతను మిక్కిలి మనోహరముగా వుండినది ఆ ఆశ్రమము. ఆ ఆశ్రమమును చూచిన దేవలుడు ఈ ఆశ్రమము ఎవ్వనిదో తెలియదు. దీనిని చూడగానే మనస్సు ఆహ్లాదపడుచున్నది. ఈ ఆశ్రమమునందున్న మహాత్ముని తపస్సు ఏపాటిదో గదా అని ఆశ్చర్యము వెలిబుచ్చుచూ ఆ ఆశ్రమములోనికి ప్రవేశించినాడు. ఇచ్చట ఒక విషయమును గమనించవలసి వున్నది. నారాయణుని వద్దకు తంతువులు తీసుకురావటానికి దేవలుడు వెళ్ళినాడు అను విషయమును రాక్షసులు తెలిసికొని అతనిని దారి మధ్యలోనే అడ్డగించి ఆ తంతువులను దొంగిలించాలనే తలంపు కలిగి వుండుట చేత దేవలున్ని ఆహ్లాదపరచే విధంగా ఒక కృత్రిమమైన ఆశ్రమాన్ని అప్పటికప్పుడు తమ మాయాశక్తితో ఏర్పరచినారు రాక్షసులు. ఈ విషయం తెలియక దేవలుడు అద్భుతంగా వున్న ఆశ్రమాధిపతియొక్క గొప్పతనమును గురించి ఆలోచిస్తూ లోనికి ప్రవేశించినాడు. రాక్షసులే మాయామునుల రూపములోవుండి కపట మంత్రములతో జపించుచున్నట్లు నటన చేయుచుండిరి. వారిని చూచుచూ లోపలకు వెళ్ళే సరికి ఆ ఆశ్రమాధిపతి మిక్కిలి వృద్ధస్వరూపముతో మహర్షి రూపముగా అలంకరించుకొని నిమీలిత కన్నులతో జపము చేయుచున్నట్లుగాను అతనిని పరివేష్ఠించి ఆయన శిష్యులు కూడా మంత్రజపములు చేయుచున్నట్లుగాను నటించుచున్నారు. వృద్ధతపస్వి దేవలుని చూచి ఏమీ ఎరుగనట్లు నాయనా ! నీవు ఎవరవు నీ పేరేమి నీవు ఇచ్చటకి వచ్చుటకు గలకారణ మేమి అని అడుగగా దేవలుడు ఆ కపట మునితో ఇట్లు చెప్పెను. నేను దేవలుడును. పార్వతీవల్లభుడైన ఈశ్వరుని మానసపుత్రుడను. ఆ మహాదేవుని ఆజ్ఞప్రకారము వస్త్రములు నిర్మించుట కొరకు అవసరమైన తంతువులను శ్రీమన్నారాయణుని వద్దనుండి గ్రహించి వెళ్ళుచుండగా ఈ

ఆశ్రమమును చూచితిని అని చెప్పినాడు. అందులకు కపటముని ఆహా! ఎంత మంచి మాట చెప్పినావు. చాలా సంతోషము కలిగినది. నీవు ఈ రాత్రికి ఇచ్చటనే బస చేసి రేపు ప్రాత:కాలమున బయలుదేరవచ్చును మీకిష్టమైతే అని చెప్పెను. అందులకు దేవలుడు అంగీకరించినాడు.

## రాక్షసులు దేవలుని చంపుటకు యత్నించుట

ఆనాటి రాత్రి దేవలుడు విశ్రమించి వుండగా కపటమునుల వేషములో వున్న రాక్షసులు ఒక్కసారిగా తమ నిజరూపాన్ని పొంది దేవలునిపైబడి చంపటానికి ప్రయత్నం చేయుచుండిరి. తృటిలో ఈ విషయమును గ్రహించిన దేవలుడు మిక్కిలి పెనుగులాడినాడు. చేసేది లేక నారాయణుడు ఇచ్చిన సుదర్శన చక్రమును రాక్షసులపై ప్రయోగించినాడు. ఆ దివ్య సుదర్శన వైష్ణవ చక్రము దేదీప్యమానముగా ప్రకాశిస్తూ వేగముగ శత్రువులను సంహరిస్తూ వున్నది. కొందరికి చేతులు తెగిపోయినవి. కొందరికి కాళ్ళు తెగిపోయినవి. ఇంకొందరికి హృదయములను ఛేదించినది. మరికొందరికి శిరస్సులను త్రుంచివేసినది. ఈ విధముగా రాక్షసులను తునుమాడుచున్నది. ఈ వైష్ణవ చక్రముయొక్క ప్రతాపమునకు రాక్షసులందరూ చెల్లాచెదురై దశదిక్కులకు పారిపోయినారు. అంతట వజ్రముష్టి, ధూమ్రవక్తుదు, మహాబలశాలి అయిన ధూమ్రాఖ్యుడు, చిత్రసేనుడు, పంచసేనుడు అను అయిదుగురు రాక్షసరాజులు మిక్కిలి బలసంపన్నులు. వారు వెంటనే మరలా తమ సైన్యమును సమీకరించుకొని వచ్చి దేవలునితో పోరాడుచుండిరి. ఆ రాక్షస రాజుల మీదకు ఈ విష్ణు చక్రము ప్రయోగింపగా రాక్షసరాజులైన అయిదుగురినీ విష్ణు చక్రము ఏమీ చేయలేకపోయినది. కాని రాక్షస సేనను మాత్రము చండ ప్రచండ వేగముతో నాశనము చేయుచున్నది. అయిదుగురు రాక్షస రాజులు దేవలుని మీదకు అనేక అస్త్రశస్త్రములతో నలుదిక్కులనుండి మిక్కిలి వేధించగా ఆ బాధలను సహింపజాలనివాడై వారిని ఎదురించ శక్తి లేకను చివరికి ఆ జగజ్జనని అయిన చండికాదేవిని మిక్కిలి ప్రీతితో ఈ విధముగా స్తుతియించినాడు దేవలుడు. దుర్గవు షడ్గుణైశ్వర్యములు గలదానివి చండీదేవివి ఎర్రని కన్నులు గలదానివి. నల్లని రంగుగల శరీరము గలదానివి. సింహముపై ఎక్కి స్వారీ చేయునది అయిన సర్వేశ్వరేశ్వరిని స్తుతియించినాడు. లోకేశ్వరి, లోకములను



ధరించుదానివి, లోకములను కలుగజేయుదానివి, నీవు వాటిని కాపాడుదానివి హిమవంతుని పుత్రికవు ఆశీర్వాదములు కలుగజేయుదానివి శుభమైన అవయవ సౌష్ఠవముతో వుండు దానివై మిక్కిలి విజృంభించు రాక్షసుల మదమును హరించు దానివి మహిషాసురుని సంహరించిన దానివి మహాబలవైన దేవివి స్తుతియించుచున్నాను. సురలు, అసురులు తమ శిరస్సులయందు అలంకరించుకున్న శిరస్త్రాణములందలి కాంతి అమ్మవారి పాదాలపైబడి నీరాజనములు అందుగొనులాగా ప్రకాశించుదానివి. ఎర్రని తల వెంట్రుకలచే, ఎర్రని కోరలు గలదానివి బాణమును, గదను ధరించిన దానిని స్తుతి చేయుదును. ఓ మంచి భూషణములు ధరించిన చండికా మహాదేవి నన్ను కాపాడు, కాపాడు. కమలము రేకులవంటి నేత్రములు గల చండికా! రాక్షస గర్వమును ధ్వంసం చేయగల ఓ చండికాదేవి! నాకు ప్రసన్నురాలవు కమ్ము. ఈ విధముగా దేవల మహాత్ముడు స్తుతి చేయుచుండెను. భక్త వత్సలయగు ఆ చండికా మహాదేవి అతని మ్రోల విని ఆవిర్భవించినది.

## శ్రీ చౌడేశ్వరీదేవి ఆవిర్భావము

దేవాంగ పురాణములోని 2 అధాయ్యము ప్రకారం ఆషాఢ అమావాస్య అర్ధరాత్రి అంత్యకాలములో శ్రీ చౌడేశ్వరీదేవి ఆవిర్భవించినది. అనగా శ్రీ దేవలుని వివాహమునకు మునుపే అవతరించినది. దేవలుని వివాహము శ్రీ రుధిరోద్గారి నామ సంవత్సర వైశాఖ మాసం. దీనికి ముందరి సంవత్సరమైన కాళయుక్తి సంవత్సర ఆషాఢమాస అమావాస్య అర్ధరాత్రి నందు దేవి ఆవిర్భవించినది. ఆమె ఆవిర్భవించినప్పుడు ఆమె కిరీటము వెదజల్లు కాంతికి రాక్షసులు స్థంభించిరి. అమ్మవారి ఆవిర్భావమునకు 7 గ్రహములు కర్కాటక రాశియందే ఉన్నవి. ఇది సృష్టిలోనే అద్భుత విషయం. ఇచ్చట మధ్య గ్రహాలు ఇచ్చుచున్నాను. స్ఫుటం చేయగా సప్త గ్రహాలు కర్కాటక రాశిలోనే ఉండినవి.

| మధ్య గ్రహాలు | | | | |
|---|---|---|---|---|
| గ్రహము | భగణములు | రాశి | భాగ | లిప్త |
| రవి | 4153 | 2 | 27 | 43 |
| చంద్ర | 55523 | 8 | 2 | 40 |
| కుజ | 2208 | 2 | 17 | 33 |
| బుధ | 17244 | 7 | 23 | 11 |
| గురు | 350 | 1 | 19 | 16 |
| శుక్ర | 6751 | 2 | 10 | 30 |
| శని | 140 | 11 | 28 | 15 |
| రాహువు | 223 | 3 | 18 | 54 |
| కేతువు | 223 | 9 | 18 | 54 |

అహర్గణం :
2488131
సోమవారం

అంతట ప్రసన్నురాలైన ఆ మహాదేవిని దేవలముని శ్రేష్టుడు మరలా స్తుతించినాడు. ఎల్ల లోకముల వారిచే పూజింపబడు ఓ లోకనాయకి! నీకు నమస్కారము. శివుని దేహమందు సగభాగము కలిగిన ఓ దుర్గా చండికా నీకు నమస్కారము. పుణ్యమూర్తివైన అమ్మా! నీకునమస్కారము. సర్వేశ్వరివి అయినదేవీ! నీకు నమస్కారము. దైత్యులను సంహరించునట్టి దేవీ! నీకు నమస్కారము. పాపాత్ములగు ఈ రాక్షసులను జయింపుము. నన్ను కాపాడుము తల్లీ! భక్తవత్సురాలా! నీకు నమస్కారము అని ఈ విధముగా స్తోత్రము చేయగా ఆ దేవి దేవలా! నాయనా! నీవు భయపడవద్దు. ఒక ముహూర్తములోపల అనగా 24 నిముషముల లోపల నా బలము నీకు తెలియును అని ఓదార్చుచుండెను. అప్పుడు ఆ దేవి ఈ విధముగా చెప్పెను. నాదైన మహాశూలముచేత ఈ దుర్మార్గులగు రాక్షసులనెల్ల కొట్టెదను. కొందరిని తరిమి వేయుదును. కొందరు సంహరింపబడుదురు. వారల రక్తమును త్రాగెదను అని చెప్పెను. నాలుగు భుజములతోను మిక్కిలి పెద్ద నాలుక కలిగి మిక్కిలి ఎరుపెక్కిన కన్నులతోను మహా బలముగల ఆ దేవి హహ్హాహ్హా అని అట్టాట్టహాసము చేయుచున్నది. శూలము, చక్రము, గద ఖడ్గమును చేతబట్టినదై



భయంకరములగు ఆయుధములను కలిగి కాటుకవంటి మిక్కిలి నలుపు వర్ణముగల శరీరము కలిగి కోటి సూర్యుల కాంతి నిచ్చెడి కిరీటమును శిరస్సున దాల్చి ఆ రాక్షసులను ధ్వంసం చేయుటకు శూలమును త్రిప్పుచుండెను. మిక్కిలి ఉగ్ర రూపములో వున్న చండికను చూచి ఈ మహా శక్తితో పోరు తమకు అసాధ్యమని గ్రహించలేకపోయిరి రాక్షసులు. ఏ విధముగానైనను ఆ చండికా మహాశక్తిని నాశనము చేయవలయునని తలంపు కలిగి వుండుట వలన వారి వద్దనున్న సకల ఆయుధములను సేకరించుకొని యుద్ధానికి సిద్ధపడిరి.

## చౌడేశ్వరి నామము ఏర్పడుట

అప్పుడు ఆ జగద్రక్షురాలు అయిన చండికా దేవి మిక్కిలి కాంతులు వెదజల్లుచుండెడి చూడము అనగా కిరీటమును శిరస్సుపై ధరించియున్నది. ఆ చూడమునుండి వెలువడే మిక్కిలి ప్రకాశవంతమైన కాంతిని రాక్షసులు చూడలేకపోయిరి. నిశ్చేష్టులు అనగా ఉన్నచోటున ఉన్నట్టుగానే స్థంభించిపోయిరి. ఏమి పాలుపోని పరిస్థితిని అనుభవించిరి. అంతేగాకుండా ఆ మహాదేవి హూంకరింపగా మిక్కిలి భయముచెంది మూర్ఛిల్లునట్లు అయినది వారి పరిస్థితి. చౌడము లేక చూడమును (కిరీటమును) ధరించిన అమ్మవారి కాంతులకు దృష్టిని నిలుపలేక అయోమయ స్థితిలో మిక్కిలి దైన్య స్థితిచెంది మిక్కిలి భయపడి స్పృహను కోల్పోయిరి. దైత్యులు (రాక్షసులు) అమ్మవారి చూడము (కిరీటము) నకు మిక్కిలి విభ్రమ ఆశ్చర్యములకు లోనై మహా విషాద పరిస్థితిని రాక్షసులు అనుభవించినందులకు అటువంటి స్థితిని రాక్షసులు పొందుటకు మూల కారణము అమ్మవారి చూడము (కిరీటము) యొక్క దేదీప్యమాన కాంతులు. కాబట్టి ఆ కాంతులే ఆయుధములుగా ఉపయోగపడి రాక్షసులను మూర్ఛిల్లజేసినది. కావున జగద్రక్షకురాలు అయిన చండికా మహాదేవికి ఒక విశిష్టమైన నామము అప్పుడు ఏర్పడినది. ఆ నామమే చౌడేశ్వరి.

## దేవలునికి పునర్జన్మ ప్రసాదించుట

దేవాంగుల వంశ ఆదిపురుషుని ప్రాణాలను రాక్షసులబారినుండి కాపాడినది చౌడేశ్వరీదేవి. దేవలునికి పునర్జన్మను సిద్ధింపజేసినది. ఆపుర్జన్మను పొంది దేవలుడు వస్త్ర, సూత్రములు నిర్మించి, దేవతలకు వస్త్ర ప్రదానము చేసి

శివుని అనుగ్రహము వలన సూర్యభగవానుని సోదరి దేవదత్తనువివాహము చేసికొని తద్వారా వంశమును అభివృద్ధి చేసెను. ఆ వంశమువారే దేవాంగులు. కావున తమ ఆది పురుషునికి ప్రాణదానము చేయుటయేగాక వంశాభివృద్ధికి అమ్మవారే కారణురాలు అయినది. కావున ఈ దేవాంగ వంశస్తులకు శ్రీ చౌడేశ్వరి నామముతో వున్న జగజ్జననియే ఆరాధ్యురాలు అయినది. దేవలుని ఆర్తనాదము విని రాక్షసులుబారి నుండి కాపాడటానికి ఆవిర్భవించిన సమయము ఆషాఢ మాసములోని అమావాస్య అర్థ రాత్రి అంత్య (చివరి) కాలమున అనగా శుక్రవారము పుష్యమీ నక్షత్రమునందు ఆవిర్భవించినది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర తదితరులందరికి జగజ్జనని చండికాదేవి. కానీ దేవాంగ బ్రాహ్మణులకు మాత్రము శ్రీమన్నారాయణుడు మరియు శివపరమాత్మలచే వరములుపొందిన ఐదుగురు రాక్షసరాజులైన వజ్రముష్టి, ధూమ్రవక్తుడు, ధూమ్రాస్యుడు, చిత్రసేనుడు అనువారిని చంపి దేవలునికి పునర్జన్మ ప్రాప్తించు సమయమందు దేదీప్యమాన కాంతులు నలుదిశలయందు వెదజల్లుచున్న కిరీటము ధరించినటువంటి అమ్మవారు శ్రీ చౌడేశ్వరీ నామముతో ప్రసిద్ధమై దేవాంగ వంశస్థులకు దివ్యమై చిరస్మరణీయమై పూజనీయమైనది.

## రాక్షస సంహారము

ఇంతకి ఆ పంచ రాక్షసులను తుదముట్టించిన విధానము ఎలావున్నదంటే మహోగ్రరూపంములో వున్న చండికాదేవిని నాశనం చేయవలయునను మనోనిశ్చయముతో వున్న ఐదుగురు రాక్షసరాజులు తమ యావత్సైన్యమును, అస్త్రశస్త్రములను అతిశీఘ్రముగా సమకూర్చుకొని అమ్మవారిపై ఉరికినారు. ఆ రాక్షస సైన్యముచేసే ధ్వనులు, ఇరుసు మొదలగు ఆయుధ చప్పుళ్ళు, రథములపై నుండే ధ్వజ పటలముల రెపరెపలాడే చప్పుళు, గుర్రముల సకిలింపులు, ఏనుగుల ఘీంకారములు, యుద్ధసమయమున సైన్యమును ప్రోత్సాహపరచే శంఖానాదములు, కొమ్ములు ఊదుటద్వారా వెలువడే శబ్దములు, రాక్షసుల ఆర్తనాదములు దిగంతములకు వ్యాపించి త్రిలోకవాసులయొక్క చెవులు స్థంభించి పోయినట్లుగా మిక్కిలి రణగొణ ధ్వనులుపెచ్చరిల్లెను. అప్పుడు ఆ జగదీశ్వరి ఆ రాక్షసులను చూచి మిక్కిలి



కోపించినదై తన గదచేత పెక్కు రథములను నానారకములుగా ధ్వంసం చేసినది. ఒక్కొక్క ఆయుధముతో ఒక్కొక్క రకంగా సైన్యమును హతమార్చుచున్నది. ఏ విధంగా అంటే ఒక ఆయుధం పది మందిని చంపితే మరొక ఆయుధం ఇరవై మందిని , ఇంకొక ఆయుధం ఇరవై ఐదుమంది, మరొకాయుధం నలభైమందిని ఈ విధముగా తన అస్త్ర శస్త్రములతో రాక్షసులను చిన్నాభిన్నంచేసింది. రాక్షసరాజులుకూడా అంతే ఉత్సాహముతో దేవిపై అస్త్రశస్త్రములను కురిపించినను అవి అన్నియుఅమ్మవారి శస్త్రనైపుణ్యమునందు ఎందుకు పనికిరాకుండాపోయినవి.

## దేవలునివద్దవున్న తంతువులు ఐదు వర్ణములుగా రూపొందుట

ఈ విధముగా అమ్మవారు మహోగ్రరూపముతో వుండి పంచ రాక్షసరాజులను హతమార్చినది. ఆ ఐదుగురు రాక్షసుల రక్తము వివిధ వర్ణములుగా అనగా పసుపు, ఎరుపు, పచ్చ, నలుపు, తెలుపు రంగులుగా ప్రవహిస్తున్నది. ఐదు వర్ణములు కలిగిన రక్త ప్రవాహమును చూచి దేవలుడు తనవద్దనున్న తంతువులను ఐదు వర్ణముల రక్త ప్రవాహమునందు తడిపినాడు. అనగా ఒక్కొక్క వర్ణమునందు కొన్ని కొన్ని తంతువులను వుంచి రక్తములో తడపుటద్వారా ఐదు వర్ణముల దారములు అయ్యెను. అంతియేగాక ఐదు వర్ణముల రక్తమును సమ్మిశ్రమము చేసికూడా తంతువులను తడిపినందువలన చిత్ర విచిత్ర వర్ణములుగల తంతువులు తయారైనాయి. ఈ విధముగా తమ రాక్షసరాజులు ఐదుగురు చనిపోవుట వలన మిగిలిన రాక్షసులు దిక్కుతోచక అష్టదిక్కులకు పారిపోయిరి. అమ్మవారి సేనారూపిణులగు శాకినీ, రాకినీ, ఢాకినీ గణములు మాంసాభిలాషులు అగుటవలన ఒక్కసారిగా ఆ యుద్ధములో ప్రవహిస్తున్న రక్తాన్ని మహాప్రీతితో అమితంగా త్రాగివేయుచున్నవి. రాక్షసుల మాంసమును భక్షించుచున్నవి. ఆ విధముగా మిక్కిలిగా భక్షించిన తరువాత వారికి విపరీత శరీర ఆయాసమువలన చిందులు, నాట్యములతో గంతులు వేసినాయి. ఈ విధముగా చౌడేశ్వరీదేవి దేవలునికి ప్రాణభిక్ష పెట్టినది. తంతువులు పంచవర్ణములతోపాటు చిత్రవిచిత్ర వర్ణములుగా రూపొందినవి. నారద మహాముని మిక్కిలి కుతూహలముతో ఈ రాక్షసరాజులను విష్ణు చక్రము ఏల చంపదయ్యెను? వారి రక్తము అయిదు వర్ణములుగా ప్రవహించడమేమిటి?

అను విషయమును విపులముగావర్ణించుము బ్రహ్మదేవా! అని అడిగినాడు.

## రాక్షసులు విష్ణుమూర్తినుండి వరము పొందుట

అందులకు బ్రహ్మదేవుడు నారదా! పూర్వము ఈ సృష్టికి ముందర ప్రళయకాలమునందు ఈ భూమియంతయు జలముతో నిండివున్నది. అప్పుడు జగద్రక్షకుడైన నారాయణుడు ఆదిశేషుని పాన్పుపై ఆ జలముమీద యోగనిద్రలో వుండినాడు. ఆ విధముగాకొంత కాలమున్న తరువాత నారాయణుని శరీరమునుండి చెమట (స్వేద) బిందువులు బయటకువచ్చి అవి ఐదుగురు రాక్షసులుగా రూపొందినవి. వీరు మిక్కిలి బలిష్టులుగా వుండి మిక్కిలి భుజ బలము కలిగివున్నారు. వీరు యోగ నిద్రలో వున్న నారాయణున్ని ముష్టి ఘాతములతో నిద్రలేపినారు. అప్పుడు నారాయణుడు తన భుజశక్తితో వారితో ముష్టి యుద్ధము చేసినాడు. ఈ ముష్టి యుద్ధము గంభీరముగా జరిగినది. చివరికి నారాయణుడు రాక్షసులయొక్క ముష్టి యుద్ధ నైపుణ్యానికి ఆశ్చర్యపడి వారితో నారాయణుడు ఈ విధముగా చెప్పినాడు. రాక్షస వీరులారా! మీ యుద్ధ నైపుణ్యము నాకు నచ్చినది. అందువలన నేను సంతోషము చెందినాను. మీ నైపుణ్యానికి ప్రతిగా మీకు వరము ఇవ్వదలచినాను. కావున మీ ఇష్టమువచ్చిన వరము కోరుకొనుడు. నేను దానిని ఇవ్వదలచినాను అని అనగా పంచరాక్షసులు మిక్కిలి ఆశ్చర్యపోయినారు. శ్రీమన్నారాయణుడు తనకు తానుగా వరమిస్తానని చెప్పటంతో వెంటనే వారు మీ సుదర్శన చక్రమునుండి మాకు మరణము లేకుండా వుండు విధముగా వరము కోరినారు. శ్రీహరి వారికి తన చక్రమునుండి చావులేని విధముగా వరమిచ్చినాడు. శ్రీమన్నారాయణుడు తన సుదర్శన చక్రమునుండి ఒక చక్రమునుసృష్టించి దేవలునకు ఇచ్చినాడు. ఆ రాక్షసులు దేవలుడిని చంపటానికి ప్రయత్నించినప్పుడు దేవలుడు ఆ చక్రాన్ని ఈ అయిదుగురు రాక్షసులపై ప్రయోగించినాడు. నారాయణుని వర ప్రభావమువలన ఆ చక్రము ఆ రాక్షసులను ఏమీ చేయలేకపోయినది అని బ్రహ్మదేవుడు చెప్పినాడు. నారదుడు మరలా బ్రహ్మ దేవున్ని అడుగుతున్నాడు.

## రాక్షసులు స్త్రీ దేవతచేతిలో చనిపోవుటకు కారణము

నారాయణుని చక్రానికి చావులేనివారు ఒక స్త్రీ దేవతచేత ఎలా



చనిపోయినారు. ముష్టి యుద్ధములో నారాయణుని మెప్పించినారు కదా! అంతటి వీరులు ఇలా చనిపోవటం ఆశ్చర్యముగా వుంది.కావున ఈ విషయమును నాకు తెలుపవలయును అని అడుగగా బ్రహ్మదేవుడు చెప్పుచున్నాడు. ఈ పంచ రాక్షస రాజులు పాతాళ లోకమునకు వెళ్ళి వారికి అనువగు ప్రదేశములయందు వారివారి నివాసములు ఏర్పరుచుకొని పాలన చేయుచుంటిరి. కొన్నాళ్ళకు వారు తమ గురుదేవులైన శుక్రాచార్యుని చూడనుద్దేశించి భార్గవుడు అని పిలువబడు ఈ శుక్రాచార్యుని ఆశ్రమానికి వెళ్ళినారు. ఆ సమయములో ఆశ్రమము బయట శుక్రాచార్యుని కూతురైన దేవయాని విహరించుచుండెను. ఆమెయొక్క రూపలావణ్యములు అమోఘమైనవి. బంగారు రంగులాంటి దేహముతో విలసిల్లుచున్నది. మహా అందగత్తెగా వున్నది. మంచి యవ్వన ప్రాయములో వున్నది. బ్రహ్మదేవుడు ప్రత్యేక శ్రద్ధతో దేవయానిని అందచందాలతో సృష్టించినాడు. ఈ అమోఘమైన అపూర్వమైన ఆ లావణ్యవతి దేవయానిని చూడగానే వారు మహా మోహములో పడిపోయిరి. ఆమోహములో వారి మనస్సు చిత్రవిచిత్ర భ్రమలకు లోనైనది. ఆ అవస్థలో తమ వ్యక్తిత్వం మరచిపోయినారు. ఏదిమంచి, ఏదిచెడు అను వివేకమును కోల్పోయినారు. ఈ అయిదుగురు రాక్షసులు దేవయాని వద్దకు వచ్చి మిక్కిలి చక్కనైనదానా! మా మాటలు ఆలకించుము. మేము రాక్షస రాజులము. మిక్కిలి పేరు ప్రఖ్యాతులు గలవారము. నీ అందచందాలను చూచి మాకు నీపై ప్రేమకలిగినది.అందువలన నిన్ను ఒక మాట అడగదలచినాము.

## రాక్షసులను దేవయాని శపించుట

మా అయిదుగురిలో నీకు నచ్చిన వారిని వివాహమాడవలెను. ఇది మా అందరికి సమ్మతమైన విషయము అని దేవయానికి చెప్పగా ఆమె మిక్కిలి నిర్వేదము పొందినది. ఓయీ! నేను మీ గురువుగారి కుమార్తెను. కావున నేను మీకు సోదరిలాంటిదాన్ని. సోదరిని వివాహము చేసుకుంటామని అడగవచ్చా? మీరు మిక్కిలి మదాంధులు అయినారు. విపరీతమైన బలగర్వముతో విర్రవీగుచున్నారు. అందువలన ఏది కోరదగినది, ఏది కోరరానిది అనే వివేకము కూడ కోల్పోయినారు. నన్ను మిక్కిలి అవమానించినారు. మీ మాటవలన నా మనస్సు ఎంతో క్షోభించుచున్నది. ఇంతటి మధోమత్తులై వుండుట సహించరాని

విషయము. ఆడదానిని అని మీరు నన్ను హేళన చేయుదురా! ఆడది అంటే మీదృష్టిలో ఇంతటి నీచమైన అభిప్రాయమా? గురువు కుమార్తె అని చూడకుండా చాలా చులకనగా చూశారు. కాబట్టి మీ బలగర్వమును హరించి చంపటానికి ఒక స్త్రీ కారణమౌతుంది. మీరు నావంటి ఒక స్త్రీ చేతిలో తప్పక మరణిస్తారు అని వారిని శపించి అచ్చటనుండి వెళ్ళిపోయినది దేవయాని. అందువలన నారదా! ఈ అయిదుగురు రాక్షసులు ఈ స్త్రీశక్తి అయిన చౌడేశ్వరీదేవి చేతిలో హతులైనారు. వీరికి ఈ శాపము కారణముగానే దేవలుడు పాల సముద్రమునుండి తంతువులు తీసుకొని వచ్చునప్పుడు వారికర్మ బాగాలేక ఈ ప్రాంతమునకు వచ్చి దేవలునిపై బడటంతో చివరికి దేవయాని శాపము వలన దేవలుడు దుర్గను అయిన చండికను ప్రాణరక్షణ కొరకు స్తుతిచేసినాడు. అమ్మవారు ఈ రాక్షసులను సంహరించినది. ఈ విధముగా దేవయాని శాపము వలన పంచ రాక్షసులు హతులైరి అని బ్రహ్మ చెప్పినాడు.

## రాక్షసుల రక్తము ఐదు రంగులలో ఉండుటకు కారణము

నారదుల వారు బ్రహ్మదేవునితో నాకు ఇంకొక సందేహము వున్నది దానిని తీర్చండి అని ఈ పంచ రాక్షసుల రక్తము అయిదు రంగులుగా వున్నది ఏమిటి? ఇది ఎట్లా సంభవము? వారి శరీరములో రక్తం అయిదు రంగులుగా వుండటానికి కారణము తెలుసుకోవాలని మిక్కిలి కుతూహలముగా వున్నది అని అడుగగా పితామహుడు ఈ విధముగా చెప్పుచున్నాడు.

మహా మోహముతో వుండి గురు పుత్రిక అయిన దేవయానిని వివాహ మాడవలెనని అడిగి ఆమె చేత శాపముపొందిన తరువాత వారు నిశ్రేష్ఠులైనారు. అందువలన మిక్కిలి బలము పొందుటకొరకు పరమేశ్వరుని గురించి మిక్కిలి నియమ నిష్ఠలతో ఘోరమైన తపస్సు చేసిరి. వారి తపస్సుకు మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమైనాడు. మీరు మీఇష్టమైన కోరికను కోరుకొనుడు. దానిని నేను నెరవేర్చెదను అని చెప్పగా అప్పుడు ఈ అయిదుగురు రాక్షసులు పరమేశ్వరా! మా రక్తమును ప్రజలు ధరించాలి. ఆ కోరిక నెరవేర్చుము అని అడిగితిరి. దానికి పరమేశ్వరుడు తథాస్తు మీరు కోరిన విధముగా జరుగుతుంది అని వరమిచ్చినాడు. ఈ అయిదుగురు రాక్షసలకు ఆయువుమూడి తంతువులను



దొంగిలించుట కొరకై కపటముని వేషధారులై దేవలున్ని అడ్డగించినారు. పార్వతీదేవి వారిని చంపగా వారి రక్తము పంచ వర్ణములుగా బయటకు వెడలెను. ఆ పంచ రంగులను చూచి దేవలుడు వెంటనే తనవద్ద నున్న తంతువులను ఆ రక్తములోముంచగా పంచ రంగులుగల దారములు తయారయినవి. ఆ దారములతో చిత్రవిచిత్ర వర్ణములుగల వస్త్రములను తయారు చేయగలిగినాడు దేవలుడు. ఈ వస్త్రములను దేవ మానవాది సమస్త జాతులవారికి ఇవ్వబడినాయి. అందరూ ఆ దివ్య వస్త్రములను ధరించినారు. అనగా రాక్షసుల రక్తము తంతువుల రూపంలోవుండి వస్త్ర నిర్మాణమైన తరువాత అందరూ తమ శరీరములను అలంకరించుకొనుట వలన పరమేశ్వరున్ని రాక్షసులు కోరినట్లు తమ రక్తమును అందరూ ధరించాలి అను వరము ఈ రూపముగా నెరవేరినది. ఈ విధముగా పరమేశ్వరుని వరము సఫలమయ్యెను. రాక్షసుల కోరిక నెరవేరినది. రాక్షసులు చిరస్థాయిగా ప్రజల వస్త్రరూపములో జీవిస్తూ వున్నారు. రాక్షసులు ఈ విధముగా చిత్రవిచిత్ర వర్ణములతో వస్త్రములు తయారవటానికి కారకులైనారు. దేవతలు మానవులు అందరూ ఒకే వర్ణముగల వస్త్రములను ధరించితే సృష్టి వైవిధ్యము ఏముంటుంది. సృష్టిలో రమణీయత ఏముంటుంది. దేవ మానవ జాతులవారు రకరకాల వర్ణములుగల వస్త్ర ధారణ వలన చిత్ర విచిత్రముగా కనబడుట వలన బ్రహ్మదేవుని సృష్టికి రమణీయత ఏర్పడినది.



# దేవలుని పట్టాభిషేకము
## తృతీయాధ్యాయము

దేవలుడు మిగుల సంతోషముచెంది ఆమోద పట్టణమునకు బయలుదేరెను. ఆ త్రోవయందు అక్కడక్కడ మనోహరములైన పలు దేశములను, ప్రవేశించడానికి వీలులేనటువంచి కీకారణ్యములను అనేకములైన వాటిని చూచుచూ పలు విధములైన కొండలను, మహాపుణ్యకరమైన నదులను దాటుచూ తన గమ్యస్థానమైన ఆమోద పట్టణమువద్దకు చేరెను. ఆమోద పట్టణము మహా రమణీయముగావున్నది. దేవేంద్రుని అమరావతి పట్టణమును మించినదిగా భూలోకములో ఆమోద పట్టణము విరాజిల్లుతున్నది.

## దేవలుని ఆమోద పట్టణ ప్రవేశము

మహాత్ముడగు దేవలుని రాకగురించి ముందుగా తెలుసుకున్న ఆమోదగిరి పట్టణ ప్రజలు మిక్కిలి సంతోషమును పొందివుంటిరి. రాజ వంశమునందు పుట్టినవారును, మంత్రి కుమారులును, రాజోద్యోగులును, ప్రజలును దేవలుని రాకకొరకు వేయి కళ్ళతో ఎదురుచూచుచుండిరి. వారి మనస్సు ఆనందడోలికలతోకూడి వున్నది. సాక్షాత్తు శివమానస పుత్రుడై లోక కళ్యాణ కారకమైన యజ్ఞసూత్ర, వస్త్ర నిర్మాణము నిమిత్తము తమ ఆమోద పట్టణము నందుండి రాజ్యపాలన చేస్తాడు అని తెలుసుకొనిన యావత్ ఆమోద పట్టణ వాసులు మిక్కిలి హర్షముతో వుండినారు. దేవలుని రాకకోసం నిరంతరం ఎదురుచూచుచున్నారు. అటువంటి ఉత్సాహభరిత వాతావరణమున్న ఆమోదపట్టణ ప్రవేశము చేయు సమయమునందు ఆ నగరమునందలి మహాజనులు తమ రాజ వంశీయులు, మంత్రిమండలి, రాజోద్యోగులు మొదలగు ప్రముఖులందరు నగరమునకు ముందు వేంచేసి వున్నారు. రాజ నర్తకీమణులు తమ నాట్య విన్యాసాలు చేయుచున్నారు. ఆస్థాన గాయనీ మణులు, గాయకులు తమ పసందైన కంఠ మార్ధవముతోమిక్కిలి సొగసైన గీతాలాపన చేయుచున్నారు. దిక్కులుమారుమ్రోగేటట్లుగా మేళతాళములతో మంగళ వాయిద్యములతో



అలరారుచుండెను. నగరమునందలి వేశ్య శిఖామణులు మిక్కిలి ఆశ్చర్యమునుగొల్పు నృత్యములు చేయుచుండిరి. వేద పండితులు తమ వేద ధ్వనితో ఆ ప్రాంతమును పవిత్రీకరించుచుండిరి. శంఖారావములు మారుమ్రోగుచుండెను. రాజుల బూరగలతో ఆ ప్రాంతమంతా మారుమ్రోగుచున్నది. ఈ విధముగా దేవల మహాత్ముడు తమ నగర ప్రవేశానికి అవసరమైన అన్నీ హంగులు ఏర్పరచుకొని సిద్ధపడియుండినారు ప్రజలు. దేవల మహాత్ముడు నగర ప్రవేశ సమయములో బ్రాహ్మణ స్త్రీలు మంగళ హారతి పట్టిరి. మంగళ గీతములు ఆలపించిరి. నగర ప్రవేశ దారి మొత్తము ప్రజలచే కిక్కిరిసిన జనులతో నిండిపోయి వున్నది. జయజయ ధ్వనులతో, ప్రజల చప్పట్లతో కోలాహలముగా వున్నది. మార్గమునుండి ప్రవేశించునప్పుడు ఎత్తైన మేడలనుండి సువాసినులు దేవలుని శిరస్సుపై పూల వర్షము కురిపించుచున్నారు. నగర స్త్రీల నేత్రముల కాంతిసమూహము దేవలునిపై పడుతున్నది. పురోహితుల వేద మంత్రాలతో ఆమోద పట్టణము మారుమ్రోగుచున్నది దేవలున్ని చూచుటకొరకై జనులు తండోపతండాలుగా బారులుతీరి వున్నారు. రక్షక భటులు తమ ఆయుధములతో జనులను ప్రక్కకు తొలగించుచూ బాట విశాలముగా వుండులాగున చేయుచున్నారు. అట్టహాసముగా జరుగుతున్న నగర ప్రవేశ కార్యమువలన దేవలుడు ఆనందపడినాడు. అంతా ఈశ్వరేచ్ఛ అనుకొనినాడు. అంతఃపురములోనికి ప్రవేశించినాడు దేవలుడు. పురమునందు విజయ దుందుభిలు మ్రోగించినారు. ఆ పట్టణములోని మంత్రుల శ్రేష్ఠు లందరు నానా దేశములనందుండు అనేక పుణ్య నదుల తీర్థములను తెప్పించి దేవలుని పట్టాభిషేక మహోత్సవమునకు వినియోగించినారు. పట్టాభిషేకమునకు అవసరమైన లగ్న, గ్రహ బలముగల ఒక దివ్య సుముహూర్తమును నిర్ణయించినారు. లగ్న అష్టమ, దశమ శు ద్ధిగల దివ్య ముహూర్తమును నిర్ణయించినారు. ఈ విధముగా దేవలుని పట్టాభిషేక మహోత్సవము దివ్యముగా ఆ ముహూర్తమునందు జరిగినది. ఆ సమయములో దేవలుడు తన చుట్టూవున్న ప్రజలతో కలిసి అమరావతియందు దేవతలతోకూడి దేవేంద్రుడు ఎలా వుంటాడో ఆ విధముగా దేవలుడు తనప్రజలతో కలిసి ఆ విధముగా ఉన్నాడు. రాజ కుమారులును, మంత్రులును మిక్కిలి సంతోషముతోకూడి దేవలునికి రాజ్యాభిషేకము చేసి మ్రొక్కినారు.

రాజముద్రను అతనికి అందించినారు. ఆనవాయితిప్రకారము ఆమోద పట్టణము రాజ్యానికి వచ్చు ఆదాయము మరియు ఇతర విషయములను మంత్రులు దేవాంగునకు తెలియపరచినారు. ఏ విధంగా అంటే సంవత్సరానికి ఆరుకోట్లు వరహాలు (వరహా అనగా నాలుగు వెండి రూపాయలు) ఆదాయము రాజ్యానికి వచ్చుననియు తెలిపిరి. పట్టాభిషేక మహోత్సవము ముగిసిన వెంటనే తన రాజ్యములలోని శివ భక్తులకు వంద అగ్రహారములు ఇచ్చినాడు దేవలుడు. దేవలుడు తన రాజ్యములో వున్న ఖజానాను తెరిపించి వేద శాస్త్రములు తెలిసిన బ్రాహ్మణులకు, సంగీతము ఆలపించేవారికి పుట్టు గ్రుడ్డివారికి, చెవిటివారికి, వికలాంగులకు, ముసలివారికి, బీదలకు ధనమును పంచిపెట్టెను. దీనివలన శాస్త్రము పఠించిన వారి ఆశీస్సులతోపాటు పేదల అభిమానమును పొందినటుల అయినది. ఆ తరువాత తన పట్టాభిషేక మహోత్సవానికి హాజరైన రాజ్య పాలకులను, అధికారులను పేరుపేరున పిలిచి వారందరితో సన్నిహితముగా వుండినాడు. తదనంతరము సామంతరాజులను వారివారి స్థావరములకు దిగబెట్టించినాడు. ఈ విధముగాతన రాజ్యములోని ప్రభు వంశీయులను ఆదరముతో సత్కరించినాడు. ఈ దేవల రాజుకు నలుగురు మంత్రి శ్రేష్టులు కలరు. వారు సుబుద్ధి, కార్యదక్షుడు, నీతిమంతుడు, దీర్ఘదర్శనుడు అను వారు. వారు రాజ్య భారమంతా వహించి మిక్కిలి నైపుణ్యముతోను, చాకచక్యముతోను సమర్ధవంతముగా రాచకార్యములను నెరవేర్చుచుండిరి అని బ్రహ్మదేవుడు చెప్పుచుండెను.

## సునాభుని వృత్తాంతము

అందులకు నారదులవారు మహాత్మా! ఈ దేవలుడు పట్టాభిషేకము కాకమునుపు ఆమోద పట్టణమునకు పాలకుడుగా భద్రబాహుని కుమారుడైన సునాభుడు అను నతడు వుండినాడు గదా! పాలకుడు వున్న పట్టణానికే శివుడు వేరొక పాలకుడిని నియమించడం ఏమిటి? సునాభుడు వెంటనే దేవలునికి రాజ్యము అప్పగించడ మేమిటి? ఇది అంతయు ఆశ్చర్యకరముగా వున్నది. కావున వివరించవలయును పితామహా! అని నారదుడు అడిగెను. అందులకు బ్రహ్మ చెప్పసాగెను.



ఓ నారదా! వినుము. ఆమోద పట్టణమునకు ప్రభువుగానున్న సునాభుని కథను తెలిపెదను. ఇది మంగళకరమైన అనగా ఇదివింటే శాంతిసౌఖ్యములను ఇచ్చును. ఆ పట్టణ ప్రభువైన సునాభుడు దేవలరాజు వద్దకు వచ్చి మిక్కిలి సంతోషము చెందిన మనస్సుగలవాడై ఈ విధముగా చెప్పినాడు. ఓయీ! సర్వము తెలిసిన వేదవేదాంత జ్ఞాన సంపన్నుడా, మిక్కిలి పరాక్రమవంతుడా! దేవలభూమి పాలకుడా! స్వామీ! దేవుడా! ఇక మేము పోయివచ్చెదము. మాకు అనుజ్ఞ ఇవ్వడండి అని సునాభుడు అనగా వెంటనే దేవలరాజు ఓయీ! రాజశ్రేష్టుడా! ఎక్కడకు పోవలదు. ఈ రాజ్యములో నాతో పాటే ఉండండి. నాకు పాలనలో చేదోడువాదోడుగా ఉండండి. మీ గౌరవానికి భంగం రాకుండా చూచుకుంటాను. నీవు మిక్కిలి అదృష్టవంతుడవు. నిర్మలమైన మనస్సు కలవాడవు. నీవు ఉండగా సంతోషము కలుగుతుంది నాకు. కావున నీవు ఇచ్చటనే వుండవలయును అని దేవలుడుచెప్పెను. కాని, సునాభుడు దేవలరాజా! నా మనస్సు ఇచ్చటనుండి వెళ్ళవలెనని కోరుకొనుచున్నది. సాంబశివుని అనుగ్రహమువలన మిక్కిలి దుస్తరమైన శాప సముద్రమును దాటితిని. కావున మీరు అనుజ్ఞ ఇచ్చినచో వెళ్ళెదను అని విన్నవించినాడు. ఈ విధముగా సునాభుడు చెప్పగా దేవలుడు మిక్కిలి ఆశ్చర్యపొంది మహానుభావుడా సునాభా! నీకు శాపమా! నీ కథను వినవలెనని నా మనస్సు కోరుచున్నది. కావున నీ చరిత్రను నాకు చెప్పవలసినది నీవెవరు? నిన్ను శపించినది ఎవరు? శాపవిముక్తి నా చేత కావడమేమిటి? ఇది అంతయు ఆశ్చర్యము కలుగజేయుచున్నది. కావున నీ వృత్తాంతమంతయు నాకు వివరముగా తెలుపవలయును అని దేవలుడు అడిగినాడు. అప్పుడు సునాభుడు దేవలరాజుకు తన కథను ఈ విధముగాచెప్పినాడు.

నేను మహాబలశాలి, శక్తిశాలి అయిన రుక్మరథుడు అనువాని కుమారుడను. నా తండ్రి సత్యవంతుడు. మిక్కిలి పరాక్రమశాలి, తేజస్సంపన్నుడు. సకల సంపదలు కలవాడు. తపస్వియును, ముల్లోకములయందు ప్రఖ్యాతి చెందినవాడు. అష్ట వసువులలో ఎనిమిదవ వసువైన సావిత్రుడు అను నతడికి ఒకమయూరి (నెమలిపక్షి) యందు పుట్టినవాడు మా తండ్రి. మా తండ్రికి మహేంద్రపర్వత గుహలయందు

మిక్కిలి రమ్యమైన సుందరమైన నగరము ఉన్నది. ఆ పట్టణముయొక్క కోటలు, ఇండ్లును బంగారముతో కట్టబడినవి. అచ్చటవున్న మంటపములన్నియు వజ్ర, వైఢూర్య, కనక, పుష్యరాగాదులచే నిర్మించబడినవి. అచ్చట సమృద్ధిగా జలములుండు అనేక కోనేరులు కలవు. ఆపట్టణము మిక్కిలి శోభాయమానముగా వుండి సకల సౌకర్యములు, సకల సంపదలతో తులతూగుచున్నది. ఆ పట్టణము పేరులక్ష్మీవర్ధనము. మాతంఢ్రి గంధర్వ శ్రేష్టులను పాలించుచుండెను. అటువంటి మాతంఢ్రికి పద్మములవలె నేత్రములు కలిగి బహు సుకుమారమైన దేహముగల స్త్రీ రత్నము భార్యగా కలిగి యుండెను. ఆమె పేరు శరీరానికి తగినట్లుగానే పద్మకోమల అను పేరు గలది. పారిజాత పర్వతమునందు ప్రభుత్వము నడిపించుచున్న హేమమాలిని అను రాజు కుమార్తె. ఆ హేమమాలిని జయించి అతని కుమార్తె పద్మకోమలను ఎత్తుకొనివచ్చి వివాహమాడెను. మహా ప్రభువైన రుక్మరధుని వలన ఆమెయందు నేను జన్మించితిని. మహా బలముగల దేవలరాజా! అని సునాభుడు చెప్పెను. అంతట దేవలుడుమిక్కిలి సంతోషముచెంది సునాభుడా!ముందు మీ తంఢ్రిగారి కథ వినవలెనని ఆసక్తి కలుగుచున్నది. కావున ముందుగా నీ తంఢ్రి కథ వినిపించుము అని దేవలరాజు అన్నాడు అని బ్రహ్మదేవుడు నారద మునీంద్రులతో చెప్పినాడు. అప్పుడు సునాభుడు దేవలరాజుకుతన తంఢ్రి రుక్మరధుడి కథను ఈ విధముగా చెప్పటం ప్రారంభించినాడు అని బ్రహ్మదేవుడు నారదునితో అన్నాడు.





# సునాభోపాఖ్యానము

## నాల్గవ అధ్యాయము

### సావిత్రుడు అను వసువు కథ

పూర్వకాలమందు అష్ట వసువులలో ఎనిదవ వసువు సావిత్రుడు అనువాడు. ఈతడు మిక్కిలి బల పరాక్రమవంతుడు, ప్రశస్తమైన తేజస్సు కలవాడు. ఇతడు త్రిలోకములయందు పేరు ప్రఖ్యాతులు సంపాదించినాడు. మహా భుజ బలము కలిగివుండినాడు. మహేంద్రునితో సమానమైన పరాక్రమము కలవాడు. మహా తేజస్సంపన్నుడు. ప్రతిరోజు అమితమైన భక్తి కలిగివుండి చంద్రరేఖను శిరస్సున ధరించియున్న సాంబశివుడిని సేవించు చుండును. ఒకానొక రోజున చంద్రమౌళీశ్వరుడిని సేవింప కైలాసమునకు ప్రయాణమయినాడు సావిత్రుడు. అప్పుడు అతను మహా రత్నములచే అలంకరించుకొని దేదీప్యమానముగ వెలుగులను వెదజల్లుచున్న కిరీటమును ధరించి మెడలో ముత్యాల హారమును, భుజ, శిరస్సులయందు భుజకీర్తులను, చేతులయందు కంకణములను నానావిధ ఆభరణములను ధరించి అలంకృతుడయి దివ్య విమానము ఎక్కి కైలాసమునకు ప్రయాణమయినాడు. కైలాసపర్వత శిఖరము సమీపమున అనేక శ్రేష్టములైన సరస్సులు అలరారుచుండెను. వాటిలో చంద్రపుష్కరమనే అత్యంత శ్రేష్టమైన సరస్సును మార్గ మధ్యములో చూచినాడు సావిత్రుడు. ఆ సరస్సునుచూచి మహానందపడినాడు. అది మిక్కిలి మనోహరముగా వున్నది. అంత ఆ సరస్సున వున్న సహస్ర కమలములతోవుండు పద్మమును ఒకదానిని తీసుకొనదలచి సరస్సువద్దకు వెళ్ళినాడు. ఆ సరస్సునందు వేయిరేకులుగల తామర పువ్వులు అమితముగా వున్నవి. నాలుగు ప్రక్కల రాజహంసలుఆసరస్సులోని నీటియందు ఈదులాడు చున్నవి. చక్రవాక పక్షులు, కల్నేటి పక్షులు సరస్సు అంతా వ్యాపించి యున్నవి. నీరుకోళ్ళు అమితముగా యున్నవి. కమలము లందలి మకరందమును ద్రావి, మదించి ఝుంకారములతో హోరెత్తిస్తున్న తుమ్మెదలు మూగుచున్నవి. ఆ కోనేటి నీళ్ళయందు నాచు పాచి స్త్రీ అనే పుష్కరానికి ఆ

కమలములు ముఖమువలె శోభాయమానముగావున్నవి. ఆ సహస్రరేకుల కమలముల రేకులు కన్నులవలె వుండెను. చక్రవాక పక్షులు ఆ సరస్సుకు స్తనములవలె వుండెను. తామరతూండ్లు భుజములవలెను, ఇసుక తిన్నెలు పిరుదులవలె శోభాయమానముగాను, ఫాల భాగమున ముంగురులువలె లతలు మిక్కిలి మనోహరముగా ప్రకాశించుచుండెను. అందువలన చూచువారికి ఆ కొలను ఒక సుందరమైన స్త్రీ ఆకారముగా తోచును. కొలను గట్టుపైన దిరిసిన చెట్లు, పాటల వృక్షములు, సంపెంగ చెట్లు మిక్కిలి మనోహరమైన పొగడచెట్లు, జొన్నచెట్లు, మల్లె తీగెలు, బండిగురువింద తీగెలు అల్లుకొనివున్న ఏపి చెట్లును, పనస చెట్లు, ఏడాకుల అరటిచెట్లును, పిప్పల వృక్షములును, పారిజాత వృక్షములును ఈ విధముగా అనేక వృక్షజాతులతో ఆ చంద్రపుష్కర కొలను ప్రకృతిలోని అందమంతయూ తనే గ్రహించినట్లు అత్యంత రమణీయముగా వున్నది. ఆ చెట్లకు పూలు పూచియు, పండ్లు కాచియు దర్శనీయముగా నున్నవి. ఆ వృక్షరాజముల మధ్య కోకిలలు మనస్సు ఆహ్లాదపడునట్లు తమ రావములను కూయుచున్నవి. ఆ నాదము మనస్సు మైమరచిపోవునట్లు వున్నది. తుమ్మెదలు ఆ చెట్లయందలి పుష్పముల మకరందమును ఝుంకారముచేస్తూ త్రాగుచున్నవి. ఆ చెట్లపైన అనేక పక్షులు గూళ్ళు కట్టుకొని వాసముచేయుచూ, కిలకిలారావములతో దట్టమైన నీడలు కలిగి వున్నవి. ఆ కొలనుకు దారిలేకుండా ఆక్రమించినట్లు వృక్షరాజములు, లతలతోకూడి వున్నవి. అటువంటి వనమునందు పరిమళము మిక్కిలిగా వ్యాపించి మనస్సును దోచుకొను చున్నవి. సావిత్రి అనువసువు ఒక్క క్షణంపాటు ఆ సరస్సునందు నిలిచెను. అతని మనస్సు ఆ ప్రకృతి సౌందర్యమునకు పరవశించినది. సుగంధ వాసనలతోను, కంటికింపైన దృశ్యములతోను అలరారుచున్నది ఆ కొలను. మందగమనముతో మలయ మారుతము వీయుచున్నది. ఆ ప్రకృతి దృశ్యాలకు మైమరచియున్న సావిత్రుడిపై మన్మధుడు తన పుష్ప బాణములను సంధించినాడు. దానితో సావిత్రుడు కామ జ్వరపీడితుడై మిక్కిలిగా వేధింపబడినాడు. అప్పుడు మన్మధుడా! నాపైన నీకు ఎందులకయ్యా ఇంతకసి? నీ పుష్ప బాణములు నాపైనవేయుట వలన శరీరము అంతటా మన్మధ బాధ వ్యాపించినది. ఈ స్థితిని భరించలేక పోవుచున్నాను. చంద్రమౌళేశ్వరుడిని అర్చన చేయుటకు వెళ్ళు నాకు పూజాభంగం ఎందుకు కలిగించినావయ్యా! శరీరమున కలుగుచున్న ఈ



తాపమును భరించలేకుండా వున్నానయ్యా! నీ బాణములు పుష్పముల వంటివి అంటారు అందరు. కానీ అదికాదు. వజ్రములవలె నా హృదయాన్ని ఛేదించుచున్నవి. మన్మధా! ఈ తాపము చాలునయ్యా! నేను భరించలేక పోవుచున్నాను అని పరిపరి విధాలుగా ఆ కామబాధకు అలమటించి పోవుచున్నాడు. అప్పుడు చంద్రపుష్కర కొలనులో అటూఇటూ తిరుగుతున్న ఆడనెమలిని చూసినాడు. మంత్ర శక్తి సంపన్నుడైన ఆ వసువు ఆ మయూరిని యవ్వనవంతురాలైన సౌందర్య స్త్రీగా చేసుకొని మిక్కిలి మూఢమైన బుద్ధి కలవాడై ఆమెతో క్రీడించినాడు. అంతట ఆ యవ్వనవంతురాలియందు మహా తేజస్సంపన్నుడును, తన ప్రకాశమును నలుదిశల వ్యాపింపజేయుచున్న ఒక కుమారుడు పుట్టెను. అప్పుడు ఆమె తన యదార్ధ రూపము మయూరిగా మారి తనదారిన తాను పోయినది.

## రుక్మరధుని కథ

అయితే సావిత్రీ వసువు ఆ పుట్టినబిడ్డపై మమకారముతో విమానములో వుంచుకొని దేవలోకానికి వెళ్ళి, తన భార్యలకు ఆబిడ్డను సంతోషముగా ఇచ్చెను. తరువాత ఆపిల్లవానికి దేవతలందరూ కలసి రుక్మరధుడు అను పేరుపెట్టిరి. అతడు క్రమముగా పెద్దవాడై, మిక్కిలి విద్యాబుద్ధులు పొందినవాడై తపస్సు చేయుటకు మహేంద్ర పర్వతమువద్దకు వెళ్ళెను. అచ్చట మిక్కిలి నియమనిష్టలతో నుండి శరీరమును కృశింపజేసికొనుచూ తీవ్రమైన తపస్సు చేయుచుండెను. అతని తపస్సుకు పరమేష్ఠి అయిన బ్రహ్మదేవుడు మిగుల సంతోషముచెందినవాడై అతనికి ప్రత్యక్షమయ్యెను. అప్పుడు రుక్మరధునితో ఓయీ! నీ తపస్సు నన్ను మెప్పించినది. నాకు సంతోషము కలిగినది. నీవు కోరిన కోర్కెను తీర్చెదను. నీకోర్కె ఏమిటి? అని అడిగినాడు. దానికి రుక్మరధుడు మిక్కిలి భక్తిశ్రద్ధలతో నమస్కరించి బ్రహ్మదేవుడా! నాకు ఏ భూతమునుండి మరణము లేకుండా ఉండు విధముగా అనుగ్రహింపుము అని అడుగగా తథాస్తు అని పలికి అదృశ్యుడయ్యెను. అంతట సావిత్రీ వసువు తనయుడు అయిన రుక్మరధుడు మిగుల అహంకారముచేత తనకు చావులేదని గర్వించి త్రిలోకముల యందు సంచరించుచుండెను. ఒకసారి విశ్వకర్మ బ్రహ్మ వద్దకువెళ్ళి అవిధేయుడై శాసించినట్లుగా ఓ విశ్వకర్మా! నా కిపుడు మహేంద్ర పర్వతమువద్ద మిక్కిలి

సొగసైన పట్టణమును నిర్మించి ఇవ్వుము అని అహంకార పూరితముగా అడిగినాడు. దానికి విశ్వకర్మ మిక్కిలి కోపించి అతని కోర్కెను తిరస్కరించుటయేగాక నిందించినాడు. రుక్మరధుడు వరబలముచేమిక్కిలి గర్వించి విశ్వకర్మతో యుద్ధానికి సన్నద్ధుడైనాడు. మహాబల సంపన్నుడైన విశ్వకర్మబ్రహ్మకూడా యుద్ధానికి సిద్ధపడినాడు. వీరిద్దరిమద్య మహా యుద్దమేజరిగినది. రుక్మరధునిబాణముల తీక్షణకు విశ్వకర్మ భరించలేక పోవుచున్నాడు. విశ్వకర్మ బాణముల ప్రభావం రుక్మరధునిపై పెద్దగా ప్రభావం చూపుటలేదు. విశ్వకర్మ అలసిపోవుచున్నాడు. అతనికి వెంటనే బ్రహ్మదేవుడు రుక్మరధునికి ఇచ్చిన వరము గుర్తు తెచ్చుకొని అతనితో మైత్రి చేసుకొని అతని కోరికమేరకు దివ్యమైన పట్టణమును మహేంద్ర పర్వత గుహలయందు నిర్మించినాడు. అది మిక్కిలి శోభాయమానముగా వున్నది. అందు నీటి సమృద్ధి పుష్కలంగావున్నది. బంగారు కోటగోడలతోను, వజ్ర, వైఢూర్యములతోను అలంకరింపబడిన, బంగారు గోడలుగల యిండ్లను, అతి ఎత్తైన గోపురములను ఆకాశమును అంటుచుండు విధముగా తననేర్పరి తనమును అంతను వినియోగించి బ్రహ్మాండముగా నిర్మించినాడు విశ్వకర్మ. ఆ పట్టణమునకు లక్ష్మీవర్ధనము అని పేరు. సావిత్రీ వసువు కుమారుడైన రుక్మరధుడు ఆపట్టణమునందు నివసించుచూ గంధర్వ శ్రేష్టులను పాలించుచుండెను. అతడు మిక్కిలిబల గర్వముచేత అనేక వందల వేల రాక్షసుల బల గర్వమును అణచివేసినాడు. దేవతలు రాక్షసులతో యుద్ధానికి వెళ్ళునప్పుడు ఈ రుక్మరధుని ప్రార్థించి, తమ సహాయముకోసం తీసుకు వెళ్ళేవారు. ఈ విధముగా రుక్మరధుడు మిక్కిలి ప్రఖ్యాతిగాంచినాడు. మహా బల సంపన్నుడైన రుక్మరధుడు ఒకానొకప్పుడు వేటయందు ఆసక్తి కలిగి పెక్కు గంధర్వులతో కలిసి పారిజాత పర్వతము వద్దకు వెళ్ళినాడు. పారిజాత పర్వత ప్రాంతమందు మహా సొగసైన కొలను ఒకటి కనబడినది. అది అతి మనోహరముగా వున్నది. అందు చెలికత్తెలతోకూడి జలకాలాడుతున్న సమస్త శుభలక్షణములతోను, మెరుపు తళుక్కుమన్నట్లు వున్నటువంటి ఒకానొక స్త్రీని చూచినాడు. ఆమె అంద చందాలకు దాసోహుడైన రుక్మరధుడు ఆ స్త్రీ వద్దకు వెళ్ళి బుజ్జగించుచు ఆమెతో మాట్లాడ నారంభించెను. శుభ లక్షణములతో కూడియున్న మిగుల అందాలరాశివైన ఓ సుందరీ! నీ పేరేమి? నీవు ఎవరు? నీ తండ్రి పేరేమి?



అని లాలనతో అడిగినాడు రుక్మరధుడు. అప్పుడు ఆ సుందరి నేను హేమమాలి అను గంధర్వ రాజు కుమార్తెను. ఇచ్చటనే మంగళకరమైన విలాస పట్టణమునందు ఉన్నాడు నా తండ్రి. నా పేరు పద్మకోమల అందురు. అని వినయముతో చెప్పి, తన చెలికత్తెలతో తన పట్టణమునకు వెళ్ళినది.

## హేమమాలివద్దకు వివాహ నిశ్చయంకొరకు మంత్రులను పంపుట

సుందరాంగి మిగుల కోమలమైన శరీరముగల ఆ యువతిపై మంచి ప్రేమ కలిగినది రుక్మరధునికి. అందువలన ఆ కన్యను వివాహమాడ వలయునని నిశ్చయించుకొనిన వాడై తన మంత్రులను హేమమాలి వద్దకు వివాహ నిశ్చయ విషయమై పంపినాడు. శ్రేష్ఠులైన ఆ మంత్రులు విలాస పట్టణమునకు వెళ్లి దాని పాలకుడైన హేమమాలివద్దకు వెళ్ళి తన ప్రభువు చెప్పిన విషయమంతయు చెప్పినారు మంత్రులు. మిక్కిలి బలగర్వముతో వుండిన హేమమాలి ఆ మంత్రులతో కుత్సిత యోనియందు జన్మించిన మీ ప్రభువుకు మిక్కిలి సౌందర్యవంతురాలై దేవతల చేతను, గంధర్వుల చేతను కోరబడే నా కూతురును ఆ దుష్ట బుద్ధిగల మీ రాజునకు నేను ఎట్లా ఇవ్వగలను, మిమ్ములను ఏ విధముగా పంపినాడు. స్వయంవరము చేయుటకు తగిన నా కూతురును నేను ఊరకివ్వను అని హేమమాలి మంత్రులను వారి దారిని వారిని వెనుదిరిగి పొమ్మని చెప్పినాడు. అంతట ఆ మంత్రులు రుక్మరధునికి జరిగిన విషయమంతయు వివరించిరి. అప్పుడు మహా ప్రరాక్రమ శాలియైన రుక్మరధుడు మిక్కిలి కోపించినవాడై ఇప్పుడు ఆ విలాస పట్టణమునకు వెళ్ళి నా బాణములతో విలాస పట్టణమును భస్మము చేయుదును. హేమమాలి అంగములను ఛేదింతును అని చెప్పి బిరబిర ఆ పట్టణమునకు వెళ్ళినాడు. అప్పుడు శత్రువులకు హృదయభేదము చేయునట్లుగా రుక్మరధుడు అల్లెత్రాటిని శబ్దింపచేసి కోపగించుకొని ఆ హేమమాలినిని యుద్ధము కొరకు పిలిచెను. అతనిరాకను ఎరిగిన హేమమాలి కూడా యుద్ధము చేయుటకు సంసిద్ధుడాయెను. ఇరువురికి యుద్ధము జరుగుచున్నది. రుక్మరధుడు వేసిన తీక్షణమైన బాణములకు మూర్ఛనొందినాడు హేమమాలి. అంతట రుక్మరధుడు తన బాణములను,ఆయుధములను ప్రక్కనబెట్టి మూర్ఛనొందిన హేమమాలికి

శైత్యోపచారములు స్వయముగా చేయుచుండెను. కొంతసేపటికి హేమమాలికి తెలివి వచ్చిన తరువాత తనకు ఉపచారములు చేయుచున్న రుక్మరధుడుని చూచినాడు. రుక్మరధుని విశాల హృదయమును గ్రహించినాడు. శత్రువు ఆపదలో వున్న సమయములో అతనికి స్వయముగా శైత్యోపచారములు చేయుట అనేది పుణ్య పురుషుల లక్షణము. మహా గంభీరమైన ధీరోదాత్త లక్షణములు గలవారుమాత్రమే ఆ విధముగా ప్రవర్తించగలరు. సహృదయులైన వారే ఆ పనిని చేయగలుగుదురు. ఆపదలో వున్న వారిని ఆదుకొని ప్రాణాన్ని రక్షించటానికి ప్రయత్నించిన రుక్మరధుని చూచి మిగుల సంతోషించి ఓయీ! నీకు నా కుమార్తెను ఇచ్చి వివాహము చేయుదును. నా పట్టణమునకు వెళదాము రండి అని ఆహ్వానించినాడు. ఈ విధముగా రుక్మరధుడు పద్మకోమల యొక్క మనస్సును హరించటమే గాక ఆమె తండ్రి మనస్సును కూడా జయించినాడు. హేమమాలి తన కూతురు పద్మకోమలిని రుక్మరధునికి ఇచ్చి వైభవముగా వివాహము జరిపించినాడు. రుక్మరధుడు పద్మకోమలతో కలసి లక్ష్మీవర్ధనము అను పట్టణమునందు నివశించుచుండెను.

## సునాభుని కథ

ఓ దేవలరాజా! ఆ రుక్మరధుని వలన పద్మకోమల యందు నేను జన్మించితిని. నాకు స్వర్ణ కేతువు అని పేరు పెట్టినారు. నేను ఒకానొకప్పుడు నాభార్య చంద్రరేఖతోకూడి విమానము ఎక్కి కైలాస పర్వతమునకు వెళ్ళితిమి. ఆ సమయమునందు పార్వతీ పరమేశ్వరులు పర్వత గుహయందలి వనమునందు రహస్య క్రీడ జరుపుకొనుచుండిరి. నేను ఆ విషయమును తెలియని వాడనై ఆ వనమునందు వెళ్ళితిని. అప్పుడు శివుడు నన్ను చూచి మిక్కిలి కోపము గలవాడై దుష్టబుద్ధీ! ఇప్పుడు నా సమీపమునకు ఎందుకు వచ్చితివి. నా శాపమువలన నీ మహిమలన్నీ విడచి నీవు మన్మ్యష యోనియందు జన్మింపుము నీ భార్యకూడా మనుష్య యోనియందు జన్మించి, నీకు భార్య కాగలదు. ఈ విధముగా శంకరునిచేత శపింపబడినవాడనై మిక్కిలి భయము చెంది వణుకుచున్న నేను పార్వతీపతిని ప్రార్థించినాను. నాకు శాపము ఎప్పుడు ఏవిధముగా విడచునో తెలుపుము దేవా! భగవంతుడా! మీరు నన్ను శపంచితిరే ఈ శాప సముద్రమును ఏ విధముగా దాటగలను. దాని అంతమును తెలుపుము. ఓ సర్వకార్య సమర్థుడా!



ఈ శాపమనే అగ్ని జ్వాలను దేనిచేత చల్లార్చు కొందునయ్యా! దయానిధీ! నాకు తెలుపుమయ్యా! అని ఈ విధముగా ప్రార్థించగా శంకరుడు ఈ విధముగా నాతో చెప్పినాడు దేవలరాజా. శంకరుని మాట. నేను లోకములకు ఉపకారము చేయదలంచి, పాపము లేనటువంటి పరిశుద్ధుడైన దేవాంగుడని ప్రసిద్ధికెక్కిన మునివర్యుడును, ఎప్పుడు సృజియింతునో, అతడు నీవు పాలించు పట్టణమునకు ప్రభువుగా ఎప్పుడు వచ్చునో అప్పుడు నీ పాపమంతయు నశించి నీవు ఈ శాపమునుండి విముక్తుడవు అవుతావు అని చెప్పి పార్వతితోకూడిన పరమేశ్వరుడు అంతర్ధానమయ్యెను. తరువాత నేను ఆమోద పట్టణమునకు ప్రభువైన భద్రబాహువను వానిచేత అతని భార్యయైన ఇందుమతి యందు జన్మించితిని. నా తండ్రి భద్రబాహువు. నాకు సునాభుడు అను నామకరణము చేసినాడు. కాశీరాజు కూతురు అయిన కళావతి అను దానితో నా తండ్రి భద్రబాహువు నాకు వివాహము చేసినాడు. దేవలరాజా! ఇది నా వృత్తాంతము. నా వృత్తాంత మంతయు మీకు వివరించితిని. నీ అనుగ్రహమువలన నేను ఈ శాపమనే సముద్రమును దాటితిని. అని సునాభుడు చెప్పగానే సునాభుడు అతని భార్య కళావతి ఇరువురు మనుష్య శరీరములను త్యజించి దేవతలుగా మారిపోయినారు. కల్ప వృక్షముల పువ్వుల దండలచేత అలంకరింపబడి వుండిరి. సంతోషము పొందిన వారై దేవలుని ఊరడించు మాటలు చెప్పి తమ నివాసములకు విమానములో వెళ్ళిరి. అంతట దేవలుడు ఆ ఇరువురి మనుష్య శరీరములకు అంత్యేష్ఠి సంస్కారమును చేయించినాడు. ఓ నారదుడా! సునాభుని చరిత్ర ఇది. దీనిని సంగ్రహముగా తెలిపితిని. ఇది మిక్కిలి శుభదాయకమైన చరిత్ర. ఇక తరువాత వృత్తాంతమును కూడా నీకు చెపుతాను. శ్రద్ధగా విను నారదా! అని బ్రహ్మదేవుడు చెప్పినాడు.



# యక్షోపాఖ్యానము

## ఐదవ అధ్యాయము

### దేవలునికి నేతయందు నేర్పరితనము ఏర్పడిన విధము

బ్రహ్మదేవుడు తరువాత జరిగిన సంగతిని నారదులవారికి చెప్పుచున్నాడు. దేవల మునీంద్రుడు వస్త్రములు నేయుటలో మంచి నేర్పరితనము స్వతస్సిద్ధముగా కలిగియున్నాడు. ఎందువలనంటే పూర్వ కల్పములో అనగా పూర్వ జగత్తునందు దేవతాది సకల జాతుల వారికి యజ్ఞ సూత్ర వస్త్రములను నిర్మించి, అందరికీ ప్రదానము అనగా యిచ్చి, సృష్టికి రమణీయత కల్పించినాడు దేవలుడు. మహా ప్రళయ కాలమందు ఈ వస్త్ర నిర్మాత పరమేశ్వరుని యందు సాయుజ్యము పొంది దివ్యానంద స్థితిలో వున్నాడు. కాని యిప్పటి జగత్తు సృష్టి జరిగిన తరువాత బ్రహ్మదేవునిచేత వస్త్ర నిర్మాణ కార్యము నెరవేరనందున సకల దేవతలను వెంటబెట్టుకొని బ్రహ్మదేవుడు కైలాసగిరికి వెళ్ళి, వస్త్ర నిర్మాణ కర్తను సృజియింపుము. అతను నీలో సాయుజ్య స్థితిలో వున్నాడు. అతనికి తప్ప అన్యులవలన వస్త్ర నిర్మాణం కాదు అని బ్రహ్మదేవుడు చెప్పినట్లుగా ప్రథమాధ్యాయములో చెప్పుకొనినాము. అందువలన దేవలునకు వస్త్ర నిర్మాణము సహజముగా యేర్పడిన నైపుణ్యము అని తెలియుచున్నది. జగత్కళ్యాణ కారకమైన పనులను నిర్వర్తించుటలో ఎల్లవేళల యందు ముందంజలో ఉండాలని శుభస్య శీఘ్రం అను విషయము తెలిసిన వాడు కనుక దేవలుడు శీఘ్రముగా వస్త్రములను నేయాలనే తలంపు కలిగియుండి తన మంత్రులను పిలిపించినాడు.

### నేత సామాగ్రి తెచ్చుకొనుటకు మయునివద్దకు ప్రయాణము

ఓయీ! నేను వెంటనే వస్త్రములు నేయుటకు అవసరమైన నేత సామగ్రి తెచ్చుకొనుటకు మేరు పర్వతము వద్దనున్న విశ్వకర్మ కుమారుడు మయుడు అను నతని వద్దకు వెళ్ళవలసియున్నది. కావున నేను అక్కడికి ఒక్కడినే వెళ్ళడానికి సంకల్పించి నాను. అందువలలన మీరు రాజ కార్యములు చక్కబెడుతూ ప్రజల



శాంతి భద్రతలు చూచుకొనవలయును అని వారితో చెప్పగా రాజుపై విశేష గౌరవ భక్తి కలిగిన ఆ మంత్రులు వెంటనే రాజా! మీరు ఒక్కరే వెళ్ళవలదు. చతురంగ బల సమేతముగా వెళ్ళెదము. మీతోపాటు మేముకూడా వచ్చెదము. మిమ్ములను ఒంటరిగా పంపుట మా అభిమతము కాదు అని విన్నవించినారు. వెంటనే దేవలుడు ఓయీ! మీరెవ్వరును నా వెంట రారాదు. మీరు వస్తే రాజ్య భారము ఎవరు వహిస్తారు. కావున నేను ఒంటరిగా పోదలచినానని వారికి నచ్చజెప్పినాడు. మహా బల పరాక్రమవంతుడు అయిన దేవలుడు విల్లు చేతబట్టుకొని పెద్ద అంబుల పొదిని ధరించి, మిగుల బలము కలవాడు గనుక మేరు పర్వతమునకు ఒక్కడుగానే బయలుదేరినాడు.

### దేవలుడు గార్గ్య మునితో సంభాషించుట

మేరు పర్వత మార్గమునందు గార్గ్య మహామునీశ్వరుడి ఆశ్రమమును చూచినాడు దేవలుడు. అది అతి రమణీయముగా వున్నది. గార్గ్యమునినిచూడ నుద్దేశించి ఆ ఆశ్రమమునందు ప్రవేశించినాడు. అచ్చట తపస్సే ధనముగా గలవాడును, ఋషిశ్రేష్టుడును, నిష్కలంక తెలివిగలవాడును, ధర్మము బాగుగు తెలిసిన వాడును అయిన గార్గేయ మహాముని దేవలుని రాకను ముందుగానే గ్రహించి అతడికి ఎదురువెళ్ళి చక్కగా పూజించినాడు. దేవలునితో గార్గ్య ముని ఓ మిక్కిలి అదృష్టవంతుడా! నీవు ఇచ్చుటకు వచ్చునప్పుడు దారిలో నీకు క్షేమమే కదా! నీకు కుశలమే కదా! నీ రాజ్యమందు జనులందరు సుఖ సంతోషములతో వున్నారు కదా! ధన, ధాన్యములతో సమృద్ధిగా నీ రాజ్యమున్నదికదా! అని కుశల ప్రశ్నలు వేసినాడు. దేవలుడు గార్గ్య మహామునీ! తపస్సునే ధనముగా భావించినవాడా! నీ అనుగ్రహమువలన మా క్షేమమునకు తక్కువ లేదు. మా రాజ్యము సర్వకాలము సుభిక్షముగానే ఉన్నదయ్యా! మహానుభావా! అని చెప్పగానే గార్గ్య ముని మిగుల సంతోషము చెందెను. దేవలుడు గార్గ్య మునిని యోగక్షేమములు అడిగినాడు. దానికి గార్గ్యుడు కుశలమే అని బదులిచ్చినాడు. తరువాత తాపస శ్రేష్టుడైన గర్గ్యుడు దేవలున్ని ఓ రాజా! మీరు ఎక్కడకు వెళ్ళుటకు బయలుదేరి ఇచ్చటకు వచ్చినారు. మహానుభావుడా! నీ పరివారము లేకుండా ఒంటరిగా వచ్చినావా! అని గార్గ్యుడు అడుగా అతనికి జరిగిన వృత్తాంతమంతయు చెప్పగా ఆ ముని ప్రీతిచెంది దేవలునికి ఆతిధ్యము

ఇచ్చినాడు. దేవలుడు ఆ రాత్రి గార్గ్యా శ్రమములోనే మునీశ్వరునితో సంభాషణలు చేసి గడిపినాడు. మరుసటి దినము ప్రాతఃకాలమునందు ఆహ్నిక క్రియలు అయిన సంధ్యా వందనము, నిత్య దేవతార్చనాదులు నిర్వర్తించుకొని గార్గ్య మునివద్ద సెలవు తీసుకొని అచ్చటనుండి బయలుదేరినాడు.

## కపింజలుని శాప వృత్తాంతము

మహా బలవంతుడైన దేవలుడు ఆ విధముగా ప్రయాణమై పోవుచు మిక్కిలి ఎత్తుగాగల కొండలను దాటుకుంటూ మనుష్య సంచారమే లేని వనము మధ్యన దేవలుడు ప్రవేశించినాడు. ఆ వనమునందు సింహములు, గండబేరుండ పక్షులు, అడవిదున్నలు, అడవిపందులు,లేళ్ళను గుంపులు గుంపులుగా వుండినవి. ఆ అడవి అంతటను అడవి ఏనుగులు, దున్నపోతులు, ఎలుగుబంట్లు, శరభములతో అడవి నిండిపోయి వున్నది. ఖడ్గ మృగములు, చమరీ మృగములుకూడా విస్తృతముగా వ్యాపించివున్నవి. దుప్పులు, జింకలు కోకొల్లలుగా వుండినవి. భయమునుగొల్పు కొండముచ్చులు మిక్కిలిగా వున్నవి. అంతేకాకుండా నానావిధ కౄరమృగములతో అ అడవి అంతా నిండి వున్నది. అయితే వనము కౄరమృగములతో నిండివుండి నానావిధములగు పెను వృక్షములచేత ఆ వనము ఆవరింపబడివున్నది.అనేక రకములైన పక్షి సంఘములచేత వ్యాపించియున్న ఝుల్లికా నాదములచే ఇతర శబ్దములు వినరాక యుండెను.సింహ గర్జనలతో ఆ వనము మారుమ్రోగుచున్నది. గుడ్లగూబల కూతలు మిక్కిలి భయపెట్టునట్లుగా నున్నవి. ఇటువంటి భయంకరారణ్యమునందు మిగుల సాహసవంతుడు, ధైర్యశాలి, ధీశాలి పరాక్రమవంతుడేగాక మహాబల సంపన్నుడు అయిన దేవలుడు అరణ్యమునందు ప్రవేశించినాడు. ప్రవేశించి కొద్ది దూరము వెళ్ళగానే మహాభయముగొల్పు విధముగా ఒకపెద్ద సింహము జూలు విదల్చుకొని మిక్కిలి బిగ్గరగా గర్జించుచూ పెద్ద గంతులు వేస్తూ, దేవలునిపై ఉరికినది. దేవలున్ని చంపడానికి తన యావత్ శ్శక్తిని వినియోగించి ప్రయత్నించుచున్న సింహముపై ధనస్సు ఎత్తుకొని మిక్కిలి తీక్షణమైన బాణములచేత ఆ సింహము నొసటను కొట్టినాడు. మిక్కిలి బలవంతుడగు దేవలునిచేత ఈ విధముగా బాణములచేత గొట్టబడిన సింహము క్రమముగా తన శక్తిని కోల్పోవుచూ భయంకరముగా



రొప్పుచుండెను. అంతట దేవలుడు మిగుల కోపము తెచ్చుకొని శ్రేష్టములైన బాణములతో దాని ముఖమునిండా వేసెను. మరియొక బాణమును దాని కంఠంపై వదిలినాడు. ఆదెబ్బతో ఆ సింహము పెడబొబ్బలు పెట్టుచూ ప్రాణమును విడిచినది. దానిచెవులనుండి, ముక్కునుండి రక్తము గ్రక్కుచూ నేలపైబడినది. అంతట అంతరిక్షమునందు పుష్పక విమానమును అధిరోహించి దివ్యమాన శ్రీగంధమును దేహమునందు అలంకరించుకొని దివ్యమగు పూలదండలు ధరించియున్న ఒక దివ్య పురుషుడిని దేవలుడు చూచి మిగుల ఆశ్చర్యపోయినాడు. దేవలుడు అతనితో ఇట్లు అడిగినాడు. ఓ పురుష శ్రేష్టుడా! నీవు ఎవ్వరవు? నీ సమాచారము ఏమిటి? మిమ్ములను చూడగానే చాలా ఆశ్చర్యము కలుగుతున్నది. మహానుభావా! కావున నీవృత్తాంతమువిన వలయునని ఆసక్తి కలుగుచున్నది. కాబట్టి నీ వృత్తాంతమంతయు విపులముగా నాకు తెలుపవలనోయి అని దేవలుడు అడుగగా ఆ విమానమందలి దివ్య పురుషుడు దేవలుడికి తన వృత్తాంతము ఈ విధముగా చెప్పసాగెను.ఓ మహానుభావా! మిక్కిలిపరి శుద్ధుడైనవాడా! రాజశేఖరుడా! నీ దయవలన భరించలేనటువంటిమిక్కిలి బాధాకరమైనటువంటి ఈశాపమునుండి విముక్తుడిని అయితిని. నా కథను చెప్పుచున్నాను.విసుగు చెందకుండా వినవలయునని దివ్య పురుషుడు ఈ శాపముఏ విధముగా కలిగినది దానిని వివరించసాగినాడు.

నేను కుబేరునకు స్నేహితుడను. నా పేరు కపింజలుడు అను యక్షుడను. ఒకానొకప్పుడు వేటాడవలయునను కోరికబలంగా వుండి అనేకులగు యక్షులను వెంటబెట్టుకొని ఒక పెద్ద అడవి యందు ప్రవేశించితిని. అచ్చటగల అనేక కౄర జంతువులను చంపితిని. అదే విధముగా కౄరముగా వున్నటువంటి జింకలనుకూడా వేటాడితిని. అయినను ఇంకను వేటాడవలయునను తలంపు వున్నది. నాకు ఒక జింక కనబడినది. దానిని వేటాడ వలయునని దానిని వెంబడించితిని. అది మిక్కిలి వేగముగా పరుగులు తీయుచున్నది. నేనుకూడా పట్టువీడక దానిని వెంబడించితిని. అది అడవిలో ఎంతో దూరమునకు పరిగెత్తినది. ఎంత ప్రయత్నించినను నా బాణములకు చిక్కడం లేదు. కొంత సేపటికి ఒక తీక్షణమైన బాణమును దానిపై వదిలితిని. అది వేగముగాపోయి దాని వెన్ను క్రింద గ్రుచ్చుకున్నది. రక్తము కారుతున్నా సరే అది పరుగు ఆపలేదు.

నేనుకూడా దైవవశాత్తు దాన్ని వెంబడించితిని. కాసేపటికి అది ఒక ఆశ్రమములోనికి ప్రవేశించినది. నేనుకూడా ధనుర్బాణములతో ఆశ్రమమునందు ప్రవేశించినాను. అప్పుడే అక్కడకు ఆ ఆశ్రమవాసియైన గౌతమ మునీంద్రుడు వచ్చినాడు. రక్తము కారుతూ బాణాలతోవున్న జింకను చూచి దయాళుడైన మునివర్యుడు వ్యధ చెందినాడు.

## గౌతమముని కపింజల యక్షుని శపించుట

ఓయీ! ఏపాపమూ ఎరుగని నా ఆశ్రమ జంతువును చంపదలచితివా? నేను దీనిని అల్లారుముద్దుగా పెంచుకొనుచుంటిని. నీవు మిగుల బల గర్వముచెంది దీని రక్తము చిందించినావు అని కన్నులు ఎర్రగాచేసుకొని ఓరీ! పాపాత్ముడా! దుష్టుడా! నీవు ఒకపెద్ద అడవియందు సింహమై అతి కౄరముగా వుండెదవు. భయంకరమైన అడవి యందు సింహమై అతి కౄరముగా వుండెదవు గాక! అట్లు మృగరాజువై అరణ్యమునందలి జంతువునెల్లా తినుచూ పాపములకు పాత్రుడవు కమ్ము అని ఇట్లు గౌతముడిచే శపింపబడినాను. గౌతమునివలన మిక్కిలి భయపడి అతన్ని గురించి అనేకసార్లు ప్రార్థనలు చేసి, ఈ విధముగా అడిగినాను. ఓ షడ్గుణైశ్వర్య సంపన్నుడవగు ముని శ్రేష్టుడా! నా యందు దయ వుంచుము. ఇప్పుడు మీరు నన్ను శపించినారు. ఈ శాపము ఎప్పుడు తీరునో దానిని తెలుసుకొనవలెనని వున్నది. మహాత్మా! అని అడిగినాను. అంతట తపస్సంపన్నుడైన గౌతముడు నాతో ఈ విధముగా చెప్పెను. గౌతముడు చెప్పినది ఏమనగా శివునకు మానస పుత్రుడు దేవాంగుడని ప్రసిద్ధికెక్కిన వాడు లోకములకు అభిమానము కాపాడదలచిన వాడును, మహా తేజస్సంపన్నుడును, మిక్కిలి పరాక్రమశాలియై నిన్ను కలువగలడు. అతడునిన్ను శాప విముక్తుడిని చేయును అని చెప్పి ముని వెడలిపోయెను. అప్పుడు నేను సింహముగా నైతిని. ఇట్లా శాపభారము పైబడి బహు దినముల నుండి ఈ అడవియందు తిరుగుచుంటిని. ఓ పురుష శ్రేష్టుడవైన దేవలుడా! నేడు నీ దయచేత పాపములను విడచి పరిశుద్ధుడైతిని. ఇది నా గురించి వున్న విషయము. ఇచ్చటకు ఉత్తర దిగ్భాగమున 24 మైళ్ళ (36 కిలోమీటర్లు) దూరమున దేవఋషియైన వామదేవ మహర్షి ఆశ్రమము వుండినది. అది మిక్కిలి మనోజ్ఞముగా వున్నది. మీరు ఆ దిక్కుగా వెళ్ళేటట్లతే ఆ దివ్య మహర్షిని



దర్శించగలవు. పురుష శ్రేషుడవైన ఆజానుబాహువుడైన (నిలబడి యున్నప్పుడు చేతులు మోకాలును తాకుచున్నంత పొడవు గల చేతులు గలవాడు) దేవలుడా! అని ఇట్లు చెప్పి ఆ యక్షుడు దేవలుని నియమాదులకు తృప్తిచెంది మిగుల ఆనందభరితుడై తన నిజ నివాస స్థానమునకు వేగిరముగా వెళ్ళెను.



# రాక్షస శాప విమోచనము

## ఆరవ అధ్యాయము

## గంగానది ప్రాశస్త్యము

మహా ధైర్య శాలియు, అపరిమిత బలపరాక్రమవంతుడు అయిన దేవలుడు వేగముగ ఆడవిని దాటి ఆ దరముతో గంగానదివద్దకు చేరినాడు. ఆగంగానదియొక్క పవిత్రత ఎట్టిదనిన మూడులోకములు అనగా స్వర్గ, మర్త్య, పాతాళ లోకములను పవిత్రము చేయును. దివ్యము అయినటువంటిది. పాపములు అనేమేఘములకు పెనుగాలి వంటిదియు ఆకాశమున జన్మించినదియును, మూడు కన్నులు కలిగిన చంద్రమౌళీశ్వరుని జటాజూటము అంచున వుండునదియును, స్వచ్ఛమైన కాంతి కలిగి పాతాళ లోకమువరకు ప్రవహించియుండునదియు, అనేకమైన జలజంతువులను తనయందు స్థావరము కల్పించినదియును, పూలమీగడలవంటి తరంగములతో నిండియున్నదియును, అందుండు జలజంతువుల తలలు కనపడుతూ దీనిలో స్నానము చేసినవారి పాపములు నశించును అను తెలుపునట్లుగా నుండినదిగాను తనలో స్నానముచేసినంత మాత్రముననే వారి పాపము లన్నియు నశింపజేయునదియును, దీనిని స్మరించినంతటనే మనుష్యులు తమ పాపములను పోగొట్టుకొని దేహావసానమందు సకల సౌఖ్యదాయకమై శాశ్వతమైయుండు విష్ణులోకమునకు పోవునట్టి శక్తిఇచ్చుదానిగా వుండినదియు

ఆగంగను చూచినంతనే పాపములనే రాశిని దగ్ధము చేసిపరమ పదమునకు పొందింపజేయునదియును, పాపములను నశింపజేయునట్టి ఈ నదిలో స్నానముచేసిన పురుషుడు బ్రహ్మ హత్య మొదలగు పంచపాతకములైన అతిభయంకర పాపములను పోగొట్టునదియును, ఎర్రగా కాల్చబడిన ఇనుమును ఏమనుజుడు ఎట్లు తాకకుండా వుండునో అదే విధముగా జీవులయొక్క సమస్త పాపములు ఈ నదిలో స్నానము చేసినచో ఈతనిని అంటవు. మిక్కిలి పవిత్రమైన ఆగంగ ఒడ్డున మూడు రాత్రులు నివసించి ఆగంగోదకములను స్నానము మరియు పానము చేయుట ద్వారా బాహ్యాభ్యంతర (అనగా శరీరముపైవున్న దోషములు, శరీరములోపల వున్న దోషములన్నియు) అజ్ఞానమును జ్ఞానము దహించినట్లు వారిదోషములన్నియు దహింపబడును. ఒక జన్మమందు చేసినపాపములేగాక అనేక జన్మలయందు చేసిన పాపములన్నియు భస్మమైపోయి వచ్చే జన్మలయందు ఎటువంటి పాపము లేకుండా వుంచునదియును, ఇకమీదట పాపములు చేయాలనే బుద్ధిని నశింపజేయునదియును, మోక్షాన్ని ఇచ్చునట్టిదియును, పుణ్యముయొక్క వికారముగా గల ఆ గంగోదకముచే పితృదేవతలకు తర్పణక్రియలు చేసినచో ఆ పురుషుని పితృదేవతలందరూ అనగా వాని వంశమందు పుట్టినవారును, స్నేహితులు, బంధువులు, ఆచార్యులు, గురువులును అనుకూలురగు ప్రభువులును మొదలగువారి చేత కూడివుండి దుస్తరమైన నరకము అనే బాధను తొలగించుటయందు మిక్కిలి శక్తివంతమైనదియును వారికి శివలోక ప్రాప్తి కలిగించునదియును, యోగనిష్టులు, బ్రహ్మవిచారమును చేయువారు మోక్షమును కోరినవారు ఆ గంగానదిని ఆశ్రయించి వుండెదరు. ధర్మమును పెంచునట్టిది అయిన గంగానదిని చూచి ఆ దేవలుడు సంతోషపడినవాడై తన ఆహ్నిక కార్యములను గంగానది ఒడ్డున తీర్చుకొనినాడు.

## వామదేవాశ్రమము

అతి వేగముగా వామదేవాశ్రమమునకు దేవలుడు వెళ్ళినాడు. ఆ వామదేవాశ్రమమునందుండు వృక్షములన్నియు పుష్పించి, ఫలించి సొగసుగావున్నవి. అందుండు సరస్సులు తామరపుష్పములు, కలువలతో నిండిపోయియున్నవి. ఆ ఆశ్రమము నందుండు క్రూరజంతువులన్నియు తమ



వైరమును విడనాడి అవి పరస్పర ప్రేమాభిమానములతో కలసి జీవించుచున్నవి. పలువిధములైన పక్షులు వ్యాపించివున్నవి. అది తపస్సు చేయుటకు ఉత్తమమైన ప్రదేశముగా ఒప్పారుచున్నది. ఈ ఆశ్రమమునందు లేళ్ళు, దుప్పులు, జింకలు గుంపులు గుంపులుగా వుండి క్రూరజంతువుల వలన అపాయము కలుగునను భయము లేకుండా వున్నవి. మృగములయొక్క దురద పోగొట్టుటకు సింహము తన గోళ్ళతో గీరుచున్నది. పులులు కంఠమునందలి దురదను పోగొట్టడానికి జింకలు తమ యొక్క కొమ్ముతో కంఠమువద్ద రుద్దుచున్నవి. సింహపు పిల్లలు ఏనుగుల కుంభస్థలము పైకి ఎక్కి ఆడుచున్నవి. సింహపు పిల్లలు పర్వతశిఖరముల మీద వున్న తమ తల్లులవద్దకు ఏనుగుల తొండములు ఎత్తియుండగా వాని ఆధారముగా చేసికొని ఎక్కిపోవుచున్నవి. ఏనుగులు తమ తొండములను గండభేరుండ పక్షుల మెడలకు చుట్టి ఉయ్యాలలు ఊపుచున్నవి. వీటిని అన్నిటిని చూచిన దేవలుడు మిక్కిలి ఆశ్చర్యపోయినాడు. మహానుభావుడైన వామదేవ మహర్షి సన్నిధానమున వుండుట వలన దుష్టమృగములన్నియు జ్ఞానవంతులై ఐక్యమును పొందివుండుటను పలుమారులు చూచిన దేవలుడు మిక్కిలి సంతోషించినాడు. సకలము తెలిసిన దేవలుడు తపోనిధి అయిన ఆ వామదేవుని చూచినాడు. పెక్కుమంది శిష్యులు వేదం చదువుతూ ఆతనిని పరివేష్ఠించివుండిరి. సేవచేయుచుండిరి. వామదేవమహర్షి వేదములు వేదాంగములయొక్క రహస్యార్థము చక్కగా తెలిసినవాడు, **సర్వవిధములైన పరిశుద్ధము** చేయుటలో సమర్థత కలవారు. నిష్కల్మషమైన మనస్సుగలవారు, వినయము, సదాచారము సంపూర్తిగా కలవారుగను, జ్ఞానమును వృద్ధిపరచునట్టి విద్యలయందు సమర్థుడును, బ్రహ్మతేజస్సుయొక్క సమూహముగా వుండు రాశివంటి వారును, అమితమైన ధర్మాత్ములచే దర్శింపబడువాడును, అగ్నివలె మిక్కిలి తేజస్సుతో ప్రకాశించుచుండినాడు. వామదేవమహర్షి, అట్టి వామదేవున్ని దేవలుడు చూచి భక్తితో అతనికి సాష్టాంగనమస్కారము చేసినాడు. అంతట వామదేవుడు దేవలున్ని కుశలప్రశ్నలను అతి ప్రీతితో అడిగినాడు. అనంతరము దేవలుడు అంతఃశత్రువులు కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యములు అగు వాటిని జయించిన ఓ దేవమహాముని మీ దర్శనముచేత నేను ఇప్పుడు కృతార్థుడనైతిని. జ్ఞానమే భూషణముగా గల ఓ మహానుభావుడా ఇప్పుడు నేను మీ దర్శనమువలన ధన్యుడనైతిని. ఈ విధముగా పెక్కు ఉపచారపు

మాటలచేత ఆయనను మిక్కిలి వినయముతో కూడి గౌరవించుచు మరలా అతనితో గొప్పమాటలు చెప్పసాగినాడు దేవలుడు. దేవలుని మాట. ఓ మహానుభావుడైన ఋషి శ్రేష్ఠుడా మీకు క్షేమమే కదా. తపస్సులకు గనివంటి వాడవైన ఓ మునీశ్వరుడా మీకు సులభముగా తపస్సులు జరుగుచున్నవా ఇట్లు దేవలుడు అడుగగా వామదేవముని దేవలునితో ఈ విధముగా చెప్పినాడు. వామదేవుని మాట. ఓ మిక్కిలి పరాక్రమవంతుడవైన దేవలుడా! ఏమి చెప్పుదునోయీ! ఓ ఆజానుబాహుడా! ఇన్నిదినములు మేము ఇచ్చట సుఖముగా కాలమును గడిపితిమి. తపస్సు చేయుటకు, వేదములు చదువుటకును, యజ్ఞములు, యాగములు ఆచరించుట మాకు దైనందిన కర్తవ్యముగానుండును. ఎప్పుడునూ ఒకడివలన భయముపడి ఎరుగము. మాకొక బాధయునూ లేదు. ఇంత కాలమువరకు తపస్సులకు విఘ్నములు లేకుండా చక్కగా జరుగుచుండినవి. కాలమును సుఖముగా గడిపితిమి. ఇప్పుడు మా తపస్సుకు విఘ్నము సంభవించినది. ఇప్పుడు మా ఆశ్రమమునకు పెద్ద భయము కలిగినది. ఇప్పుడిక్కడవున్న ముని కుమారులందరికీ బాధ కలుగుచున్నది. మా ఆశ్రమమునందుండు మృగములకు వినాశనము సంభవించినది. తపస్సే ధనముగా గల వాడైన వామదేవమహర్షి ఇట్లు దేవలునితో చెప్పగా దేవలుడు వినయముతో కూడినవాడై ఆ మునిశ్రేష్ఠుడు ఇక చెప్పబోవు రీతిని మరలా అడిగెను. “దేవలుడు అన్న మాట. తపస్సు చేసికొనుచుండు మిమ్ములను బాధించినట్టి పాపాత్ముడు ఎవడు. అతను ఎక్కడున్నాడు, అతని పేరేమి ఈ విషయ మంతయూ నాకు తెలుపుము. అతను దైత్యుడా! యాతుధానుడా! భేతాళుడా, మనుష్యుడా అతనిని పిడుగులతో సమానమైన నా బాణములతో యముని ఇంటికి పంపెదను. ఇప్పుడే ఆ పాపాత్ముడిని చంపి మీ దు:ఖములన్నింటినీ తీర్చెదను. బంగారముచేత చేయబడిన పుంఖములు కలిగి అగ్నితో సమానములైయుండు నా బాణములచేత ఆ దురాత్ముని శిరస్సును ఇప్పుడే ఛేదించగలను. సందేహపడవలదు మహానుభావా అని దేవలుడు అనగా అప్పుడు దేవమహర్షి తన కోరికను పొందినవాడై దేవలునితో మరలా ఓ దేవలుడా నీవడిగిన సంగతిని చెప్పెదను వినుము.

వామదేవమహర్షి సంతోషముతో దేవలునితో చెప్పుచున్నాడు. ఇచ్చటకు అర్థయోజనము (నాలుగు మైళ్ళు) దూరమందు దుర్మార్గుడైన కుండికుడు అను



రాక్షసుడు కలడు. అతను గొప్ప బలము కలిగియున్నాడు. కొండగుహలయందు నివసించుచున్నాడు. అతనిని చూచి సకల ప్రాణులు భయపడి పారిపోవుచున్నవి. అతడిని నేను నా తపశ్శక్తి చేత నశింపజేయగలను గాని తపశ్శక్తి క్షీణించునని తలచి వానిని చంపక ఉదారభావముతో ఉంటున్నాను. నీవు మహాబలవంతుడగు రాజువు.

## బ్రాహ్మణ ప్రాశస్త్యము

బ్రాహ్మణులకు కలిగిన సంతాపమును హరింపచేయుట రాజులయొక్క ముఖ్యధర్మము. బ్రాహ్మణులను రక్షించుటకంటె రాజులకు గొప్పధర్మము లేదని కదా పెద్దలు చెప్పుదురు. బ్రాహ్మణులు ప్రతిరోజు ఆరుసార్లు దేవతార్చన చేసెదరు. లోక క్షేమం కొరకు సుభిక్షమైన వర్షాలకోసం, ధనధాన్య వృద్ధికొరకు, రాజ్యక్షేమం కొరకు, యజ్ఞయాగాలను నిష్కల్మష బుద్ధితో చేయుదురు. వేదవేదాంగములు నిరంతరం ఒక తరంనుండి మరొక తరం వారికి నేర్పి రాజ్యములో వేదవిద్యను అభ్యసించుటకు కృషి చేయుదురు. అందువలన రాజులు బ్రాహ్మణులను రక్షించుటకంటె గొప్పధర్మము లేదు. ఆర్తులు, దుర్బలులు, తపస్యులు అగు బ్రాహ్మణులకు తప్పక అభయమివ్వవలెను. అది పరమ ధర్మమని మన్వాదులు చెప్పియుండిరి. బ్రాహ్మణులకు సంతోషము కలిగించుటవలన కలిగిన పుణ్యము లెక్కించలేనంతటిది. బ్రహ్మహత్య కంటే మించిన పాపము, బ్రాహ్మణరక్షణ కంటే మించిన పుణ్యము ఈ భూమిలో లేనే లేదు. బ్రాహ్మణులతో ద్వేషించిన పాపాత్ముని దు:ఖమునకు అంతము ఉండదు. బ్రాహ్మణుని ద్వేషించినవాడు పరమ పాపాత్ముడగును, ఘోరనరకములను అనుభవించి అనంతరము నీచయోనులు కలిగినవంటి జన్మలను పొందెదరు. బ్రాహ్మణులను రక్షించిన ధర్మాత్ములు భూలోకమున సమస్త సుఖములను అనుభవించి తరువాత స్వర్గమునందు ఉత్తమ భోగములను అనుభవించెదరు. ఆ పుణ్యము క్షీణించినతోడనే ఆరోగ్యవంతుడై ధనవంతులు కులీనులు మొదలగు ఉత్తముల ఇండ్లయందు పుట్టెదరు. వారికి ఎప్పుడూ సుఖములేగాని దుఃఖములు వుండవు. బుద్ధిమంతుడిగావుండి ఈశ్వరప్రీతిగా బ్రాహ్మణులకు తృప్తి కలుగజేసినవాడు పునరావృత్తి రహిత అనగా ఇక మరొక జన్మ లేకుండానే శాశ్వతమైనట్టి మోక్షమును పొందుదురు. ఏ కారణము చేతనైననూ బ్రాహ్మణులకు తృప్తిని

కలిగించినవాడు దేవతలందరినీ తృప్తి పొందించిన పుణ్యము పొందును. అటువంటివాడిచే చేయబడిన పనులకు దేవతలు తృప్తి చెందుదురు. వేదవిదుడు అగు బ్రాహ్మణుని దేహమునందలి అవయవములందు సమస్తదేవతలు నివసించి వుండెదరు. అందువలన అతని దేహమును ఆశ్రయించి సమస్త పుణ్యనదులును, పుణ్యతీర్థములను ఉండును. అందువలన వేదవిదులైన బ్రాహ్మణుడు ప్రతిదినము పూజింపదగినవాడుగా నుండును. వేదవేత్తలైన బ్రాహ్మణులకు సంతోషముగా ప్రతిదినము నమస్కరించుట మంచిది. అతనికి నమస్కరించినచో సర్వదేవతలకు నమస్కరించినట్లు అగును. దేవలరాజా! ధర్మము ఆచరింపదలచినవారు తప్పక బ్రాహ్మణులను సంతోషపరచవలెను. అందువలన గొప్పధర్మము లభించును. వెయ్యి మాటలెందుకు? మహానుభావా అతి ముఖ్యమైన విషయము తెలిపెదను వినుము. వేలకొలది అశ్వమేధయాగములు, కోట్లకొలది గంగాస్నానములను చేయుటవలన లభించు పుణ్యము బ్రాహ్మణుని రక్షించుట వలన వచ్చు పుణ్యములో పదహారు భాగములలో ఒక భాగమునకు సమముగా వుండును. అందువలన బ్రాహ్మణసేవ ఏ పాటిదో ఎంత మహత్తుగలదో పుణ్యకరమైనదో తెలుసుకొనుము.

## పాకృత బ్రాహ్మణులు, అప్రాకృత బ్రాహ్మణులు వివరణ

బ్రాహ్మణులు రెండురకములుగా వున్నారు. పాకృత బ్రాహ్మణులు, అప్రాకృత బ్రాహ్మణులు అని. పాకృత బ్రాహ్మణులు అనగా అందరివలెనే బ్రాహ్మణస్త్రీ యందు జన్మించిననూ వారు ఉపనయనము కర్మగావించుకుని యజ్ఞోపవీత ధారణ చేసి, గాయత్రీ మహామంత్రమును నిత్యమూ జపించుచూ త్రికాలములయందు అనగా పూర్వాహ్ణము, మధ్యాహ్ణము, సాయంకాలమునందు సంధ్యావందనము చేయుచుండువారు. ప్రతిరోజు ఆరు సమయములందు నిత్యదేవతారాధన చేయుచుందురు. వేదాధ్యయనము ప్రతిరోజు చేయుదురు. వీరు సాత్విక బుద్ధి కలిగి అందరినీ సమభావనతో చూచుచుందురు. ఐహిక జీవితము కన్నా ఆధ్యాత్మిక జీవనమునకు ప్రాధాన్యత ఇచ్చుచుండువారుగను, సాత్వికాహారమే కలుగు యుండు వారును, లోకక్షేమములోనే తమ క్షేమము ఇమిడివున్నదని గ్రహించి లోకోద్ధరణకు పాటుపడేవారిని ప్రాకృత బ్రాహ్మణులు అందురు. అయితే వేదవిద్యాభ్యాసం చేయకుండినను సంధ్యావందనం



చేయకుండినను రోజుకు ఆరుసార్లు దేవతా పూజ చేయకుండావున్న వారిలో క్రమముగా వారిలో వున్న బ్రాహ్మణత్వము క్షీణించుచుండును. బ్రాహ్మణత్వం క్షీణించిన తరువాత వారు శూద్రసములుగా వుందురు. అనగా వారిలో ఎటువంటి పవిత్రత లేకుండును. ఈ విధముగా బ్రాహ్మణత్వం వృద్ధి చెందుట, క్షీణించుట వుండువారిని ప్రాకృత బ్రాహ్మణులు అని అందురు. మరొకరు అప్రాకృత బ్రాహ్మణులు. అనగ పుట్టుకతోనే సహజసిద్ధంగా బ్రాహ్మణత్వం కలిగివుండినవారు. వీరికి బ్రాహ్మణత్వం నశించుటగాని, వృద్ధిచెందుట గాని అను విధానము లేకుండా ఎప్పటికినీ శాశ్వతముగా, స్థిరముగా బ్రాహ్మణత్వం కలవారు. ఈ వంశము వారి ఆది పురుషుడు దేవలుడు సహజసిద్ధముగా యజ్ఞోపవీతమును కలిగివుండి ఆవిర్భవించినాడు. సహజసిద్ధముగా యజ్ఞోపవీతమును కలిగివుండినందున ఆతని వంశీయులును అప్రాకృత బ్రాహ్మణులు అనగా శాశ్వత సిద్ధ నిత్య బ్రాహ్మణులు అందురు. వారు దేవలముని సంతతి వారు. వారినే దేవాంగులు అనికూడా పిలిచెదరు. ప్రాకృత బ్రాహ్మణుల ఆదిపురుషుడు సహజసిద్ధముగా యజ్ఞోపవీతము ధరించి ఆవిర్భవించలేదు. అందువలన ఆతని సంతతివారు సాధారణముగా ఐదు సంవత్సరముల వయస్సు వచ్చిన తరువాత ఉపాకర్మతో కూడిన ఉపనయన కర్మ జరిపించునప్పుడు యజ్ఞోపవీతము ధరించి గాయత్రీ మంత్రమును జపించెదరు. ఈ విషయము గురించి వేదవేదాంగములు పురాణములు, ధర్మశాస్త్రములు, ఆగమశాస్త్రములు వివరించుచున్నవి.

## అగ్రధన్వుని శాప వృత్తాంతము

వామదేవమహర్షి దేవలునితో మేము ఆ రాక్షసులవలన చాలా బాధపడుచున్నాము. పరమపాపాత్ముడైన ఆ రాక్షసుడిని నీ బాహుబలముతో చంపివేయుము. వానిని చంపి మా బాధను తొలగజేయుము. నీవు సాధువులకు ఉపకారము చేయు నిమిత్తము ఈశ్వరునిచే పుట్టింపబడిన వాడవు కదా! ఆ రాక్షసుడు దుర్బలులు అగు మమ్ములను నిత్యము బాధించుచున్నాడు. వాడికి ఎవ్వనివలనను భయము లేదు. ప్రాణికోటిని భక్షించుచున్నాడు. వానిని ఎట్లయిననూ చంపుము. నీకు క్షేమము కలుగుగాక అని వామదేవమహర్షి చెప్పినాడు. బ్రహ్మ నారదునితో వామదేవమహర్షికి దేవలుడు ఈ విధముగా

చెప్పినాడు అని చెప్పుచున్నాడు. దేవలుడు వామదేవమహర్షితో మునీంద్రా! ఇప్పుడు పాపాత్ముడైన ఆ రాక్షసుని చంపెదను. మీరందరూ నిర్భయముగా వుండండి అని చెప్పి యుద్ధ సన్నద్ధుడై వామదేవుని అనుమతి పొంది వానిని చంపుటకు బయలుదేరెను. ఆ రాక్షసుడు నివసించు గుహద్వారమునకు దేవలుడు సమీపించెను. అది మిక్కిలి భయంకరముగను, అసహ్యకరముగను వుండి, దుఃఖమును, ఆశ్చర్యమును కలిగించునదియై యున్నది. అటువంటి రాక్షసుని నివాసమును చూచిన దయావంతుడైన దేవలుడు మిక్కిలి బాధాతప్త హృదయుడై వుండెను. ఎందువలననగా అసంఖ్యాకమైన జంతువుల కళేబరాలు, పుర్రెలు, ఎముకలు, ఏరులుగా ప్రవహించి తడిసిన రక్తముతో కూడిన భూమిని చూచి శీఘ్రముగా తీవ్రమైన కోపమును పొంది ధనస్సు యొక్క అల్లెత్రాడుతో మిక్కిలి గంభీరమైన ధ్వనిని కలిగించినాడు. ఆ ధనుష్టాంకారముతో రాక్షసుడు భీతిల్లి గుహలోనుంచి బయటకు వచ్చినాడు. కాటుక కొండ వంటి ఆకారముగల ఆ రాక్షసుడు దిక్కులు పిక్కటిల్లెటువంటి అరుపులు అరుస్తూ రక్తముతో తడిసియున్న తన శూలమును గిరగిర త్రిప్పుచూ కన్నులు ఎర్రగ చేసుకొని దేవలునిపై పరుగెత్తుచున్నాడు. మహాబలశాలియగు దేవలుడు తీక్షణములైన బాణములచేత రాక్షసుడిని గట్టిగా పీడించినాడు. దేవలునిచే బాగుగా కొట్టబడిన ఆ రాక్షసుడు మిక్కిలి కోపించి పెద్దపెద్దగా అరుస్తూ రంకెలు వేసినాడు. ఆ ధ్వని పదిదిక్కులకు వ్యాపించినది. శూలమును తీసుకొని అతి వేగముగా తన పైకి వచ్చుచున్న రాక్షసుడి గర్వం అణచివేయాలని మూడు బాణములతో వానిని కొట్టి మరలా మూడు బాణములు వేసి వాడిశూలమును విరగగొట్టినాడు. తన శూలము ముక్కలు ముక్కలు కాగానే పండ్లు పటపటమని కొరుకుచూ ఆ రాక్షసుడు ఒక పెద్ద వృక్షమును వ్రేళ్ళతో సహా పెళ్ళగించి దేవలునిపై విసిరివేసినాడు. దేవలుడు ఆ వచ్చుచున్న చెట్టును ముక్కలు ముక్కలుగా చేసి పడేసి రాక్షసుడివైపు చూస్తూ ఓరీ దురాత్ముడా! నీ శూలము పోయినది. నీవు ప్రయోగించిన వృక్షము ముక్కలుముక్కలు అయినది. ఇక నువ్వు ఏమి చేయుదవో చేయుము. దుర్బలులు అగు మునీశ్వరులను భక్షించి మిక్కిలి గర్వముతో మిడిసిపడుచున్నావు. నీకు ఎవ్వరివలనను భయము వుండినట్లు లేదు. నీవు ఇప్పటికే మిక్కిలి పాపమును సంపాదించుకున్నావు. నీ పాపాన్ని ఈ రోజు



తుదముట్టించెదను. నిమిష మాత్రములోనే నా తీక్షణ బాణములతో నీ గర్వమును అణచివేయుదును అని దేవలుడు చెప్పుచుండగరాక్షసుడు మిక్కిలి కోపముచెంది ఒక పెద్ద బండరాయి తీసుకొని ఇదిగోదీనితో నీకు చావుమూడినది అని అరుస్తూ దానిని దేవలునిపై విసిరి వేసినాడు. ఆ వచ్చుచున్న శిలను దేవలుడు వజ్రమువంటి తన బాణములతో పిండిపిండిగా చేసినాడు. పిదప ఆ రాక్షసుని సర్వాంగములపై బాణములు వేసినాడు. చివరకు రాక్షసుడు కోపపూరితుడై ఓరీ! మూఢుడా! నీకు కాలం కలసిరాక, యముని ఇంటికిపోవు సమయము ఆసన్నమై నా కంటికి కనబడినావు. ఇక నువ్వు ఎక్కడికి వెళ్ళెదవు. ఇప్పుడు నిన్ను వజ్రమువంటి నా పిడికిలితో పొడిచిచంపి నీ రక్తమును త్రాగి తృప్తి చెందెదను అని అంటూ పిడికిలి బిగించి దేవలునివైపుకు వేగముగా పరుగెత్తుచున్నాడు. వెంటనేబాణము ప్రయోగించి వాడి చేతిని ఖండించినాడు దేవలుడు. మరియొక బాణముతోరెండవ చేయినికూడ ఖండించినాడు. ఇట్లు రెండుచేతులు తెగిపడేసరికి మహాహుంకరించి నోరుతెరచుకొని శిరస్సుతో దేవలున్ని ఢీకొనుటకు వేగముగా వచ్చుచుండగా అర్ధ చంద్రాకారపు బాణమును ప్రయోగించి రాక్షసుని శిరస్సును త్రుంచివేసినాడు. వాని శిరస్సు వజ్రాయుధము చేత కొట్టబడినకొండశిఖరమువలె నేలకూలినది. వెంటనే ఒక దివ్య విమానమునందు ఒక దివ్య పురుషుడు తన తేజస్సుచే దశదిశలనువెలిగించుచూ దేవలునికి కనబడినాడు. ఆతనిని చూచి ఆశ్చర్యపడిన దేవలుడు అతనితో నీవు ఎవరవు? అని అడిగినాడు. అప్పుడు అతడు ఇట్లు చెప్పసాగెను. రాజేంద్రా! బాగుబాగు. నేను పవిత్రుడనైతిని. నీ ధర్మమువలన మిక్కిలి దుస్తరమైన శాప సముద్రమునుదాటితిని. నా శాపమనే అగ్నిహోత్రమును చల్లార్చితివి. నా వృత్తాంతమంతయు వివరించిచెపుతాను ఆలకింపుము.

నేను ఇక్ష్వాకు వంశస్థుడైన విశాలుడు అను వాని పుత్రుడను. నా పేరు అగ్రధన్వుడు. నేను మహాబల పరాక్రమములు గలవాడను. నేను బాగుగా రాజ్యమును పాలించితిని. నా పట్టణము విశాల అనుపేరుగలది. నేను రాజ్యమును పరిపాలించు కాలమునందు వికటుడు అను పేరుగల రాక్షసుడు దేశదేశములను బాధించుచుండెను. అందుండు మునీంద్రులను భక్షించు చుండెను. నేను ఆ విషయమును తెలుసుకొని ఆ పాపాత్ముడిని చంపి, అందరికి

సంతోషము కలిగించితిని. దేవలరాజా! ఆ పాపాత్ముడైన రాక్షసునికి తమ్ముడు ఒకడు వున్నాడు అతడి పేరు కర్కశుడు. నాతో యుద్ధము చేయజాలక కపటబుద్ధిని అవలంభించి, మా యింట వంటలవాని రూపములో ప్రవేశించినాడు. నాకు ఈ విషయము ఏ మాత్రము తెలియకుండెను. నన్ను దెబ్బ తీయుటకు తగిన సమయము కోసం ఎదురుచూచుచున్నట్లున్నది. ఇట్లుండగా ఒకరోజు దూర్వాసముని భోజనార్థము మండుచున్న అగ్నివలె మా యింటికి దయచేసినాడు. పాపాత్ముడగు కర్కశుడు అను ఈ రాక్షసుడు వారికి మనుష్య మాంసము వడ్డించినాడు. వెంట్రుకలతోకూడి మనుష్య మాంసం వుంటుంది. దానినిచూచినదూర్వాసుడు అన్నమును విడచినవాడై విపరీత కోపాత్ముడైన ఆముని దురాత్ముడు అగు రాజాధమా! నాకు మనుష్య మాంసమును వడ్డింప జేసితివి అని అనగా వెంటనే నేను ఎంతగా బ్రతిమిలాడికొనినను నామాట వినకుండా ఓరీ!పాపాత్మా! నాకు మనుష్య మాంసము పెట్టించినందులకు నీవు మనుష్య మాంసం తింటూ దురాచారుడవై యుండుము అనిశపించినాడు. నేను ఎంతగా బ్రతిమిలాడుకొన్నను, నేను నిర్ధోషినని ఎంతచెప్పినను నన్ను శపించినాడు. ఆశాపమును విని మిక్కిలి పరితపించిన వాడనై ముని చంద్రమా! నా యందు దయ తలుపుము. నా శాపానికి ఒక అంతమును కల్పించుము అని అనేక విధములుగా ప్రార్ధింపగా అప్పుడు ఆ ముని శివుని మానస పుత్రుడు అగు దేవాంగుడు అను నతడు సమస్తమైన వారికిని మాన సంరక్షకుడుగా ముందు పుట్టును. అతడు వచ్చి నీశాపమును తొలగించును. అంతవరకును నీవు రాక్షసుడవై యుండుము అని చెప్పి, ఆ ముని అంతర్ధాన మయ్యెను. వెంటనే నేను రాక్షసుడిగ మారిపోతిని. చిరకాలమునుండి శాపదగ్ధుడనై ఈ అడవిలో పడియుంటిని. నేను భక్షించిన జంతుజాలమునకు లెక్కయేలేదు. రాజేంద్రా! ఇన్నాళ్ళకు నీవలన సమస్త పాపములు పోయి పవిత్రుడను అయితిని. ప్రభూ! నా వృత్తాంత మంతయు నీవు అడిగినట్లు చెప్పితిని. నేనునీవద్ద సెలవు తీసుకొనివెళ్ళెదను. నీ కెప్పుడునూ క్షేమము అగుగాక! అని పలికి అతడు పరమ సంతోషము పొంది దేవలోకమునకు వెళ్ళెను. మహాశూరుడుఅగు దేవలుడు వామదేవ మునీంద్రుని వద్దకు వచ్చి విషయము అంతయు తెలిపినాడు. ఆ మహర్షిచే విశేషముగా సత్కరింపబడిన



దేవలుడు అతడివద్ద సెలవు తీసుకొని అచట నుండి క్రమముగా మేరు పర్వతమునకు వెళ్ళెను.

## దేవలుడు మయునివద్దకు ఏకాంతముగా వెళ్ళుట

శివ మానస పుత్రుడైన దేవల మునీంద్రుడిచేత ఇంతమందికి శాప విమోచనము కలుగవలసి వున్నందననే దేవలుడు చతురంగ బల సమేతుడుగా కాకుండా ఒంటరిగా మేరు పర్వతము వద్దనున్న మయుని వద్దకు బయలుదేరి నాడు. పరమేశ్వరునిచే ప్రేరేపితుడై ఎంతోకాలము నుండి శాపాగ్నికి బలై బాధపడుతున్న వారికి విముక్తి చేయడం కొరకు దేవలుడు మయునివద్దకు ప్రయాణమయినాడు అని బ్రహ్మదేవుడు నారద మునీంద్రునికి వివరించినాడు.



# వస్త్రాక్షయ వర ప్రదానము
## ఏడవ అధ్యాయము

ధైర్య పరాక్రమములు గల దేవలుడు మేరు పర్వతమువద్దకు వెళ్ళినాడు. అచ్చట పవిత్ర కార్యములను నెరవేర్చుచుండు మయుని గృహమునకు వెళ్ళినాడు. విశ్వకర్మ కుమారుడు అయిన మయుడు సంతోషము చెంది దేవలున్ని గౌరవించి పూజించినాడు. విశ్వకర్మకే త్వష్ట అను పేరుకూడా కలదు. త్వష్ట కొడుకైన మహా బలవంతుడు అగు మయుడు దేవలున్ని ఈ విధముగా అడుగుచున్నాడు. ఓ రాజశ్రేష్ఠుడా! మిక్కిలి బుద్ది కుశలత కలవాడా! ఏ కార్యము నిమిత్తము ఇచ్చుటకి వచ్చినావు. పరిజనులు లేకుండానే ఒంటరిగా వచ్చినావు నాకు మిగుల ఆశ్చర్యముగా నున్నది. కావున నీ రాకకు కారణము తెలుపవలయును అని అడిగినాడు.

### నేత సామాగ్రి కావలయునని మయుడిని అడుగుట

దేవలుడు ఓ మహాభుజ బలముగల మయుడా! నేను నీవద్దకు వచ్చుటకు కారణము వున్నది. అది ఏమిటంటే వస్త్ర నిర్మాణములు చేయమని వస్త్రములు తయారుచేసి, శీఘ్రముగా దేవతలు మొదలగు జాతుల వారందరికి ఇవ్వవలయునని శివునిచే ఆజ్ఞాపించబడినాను. అందువలన వస్త్రములు తయారు చేయుటకు అవసరమైన నేత సామగ్రిని నీ వద్ద తయారు చేయించుకొని తీసుకు వెళదామని వచ్చినాను. కావున సకల సంపదలతో తులతూగుచున్న ఓ మయుడా! నాకు వెంటనే ఆ నేతనేయు సామగ్రిని నాకు ఇవ్వుమయ్యా! నీవు మిక్కిలి నేర్పరితనము కలవాడవు, సర్వకార్య సమర్థుడవు, మిక్కిలి బలవంతుడవు గనుక నీ వద్దకు వచ్చితిని. అని దేవలుడు చెప్పినాడు. దేవలుడు చెప్పిన మాటలకు మిక్కిలి సంతోషము చెందిన మయుడు సంప్రీతితో ఒక్క క్షణ కాలములోనే నేత నేయుటకు కావలసిన సామాగ్రినంతను తయారుచేసి దేవలునికి సంతోష పూర్వకముగా ఇచ్చినాడు. దేవలునితో ఓ రాజా! ఈ సామగ్రి యొక్క గొప్పతనమును చెపుతాను వినుము. వజ్రమయమై సుందరము అయినట్టిది అగు వస్త్రమును చుట్టు సాధనమును నిర్మించినాను. దీనిని నగదోనె



అని పిలుచుచుందురు. మధ్యమధ్యను రత్నములతో పొదగబడిన వైఢూర్యమణి వికారముగల దట్టింపు పలకను, వజ్ర మయమును దంతమయమును అయిన సూదిని సూక్ష్మ విద్యలయందు ఆరితేరిన మయుడు తయారు చేసినాడు. బాగా బుద్ధిశాలియగు మయుడు మరకత మణి వికారమై పుష్యరాగపు పువ్వుల చేత అలంకరింప బడినదియు కంఠ భాగమునందు గోమేధికముతో తయారు చేయబడినది నేత కఱ్ఱ. గరుడ పచ్చతోటి నాడి క్రోవిని, వజ్రమయమైన కీలను చేసెను. చుట్టునట్టి ఆ వజ్రమయమైన కీలయందు ఒక్కొక్క పలక ఒక్కొక్క రత్నముచేత చేయబడి ప్రకాశించుచుండెను. అదే విధముగా చిత్ర విచిత్రములగు వస్త్రములను చుట్టు సాధనమును నిర్మించినాడు. వజ్రమయమైన పిడికిడితో పట్టుకలిగి వజ్రముతో చేయబడిన కీళ్ళుకలిగి రత్నముల పువ్వుల చేత ప్రకాశించునట్టి బంగారపు పట్టకలిగి ఉక్కువాదర గల చురకత్తిని చేసెను. ఈ విధముగా బుద్ధిశాలియు, మిక్కిలి నేర్పు గలవాడును అయిన మయుడు నేత నేయుటకు ఏడు రకముల సాధనములను నిర్మించి దేవలునకిచ్చి వాటిని గురించి దేవలునితో ఈ విధముగా చెప్పసాగినాడు. ఓ రాజరాజగు దేవలుడా! మిక్కిలి సంతోషకరముగా నుండునట్టి ఈ ఆయుధముల మహిమను తెలిపెదను వినుము. వస్త్రములను జుట్టు సాధనమైన ఈ నగదోనె యందు పెక్కు వస్త్రములు చుట్టినను అది నిండదు. దీని ప్రమాణము అట్టిది. ఓరాజా! ఈ సూదియు, నేత కఱ్ఱయును నీ అనుబంధ ప్రమాణముచేత (అనగా మగ్గానికి త్రాళ్ళు కట్టుకుంటాము. మగ్గము సొరుగులోని నాడిని అవతలి సొరుగులోనికి పోయే విధంగాను అచ్చు పైకి క్రిందకి వచ్చునట్లు పావుకోళ్ళకు కట్టి అన్నె ద్రొక్కుటకు వీలుగా వుండునట్లుగా త్రాళ్ళచేత బంధించుతాము. దానినే అనుబంధము అంటారు. హృద్యము అనగా సౌకర్యముగా వుండుట అనగా నేత నేయుటకు అనువుగా వుండవలయును.) ఓయీ మిక్కిలి బుద్ధిశాలియైన దేవలుడా! ఈ నాడి క్రోవి చీలలు నీకు ఏ విధముగా వుండాలని తలిస్తే ఆ విధముగా నుండగలవు. లోకముల యందలి జనుల మానమును కాపాడువాడా! ఇదిగో ఇది ఐదురంగుల దారములతో కండెలను చుట్టి వున్నను వానిలో నీకు ఏది అవసరమో ఆ వర్ణపురంగు దారమే నీవు కోరినట్లు వచ్చుచుండును. ఈ ఐదు రంగుల దారములను చుట్టి వున్న కండెను నీ కనుకూలముగా ఉపయోగించ వచ్చును. అనగా ఏ రంగు దారము కావలెనన్న ఆ రంగు దారము ఒక్కటే

వస్తుంది. అయిదు రంగుల దారములు కలిసి కావాలన్నా వస్తవి. అట్లా కాకుండా 1,2,3,4 ఎరుపు, పసుపు,ఈ విధముగా చిత్రవిచిత్ర వర్ణములు గల దారములతో రకరకములైన 25 రకాల వన్నెలు గలిగిన వస్త్రములను నేయుటకు వీలుగా నీకు తోడ్పడును. దేవలా అని చెప్పినాడు.

## దేవలునికి అష్టగంటా విరాజిత శక్తిని బహుమతిగా ఇచ్చుట

దేవలునకు అష్టగంటా విరాజితమగు ఒక శక్తిని కానుకగా బహూకరించినాడు మయుడు. అది బంగారు పట్ట కలిగి వజ్రములచే నిర్మింపబడిన ఎనిమిది గంటలచేత ప్రకాశింపబడే మహాశక్తిని కానుకగా ఇచ్చినాడు మయుడు. ఈ దివ్యశక్తి ఎవరి సమీపములో వుండునో వారియొక్క మనోభీష్టము త్వరగా నెరవేరును అను తలంపు కలిగిన మయుడు లోకోపకారము నెరవేర్చు దేవలునికి మహదానందపడి ఈ దివ్యశక్తిని ఇచ్చినాడు. అందుకు దేవలుడు మిక్కిలి సంతోషపడి మయుడిని పరిపరి విధములుగా అభినందించాడు. తరువాత తన నిజ పట్టణమైన ఆమోదగిరి పట్టణమునకు బయలుదేరెను. ఆమోదపట్టణమునకు వచ్చి తగిన సౌకర్యకరమగు ప్రదేశమున తాను తెచ్చిన నేతసామాగ్రిని అంతను నేత నేయుటకు అనువుగా వుండు విధముగా వాటిని అమర్చినాడు. ఆయా పరికరములను ఉపయోగించి నేత నేయుటకు 7 సాధన వస్తువులను ఒకదానితో ఒకటి అనుబంధం కలుగు లాగున మనోహరముగా త్రాళ్ళచే బంధించినాడు అని సూతుడు ఋషులకు చెప్పుచుండగా ఆ ఋషులు మిక్కిలి ఆశ్చర్యపడిరి. సూతుడుని ఋషులు అడుగుచున్నారు. అనుబంధము కట్టుట చాలా కష్టమైనది, కీలకమైనది. అనుబంధం సరిగ్గా వుంటేనే నేతపని ముచ్చటగా సాగుతుంది గదా. దేవలుడు అనుబంధంను కట్టి ఇమ్మని మయుని ఎందుకు అడుగలేదు? మిక్కిలి కష్టతరమైన అనుబంధం దేవలుడికి తెలిసినప్పుడు నేత సామగ్రి నిర్మించుకొను శక్తి అతనికి లేకుండా వుంటుందా? అయినా దేవలునికి ఈ అనుబంధం ఎట్లా తెలుసుకున్నాడు అను సందేహములుకలుగుచున్నవి. కావునసూత మహామునీ! నీవు ఈవిషయములు చెప్పి మా సందేహములను తీర్చవయ్యా అనిఅడిగిరి. అప్పుడు సూతుడు ఋషులతో చెప్పుచున్నాడు. దేవలునికి నేత సామగ్రి సంబంధించిన అనుబంధం తెలుసును. ఎందువలననగా పూర్వ కల్పములో



వస్త్రములను నిర్మించినది ఈతనే కదా! ఆ విద్య దేవలునికి శివునిద్వారా లభించినది. నేత సామగ్రిని తయారు చేసుకొను శక్తి దేవలునికి కలదు.

## శాప విమోచనము కలిగించుటకు ప్రయాణము

శాపములు పొందియున్న యక్షుడు, ఇక్ష్వాక వంశ అగ్రధన్వుడు అను వారికి శాప విమోచనము దేవలుని వలన కలుగవలసియున్నది కదా! అందువలన విధి ప్రేరేపితయై దేవలుడు నేత సామగ్రికి మయుని వద్దకు వెళ్ళు సమయములో వారికి శాప విమోచనము కలిగించటము కొరకే మయుని వద్దకు ప్రయాణము ఈ కారణముతో చేసినాడు. కావున దేవలుడు వస్త్ర నిర్మాణమునందు సర్వ శక్తి సంపన్నుడు. అమోఘమైన నైపుణ్యము కలిగియున్నవాడు. ఈ విషయములో ఎటువంటి సందేహములకు తావులేదు అని సూతముని ఋషులకు చెప్పినాడు.

## చౌడేశ్వరీదేవి వద్దనుండి కంకణమును వరముగా పొందుట

దేవలుడు ఈ విధముగా ఉప కరణములను కూర్చుకొనిన తరువాత తనకు ప్రాణదానము చేసి పునరుజ్జీవింపజేసిన చౌడేశ్వరీ రూపముతోనున్న చండికా దేవిని స్మరించినాడు. దేవలుడు స్మరించిన వెంటనే ఆ మహాశక్తి తక్షణమే ప్రత్యక్షమైనది. దేవలునితో లాలనగా నాయనా! నన్ను ఇప్పుడు స్మరించుటకు కారణమేమిటి? నేను చేయవలసిన పని ఏమిటి? తెలుపుము అని అడుగగా మిక్కిలి సంతోషించిన దేవలుడు అమ్మవారికి అనేకసార్లు మ్రొక్కి పెక్కు విధములుగా ఆమెను స్తోత్రముచేసి దేవతతో ఒక మాట చెప్పినాడు దేవలుడు. ఓ దేవతలకెల్ల ప్రభువైన ఈశ్వరునికి పత్ని యగు ఓ దేవీ! నీ దర్శనము వలన నేను కృతకృత్యుడునైతిని. ధన్యుడను అయితిని ఓ మహాదేవీ! నీ అనుగ్రహము వలన నా కోరిక సఫలము అవుతున్నది. శివుని ఆజ్ఞ ప్రకారము నేను వస్త్రములను నిర్మాణము చేయుటకు సిద్ధముగా వుండినాను. భక్తుల అభీష్టమును నెరవేర్చుచూ వారియందు ప్రీతిగల ఓ దేవీ! నేను నేసిన వస్త్రములు తరగకుండా ఉండవలయును. మూడు లోకములలో నున్న వారందరికీ వస్త్రములను ఇవ్వవలసిన వాడను. అందువలన ఓ మహాదేవీ! నేను నేసిన వస్త్రములు తరగకుండా ఉండవలయును. ఓ అంబికా! దేవతలు మొదలగు

వారికి వారు కోరిన విధముగా వస్త్రములు యిచ్చి, కృతార్థుడనగుదును. కావున నీవు ఆ విధముగా అనుగ్రహము యివ్వవలయును అని మిక్కిలి కీర్తిగల దేవలునిచేత ఆ చౌడేశ్వరీ మహాశక్తి ఇట్లు ప్రార్థింపబడినది. అందుకు ప్రీతిచెంది అతనిని సంతోషపరచుచు తీయని మాట చెప్పినది శ్రీచౌడేశ్వరీదేవి. ఓ రాజశ్రేష్టుడా! దేవలా! నీవు ఎట్లు చెప్పితివో ఆ విషయము అట్లే అగును గాక. ఓ నిష్కల్మషుడా లోకములకు మానము నిచ్చువాడా ఇదిగో ఇది నా చేతి దివ్య కంకణము. దీనిని నీవు నీ చేతికి ధరించుచు నీ నేర్పు కొలది అనేకమైన వస్త్రములు (చీరలు) నేయుము. నీవు నేయునప్పుడు ఒక్కొక్క రంగు దారముతో ఒకొక్క రంగుగల వస్త్రమును ప్రయత్నపడి అనగా జాగరూకతో వుండి నేయవలయును. పిమ్మట అవి తరగనివి అయి పెరుగుచుండును. ఇందులో సందేహము లేదు. ఓ రాజా! నీవు ఏమాదిరి వస్త్రములను నేయుదువో అవి అన్నియు అక్షయములే అగును అనగా తరగక వుండును. ఇందు సందేహము లేదు. ఒక్కొక్క నమూనా (రీతి) లో ఒక్కొక్క రకమైన వస్త్రమును నేయుము. అవి నా వలన అక్షయమై పెరుగును. ఈ విధముగా మహాశక్తి చెప్పి ప్రీతితో కంకణమును దేవల రాజుకు ఇచ్చి సంతోషపరచి అక్కడనే అదృశ్యమయ్యెను. అప్పుడు సకల సంపదలతో వుండుచు మిక్కిలి సమర్థుడై వున్న ఆ దేవలుడు నేత నేయ ఆరంభించుటకు జ్యోతిష్కులచే తారాబల, చంద్రబల, లగ్న, గ్రహబలముతోను శుద్ధి కలిగిన ఒక దివ్య ముహూర్తమును ముందుగా నిర్ణయింప చేసుకొని యున్నాడు. ఆ సమయానికి వేదవిదులైన బ్రాహ్మణులను రప్పించి స్వస్తి వాచకముతో కూడిన వేదపఠనము జరగుచుండగా దేవలుడు అమ్మ వారిచ్చిన కంకణమును తన చేతికి ధరించి నేత నేయుట ప్రారంభించినాడు. వెల లెక్కింప సాధ్యము కాని అనేక వస్త్రములను దేవలుడు నిర్మించాడు. ఈ విధముగా వస్త్రనిర్మాణము ప్రారంభమైనది.





# దేవాంగుని దేవలోక వస్త్ర ప్రదానము

## ఎనిమిదవ అధ్యాయము

తరువాత కథను సూతులవారు ఋషులకు చెప్పుచున్నాడు. అప్పుడు సకల సంపదలుగల ఆ దేవలుడు తన నేర్పరితనముతో మనోహరమగునట్లు పలు విధములైన వన్నెలుగల వస్త్రములను నేసెను. అవి నడుమ కన్నుల వంటి పూలు కలుగు వన్నెకు చెందినవియు, హంస వన్నె కలిగియుండు వానిని, హంసలవంటి పూలు గలిగియుండువానిని, చంద్రుని వన్నెలు గలవానిని, నక్షత్రములవలె పూవులుండువానిని, చంద్రునివంటి పూలును మరియు నక్షత్రపు పూలు, ఏడు వన్నెలు కలవియును, సుందరమగు నీలమేఘము అయిన మబ్బు రంగు వన్నె కలవియును ఈ విధముగా పలు విధములుగా మనస్సును ఆహ్లాదపరచు చిత్రవిచిత్ర వర్ణములతో వన్నెలు దేవలుడుకల్పించినాడు. తెల్లనివి, నల్లనివి, పసుపువి, పచ్చ వన్నెవియు, ఎర్రనివి, చిత్రవిచిత్ర వర్ణములుగలవి అగు వస్త్రములను మిక్కిలి నేర్పరితనముతో దేవలుడు నేసి అనేక వస్త్రములను ఎత్తుకొని దేవలుడు విష్ణు సమీపమునకు పోయి అచ్చట పసుపు వన్నె దోవతిని మిక్కిలి ప్రీతితో విష్ణుమూర్తికి దేవలుడు ఇచ్చినాడు. మిక్కిలి జ్ఞానముగల దేవలుడు తెల్లని వస్త్రములను లక్ష్మీదేవికి ఇచ్చినాడు. భూదేవికి సుందరమైన ఎర్రని వస్త్రములను (చీరలను) ఇచ్చెను. మరలా అచ్చటనుండు వారందరికి వారువారు కోరినవర్ణముల వస్త్రములను యదేచ్ఛగా ఇచ్చినాడు. శ్వేత ద్వీపమున నుండు వైష్ణవులు పెక్కు విధముల సొమ్ములును, కిరీటములను, దివ్యములగు వాహనములను దేవలునికి బహూకరించినారు లక్ష్మీనారాయణులు. అచటనుండి సత్యలోకమునకు పోయి లోక నిర్మాతయగు బ్రహ్మకొరకు ఎర్రని వస్త్రమును యిచ్చినాడు. సరస్వతీదేవికి మంచితెల్లని చీరెను, సావిత్రి అను దేవతకొరకు పసుపు వన్నె చీరయును, గాయత్రీకొరకు ఎర్రని చీరను, ప్రజాపతికి తెల్లని దోవతిని, పులస్త్యునకు పసరు వన్నె దోవతిని మరియు అక్కడ వున్న గంధర్వులు, కిన్నరులు, సిద్ధులు, సాధ్యులు, మహర్షులు, చారణులు వీరలకెల్ల

వారువారు కోరిన వస్త్రములను వారివారికిచ్చి జగత్తులకెల్ల ప్రభువైనటువంటి నాలుగు ముఖములు గలవాడగు బ్రహ్మకు నమస్కరించి ఆ దేవలుడు ఇట్లు అడగసాగెను.

## బ్రహ్మదేవుడిని నూలుకొరకు దేవలుడు ప్రార్థించుట

దేవతలకెల్ల పెద్దవాడవు సకలము సృజింప సమర్థుడవు అగు ఓ స్వామీ! ఇక మీదట మా వంటి వారికి వస్త్రములునేయుటకు నూలు కావలయును అదియెట్లు కలుగును. నావారికి నూలు లభించునట్లు చేయుమయా దయానిధీ! అని ఇట్లా దేవలుడు అడుగగా లోకములకు ప్రభువగు ఆ బ్రహ్మ ఆదేవలుకి సమాధానము చెప్పెను. ఓ దేవలుడా! నీ వంశము వారికి నూలుకలుగు విధము చెప్పెదను వినుము. వీరిద్దరు మాని, అభిమాని అను పేరులుగల స్త్రీలు వీరు. విష్ణు నాభి కమలమునందున్నవారు. వీరు తంతువులకు విచ్ఛేదము అనగా లోటు రాకుండా ఉండుటకై భూమియందు ప్రత్తి వృక్షములుగా అగుదురు. అందుచేత ప్రపంచమునందు దారములు అధికమగును. సందేహములేదు అని బ్రహ్మ చెప్పగా దేవలుడు సంతోషము చెందినాడు. బ్రహ్మవద్ద సెలవుపుచ్చుకొని స్వర్గలోకమునకు వెళ్లినాడు. అక్కడవున్న మహేంద్రునకు ఎర్రని వస్త్రములు ఇచ్చెను. శచీదేవికి పసుపు వన్నె వస్త్రమును, జయంతునకు తెలుపు వస్త్రమును, ఎనిమిదిమంది వసువులకు, ద్వాదశ ఆదిత్యులకు, ఉగ్ర స్వభావముగల ఏకాదశ రుద్రులకు వారివారి మనస్సులకు నచ్చిన వస్త్రములను దేవలుడు వారికిఇచ్చెను. ఇంకను బ్రహ్మర్షులకును, దేవఋషులకును, దేవతలకును, గంధర్వులకును వీరందరికి వారువారు కోరిన విధముగా వస్త్రములను వారికి ఇచ్చినాడు దేవలుడు. అంతట స్వర్గలోకమున వున్న వారందరు ఏనుగులు, గుర్రములు, దండలు, రత్నములు సొమ్ములు, అనేక విధములైన ఆయుధములులను దేవలునికి బహూకరించినారు. వీనిని గ్రహించి సంతోషపడిన దేవలుడు దేవతా భేదముల ప్రీతితో వస్త్రములను ఇచ్చి అప్పుడు ఆ రాజశ్రేష్టుడగు దేవలుడు మేరు పర్వతము వద్దకు వెళ్ళెను. ఆ మేరు పర్వతము నందుండు దేవతలకును, విద్యాధరులకును, గంధర్వులకును, సిద్ధులు, చారణులకు, సాధ్యులకును, కింపురుషులకును, యక్షులకును, కిన్నరులకును, గరుడులకును, మరియు మహానుభావులకును,



తపస్సంపన్నులకును ఋషులకును వీరలకెల్ల వారు కోరుకున్న తెల్లని, ఎర్రని,పచ్చని, నల్లని, పసుపువన్నెలవియును, అయిన వస్త్రములను దేవలుడు ఇచ్చి వారిని సంతోషపరచెను. ఆ తరువాత బుద్ధిశాలియగు త్వాష్టుని కొరకు కోరిన మంచి వస్త్రములను ఇచ్చినాడు. అనేక ఆయుధములు, బంగారు నగలు, సొమ్ములుచేతను దేవలున్ని సంతోష పరచినాడు త్వష్టుడు. ఆ తరువాత బుద్ధిశాలియగు దేవలముని మహేంద్ర పర్వతమునకు వెళ్ళి అక్కడవున్న గంధర్వుల కెల్ల దివ్య వస్త్రములను ఇచ్చినాడు.గంధర్వులు దేవలున్ని బహుమతులతో సంతోష పెట్టినారు. ఆ తరువాత మలయ పర్వతము వద్దకు వెళ్ళి అచ్చటవున్న సిద్ధు లందరిని వస్త్రముల చేత సంతోషపరచినాడు. వారిచేత పూజింపబడినాడు దేవలుడు. ఆ తరువాత సహ్యాద్రి పర్వతములకు వెళ్ళి కిన్నర శ్రేష్టులకు దివ్యములైన వస్త్రములను ఇచ్చినాడు. అక్కడ నుండి హిమవత్పర్వతము వద్దకు వెళ్ళెను. అక్కడవున్న కింపురుషులకు దోవతులు (పంచలు) ఇచ్చి వారిని సంతోష పరచినాడు దేవలుడు. అచ్చటనుండి వింధ్యపర్వతము వద్దకు వెళ్ళి అచ్చటవున్న చారణులను సంతోషపరచే విధంగా వారికి కావలసిన చిత్రవిచిత్ర వస్త్రములను ఇచ్చినాడు. తరువాత అచ్చటనుండిఋక్షవంతము అనుకొండ వద్దవున్న విద్యాధరులకు వస్త్ర ప్రదానముచేసి అనంతరము పారిజాత పర్వతము వద్దకు వెళ్ళి అచ్చటవున్న గంధర్వులకును, సాధ్యులకును వారు కోరిన వస్త్రములు ఇచ్చినాడు. తరువాత అరణ్యములలో నుండి యమనియమాది అష్టాంగ మార్గములో తపస్సు చేసుకొనుచున్న మునీశ్వరులందరికి వారికి కావలసిన వస్త్రములను ఇచ్చి వారల భార్యలగు పుణ్యస్త్రీలకు అతి రమణీయములైన వస్త్రములు ఇచ్చినాడు.

## అష్టదిక్పాలకులకు వస్త్ర ప్రదానము చేయుట

అచ్చటనుండి అగ్నిదేవుడు వుండు పట్టణమునకు వెళ్ళెను. అతనికి నల్లని వన్నెగల వస్త్రములను ఇచ్చినాడు. అగ్నిహోత్రుడు సంతోషభరితుడై దేవలున్ని సత్కరించినాడు. దక్షిణదిక్కునందు నివసించు యమధర్మరాజు వుండు పట్టణమునకు వెళ్ళి అతనికి నల్లని వస్త్రములను ఇచ్చినాడు. అచ్చటవుండే అతని భక్తులందరికి వస్త్రములను ఇచ్చినాడు. అచ్చటనుండి నైరుతి దిక్కునందు నివసించు నిర్భతి అను దిక్పాలకుడు వుండు పట్టణమునకు వెళ్ళి పసుపు

వన్నెగల దోవతిని ఇచ్చినాడు. అచ్చటనుండి వరుణుడు వుండు స్థానమునకు వెళ్ళి అతనికి తెల్లని వస్త్రములను ఇచ్చి వారిని సంతోష పరచినాడు. వరుణుడు సంతోషించి మణులచేతను, మిక్కిలి సుందరమైన దండలచేతను దేవలున్ని సత్కరించినాడు. అచ్చటనుండి వాయుదేవుడుండు స్థానమునకు వెళ్ళి అతనికి పచ్చని వస్త్రములను ఇచ్చినాడు దేవలుడు. వాయుదేవుడు సంతుష్టాంతరంగుడై దేవలున్ని మిక్కిలి గౌరవించినాడు. అచ్చటనుండి అలకా పట్టణమునకు వెళ్ళి కుబేరునకు చిత్ర వర్ణములు గల దోవతి ఇచ్చి సంతోషపరచినాడు. అచ్చటవున్న అతని కుమారుడైన నలకూబరునికి సొగసైన వస్త్రములను ఇచ్చి సంతోషపెట్టెను. అంతట మహాబుద్ధి శాలియగు కుబేరుడు దేవలున్ని మిక్కిలి మనోహరములగు రత్నఖచితములైన మరియు కోటిసూర్యులకు ఎంత వెలుగు వుండునో అంతటి ప్రకాశము గల కిరీటమును మరియు పెక్కు ఆభరణములను ఇచ్చి సత్కరించినాడు. పిమ్మట ఈశాన్యదిక్కు నందుండు ఈశ్వరుని వద్దకువెళ్ళి అతనికి తెల్లని వస్త్రములను ఇచ్చినాడు. అతని వద్దనుండు ప్రమథ గణములకు, భూతములకు మిక్కిలి వెలగల వస్త్రములను ఇవ్వగా వారందరు చాలా సంతోష పడినారు. ఈ విధముగా ధర్మబుద్ధి కలిగి కీర్తిని పెంపొందింప జేసుకొనిన దేవలరాజు స్వర్గ లోకమునకు వెళ్ళి అచ్చటనున్న వారందరికీ దివ్యములగు వస్త్రములను ఇచ్చి వారలను సంతోష పెట్టినాడు. ఈ విధముగా స్వర్గలోకము నందున్న వారందరి అభిమానమును పొందెను. కులపర్వతము నందున్న మహానుభావులగు ఋషులకును, అనేక జాతులవారికిని వారు కోరిన వస్త్రములను ఇచ్చి వారందరిని సంతోషపరచినాడు. ఓ ముని శ్రేష్టులారా! ఈ ప్రకారముగా దేవలుడు దివ్యములైన వస్త్రములను నేసి దేవతల అందరికి ఇచ్చిన వస్త్రములను దేవతలు యొక్క అంగములను అలంకరించుటచేత దేవాంగుడు అని ప్రసిద్ధి చెందినాడు దేవలుడు అని సూతముని చెప్పెను.





# దేవాంగుని మర్త్య పాతాళ లోక వస్త్ర ప్రదానము

## తొమ్మిదవ అధ్యాయము

సూత మహాముని తరువాత కథను ఋషులకు ఈ విధముగా చెప్పుచున్నాడు. మహా శ్రీమంతుడు అగు దేవలుడు దేవలోకములోని వారందరికి వస్త్రములను ఇచ్చి తరువాత భూలోకమునకు వచ్చినాడు. భూలోకములో వుండు సకల దేశాధీశులకు వస్త్ర ప్రదానము చేసి మానవ నాగరికత వికసింపజేసినాడు. మనుష్యలను అలంకార ప్రియులుగా చేయుటకు తన వస్త్ర ప్రదానము ద్వార సృష్టి రమణీయతను బహుగుణీకృతము చేసినాడు. మనుషుల దిగంబరత్వం నుండి నాగరికత వైపుకు పయనించుటకు వస్త్రము ప్రధాన భూషణమైనది. మన్యుషులయొక్క అంగములను తన వస్త్రములచే అలంకరింప చేయుటచేత దేవలుడు మానవాంగః అను మరొక ప్రసిద్ధ నామమును పొందెను.

## దేవల, దేవాంగ, మానవాంగః

అనగా దేవతలచేత లాలింపబడుట వలన అనగా స్తోత్రములచే పూజింపబడుటవలన అనగా మా మానములను కాపాడుము మాకు కలిగిన సిగ్గును దూరము చేయుము అని పరిపరి విధముల దేవతలచే లాలింపబడుట వలన **దేవలః** అను ప్రథమ నామము ఏర్పడినది. తరువాత దివ్య వస్త్రములను సృష్టించి సకల దేవతల అంగములను తన దివ్య వస్త్రములచేత అలంకరింపబడుట వలన **దేవాంగః** అను ద్వితీయ నామము ఏర్పడినది. దేవతలకు ప్రదానము చేసిన తరువాత భూలోకములోవున్న సకల మానవులందరికి సకల దేశములయందుండు వారికి వస్త్ర ప్రదానము చేసి మానవులయొక్క అంగములను తన దివ్య వస్త్రములచేత అలంకరింప చేసినందు వలన **మానవాంగః** అనికూడ పిలువబడతాడు దేవలుడు. భూలోకములోని రాజులలో అందరి కన్నా ముందుగా జంబూ ద్వీపమునకు వచ్చినాడు. ఆ జంబూ ద్వీపమును పృథువను రాజు అప్పుడు పాలించుచున్నాడు. ఆతని పట్టణము వజ్ర పట్టణము. ఆ పట్టణమునకు వచ్చి అందుండు రాజు పృథువునకు అనేక వస్త్రములు ఇచ్చి తరువాత ఆపట్టణమున నున్న జనులందరికి వస్త్రములు

ఇచ్చినాడు దేవలుడు. అనగా పాలకుడికి, పాలింపబడే ప్రజలందరికి వస్త్రములు ఇచ్చి వారినందరిని మిక్కిలి సంతోష పెట్టినాడు దేవలుడు.అప్పుడు పృధువను రాజు దేవలునికి ఏనుగులు, గుర్రములు, ధనమును ,కానుకలను అమితముగా ఇచ్చి అతనిని సంతోషపరచినాడు. అచ్చటనుండి ప్లక్ష్య ద్వీపమునకు దేవలుడు వెళ్ళి అచ్చట ప్రభుత్వము చేయుచున్న శూరసేనుడు అనురాజుకు దోవతులను ఇచ్చినాడు. ఆ శూరసేన రాజు కృతజ్ఞతా పూర్వకముగా దేవలునికి మదపుటేనుగులను ఇచ్చి సంతోషపరచినాడు. అచ్చటనుండి కుశ ద్వీపమునకు దేవలుడు వెళ్ళినాడు. దాని రాజైన కుశడును కలిసి అతనికి సంతోషముతో వస్త్రములను ఇచ్చినందున అతడు గుర్రములను దేవలునికి బహుమానములుగా ఇచ్చి సంతోష పెట్టినాడు. తరువాత దేవలుడు క్రౌంచ ద్వీపమునకు వెళ్ళి అచ్చటి రాజగు హేమాక్షుడును కలసి అతనికి నానా వర్ణములగు వస్త్రములను ఇచ్చినాడు. అధిక ప్రతాపవంతుడైన ఆ హేమాక్షుడు మిక్కిలి సంతోషించి దేవలునకు ముత్యములు,ఇంద్రనీల మణులు గుర్రములు, ఏనుగులు ,భూషణములను ఇచ్చి సంతోషపరచినాడు.

అచ్చటనుండి దేవలుడు శాకద్వీపమునకు వెళ్ళెను. ఆ ద్వీపానికి పాలకుడైన అభిరామునకు వివిధములైన వస్త్రములను ఇచ్చి అతడిచ్చిన రధములు,వాహనములు, సుందరమైన పల్లకీలు, భూషణములు గ్రహించి మిక్కిలి సంతోషించినాడు. తరువాత శాల్మలీ ద్వీపమునకువెళ్ళి అచ్చటి రాజగుశాలిహొూత అను రాజునకుమనోహరములగు వస్త్రములను ఇచ్చి అతను ఇచ్చిన అనేక గుర్రములు గ్రహించుకొని అచ్చటనుండి పుష్కల ద్వీపమునకు వెళ్ళి అచ్చటవున్న భానుమంతుడు అను రాజునకు దివ్యములైన వస్త్రములను మహా బుద్ధికుశలతగల దేవలుడు ఇచ్చినాడు. అంతేకాకుండా భానుమంతుడు రాజు ఇచ్చిన గుర్రములను, ఏనుగులను, ఆభరణములను, పలు విధ రత్నములను గ్రహించి మరల జంబూ ద్వీపమునకు వచ్చినాడు. ఆ తరువాత మాళవ, కొంకణ, ద్రావిడ, మత్స్య దేశములను, కేకయ దేశములను, కళింగ దేశమును, కులంగ దేశమును, చోళ దేళమును, నేపాళ, మాద్ర, సింధు, యుగంధర, విదర్భ, కురు, బర్బర, చైత్య, కరూశ, బంగాళ, త్రిగర్త, ద్రెంకణ,



మరాట, లాట, పాంచాల, నిషాద, ఘూర్జర, శక, సాళ్వ, అంగ, మగధ, జుల్లిక మొదలగు ఎల్ల దేశములకు అనగా రాజ్యములకు వెళ్ళి, ఆ దేశముల రాజులకు, అందుండు ప్రజలకు వస్త్రములను ఇచ్చి, వారినందరిని సంతోషపరచినాడు దేవలుడు. అప్పుడు రాజశిఖామణియైన దేవలుడు పలు దేశముల రాజులు ఇచ్చిన ఏనుగులు, గుర్రములు, ధనము, ఆభరణాలు, పల్లకీలు, బంగారము, రత్నములు, అనేక రకముల ముత్యములు, అనేక రకమలైన మణులు, పశవులు, మనోహరములగు రధములు, పెక్కు మంది దాసీ సంఘముల చేతను, పెక్కు పరిచారకులును మొదలగు అమూల్యమైన సంపదను పొంది దీటులేని సంతోషమును దేవలుడు పొందినాడు. జంబూ ద్వీపమునందలి బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు, శూద్రులకు మరియు ఇతర జనులందరికి దేవలుడు వారుకోరిన వస్త్రములను ఇచ్చి, వారిని సంతోషపరచినాడు. విశ్వమందలి సకల దేవతలు, భూమియందలి సప్త ద్వీపములలోని సకల రాజులకు వారి ప్రజలకు వస్త్రములు ఇచ్చుట చేత వారందరు మిక్కిలి సంతోషము చెందినారు. అందులకు కృతజ్ఞతా పూర్వకముగా దేవలునికి తమ యధా శక్తి బహు కానుకలు సమర్పించినారు అందరు. అందువలన దేవలుడు పొందిన కానుకలు రధములు, పల్లకీలు, ఏనుగులు, గుర్రములు, దాసీలు, సేవికులు, గాడీలు, మిక్కిలి సొగసుగానుండు పల్లకీలు, ఇవి అన్నియు బహు కోట్ల సంఖ్య అయినది ఋషులారా! అని సూతుడు చెప్పసాగెను.

## దేవలుడుకి బహూకరింపబడిన కానుకలు.

ఓ ధర్మాత్ములైన ఋషులారా! వాటి సంఖ్యను తెలిపెదను ఆలకించుము. రధములు కోటి, గోవులచేత నడుపబడు బండ్లు (గాడీలు) రెండు కోట్లు, మదపుటేనుగులు రెండు కోట్లు, మిక్కిలి శ్రేష్టములైన గుర్రములు నాలుగు కోట్లు, పల్లకీలు ఒక కోటి, దాసికలు (స్త్రీ పరిచారకులు) 90 లక్షలు, సేవకులు 36 లక్షల మంది, ఈ మనుషులను, ఏనుగులను, గుర్రములను మొదలగు సంపదనంతను ఆమోద పట్టనమునకు పంపినాడు. పై సంపదను పరిశీలించగా దేవలుడు దేవ, మానవ జాతుల వారి మనస్సులను ఎంతగా ఆహ్లాద పరచినాడో సులభముగా తెలియుచున్నది.

## పాతాళ లోకములో వస్త్ర ప్రదానము

ఆ తరువాత దేవలుడు పాతాళ లోకమునకు వెళ్ళి అందుండు సర్పరాజులను సందర్శించెను. ఆ పాతాళ లోకమునందలి సర్పరాజుల పడగలయందలి మణుల కాంతి ధగధగ మెరియుచున్నది. ఆ లోకమునంతటను నాగ కన్యలు వ్యాపించి యున్నారు. మిక్కిలి సుఖకరముగ ఆ ప్రాంతమును పాలించుచుండిన సర్పరాజములు, అచట మహా బలశాలిగావుండు ఆ సర్పములకు ప్రభువుగా నుండు వాసుకిని చూచి దేవలుడు అతనికి అనేక వర్ణములు గల దోవతులను కోరినన్ని ఇచ్చినాడు. అక్కడే వుండు చిత్రసేనునికి మంచి దోవతులు ఇచ్చినాడు. ఆ సర్పములకు భర్తయైన తక్షకునికి ఎర్రని వస్త్రములను ఇచ్చెను. అంతేకాకుండా కొన్ని నల్లని వస్త్రములనుకూడా తక్షకునికి ఇచ్చి సంతోష పరచినాడు దేవలుడు. మహా బుద్ధిశాలియగు దేవలుడు ఐరావతమనే సర్ప శ్రేష్ఠమునకు తెల్లని వస్త్రములను ఇచ్చెను. సౌరభేయము అను సర్పమునకు పసుపు వన్నె ధోవతులు ఇచ్చెను. వైశాలేయములు అను సర్పములు బహు కలవు. అవి కోరిన వస్త్రములను ఇచ్చినాడు. అచ్చట వున్న మిగతా సర్ప జాతులందరికి వారు కోరిన వస్త్రములు ఇచ్చినాడు. ఈ విధముగా సర్పజాతులందరికి వస్త్ర ప్రదానము చేయుటచేత వాసుకి మిక్కిలి సంతోషించెను. దేవలునికి మిక్కిలి వెలగల రత్నములు అనేకములు కానుకగా ఇచ్చినాడు వాసుకి. అదే విధముగా మిక్కిలి బలముగల చిత్రసేనుడు మెదలగు సర్ప శ్రేష్ఠములు మిక్కిలి ప్రేమను పొంది, మనోహరములగు రత్నములను దేవలునికిచ్చి సంతోషపరచిరి. మిక్కిలి బలవంతుడైన దేవలుడు ఆదిశేషుని ఇంటికి వెళ్ళినాడు. అతనికి చిత్ర వర్ణములగు దోవతులను తెల్లని దోవతులను తమ నల్లని దోవతులను, పసుపు వన్నె దోవతులు మొదలగు వన్నెల దోవతులను ప్రేమతో ఇచ్చినాడు. ఆదిశేషుని భార్యలు అందరికి కూడా వారు కోరునట్టి వస్త్రములను సంతోషముతో ఇచ్చినాడు. ఆదిశేషుని మంత్రులగు ధృతరాష్ట్రుడు మొదలగు సర్పశ్రేష్ఠములన్నిటికి మంచి వస్త్రములు ఇచ్చినాడు. వారి భార్యలకును కావలసిన వస్త్రములిచ్చి వారందరిని సంతోషపరచినాడు. అంతేగాకుండా అక్కడవున్న సర్పములన్నింటికి వారివారి కోరికననుసరించి వస్త్రములు ఇచ్చినాడు. అచట వున్న సర్పరాజములన్నియు మిగుల సంతోషమును పొందినవి. కృతజ్ఞతా



పూర్వకముగా దేవలరాజునకు అనేక శ్రేష్ఠములైన దండల చేతను, రత్నముల చేతను, ఆభరణముల చేతను, భూషణముల చేతను మిక్కిలి తేజోవంతుడైన దేవలున్ని సత్కరించి సంతోష పెట్టిరి. అప్పుడు సర్పము లన్నింటికి ప్రభువైన ఆదిశేషుడు దేవలుడి గుణగణములు నడవడిని గమనించి మిక్కిలి సంతోషము చెందిన వాడయ్యెను.

## చంద్రరేఖతో దేవలుని వివాహము

మిక్కిలి సుందరమైన రూపముతో అలరారుచుండిన తన కూతురు చంద్రరేఖను దేవలుడికిచ్చి వివాహము చేసినాడు ఆదిశేషుడు. తన కూతురు చంద్రరేఖకు వెలకట్టలేని దివ్య రత్నములను అనేకము ఇచ్చినాడు. అప్పుడు దేవలుడు ఆదిశేషుని వద్ద సెలవు తీసుకొని ఆదిశేషుని కూతురు చంద్రరేఖతో భూలోకమునకు వచ్చెను. కావున దేవలునికి మొట్టమొదటిసారిగా ఆదిశేషుని కుమార్తె చంద్రరేఖతో వివాహమయినది. దేవలుని తొలి భార్యగా చంద్రరేఖనే చెప్పుకొనవలసి యున్నది. ఈ విధముగా దేవల వంశస్థులకు తమ నాగ జాతివారికి అవినాభావ సంబంధమున్నదని దీనిద్వారా తెలియు చున్నది. ఈ విధముగా మహాబుద్ధిశాలియైన ఆ దేవలుడు ముల్లోకముల యందుండు సమస్త జనులకు వారికి అలంకారము కొరకు పెక్కు వస్త్రములను ఇచ్చి వారందరి అభిమానమును పొందినాడు.

## విశ్వజనాంగుడిగా దేవలుడు

అందువలన విశ్వ వస్త్ర సృష్టి కర్తగను, విశ్వ వస్త్ర ప్రదాతగను, విశ్వ వస్త్ర నిర్మాణ ప్రదాత గాను **దేవాంగః** అనుదానితోపాటు **మానవాంగః, విశ్వ జనాంగః** అని పరి విధములుగా కీర్తింపవచ్చును. ఆతరువాత దేవలుడు తన నిజపట్టణమైన ఆమోద పట్టణమునకు వచ్చి తన పట్టణములో వున్న జనులందరకు వస్త్రములు ఇచ్చినాడు. ఇచ్చట దేవలుని విశాల భావము శ్లాఘనీయముగా వున్నది. ఎందువలనంటే అన్ని ప్రాంతములు, సకల జనులకు వస్త్రములను ఇచ్చి సంతోషపరచిన తరువాతనే తను పాలించు ప్రాంత జనులకు వస్త్ర ప్రదానము చేసినాడు. అందరి సంతోషములోనే తన సంతోషము ఉన్నది అను భావనకు ఇది చిహ్నముగా భావించ వచ్చును. దేవలుడు వస్త్రములు

ఇవ్వగా ఆమోద పట్టణ వాసులు, మంత్రులు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు మరియు ఇతర జాతుల వారును ప్రీతితో వస్త్రములను ధరించి రాజ శ్రేష్టుడగు దేవాంగ ముని వలన మిక్కిలి సంతోషము పొందితిమి అని భావించినారు. మహా బుద్ధి కుశలత కలిగి వుండి సకల సంపదలచేత తులతూగుతున్న దేవాంగ మునీశ్వరుడు ధర్మబుద్ధి కలిగినవాడైనందున ఈ ప్రకారముగా మూడు లోకముల వారికి దోవతులు, చీరలు ఇచ్చి ఎల్లవారి అభిమానమును కాపాడినాడు. వారందరు సంతోషముగా నుండవలెనను మనస్సు గలవాడు అయినందున మిక్కిలి కీర్తిని పొందినాడు.

దేవలుడు దేవతలందరికి వస్త్రములను ఇచ్చినాడు. దేవలుడు ఇచ్చిన వస్త్రములను తమ శరీరమునకు ధరింపజేసి అలంకారముగా కనపడిరి. దేవతల శరీర అంగములు దేవలుని దివ్య వస్త్రములతో అలంకరింపబడినందున ఆ అలంకారినికి దేవలుడే మూల కారకుడు కాబట్టి దేవలున్ని దేవాంగుడు అని పిలిచినారు.

మానవ జాతి మొత్తానికి దేవలుడు తాను నేసిన వస్త్రములను వారు కోరిన విధముగా వివిధ వన్నెలతోను, చిత్రవిచిత్ర వర్ణములతోను కూడివుండిన వస్త్రములు జంబూ ద్వీపము మొదలగు నవ విధ ద్వీపములలోనున్న మానవ జాతి మొత్తానికి ఇచ్చినాడు. ఈ మానవ జాతి మొత్తము దేవలునిచే ఇవ్వబడిన వస్త్రములను తమ శరీరమునకు అలంకరించుకొని తమ నగ్నత్వమును పారద్రోలినారు. వారు నూతన దివ్య వస్త్రములతో అలంకరించుకొనుట వలన వారి శరీరములు మిక్కిలి అందముగా కనబడినవి. అందువలన మానవ అంగాలను తన వస్త్రముతోటి అలంకరింప జేయుటవలన దేవలున్ని మానవాంగః లేదా మానవాంగుడు అని కొనియాడవచ్చును.

ఈ సృష్టిలోని సకల జాతుల వారందరికీ అనగా దేవ, గంధర్వ, యక్ష, కిన్నర, కింపురుష మొదలగు దేవజాతుల వారికే గాక మానవ, నాగ, రాక్షస జాతుల వారికికూడా అనగా ఈ సృష్టిలోని సమస్త జాతులవారికి దివ్య వస్త్రములు నేసి, వారి దగ్గరకు వెళ్ళి, స్వయముగా వస్త్రములు ఇచ్చినాడు. వారందరి చేత ధరింపజేసినాడు. సృష్టిలో వున్న దిగంబరత్వమును



పారద్రోలినాడు. విశ్వములోని వారందరి అంగములు (శరీర అవయవములును) ను తన వస్త్రముచేత అలంకరింపబడుట వలన దేవలున్ని విశ్వాంగః విశ్వాంగుడు అని **విశ్వ వస్త్ర ప్రదాత** అని కొనియాడ వచ్చును. ఈ విధముగా దేవలునికి **దేవాంగః, మానవాంగః, విశ్వాంగః** అని మూడు విధములైన ప్రఖ్యాత నామములు ఉన్నప్పటికి ఈ మూడు పేర్లలో ఏది తగినదిగా వున్నదని ఆలోచించగా రాక్షసులకన్నా మానవులు ఉన్నతులు. మానవులకన్నా దేవతలు ఉన్నతులు, పుణ్యాత్ములు. కావున అధిక పుణ్యాత్ములు దివ్య స్వరూపులైన దేవతలకే ఇచ్చుట వలనను, మానవులు, దానవులు వారితో సరితూగలేరు కాబట్టి దేవాంగః దేవాంగుడు అని పిలువబడుటయే సముచితముగా వున్నది. అంతేగాకుండా శివుడు కూడా ప్రప్రథమః దేవాంగుడు అని అతని నోటినుంచి మాట వచ్చినది కావున దేవలున్ని దేవాంగుడు అని పిలువబడుటయే సముచితముగా ఉన్నది. దీని ద్వారా ప్రపంచ వ్యాప్తంగా వస్త్రములను ఇచ్చుటద్వారా ఈ దేవల ముని ప్రపంచ వ్యాప్త జనుల గౌరవము పొందినాడు. కావున దేవల చరిత్ర విశ్వములోని సకల జాతుల వారికి సంబంధించిన చరిత్రగా గుర్తింపవలయును. దేవాంగుడు అని పిలువబడినప్పటికి అందరికి సంబంధించిన వాడు అని తేటతెల్ల మగుచున్నది. విశ్వ నాగరికతకు పునాదులు వేసిన వాడు అయినాడు దేవాంగుడు.



# దేవాంగ శంకర వస్త్ర ప్రదానము - నందిధ్వజ బహుకరణ

## పదవ అధ్యాయము

సూత మహాముని ఋషులకు తరువాత కథను చెప్పుచున్నాడు. సకల సంపదలుగల దేవాంగ ముని తన నిజ పట్టణము నందలిసకల జనులకు వస్త్ర ప్రదానము చేసిన తరువాత మిక్కిలి వెల గల దివ్య వస్త్రములను తీసుకొని వెంటనే కైలాస పట్టణమునకు పార్వతీ పరమేశ్వరులను చూడగోరిబయలుదేరి వెళ్ళినాడు. మహా భుజబల సంపన్నుడైన దేవలుడు వెండికొండను చేరినాడు. ఆ కైలాసగిరి మందార వృక్షముల చేతను వ్యాపింపబడియున్నది. నానావిధ దివ్య రత్నములచేత అలంకరిపబడి యున్నది. ఇంకను పొదిరి, సంపంగి, అశోక, పొన్నగడ, శ్రీ గంధ మొదలగు వృక్షములతో విరాజిల్లు తున్నది. అచట ఇంకనూ మొల్ల తీగలతో, బండి గురువింద తీగలతో, మల్లె తీగలతో వ్యాపింపబడి బంగారు భూములతో శోభిల్లుచున్నది. అంతేగాకుండా ముత్యములు, గోమేధికములు, వైఢూర్యములు, కెంపులు మొదలగు దివ్య నవ రత్నముల కాంతులతో ఆ వెండికొండ ప్రకాశించుచున్నది. బహు సుందరమైన తోటలు గలిగి చూడ ముచ్చటను గొలుపు చున్నవి. ఆ తోటలయందువున్న అనేక పక్షుల కిలకిలారావములు వీనుల విందుగా వున్నవి. నాగకేసర పుష్పముల మీద తుమ్మెదలు ఎక్కి కదలకుండా వుండుటను చూచుచున్నచో మన్మధునికి శత్రువైన శివుని స్థానము కావునఆ తుమ్మెదలు ఎక్కడబడితే అక్కడ సంచరించకుండా అక్కడక్కడ సంచరించి ఊరుకున్నవి అనునట్లుగా వున్నది. ఆ వెండికొండ యందు కమలములచేతను, కలువలచేతను బాగా వ్యాపించివున్న అనేక సరస్సులు కలవు. ఆ సరస్సుల యందు హంసలు కల్నేటి పక్షులు, నీరు కోళ్ళు పుష్కలంగా వున్నవి. మదించిన ఆడుతుమ్మెదలు ఝంకారము చేయుచుండగా ఆ సరస్సులు మిగుల సొగసుగా వున్నవి. తేనె అంతయు సమసిన కమలములను తుమ్మెదలు కొరుకుచుండగా ఆ తుమ్మెదలు వికసించిన కమలముల నిమిత్తము తమ రాజైన మన్మధుడు త్రిపురములను దహించిన సాంబ శివునిచేత దహింపబడెను. మీరు భయపడక యున్నారని వాని గర్వము



నశించునట్లు శిక్షించుచున్నవి కాబోలు అను విధముగా వున్నవి. అవి ఆ సరస్సులయందు వుండు తామరాకుల మీద నీటి బిందువులుపడుట అనునది ఆకాశ గంగ సాంబశివుని శిరస్సున పడు నీటి బిందువులుగా కనబడుచున్నవి. అచ్చట ఇంకా అనేకములైన మిక్కిలి సొగసైన సరస్సులు వ్యాపించి వున్నవి. వెండికొండ పొడవుగా నుండుటను చూచి దేవాంగముని సంతోషముచెంది ఆ కొండపై కొంత దూరము వెళ్ళినాడు.

### శివుని అంతఃపురము

అచ్చట ఎల్ల దేవతలకు దేవుడైన శూలాయుధము ధరించివుండువాని ఇల్లును చేరినాడు. త్రిశూలధారియైన శంకరుని గృహము బంగారు ప్రహరీ గోడలచేత ప్రకాశించుచున్నది. దర్వాజాలు మణులతో చేయబడినవై ప్రకాశించుచున్నవి. ఆ గృహము (మేడ) చంద్రకాంత మణుల చేత కట్టబడినది. నానావిధ రత్నములతో కట్టబడిన బురుజులును బంగారు దర్వాజాలతోను ప్రకాశించుచున్నది. పగడముల చేతను వైఢూర్య మణుల చేతను సాటిలేని విధముగా దర్వాజాలు ప్రకాశించుచున్నవి. దర్వాజాపై కప్పివున్నవి అన్నియు పుష్యరాగ మణుల పలకలు గనుక మిక్కిలి కాంతి గలిగి వున్నవి. స్థంభములపై వున్న పీఠములన్నియు గోమేధికములచేత తయారు చేయబడినవి. స్థంభముపై పీఠము క్రిందనుండి నవ రత్నములు చేత అలంకరింపబడివున్నవి. ప్రాసాదానికివున్న వున్న బంగారు గోడలయందు అమర్చబడివున్న దివ్యములైన నవరత్న ఖచితములు పలు విధములుగా కాంతులను వెదజల్లు చున్నవి. భవనమునందు సువాసన ద్రవ్యములచేత పొగ వేయుటవలన ఆధూపముల వాసన భవనము అంతటా వ్యాపించియున్నది. కస్తూరితో భవనము అలకబడినదిగా వున్నది. ఆ భవనమునుండి వెలువడు కాంతులు సూర్య చంద్రులను అటుండండి అనినట్లుగా వున్నది. ఆ విధముగా వున్నది సాంబశివుని కచేరి భవనము. ఇట్టి అందచందాలతో భవనము అలరారుచున్నది అది. ఆ కచేరి భవనమునందు సాంబశివుడు అష్ట దిక్పాలకులచేతను, ఏకాదశ రుద్రుల చేతను, ద్వాదశ ఆదిత్యుల చేతను, అష్ట వసువుల చేతను, సమస్త దేవతల చేతను, సిద్ధులు, చారణులు, గంధర్వులు, విద్యాధరులు, ఉరగులు, కిన్నరులు, గరుడులు, యక్షులు, సనకసనందనాది బ్రహ్మ మానస పుత్రులగు

ఋషీశ్వరుల చేతను, సాధ్యుల, కింపురషుల, దేవ వేశ్యా సంఘముల చేతను, కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, జాబాలి, జమదగ్ని, వశిష్టుడు, శకుడు, హారీతుడు, వామదేవుడు, పరాశరుడు, కణ్వుడు, కుత్సుడు, శతానందుడు, సైద్యుడు, గౌతముడు, శక్తిశాండిల్యుడు, చ్యవనుడు, ఉద్ధాలకుడు, భృగువు, అగస్త్యుడు, పులస్త్యుడు, మార్కండేయుడు, ఔర్వుడు, దూర్వాసుడు, విశ్వామిత్రుడు మొదలగు మహర్షులచేత సేవింపబడుచూ పార్వతీదేవితోడ రత్నమయమైన సింహాసనమందు కూర్చున్న సకల లోక శుభకరుడు అగు మహేశ్వరుడుని కుమారస్వామి, గణపతి, వీరభద్రుడు మరియు ప్రమథ గణములు, బెత్తము చేతబట్టుకొని వున్న నందీశ్వరుడును మొదలగువారు సేవించుచుండగా చూచి దేవాంగ ముని సంతోషం చెందినాడు. ఎల్ల సుఖములకు కారణుడును, దేవతలకెల్ల మహాదేవుడైన ఆ పరమేశ్వరునికి సాష్టాంగ నమస్కారముతో వుండి స్తోత్రము చేసినాడు దేవలుడు.

## దేవలుడు చేసిన శివస్తోత్రము

దేవలుడు చేసిన స్తోత్రము ఎట్టిదనగా మంగళ స్వరూపుడును అయి శుభములను కలుగజేయునట్టియు, జ్ఞాన స్వరూపుడైనట్టియు, చంద్రున్ని శిరస్సునందు ధరించనట్టియు, జగత్తులకు ఉత్పత్తి స్థానమైనట్టియు, నొసట కన్నుగలయట్టియు, మన్మధునినశింపజేసినవాడవు మృడుడు అను పేరు గలవాడవు, భక్తులను రక్షించువాడవు, భోగములకు, మోక్షములకు ప్రభువైన వాడవు, శూలాయుధమును చేతధరించిన వాడవు అగు ఓసాంబమూర్తీ! నీకు నమస్కారము చేయుచున్నాను. దేవతల రాక్షసుల ప్రభువులు నీ కాళ్ళ మీద పడి నమస్కారము చేయగా వారి కిరీటములయందలి రత్నకాంతుల పరంపరచే ప్రకాశించుచున్న పాదకమలములు గలవాడా, పార్వతికి ఇష్టుడైనవాడా, పుణ్యమును కలుగజేయునట్టి దేహమును ధరించినవాడా సూర్యుడు, చంద్రుడు, అగ్నియు అను మూడు నేత్రములు కలిగినవాడా, శ్రేష్ఠసర్పరాజములను చేతులకు కడియములుగా ధరించినవాడా, దక్షప్రజాపతి యజ్ఞమును ధ్వంసం చేసినవాడా, చర్మమును వస్త్రముగా కట్టుకున్న వాడా! నీకు నమస్కారము చేయుచున్నాను. ప్రపంచంయొక్క ఉనికికి, ప్రళయమునకు, సృష్టికి కారణమైనట్టియును, దేవేంద్రునిచేత మహావిష్ణువు చేత బ్రహ్మచేత పూజింపబడువాడా, నిష్కలంక



స్వరూపుడా, త్రిపురములను నశింపజేసినవాడా, మేరుపర్వతమును విల్లుగా ధరించినవాడా, జయములను పొందువాడా, గజాసురుని సంహరించినవాడా, జటాజూటము కలిగినవాడా! నీకు నమస్కారము. పరిశుద్ధమైన చంద్రకాంత మణులతో కట్టిన మేడయందు బంగారు పీటపై కూర్చుండి ఆనందించునట్టి పార్వతీ దేవియొక్క నర్మ గర్భ వాక్యములయందు ప్రేమగల అంతఃకరణములు గలవాడా, మంచి పరిమళ ద్రవ్యముల చేత ఘుమఘుమాయించుచున్న శ్రీ గంధమును దేహమందు అద్ది దివ్యములగు పుష్ప మాలికలచేత ప్రకాశించుచు దివ్యములగు వస్త్రములను ధరించియున్న దివ్యదేహము గల నీకొరకు మాటిమాటికి నమస్కారము చేయుదును గాక. ధగధగమని ప్రకాశించుచున్న కాంతులుగల రత్నమయములైన గోడలచేత ప్రకాశించుచున్న తన గృహము నందు (కచ్చేరి) ఉన్నతమైన వజ్రపుపీట నడుమనున్నట్టి పార్వతితో కూడియుండుటయు, భూతసంఘముచే పొగడబడినట్టియు, ప్రపంచమే విగ్రహముగా గలవాడైవున్న నీకు నమస్కరించుచున్నాను. సాయంకాలమునందు నృత్తము చేయగా జడలు కదిలి వాని లోపలి గంగ ప్రవేశింపగా బ్రహ్మ వాహనమైన హంసకు వర్షము వచ్చునను భయము కలుగుచున్నదియు, దేవతా స్త్రీలు చంద్రకాంతమణుల కోట బురుజులయందు కూర్చుండి వుండగా ఆ సాంబమూర్తి శిరస్సునవున్న చంద్రుని కిరణములు ప్రసరించి ఆ చంద్రకాంత శిలలు చల్లగా నీటిని స్రవింపగా ఆ దేవతల స్త్రీల శ్రమము మాన్పుచున్నట్టి సాంబశివునికి నమస్కారము చేతును. దేవాంగముని సాంబమూర్తికి ఈ ప్రకారముగా స్తోత్రము చేసినాడు.

## పార్వతీ పరమేశ్వరులకు వస్త్ర ప్రదానము

శివ స్తోత్రము చేసిన పిమ్మట సాంబశివునికి మంచి దివ్యములైన చిత్రవిచిత్ర వర్ణములై వున్న వస్త్రములను, నానావిధములైన దోవతులను మహానుభావుడైన ఈశ్వరునికి భక్తితో సమర్పించినాడు. అప్పుడు సాంబమూర్తి దివ్యములైన ఆ వస్త్రములను చూచి సంతోషించెను. దేవాంగమునిని ముందుగా పార్వతీ పరమేశ్వరులు సత్కరించి అనంతరము వారు దివ్యవస్త్రములను ధరించినారు. పార్వతీపరమేశ్వరులు ఇద్దరు ధరించి అలంకారము పొంది మిక్కిలి సంతోషించినవారైరి. దేవలున్ని మెచ్చుకొనిరి. తరువాత దేవలుడు

గణపతి వద్దకు వెళ్ళి అతనికి దివ్యమైన దుకూల వస్త్రములను ఇచ్చినాడు. భృంగి మొదలగు ప్రమథ గణముల వారికి వారు కోరిన వస్త్రములను ఇచ్చెను. తరువాత ఆమోదపట్టణమును రక్షించుచున్న దేవలరాజు మిక్కిలి విలువగలిగిన వస్త్రములను తీసుకొని సాంబమూర్తి అనుమతి తీసుకుని అంత:పురములోనికి వెళ్ళి మహాదేవియైన భద్రకాళీదేవికి ఎఱ్ఱని వస్త్రములు ఇచ్చెను. కుమారస్వామి భార్యకు తెల్లటి వస్త్రములను ఇచ్చెను. తరువాత సకల సంపదలు గల ఆ దేవలుడు తనకు ముఖ్యదేవత అయిన చౌడేశ్వరీ కొరకు వస్త్రములు ఇవ్వవలయునను బలీయమైన కోరికగలిగి షడ్గుణైశ్వర్యములతో విలసిల్లుచున్న ఆ చౌడేశ్వరీ మహాదేవిని మనస్సునందు తలచెను. అతడు మనస్సున తలచిన వెంటనే దేవి పరాశక్తి అయిన చౌడేశ్వరీ అతి వేగముతో వచ్చినది. అట్లు వచ్చిన చౌడేశ్వరీ దేవిని దేవాంగముని మిక్కిలి సంతోషముతో అనేక విధములుగా స్తోత్రము చేసి వినయముగలవాడై చేతులు జోడించి ఆమెను గూర్చి మాటలాడెను. అమ్మా చౌడేశ్వరీ సకల లోకముల వారికి మంగళములు కలుగజేయుదానా నీ అనుగ్రహము వలన నేను పలువిధములైన దివ్య వస్త్రములను నేసితిని. మూడు లోకములయందు వున్న వారందరికీ వస్త్రములను ఇచ్చినాను. భక్తులయందు ప్రేమగల ఓ దేవీ, దివ్యములైన నానా వర్ణములుగా వున్నటువంటి ఈ వస్త్రములను నేను భక్తితో మీకు సమర్పించుచున్నాను. నా యందు దయ కలిగి వాటిని ధరించుము తల్లీ అని చెప్పి దేవలుడు వస్త్రములను ఇచ్చెను. ఆ పరాశక్తి చౌడేశ్వరీ దేవి మిక్కిలి సంతోషము కలిగి యుండి ఆ వస్త్రములను గ్రహించి దేవలునికి శుభమగుగాక అని చెప్పి అంతర్ధానమయ్యెను ఋషిశ్రేష్ఠులారా అని సూతముని చెప్పినాడు. అప్పుడు శౌనకాది మునులందరూ సూతమహర్షిని అడిగినారు. మాకు ఒక సందేహము కలిగినది. దేవలుడు శివుడి కచేరీ యందు శివునితో పాటు పార్వతీ దేవికి కూడా అచటనే అందరి సమక్షములో వస్త్రములను ఇచ్చినాడు గదా మరి ఇప్పుడు చౌడేశ్వరీదేవిని ప్రత్యేకముగా పిలిచి ఆమెకు వస్త్రములు ఇచ్చినాడు. పార్వతీదేవియే లోక సంరక్షణార్ధము, భక్తుల సంరక్షణార్ధము అనేక రూపములతో అవసరమును బట్టి అవతారములు ఎత్తి దుష్టశిక్షణ గావించి తద్వారా లోకరక్షణ చేసి అనంతరము ఆమె యదార్ధ రూపమునకు వచ్చును గదా! చౌడేశ్వరీదేవి పార్వతీ దేవియొక్క అవతారమే గదా. ఆ పార్వతీదేవికి కచేరీలోనే వస్త్రములు



ఇచ్చెను గదా. ప్రత్యేకంగా చౌడేశ్వరీదేవికి మరలా ఇంకొకసారి ఇవ్వటము ఏమిటి. ఇది అంతయూ పరిశీలించుచుండగా పార్వతీ దేవి వేరు. చౌడేశ్వరీ దేవి వేరు అను భావం కలుగుచున్నది. వీరిద్దరూ ఒక్కరే అయితే దేవలుడు రెండుసార్లుగా వస్త్రములు ఎందుకిచ్చినట్లు. ఈ విషయమై మాకున్న సందేహమును తీర్చవలయును అని మునులందరూ ఏకకంఠంతో కలిసి అడిగినారు. అప్పుడు సూతమునీశ్వరుడు ఋషులతో ఈ విధముగా చెప్పసాగెను.

మీరు తలచినట్లుగా పార్వతీదేవి, చౌడేశ్వరీదేవి వేరువేరు కాదు. పార్వతీదేవియే చౌడేశ్వరీ. ఇద్దరు దేవతలు విడివిడిగా లేరు. కావున లోక సంరక్షణకొరకు ఆదిపరాశక్తి అనేక అవతారములను కలిగి వుంటుంది. అంతేగాని వేరువేరు కాదు. కాని దేవలుడు కచేరిలో అందరిముందు పార్వతీ పరమేశ్వరులకు వస్త్రములు ఇచ్చినాడు. కాని తనను రాక్షసుల బారి నుండి కాపాడిన ఆ పార్వతీదేవి ఏ అవతారములో వచ్చినదో ఆ అవతారముతోనున్న దేవికి కూడా వస్త్రములు ఇవ్వాలి అని అతని సంకల్పము. అందుచేత వజ్రముష్ట్యాది పంచరాక్షసులను సంహరించుటకు అమ్మవారు మహాభీకరమైన అవతారము ఎత్తి తనను రక్షించినది కావున దేవలుడు ఆ రూపములో ఉన్న శక్తిస్వరూపిణి అయిన పార్వతీదేవికి విడిగా ఇవ్వాలని సంకల్పించినాడు ప్రత్యేక కృతజ్ఞతాభావంతో. అంతేతప్ప పార్వతీదేవియే చౌడేశ్వరీ దేవి, చౌడేశ్వరీదేవియే పార్వతీదేవి. ఈ ఇద్దరుగా కనపడుచున్నది ఒకేఒక శక్తి పార్వతీదేవియే. అందువల్ల మీకు కలిగిన ఈ సందేహమును తొలగించుకొనవలయును అని సూతులవారు మునులకు విశదముగా చెప్పినాడు. అప్పుడు శౌనకాది మునులు మిక్కిలి సంతోషించినారు. ఆ తరువాత ఆ దేవలరాజు కైలాసపర్వతమున వున్న కన్యలందరికీ వారు కోరిన విధముగా వారికి వస్త్రములను ఇచ్చి వారిని సంతోషపరచినాడు. తరువాత శివుని ద్వారపాలకులుగా వుండెడి చండుడు,ప్రచండుడు అనువారలకు ఒకరికి ఎఱ్రనివస్త్రము, మరొకనికి తెల్లని వస్త్రమును దేవాంగుడు ఇచ్చినాడు. తరువాత మనస్సులో శివున్ని ధ్యానించెను. శివుని ఆజ్ఞమేరకు శివుని కొలువుకూటము వద్దకు దేవలుడు వచ్చెను. అప్పుడు సాంబశివుని ఎదుట కృతస్థల, ఊర్వశి, రంభ, మేనక, పుంజికస్థల, తిలోత్తమ

మొదలగు అప్సరస స్త్రీలు నాట్యము చేయుచుండిరి. ఆ అప్సరస సంఘములు నృత్యము చేయుటవలనను అందలి కులుకులను ఆయా రసభావములకు తగిన విధముగా సరియైన స్వరముతోగల పాటల చేతను, సహజసిద్ధమైన వివిధ నాట్యభంగిమలను అభినయములను చూచి ఆ సాంబశివుడు సంతోషపడినాడు. అప్పుడు శివుడు అప్సరస స్త్రీల నాట్యకౌశలమునకు మెచ్చుకొని వీరికి కూడా వస్త్రములు ఇవ్వవలయును అను ఆలోచనతోకూడి దేవలుని వైపు చూడగా దేవలుడు శివుని అంతరంగమున వున్న కోరికను గ్రహించినవాడై ఆ అప్సరసలకు కూడా మిక్కిలి మేలైనవి, చిత్రవిచిత్రములైన వస్త్రములను అప్పటికప్పుడు నేసి వారికిచ్చినాడు. దేవలునియొక్క అత్యాశ్చర్య జనకమైన ఈ కార్యమును చూచి ఇంద్రుడు మొదలుగాగల దేవతా సంఘముల ఎల్లవారు ఆశ్చర్యపడిరి. అప్పుడు దేవతలకు దేవుడైన శివుడు దేవలుని చేతిలోని వస్త్రములను గ్రహించి ఇంద్రుడు మొదలగు దేవతలందరికిని, ఋషులు, గంధర్వులు, సిద్ధులు మొదలగు వారికిని వరుసగా ఇచ్చినాడు. తరువాత అప్సరస స్త్రీలందరికీ ఇచ్చి వారిని సంతోషపరచెను.

## వృషభధ్వజ బహూకరణ మరియు దేవాంగ వివాహ నిర్ణయము

తరువాత శంకరుడు దేవాంగ ముని కొరకు **మంచి చక్రమును** ఇచ్చినాడు. శత్రు సంహారకరమైన శక్తి కలిగినటువంటిదైన దివ్య వృషభ ధ్వజమునిచ్చెను. అప్పుడు భక్తిచేత దివ్య వృషభ ధ్వజమును గ్రహించినాడు దేవలుడు. దేవాంగముని నీవు సకల శత్రువులను నశింపజేసే ఈ నంది ధ్వజముచేత మూడు లోకములయందున్న వారిని జయించగలవు. సర్వకాలములయందు సుఖమును పొందుదువు. ఇట్లు స్వామివారు శెలవివ్వగా వెంటనే దేవలుడు అట్లే అని శివునికి తన అంగీకారమును తెలిపినాడు. అప్పుడు భక్తులయందు ప్రీతిగల ఆ సాంబశివుడు లోకములన్నిటినీ ప్రకాశింపజేయుచూ మిక్కిలి తేజోవంతుడై వున్న సూర్యుని చూచి ఒక మనోహరమైన మాట చెప్పినాడు. అది ఏమిటంటే ఓ సూర్యుడా నీ తోడబుట్టినది కీర్తివంతురాలైన దేవదత్త అను కన్యను మిక్కిలి శౌర్యపరాక్రమము గల ఈ దేవాంగ రాజఋషికి ఇచ్చి వివాహం చేయుము అని దేవతా సార్వభౌముడైన సాంబశివుడు చెప్పగానే తన అంగీకారమును తెలుపునట్లు తల ఊపినాడు సూర్యుడు. మిక్కిలి



సంతోషము చెందినవాడై శివునితో ఈ విధముగా చెప్పినాడు. ఓ షడ్గుణైశ్వర్య సంపన్నుడవై దేవతలకే దేవుడవైన ఓ శంకరా ఇప్పుడు మీరు ఏ రీతిగా చెప్పినారో అదే విధముగా నేను నా చెల్లెలు దేవదత్త అను కన్యను దేవాంగ రాజఋషికిచ్చి పెద్దల సమక్షమములో వివాహము జరిపించెదను. మీరు అన్నమాటే నా మనసులో కూడా వున్నది. మీ సంకల్పం వలన నా కోరిక నెరవేరుచున్నది. ఈ విధముగా సూర్యుడు చెప్పగానే ఆ కచేరిలో వున్నవారందరూ బాగు బాగు చాలా సంతోషము అని పలికినారు. తరువాత పార్వతి దేవి కూడా సూర్యునితో అదేవిధముగా చేయుము అని చెప్పినది. తాను చెప్పిన మాటకు సూర్యుడు తన సంతోషము వెళ్ళబుచ్చుతూ తన చెల్లెలు దేవదత్తను దేవాంగునికిచ్చి వివాహం చేస్తానని చెప్పగానే శివుడు మిక్కిలి సంతోషించినాడు. ఇంద్రాది దేవతలందరూ తథాస్తు తథాస్తు తథాస్తు అని దీవించినారు. అయితే షడ్గుణైశ్వర్య సంపన్నుడైన శివుడు తన కచేరీలో వున్న రాక్షసులకు తప్ప మిగతా వారందరికీ వస్త్రప్రదానము చేసి పార్వతితోడ అంత:పురమునకు వెళ్ళెను. తరువాత స్వామి సేవా నిమిత్తము అక్కడకు వచ్చిన వారందరూ తమతమ ఇండ్లకు పోయిరి. పిమ్మట దేవాంగరాజు తన ఆమోదపట్టణమును గూర్చి బయలుదేరెను.



# దేవాంగునికి రంభ శాపమిచ్చుట

## పదకొండవ అధ్యాయము

పరమేశ్వరునినుండి సెలవు పుచ్చుకొని తన నిజ పట్టణమైన ఆమోదపట్టణమునకు వెళ్ళుటకు కైలాసపర్వతము నుండి బయలుదేరినాడు దేవలుడు. మార్గమధ్యములో ఒక అందమైన కొలనును చూచినాడు. తన ఆహ్నిక అనగా సంధ్యావందనాది పనులు చేయుటకు ఇది అనుకూలముగా వున్నదని భావించి కొలను దగ్గర నిలచినాడు దేవలుడు. సహస్రదళములు అనగా వేయి రేకులగల కమలములతో ఆ కొలను నిండివున్నది. ఆ కమలములు మిక్కిలి సుందరముగానున్నవి. కొలనులో రాజహంసలు విహరించుచున్నవి. ఆ జలము మిక్కిలి మనోహరమై నిర్మలముగా ఉన్నది. ఆ సరస్సు చుట్టును మంచి మ్రానులుగల వృక్షములు గలిగి పుష్పములతోను, పండ్లతోను నిండియున్నవి. శివపూజ చేయుటకు ఇది తగిన ప్రదేశముగా ఉన్నదని ఆ కొలనులో స్నానముచేసి శుచుడై తామరపూవులను గ్రహించి వాటితో దేవదేవేశ్వరుడైన ఈశ్వరునిని మిక్కిలి భక్తితో పూజించినాడు. తరువాత తన ఆమోదపట్టణమునకు తిరిగి బయలుదేరినాడు. దేవాంగుడి సుందరాకారమును చూచి మహా మోహమును పొందినది రంభ.

## రంభ సౌందర్యము

రంభ త్రిలోకసుందరి. ఆమె మిక్కిలి సొగసులకత్తె, వయ్యారిభామ. అప్సరస స్త్రీలందరిలో నాట్యమునందు మిన్న. ఆమెనుచూచి మహాతపస్సంపన్నులు సైతము ఆమె మోహములో పడేటంతటి సుందరాంగి. అటువంటి రంభ శివుని కచేరీలో దేవలున్ని చూచిన మొదలు అతనిపై మనసు పడినది. అందువలన దేవలుడు ఏకాంతముగా ఎచ్చట లభించునా అని ఎదురుచూచుచున్నది. సరిగ్గా ఇదే అదను అనుకొని తన కోరికను తీర్చుకొనుటకు ఇది సమయమని, తన కోర్కెను దేవలునికి వినిపించుటకు సరియైన ప్రదేశమని రంభ భావించి ఈ కొలను వద్దకు చేరినది. తన నిత్య పూజలు చేసుకొని తన దారిన తాను పోవుచున్నాడు దేవలుడు. రంభ ఆ



కొలను వద్ద వేచివున్నది అను విషయమును దేవలుడు గుర్తించలేదు. ఏకాంత సమయం కోసం ఎదురుచూచిన రంభ వెంటనే దేవలునికి కనపడి అతని దగ్గరకు వచ్చినది. సొగసులకత్తె, రసికజన మనోహరి, రతిసౌఖ్యానికి పట్టుగొమ్మ, అందానికి మారుపేరైన రంభ యొక్క పెదవులు దొండపండువలె ఎర్రగా, మృదువుగా మనోహరంగా వున్నవి. కన్నులు కాటుక పిట్టవలె వున్నవి. ఆమె మొఖము పూర్ణిమనాటి చంద్రునివలె ప్రకాశవంతముగా వున్నది. ఆమె జడ నల్లటి మేఘమువలె నున్నది. ఆమె చెవులు చక్కొలాలవలె వున్నవి. ఆమె కనురెప్పలు ధనస్సువలె అనగా అల్లెత్రాడువలె ఒంపు తిరిగి వున్నవి. ఆమె చూపులు బాణముల వలె తీక్షణమై వున్నవి. చెక్కిళ్ళు అద్దము వలె వున్నవి. దంతములు దానిమ్మ పండు విత్తులవలె సుందరముగా వున్నవి. ముక్కు నువ్వు పువ్వువలె వున్నది. ఆమె నొసలు అర్ధచంద్రాకారము వలె నున్నది. అధరము (పెదవి) పండిన దొండపండు వలె వున్నది. మెడ శంఖము వలె సుందరముగా వున్నది. ఆమె స్థనములు బంగారు కలశముల వలె వున్నవి. చేతులు లేత చిగుళ్ళువలె వుండినవి. భుజములు పవడపు తీగలవలె వున్నవి. ఆమె ఉదరము హృదయముకన్న లోపలి వైపుకు ఉన్నది, ఆమె నడుము ఆకాశతుల్యముగా వున్నది. వీపు తాబేటి చిప్పవలె విశాలముగా వున్నది. ఆమె నాభి (బొడ్డు) పుట్ట రంధ్రమువలె లోతుగా మనోహరముగా వున్నది. ఆమె తొడలు అరటిస్థంభములవలె నున్నవి. పిరుదులు ఇసుక దిన్నెలవలె నున్నవి. ఆమె చీలమండలు తెలియకుండా అనగాకనబడకుండావుండునట్లు చర్మము బలిసి దానిని క్రమ్ముకొని వున్నవి. పిక్కలు తారలవలె వున్నవి. ఆమె అడుగులు కమలములవలె ప్రకాశించుచూ సుందరమైన రూపము కలవై యున్నవి. ఆమె దేహము మెరుపు తీగవలె నుండి కృశాంగియై మిక్కిలి సంతోషము కలిగియున్నది. అప్పుడు చెవులయందు ధరించిన రత్నమయమైన కమ్మల కాంతులు చెక్కిళ్ళల (బుగ్గల) యందువ్యాపించుటచే అవి తళతళలాడుచున్నవి. ముక్కునకు ధరించిన బేసర (బులాకి) తొంగళమునకు వేసిన ముత్తెము కదలగా ముక్కు ప్రకాశించుచున్నది. ఆమె కనులు కదులుచున్నవే గని నిశ్చలముగా ఉండుటలేదు. అప్పుడు ఆమె చిరునవ్వు నవ్వగా దంతములయొక్క తెల్లని కాంతి వెన్నెలవలె ప్రకాశించి ముఖము మిక్కిలి కళకళలాడుచున్నది. కంఠమున ధరించిన హారములు కదులుచూ భారముగా నున్నవి. అనగా కంఠమునిండా

మంచి మంచి దివ్యమణులతో ప్రకాశించు హారములు కదులుతూ బరువుగా వున్నవా అనునట్లు తోచుచున్నవి. మిక్కిలి శోభాకరమైన పెద్దవైన స్తనములయొక్క భారముచేత ఆమెయొక్క నడుము జవజవలాడుచూ మూడు ముడతలుగా వుండి చూపరుల చూపును మళ్ళించలేక పోవుచున్నవి. మొలనూలు అందెలు (నడుముకు ఉంటవి) చేయు శబ్దము ఆమె కాళ్ళకు ధరించినకాళ్ళ పట్టీల ధ్వని రెండునూ కలిసిపోయి ఒకే శబ్దమును యిచ్చుచున్నవి. ధరించిన వస్త్రమునకు ముందరిప్రక్క జారవిడిచిన చీరకుచ్చెళ్ళ కొనలయందు ముత్యములు గ్రుచ్చబడి తళతళ మెరియు చున్నవి. స్తనములపై వున్న పయ్యద (పైట) కొంచెము ప్రక్కకు తొలగుటవలన ఆమెయొక్క బలిష్ఠములైన స్తనములు తెలియుచున్నవి. తన తళుకుబెళుకు చూపులవలన అతి శీఘ్రముగా మోహింపజేయుచున్నది. దివ్యమైన శ్రీ గంధమును దేహమునకు అలంకరించు కొనుటవలనను దివ్యములైన పూలదండలచేత అలంకరించుకొని సౌందర్యానికి దేవతగా వున్నది.

ఈ విధముగా సర్వాంగ సుందరముగా అలంకరించుకొని మందగమనముతో వయ్యారి నడకతో దేవలుని కడకు వచ్చినది. రంభ మన్మధ క్రీడకు పెన్నిధిగా వుండు విధముగా బహు సుందరముగా వున్నది. చూపులతోనే మైమరచి పోవునట్టి రూపురేఖా విలాసములు ఉట్టిపడుచున్నవి ఆమెలో. అందువలననే అప్సరసలలో అందచందాలకు రంభ పెట్టింది పేరు. ఆమెను ప్రసన్నము చేసికొని ఆమెతో సురత క్రీడ జరపటము మహా అదృష్టంగా భావించెదరు చాలామంది. అందరిని మోహింపజేసి తన వెంట పడేటట్లుగా చేసుకొనే రంభ తనే వేరొక వ్యక్తివెంట పడటం ఎంత ఆశ్చర్యము. మహా సుందరాంగి తనకుతానే వలచి వచ్చినదంటే దేవలుని రూపురేఖా విలాసములకు మిక్కిలి ఆశ్చర్యపోయి వుంటుంది. ఇటువంటి సుందరాకారుడిని ఎప్పటికి చూచి వుండనట్లున్నది. అటువంటి రంభను చూచి దేవాంగముని రంభతో ఈ విధముగా మాట్లాడినాడు. ఓరంభా! నీవు ఇక్కడకు ఎందుకు వచ్చితివి? నీ పని ఏమిటో నాకు తెలుపుము. పూవులబోణి! చెలికత్తెలులేకుండా ఒంటరిగా వచ్చినావు ఏమిటి? నీవు ఇచ్చటకు వచ్చినందువలన నీకు లభించు ఫలమేమిటి? ఈ విధముగా దేవలుడు అడిగినాడు.



## రంభ తన కోర్కెను తెలుపుట

అప్పుడు సుందరమైన ముఖము కలిగిన రసిక సామ్రాజ్ఞి అయిన రంభ తన కాళ్ళబొటన వ్రేలితో నేలపై అటూఇటూరాస్తూ చిరునగవుతో ఈ విధముగా పలుకుచున్నది. ఓ మన్మధుని ఆకారముగల రాజశ్రేష్టుడవైన దేవాంగమునీ! చెప్పుచున్నాము వినుము. ఇంతకు ముందు మిమ్ములను శివుని కచేరియందు చూచినాను. మిమ్ములను చూచిన నాటినుండి నా మనస్సు నీయందు లగ్నమైయున్నది. ఎంత వారించుకున్ననూ నా మనస్సు నీయందే నిలిచి యున్నది. నిన్ను చూడగానే నాలో కామకోరిక చిగురించింది. అది క్షణక్షణానికి రెట్టింపు అవుతున్నది. కావున నీవు నాతో మన్మధక్రీడ జరుపవలయును. ఆ మన్మధ క్రీడ రజితకూజితములతోను, పలు విధములైన భంగిమలతో కూడి నా మన్మధ తాపమును తీర్చుము. నా యొక్క సురతి క్రీడను నీవు ఒక్కసారి అనుభవించుము. బుద్ధిశాలివైన దేవాంగమునీ! ఓ రాజా! నీవు మిక్కిలి దృఢమైన దేహముకలవాడవు. కనుక నీ భుజములతో నా స్తనములను నొరయునట్లు ఒకసారి ప్రేమతో గట్టిగా కౌగలించుకొనుము. ఓ రాజరాజా! నా కోరికను శీఘ్రముగా తీర్చుమని ఈ విధముగా రంభ పలుకుతుండగా వివేకముగల ఇంద్రియ నిగ్రహముగల ఆ దేవలుడు శివశివా అనుచు తన చేతులతో చెవులుమూసుకొనుచు రంభతో ఈ విధముగా చెప్పుచున్నాడు.

## రంభ కోర్కె తగదని దేవలుడు తెలుపుట

ఓ పండితురాలైన రంభా! నన్ను నీవు ఈ విధముగా అడుగరాదు. మంగళమూర్తివైన రంభా! ఎల్లప్పుడును మా వంటివారికి ఇటువంటివి చేయుట తగవు. అందువలన నీవు కోరిన కోర్కెను నేను సఫలము చేయలేను. నేను కామములేని వాడనని నీవుతెలుసుకోలేదా! నీవు నన్ను ఆ విధంగా ఎట్లు అడిగినావు? నీకు స్వర్గలోకములో మిక్కిలి సొగసుకాండ్రు శృంగార రస ప్రియులు కామముగలవారు అచ్చట నీకులేరా? నీవు వారివలన సుఖమును పొందవలయును. మా వంటివారితో పొందుపొందుట విధివ్రాతకు వ్యతిరేకమైనది. ఇటువంటి కార్యము చేయుట వలన నా తేజస్సు నశించును. సత్కర్మములు చేయుటకు లోపము కలుగును. యోగ్యులైన (అనగా

తపస్సంపన్నులకు. ధర్మయుతముగా నడచుకొనువారు) వారికి వేశ్యా స్త్రీ సంగమము పాపమును కలిగించును. పాపమును పెంచునుకూడా. వేశ్య స్త్రీ మిక్కిలి నిందింపబడినది. అనగా సజ్జనులు వ్యతిరేకించునది. దురాచారములుగల వారు మాత్రమే వేశ్యను అనుభవించెదరు. తెలిసిగాని, తెలియకగాని యోగ్యులైనవారు (ధార్మిక జీవనము చేయువారు) వేశ్యా స్త్రీని అనుభవించినయెడల వారు రెండు విధములైన పాపములను పొందెదరు. ఓ రంభా! నీవు వేశ్యా స్త్రీవికనుక నేను నిన్ను గ్రహింపకూడదు. కాబట్టి నా వలన నీకు ప్రయోజనము ఏమీ లేదు. కావున నీవు నీ ఇష్టము వచ్చిన చోటికి వెళ్ళుము. నేను ఇప్పుడు అతి త్వరితముగా ఆమోద పట్టణమునకు వెళ్ళవలసియున్నది. సుందరములైన పిరుదులు కలదానా! నాతో నీ కోర్కె ఏమీ లేదు. నీవు స్వర్గమును గూర్చి వెళ్ళుము అని ఇట్లు దేవాంగముని అనినాడు.

## రంభ దేవలునికి తన విశిష్టతను తెలుపుట

దేవతా స్త్రీ అయిన రంభ వెంటనే కోపముతోకూడి శరీరము మిగుల వణుకునట్లు ఉద్రేకము చెంది, ఓ రాజశ్రేష్టుడా! ఏమంటివి నాకు బలే సమాధానము చెప్పితివి. అయ్యో! బుద్ధిమంతులలో మిక్కిలి శ్రేష్ఠుడవైన దేవలరాజా! నీవుఇట్లు మాట్లాడరాదు. అందరి భోగముల వారితో నన్ను కలిపి మాట్లాడుచున్నావు. ఆ విధముగా నన్ను వేశ్యగా నీవు ఎంచరాదు. ప్రపంచమందుండు వారందరిలో నేను అధిక సౌందర్యవంతురాలను అయిన రంభను నేను వచ్చి వేడుకొనునప్పుడు నీవు ఈ విధముగా మాటలాడవచ్చునా? ఓమహా బుద్ధిమంతుడ వైనవాడా! నేను వేశ్య నని నిందితురాలనని చెప్పితివి కదా! నాతో సంభోగము పొందుటకొరకే పుణ్యవంతులైన వారు యజ్ఞములు చేయుదురు. వారి కోరిక నాతో సుఖభోగములు పొందుటయే లక్ష్యముగా కలవారు. అందుకొరకు వేదములయందు తెలిపిన రీతిగా యజ్ఞములు చేసి మిక్కిలి పుణ్యముపొంది నాతో రమించెదరు. కావున నేనెట్లు నిందితురాలు అగుదును? సుఖభోగములకు ఆలవాలమైన నాతో శృంగార క్రీడలయందు పాల్గొనుటయే పరమావధిగా భావించిన ఋషులు పుణ్యము చేసుకొనిన వారే. పుణ్యము చెసుకొనిన ఋషులే నా సంభోగమును కోరుతూ వుంటుంటే నాతో



కామక్రీడ సల్పుట పాపానికి హేతువు అని అంటున్నావు నీవు. ఇది ఆమోద యోగ్యముగా లేదు నాకు. నాతో కామక్రీడ జరుపుట పాపమైతే పుణ్యము సంపాదించిన వారైన ఋషులు నన్ను ఎందుకు కోరుకుందురు. తపస్సు ఎందుకు చేయుదురు. శాస్త్రములలో యజ్ఞములు ఎందుకు చేర్చుదురు. కావున నీవు అనుకొనినట్లు నన్ను మిగతా వేశ్య స్త్రీలవలె నన్ను పోల్చరాదు. ఎంతో పుణ్యము సంపాదించుకున్న వారికే నాపొందు లభించును. నాతో పొందు పొందుట పుణ్యకార్యముగా వారు భావించెదరు. అందుకై అహర్నిశలు దానికై పరితపించెదరు. నేను మిక్కిలి పరిశుద్ధురాలను, పవిత్రురాలను యజ్ఞఫలముగా నాతో మన్మధ క్రీడ అనుభవించుట వున్నది. కావున దురాచారులే వేశ్యా స్త్రీని కోరెదరు అని అనరాదు. మిగతా వేశ్యలు వేరు. నేను వేరు. నేను పవిత్రమైన దానిని. కాబట్టి యజ్ఞము చేసి పవిత్రులైన వారే నాపొందు కోరుచున్నారంటే నేను పాపాత్మురాలునైతే నన్నెందులకు కోరెదరు. కావున నీవు ఈ విధముగా మాటలాడి నన్ను అవమానింపవద్దు రాజవర్యుడా! మూడు లోకముల యందుండు స్త్రీలలో ఒక్కతైనను నాతో సమానమైన సొగసుకత్తె లేదు. అందువలననే నాతో సుఖించుట కొరకు తపస్సు చేయుదురు. పరాశరుడు, అత్రి మొదలైన ఋషులు వారు తపస్సు చేస్తున్నను నన్ను చూడగానే వారు మనో నిగ్రహము లేనివారై వారు తమ తపస్సును భంగం చేసుకొని నా పొందుకొరకు తహతహలాడుదురు. ఎంతటి కఠినమైన ధృఢదీక్షకలిగి అంకురిత దీక్షతో తపస్సు చేస్తున్నను నన్ను చూడగానే వారి వ్రతములన్నియు ఎటో పోవును. వారిమనస్సు అంతా నిండివుండేది నాతో సుఖభోగాలు అనుభవించడానికే. కాబట్టి మహామహులందరూ ఎదురుచూచే నన్ను దూషించుట మంచిదికాదు. ఒకరా ఇద్దరా అనేక మంది మహాఋషులు తమ తపస్సునే వదిలిపెట్టి నా దగ్గరకు వచ్చుచున్నారంటే నాతో రమించుట తపస్సుకన్నా మిక్కిలి విలువైనది అయితేనే గదా! ఒక్కరూ లేదా ఇద్దరు ఆ విధముగా చేసినారంటే అది వారి అవివేకమువలననో లేక ఇంద్రియ నిగ్రహ సమర్థులు కాకనో అని అనవచ్చు. కాని పెక్కుమంది నాతో రమించుట శ్రేష్ఠ కార్యముగా భావించుచున్నారే మరి నీవు ఒక్కడివే ఇది పాపపు పని అంటున్నావు. నీవు భావించినట్లు ఇతర వేశ్యాస్త్రీ సంగమము పాపముకావచ్చు.

## నాతో పొందు ఒక మహా భాగ్యము

నాతో సంగమము ఒక పవిత్ర కార్యముగా భావింపుము. ఋషులు చేయదగ్గ కార్యమే అని నీవు గ్రహించవలయును. ఓ మన్మధరాజా! ఇటువంటి పవిత్రురాలు మిక్కిలి గొప్పదానను త్రిలోకముల యందు మిక్కిలి సొగసుకత్తెను అయిన నేను నీ పొందుకోరి వచ్చినాను. అందరూ నా పొందు కొరకు వెంపర్లాడతారు. అది ఒక మహాభాగ్యముగా భావించుతారు. ఆ విధముగా నా అందచందాలకు మోహితులు అవుతుంటే అటువంటిదానిని నేనే స్వయముగా నీవద్దకు వచ్చి నిన్ను ప్రార్థించుచున్నాను. నన్ను నీవు ఎందుకు స్వీకరించుట లేదు. నీతోటి పొందు పుణ్యశాలురకే దక్కును గాని ఇతరులకు దక్కునా! నీవు పుణ్యశాలివి కాబట్టి నేను నీవద్దకు వచ్చినాను అను విషయము గ్రహించవయ్యా! పాపాత్ముడవైతే నేను నీవద్దకు వస్తునా? కావున నీవు నన్ను పాపాత్ములు పొందుటకు మాత్రమే అను ఇటువంటి మాట అనరాదు.

## నీతో పొందు సమంజసమే

రాజా! నీవు మిక్కిలి మోహనాకారము కలవాడవు. జయంతుడు, రతీదేవి భర్త మన్మధుడు, వసంతుడు, నలకూబరుడు అను వారుమాత్రమే మహా సుందరాకారులుగాను, సొగసుకారులుగానుమిక్కిలిపేరు ప్రఖ్యాతులు పొందినవారు. కానివీరు ఎవ్వరుకూడా సౌందర్యమునందు నూరు వంతులలో అయిదు వంతులైనను నీతో సరిరారు. నీవు అపురూపమైనఅమోఘమైన బహుసుందరరూపుడవు. మోహనాకారము గలవాడవు. దేవతాపురుషులలో ఎందరెందరినో నేను చూచితిని వారెవ్వరు నీ అందచందాలకు సరిరారు. అందువలననే త్రిలోక సుందరినైన నేను త్రిలోక సుందరుడవైన నీతో పొందుకోరుట సమంజసమే. సమఉజ్జీగా వుంటుంది. లోకము మెచ్చుకొన దగినకార్యమే. త్రిలోకమోహనకారియైన రంభకు అంతకుమించిన సుందరాకారుడుతో సఖ్యత కలుగుట ఈడూజోడూ కుదిరిందని అందరూ మెచ్చుకొనుదురు. కావున నిన్ను తలచి నీకొరకు వచ్చినాను. ఏ స్త్రీ తనకుతానుగా వరించిరాదు. కానినేను నిన్ను వరించివచ్చినందులకు చులకన చేయవలదు దేవలరాజా! నా మన్మధ తాపమును శీఘ్రముగా తీర్చవోయి. నిన్ను చూచినప్పటినుంచి నామనస్సు నిలవడంలేదు. నేనెప్పుడుదేవాంగునిని



చూచెదనా అని విరహాగ్నితో తపించి పోవుచున్నాను. ఈ దేవాంగుడు నన్ను ఎప్పుడు పరిగ్రహించునా అని పదేపదే తలచుచున్నాను. కావున ఇక ఆలస్యం చేయక నీ బిగి కౌగిటిలో నన్ను బంధింపుము. నా కామ జ్వరమును నశింపజేయుము. ఇకఆలస్యం చేయవలదు. నేను నిరీక్షించ లేకపోవుచున్నాను. పడక యందు, నడక యందు, ఉనికి యందు మరియు ఇతర పనుల యందున్నను నామనస్సు అహరహం నిన్నే కోరుతున్నది. నేను నిన్ను చూసి మిక్కిలి కామ వికారము పొందితిని. ఈ బాధనుంచి నన్ను తప్పించు. ప్రతి క్షణం నిన్ను గురించే ఆలోచించు చున్నాను. ఈ విధముగా నా మనస్సును హరించి వేసినావు. నా మదిలో నీవు తప్ప అన్యము ఏదియును లేదు. నేను నిన్ను చూసిన మొదలు నుంచి మన్మధుడు తన బాణములు నాపై ప్రయోగించుచూ నన్ను మిక్కిలి బాధించుచున్నాడు.

## మన్మధుని బాణములు నిప్పులవంటివి

నాకు తెలిసి మన్మధుని బాణములు పూవుల వంటివని అంటారు కాని అవి పూవులు కావు నిప్పులు వంటివి నాకు. అతనితచేత ప్రయోగింపబడిన బాణాలు నాకు కామ జ్వరమును కలుగజేసినవి. ఓ స్వామీ! నన్ను ఆ పాపాత్ముని బాణాలకు గురి చేయనీయవద్దు. శీఘ్రముగా నన్ను పరిగ్రహించు. నా సంతాపమును తీర్చుము. నీ పెదవి యందలి అమృతమును నాకు ఇచ్చి నా మనస్సునందలి తాపమును తీర్చుము. దయకు గని వంటి దేవలుడా! నేను నిన్ను మిక్కిలిగా వేడుకొనుచున్నాను. నీవు నన్ను స్వీకరింపుము. దృఢముగా కౌగలించుకొని నీ దృఢమైన భుజములు కదులునట్లు నీ అంగములో నా అంగములు చేర్చినట్లు గట్టిగా కౌగలించుకొనుము. నా పెదవిని కొరుకుచూ నన్ను పొందుము. మన్మధ కళా స్థానములైన 16 స్థానములను ప్రీతి చెందించుము. ఒకరినొకరు చూచుకొనుట వలన ఇద్దరి దంతకాంతులు ప్రకాశించునట్లు నవ్వుచు నాతో శీఘ్రముగా రమించుము. కామక్రీడ యందు నన్ను ముంచెత్తుము. ఓ మన్మధునితో సమమైన సొగసు కలవాడా! ఓహో! అయ్యో! బ్రహ్మదేవుడు నీ మనస్సును వజ్రముతో చేసినట్లున్నదే! అట్లు కాని పక్షమున రాజా! నేను ఈ విధముగా మిక్కిలి దీనముగా నిన్ను వేడుచున్నను నీకు కనికరములేకుండా పోయినది. మూడు లోకములకు సొగసుకత్తె అయిన

రంభ ఈ విధముగా దీనాతిదీనయై నిన్ను వేడుకొను చున్నను నీకు నాపై కనికరమే లేకపోయెనే. నేను ఇంతగా వేడుకొనుచున్నను నీవు ఒక్కమాటకూడా చెప్పటం లేదు. మూగవలె వున్నావు. ఓ రాజా! మారుమాట నీకు తోచదా. నీ నుండి ఎటువంటి మాటకూడా రాకుండా వుంటున్నదే. ఓహో! నీ మనస్సు మిక్కిలి కఠినము కలది కాబోలు అందువలన నీ నుండి ఎటువంటి మాటరావటం లేదు. నీతో పొందుకు నాకు అంగీకరిస్తావా? లేదా తిరస్కరిస్తావా? ఏదో ఒక మాట చెప్పుము. నా దారిన నేను పోయెదను. ఈ విధముగా రంభ దీన వదనయై పలికినది. అప్పుడు దేవల మునీశ్వరుడు చిరునగవు నవ్వుచూ రంభకు సమాధానము చెప్పసాగెను.

## దేవలుడు ఈ దేహము దుఃఖదాయకం అనిచెప్పి రంభను తిరస్కరించుట

ఓ సొగసైన కనుబొమ్మలు కలదానా! నీకు నేను ముందే సమాధానము చెప్పితిని. ఇప్పటికిని నీవు ఎన్ని విధములుగా వేడుకొన్నను నా మనస్సు ఇటువంటి కార్యము చేయుటకు ఇష్ట పడదు. ఈ దేహము మలమూత్రములకు పుట్టిల్లు. ఈ శరీరము మిక్కిలి నిందితమైనది. మెదడు, మాంసము, ఎముకలు, నరములు, రక్తము, రజ్జువు, ప్రేగులు, పులిసిన నీరు వీనియొక్క సమూహమే ఈ శరీరము. ఈశరీరమునకు తొమ్మిది రంధ్రము లున్నవి. ఈ తొమ్మిది రంధ్రములనుండి నిరంతరము మలము విసర్జన జరుగుతుంది. అందువలన ఈ దేహము అపవిత్రమైనది. రోగములు ఈ దేహమునకు సర్వ సాధారణముగా కలుగుచుండును. దాని వలన విపరీత బాధను, క్లేశమును పొందుచుంటాము. ఈ శరీరము ఇతరులచేత దర్శింపదగినది కాదు. అనగా నిరంతరము చెమట మొదలగు కలుషితము ఈ శరీరమునుండి బయటకు స్రవింపబడుచుండును. ఈ దేహము నిత్యమైనది కాదు. నిరంతరము క్షీణించు, నశించు స్వభావము కలదిగా వుండును. ఈ శరీరము జీవునకుభారముగా తోచును. జీవుడు నిరంతరము ఆలోచన పడును. జీర్ణావస్థలో వున్న శరీరము సౌఖ్యాన్ని కలిగించడానికి బదులుగా మిక్కిలి బాధను కలిగించి జీవితముపై విరక్తి భావము కలిగించును. అడుగడుగునా వివిధ రోగములతో కూడిన ఈ శరీరము సౌఖ్యదాయకమైనది కాదు. ఇది కీడు, దుర్భరముగాకూడ తోచును. అందువలన



ఈ దేహమునకు ఒక స్థిరమైన సుఖము లేదు. అందువలన ఈదేహముద్వారా జనించు అల్ప సుఖములకు బుద్ధిమంతుడైన వాడు ఎవ్వడూకోరుకోడు. ఈ దేహము వలన పొందు నానావిధ రోగములు వృద్ధాప్యము ఇటువంటివి వుండుటవలన ఈ దేహము ద్వారా వచ్చు సుఖములను వివేక జ్ఞానవంతులు ఆసక్తి చూపరు. అంతేగాకుండా మరలా పాపము పెరుగుటకు అవకాశముండును. అందువలన ఈ దేహ జనిత సుఖములను అవశ్యం విడువదగినవి. ఈ దేహముపై మమకారాదులు వుంచుకొనరాదు.

## పరస్త్రీపై మమకారం నిందితమైనది

ఏ దుష్టుడో తెలివి లేకనో ఎవరైనా తన భార్యను కాదని అన్య స్త్రీని కోరుకొనును. అటువంటి పురుషుడు అనేక జన్మలయందు చేసియున్న పుణ్య కర్మలన్నియు నశించును. అన్య స్త్రీని కోరిన తెలివిమాలినవాడు పాపములను సంపాదించుకొని అనుభవించకూడని వంటిదైన నరకమును పొంది యమ ధర్మరాజు భటులచేత బాధింపబడుదురు. ఎవ్వడు దుష్టబుద్ధి కలిగి మోహమును నిగ్రహించుకోలేక అన్య స్త్రీని కౌగిలించుకొనునో అనగా అతడు ఇంతకంటే మించిన సుఖము లేదని కదా! భావించుచు కౌగిలించుకొనినాడు. అటువంటి వాడు ఈ లోకమునందు సత్కర్మలు చేయుటకు పనికిరాడు. అనగా అర్హత లేనివాడైవుండును. తరువాత యమభటులచే ఆ పురుషుడు బాగుగా కాల్చిన ఇనుమును స్త్రీని ఆలింగనముగా చేసుకొనిన విధముగా కాల్చిన ఇనుమును ఆలింగనము కఠినంగా చేయించెదరు. ఏ బుద్ధిహీనుడు చేయగూడనిది అయిన అన్యస్త్రీ సంపర్కమును ఆలోచింపక మద గర్వముతో ఇతరులకు బాధను కలిగించునైన ఈ పనిని చేయునో అట్టి పురుషుడు యమ భటుల చేత త్రేళ్ళచేత నిండియుండుబొక్కలో అతనిచేతిని బలవంతంగా పంపించి త్రేళ్లచే కుట్టిపించి దుఃఖించమని బాధింతురు. ఎవడు అన్య స్త్రీలను ముద్దు పెట్టుకొనునో (చుంబనము) అట్టివాడు యమ కింకరులచేత భయంకరములైన విషములతో నిండిన కౄరమైన పండ్లు కల ఆడ సర్పములను ముద్దు పెట్టుకొమ్మని బాధింతురు. కామమచేత మైకము కమ్మిన తెలివి తక్కువ వాడు అన్య స్త్రీలను కామభావంతో చూచునో అతని కన్నులను యమ కింకరులు కోపముతో సూదులవంటివానిచేత కంటిని పొడిచెదరు. కాబట్టి ఎన్ని విధములుగా

ఆలోచించినను అన్యస్త్రీలతో సంబంధమువలన పాపములు వృద్ధి చెందగలవు.

## అత్యంతశక్తివంతమైన పాపకార్యము

పాపములను కలుగచేసే కార్యములలో అత్యంత శక్తివంతమైన పాపకార్యము ఏది అంటే అన్యస్త్రీలను పొందుటయే అని స్మృతులు, ధర్మశాస్త్రములు పేర్కొనినవి. కాబట్టి పాపమునకు భయపడునట్టి నాకు ఆ పని యుక్తము కాదు అది చేయదగినది కాదు. మూడులోకములయందు మిక్కిలి సొగసుకత్తె వైన రంభా నేను సుకృతములను చేయుటద్వారా పరిశుద్ధుడను వైరాగ్యముచేత నన్ను నేను పొందుటయే ఫలము. తపస్సే ధనముగా గల ఋషులు నిన్ను అనుభవిస్తారు అని చెప్పినావు. ఆ విషయమును నేను ఆలోచించను. ఎవరి బుద్ధి వారిది ఎవరి కర్మ వారు అనుభవించ వలసినదే. తమ వ్రతము భంగము చేసుకొని నీతో అనుభవించిన వారి విషయమై నేనెందుకు వారి గురించి ఆలోచించాలి నాకు వారు సాటియనా? అనేక విధములైన ఈ చెడ్డ దేహమునకు సుఖము ఎక్కడవున్నది అంతయు దుఃఖమే కలుగును గదా. అటువంటి అశాశ్వతమైన దేహ సంబంధిత సుఖ మును నేను కోరుకొనను. ఎవరు చేసిన కర్మలకు వారు బాధ్యులు కాక తప్పదు. పుణ్యకర్మ అయినా పాపకర్మ అయినా దానినుండి వచ్చే ప్రతిఫలమును అనుభవించ వలసినదే. కావున ఒకరి నడవడిని మనము ప్రశ్నింప వలసిన అవసరం లేదు. మన నడవడిక ధర్మయుక్తంగా వున్నదా లేదాఅని నిరంతరము బేరీజు వేసుకొనుచు ఉత్తమ జీవితం గడుపుకొనవలెను. శరీర మిధం ఖలు ధర్మసాధనము. ఈ దేహము ద్వారా ధర్మకార్యములు సాధించి ఇంకా ఉత్తమ జీవనం లభించేటట్లుగాను, ఉత్తమ జన్మలు కలుగునట్లుగాను చివరికి సాయుజ్య మోక్షమునకు కృషి చేసినచో నిత్యానందమును నిరంతరము అప్రతిహతముగా అనుభవించ వచ్చును. అటువంటి ఆనందము స్థిరమైనది. కాబట్టి దేహం ద్వారా లభించే క్షణికమైన సుఖము కొరకు కాకుండా శాశ్వత సంబంధమైన ఆత్మానందము కలగటానికి కృషి చేయవలయును. నా అభిమతము అదే. కావున అధికముగా మాటలాడి ఎన్ని విధములుగా ప్రాధేయపడినను నేను నిన్ను చూడను చూడను గాక చూడను. సమ్మతింపని నేను ఇతరకార్యములు చెయ్యజాలను. ఓ రంభా! ఇన్ని మాటలేల నీకోరికను నేను తీర్చను. కావున



తక్షణం నీవువెళ్ళ వలయును అని ధృడ సంకల్పం కలిగి చెప్పినాడు. .

## దేవలుడిని రంభ శపించుట

ఈ విధముగా దేవాంగముని చేత తిరస్కరింపబడిన రంభ కోపముతోను, దుఖముతోను కూడినదై ఆ దేవాంగునిని బెదిరించుచూ ఇట్లు అనినది.

శ్లో॥ దైన్య వృత్యా ప్రార్థయంత్యా నా గ్రగీహీర్వచనం మమ।
తస్మాత్త్వం దైన్య మాపన్న శ్శతృభిః పరివారితః॥
తైర్బద్ధో భవ దుర్బుద్ధే మచ్ఛాపాద్వీత పౌరుషః।
పంచ వర్షాణి సహస్రాణి శూద్రత్వం సమవాప్స్యసి।
తతః పరబ్రహ్మ వరో భవిష్యసి న సంశయః॥ సూతః॥
ఇత్యుక్త్వా సాయయౌ రంభా తమవాస్య చ యత్రవా।
దేవాంగో పితతో రాజా క్షణం తత్ర విచింత్యచ।
ఈశ్వరాజ్ఞేతి నిశ్చిత్య స్వపట్టణ ముపాసదత్।

నా యంతట నేను వలచి వచ్చినందుకు నన్ను మిక్కిలి చిన్నచూపు చూసినావు. నానా విధములుగా నిందించినావు. అపవిత్రమైన దానిని అని నిందించినావు. త్రిలోకములలోనే మిక్కిలి సొగసుకత్తె అయిన నేను వచ్చి దైన్యముతో ఎన్ని విధములుగా ప్రార్థించినను నీ మనస్సు కరగనిది అయినది కావున నీ బుద్ధిని నిందింపవలసి యున్నది. ఓరీ! తెలివిమాలినవాడా! నీవు అతిశయముతో ప్రవర్తించినావు. ఆడదాని మనస్సును ఎరుగలేని వాడవు నీవు బుద్ధిమంతుడవా? ఓరీ! మూఢబుద్ధిగలవాడా! నీవు చెప్పిన నిత్యానిత్య వస్తు వివేకము అను నీ జ్ఞానమును కాల్చిపారవేయవలయును. నీవేదో మిగుల అందగాడివి గదా నీకు రసిక జ్ఞానము వుండును అని భ్రమించినాను. స్త్రీ స్వభావము ఎరిగికూడా మూఢముగా ప్రవర్తించినావు. విరహమే జ్ఞానము కలవాడివి నీకు రసిక జ్ఞానము గురించి నీకు ఎట్లు తెలియును. రసిక సామ్రాజ్ఞినైన నాతోటి భోగము నీకెట్లు సిద్ధించును. రసిక జ్ఞాన సంపన్నుడు అయినవాడే మిక్కిలి పుణ్యములు సంపాదించుకొని పవిత్రుడైన వాడే నాతో భోగించును. నీవు ఇటువంటి బుద్ధి జ్ఞానము లేని వాడవని రసికుడు కావని

నేను ఎరుగనైతిని. అయినను నిన్ను ఎన్ని విధములుగా మిక్కిలి దీనావస్థను పొంది బ్రతిమిలాడినను నన్ను నిర్లక్ష్యం చేసితివి. నీ అహంకారానికి ప్రతీకగా నాశాపము వలన నీవు శత్రువుల చేత చుట్టబడి అనగా బంధింపబడి దీనావస్థను అనుభవించెదవు. శత్రువుల చేత బంధింపబడతావు నీ పరాక్రమము అంతయు నిరుపయోగమగును. ఐదు వేల సంవత్సరాల కాలము శూద్ర సముడవై జీవించెదవు. ఆ తరువాత బ్రాహ్మణ శ్రేష్టుడవు అగుదువు గాక! దీనిలో సందేహము లేదు అని ఇట్లు శపించి ఆ రంభ దేవాంగునిని విడచి తన స్థానానికి శీఘ్రముగా వెళ్ళిపోయినది. రంభచే అకస్మాత్తుగా శపింపబడుట ఇది అంతయు ఈశ్వరుని ఇచ్ఛానుసారము జరిగివుండునులే అని మౌనము వహించి తన ఆమోద పట్టణమునకు వెడలిపోయినాడు దేవలుడు.

## వ్యభిచరించుటయే రసికత్వమా?

దేవలుడు విరహుడు కాడు. రసిక శిఖామణియే. తాను అధర్మ ముగా అన్య స్త్రీని ముట్టుకోను అని అన్నాడు. అంతేగాని వైరాగ్య భావం వుండి కాదు. తన స్వభార్యయందు దాంపత్య సుఖమును పొందుట ధర్మము అని పదేపదే చెప్పినాడు. కావున స్వభార్య వుండగా పరస్త్రీలవైవు ఆకర్షితులు కారాదు. తన కామకోరికలనుతన భార్యతోనే తీర్చుకోవలెను. ఎట్టి పరిస్థితులలో ధర్మము తప్పరాదని ఖరాఖండిగ తెలిపినాడు. ఈ దేహము ద్వారా ఇంకా ఉత్తమమైన జీవనం గడపాలి అని శాశ్వతమైన నిత్యానందము కలిగించు ఆత్మానందము కొరకు ప్రాకులాడవలయునేగాని క్షణికమైన సుఖములకొరకు కాదు అని నిష్కర్షగా తెలియజేసినాడు. మరి భార్యతో రమించుటకూడా క్షణికమైన సుఖమే కదా! ఇది కూడా దేహ సంబంధమైన సుఖమే కదా. శాశ్వతానందము కాదుగదా. కాని భార్యాభర్తలు అర్ధనారీశ్వరులు. ఈ భూమిమీద వివాహము కర్మ ద్వారా ఏకమై వంశాభివృద్ధికి తోడ్పడవలసియుండును. భర్త ఆనందంలోనే భార్య ఆనందము వుండును. కాబట్టి భార్యతో సంభోగం పాపకర్మ కాదు ధర్మ కార్యమే. కావున అన్య స్త్రీ సంపర్కాన్ని ఖండించినాడు కాని స్వభార్యతో సంపర్కం వద్దు అని అనలేదు. అది పాప కార్యంఅయ్యేటట్లయితే దేవలుడు చంద్రరేఖ అను ఆదిశేషుని కూతురును, సూర్యుని చెల్లెలు అయిన దేవదత్తను, వజ్రముష్టి కుమార్తె అయిన పద్మినిని (అగ్నిదత్త) అను ముగ్గురుస్త్రీలను వివాహమాడినాడు. వారి



వలన సంతానమును పొంది వంశాభివృద్ధి చేసినాడు. కావున దేవలుడు రంభ భావించినట్లు విరహుడు కాడు. శృంగార రసికత్వము కలవాడు. రంభ ఎంత కవ్వించినను, లోబర్చుకోవడానికి ఎన్ని విధముల ప్రయత్నించినను చలించని ఇంద్రియ నిగ్రహము కలవాడు. సాధారణ ఋషులయితే ఆమె అనుకొనినట్లు తపస్సు చేస్తుంటే తానుకనబడగానే వారు కామ జ్వరము పొంది వుండవచ్చు. రంభతో సంభోగించడానికే యజ్ఞములు తపస్సు చేయువారు అయి వుండవచ్చు. వారు ఆమెతో సంభోగించవచ్చు. కాని అందరు అలాగే వుంటారు అను దురహంకారముతో వచ్చినది రంభ. దేవలుడు శివునియందు సాయుజ్య స్థితిలో వుండి మోక్షానందం అనుభవిస్తూ వుండినవాడు. శాశ్వతమైన, స్థిరమైన నిత్యానందంతో వున్నవాడు. అటువంటి సాయుజ్య స్థితిని పొందుటకు అహరహం తపస్సమాధిలో, యోగ నిష్టలో వుండి సాధించినాడు. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనే అంతర్గత శత్రువులను జయించినాడు. సారూప్య, సాలోక్య సామీప్య సాయుజ్యము అని మోక్షము నాలుగు విధములు. అన్నిటికన్నా విశిష్టమైనది సాయుజ్యము. అటువంటి సాయుజ్య మోక్షస్థితిని అనుభవించుచు శివుని లోక కళ్యాణ కార్య నిమిత్తము తిరిగి జన్మించినాడు దేవలుడు. తిరిగి జన్మించినను తన తపశ్శక్తి ద్వారా సంపాదించుకున్న వాటిని పోగొట్టుకోరు. కావున రంభ ఎంత ప్రయత్నించినను తన కోరిక తీర్చుకోలేక పోయినది. ఋషులలో ఎక్కువమంది స్వర్గ సుఖములకై యజ్ఞ యాగాదులు, తపస్సులు చేయుదురు. అటువంటి వారిని గూర్చి రంభ పలికినది. కాని దేవలుడు ఒకరి విషయము నాకు అవసరము లేదు. నాకు వారు సాటియా అని గంభీరంగా తెలియజేసినాడు. మిగతా ఋషులవలె దేవలుడు తన వంపు సొంపులను చూచి మోహపడతాడు అని రంభ భ్రమించినది. శివుని మూడవకన్ను నుంచి ఉద్భవించినాడు దేవలుడు, శివుని మానస పుత్రుడు దేవలుడు. కాబట్టి శివుడు కాముదును జయించినాడు. మన్మథుని భస్మం చేసినాడు తన తపస్సు భంగం చేసినప్పుడు. తపస్సును వదలి పార్వతీ దేవిని కామించలేదు శివుడు. అటువంటి నిగ్రహ విగ్రహం గల ఈశ్వరుని మానస పుత్రుడు కూడా అటువంటి లక్షణములు కలిగి వుండుట సహజమేగదా. కాని రంభ యుక్తాయుక్తా విచక్షణాజ్ఞానం లేకుండా అందరు కామానికి దాసులే అని త్రిలోక సుందరి కాబట్టి ఎటువంటి వారైనా లొంగిపోతారు అని

పొరబడినది. మహా అందగాడైన దేవలుని చూడగానే సహజంగా రసిక శిఖామణి కాబట్టి మోహంలోపడి కామ జ్వరమును అనుభవించినది. తనకు తానుగా వలచి వస్తే చులకన అయినాను అని భావించింది. రంభేకాదు అటువంటి కామావస్థను అనుభవించు వారిలో అధికశాతం మంది యుక్తాయుక్త వివేక జ్ఞానము కోల్పోవుట తన కోరిక తీరనందున నిష్కారణంగా సజ్జనులను శపించుట లేక దూషించుట సహజమే. అటువంటి పనియే రంభకూడా చేసినది. ఆవేశము కలిగినవారికి, మదోన్మత్తులకు ధర్మవాక్యములు వినపడవు. అదే విధముగా రంభకూడా అట్లాగే ప్రవర్తించినది. నేను అటువంటి వాడినికాదు అని ఎన్నిసార్లు వినిపించినా అవతలి వారి మనస్సును అర్ధంచేసుకోకుండా తను ఆలోచించినదే సరియైనది అని అపోహపడుటను రంభ చేసినది. సృష్టిలో రతికార్యము ధర్మబద్ధంగా అనుభవించాలేకాని అధర్మ మార్గములో అనుభవించరాదు. ఎంతటి అందగత్తెలైనా ధర్మ మార్గములో ప్రవర్తించినప్పుడు వారి అందానికి వన్నె కలుగుతుంది. తన అందంచూచి మిడిసిపడేవారు ఎప్పుడో ఒకప్పుడు భంగ పడతారు. వారి అభిమానం నశించుతుంది. అటువంటిదే రంభ విషయములోను జరిగినది.

## శాపాన్ని మౌనంగా స్వీకరించిన దేవలుడు

రంభ తనను శపించుచున్నప్పుడు మౌనముగానే దానిని స్వీకరించినాడు కాని అలజడి చేయలేదు. అనగా శాపానికి ప్రతిశాపం ఇవ్వలేదు, నిందించలేదు. అంతా ఈశ్వరేచ్ఛ అని భావించినాడు దేవలుడు. రంభ తనను శపించగానే తనకు శాపవిమోచనము ఎప్పుడు ఏవిధంగా జరుగుతుంది అని ఆమెతో అనలేదు. మౌనంగా వున్నాడు. రంభ దేవలున్ని 5వేల సంవత్సరాలు శూద్రసముడిగా వుంటావు అని అన్నదేగాని శూద్రుడు అయ్యి అట్లానేవుండు అని అనలేదు. శూద్రుడితో సమానమైన జీవితమును 5వేలసంవత్సరాలు అనుభవించిన తరువాత మిక్కిలి బ్రాహ్మణ శ్రేష్టుడవుగా జీవించెదవు అని ఆమెకు ఆమె అన్నదేగాని దేవలుడి విజ్ఞప్తి ఏమీలేదు. దేవలుని వంశాన్ని శపించలేదు. ఆమె శాపం కేవలం దేవలుడికి మాత్రమే చెందుతుంది. అయితే శాపాలు ఒక్కొక్కసారి వెంటనే ప్రభావము చూపవు. సరియైన సమయము ఆసన్నమైనప్పుడే శాప ప్రభావం వ్యక్తిమీద వుంటుంది. సాయుజ్య స్థితిలోవున్న దేవలుడిని



లోకహితము కొరకు శివుడు జన్మింపజేయగా అతడిని శపించిన రంభను శివుడు ఏమీ అనకుండా మౌనముగా వున్నాడు.

కావున స్త్రీ సహజ సిద్ధమైన చపల చిత్త మనస్తత్వం పొంది ఆక్రోశం చెంది రంభ దేవలుడిని శపించినది. దేవలుడు దేవదానవ యుద్ధమునందు శత్రువులకు చిక్కి బంధింపబడినాడు. రంభ శాపము తర్వాతనే సూర్యుని చెల్లెలు దేవదత్తను దేవలుడు వివాహము చేసికొనినాడు. కాబట్టి దేవదత్తను వివాహము చెసికొనేటప్పుడు దేవలుడికి శూద్ర సమత్వము రాలేదు. శూద్ర సమత్వం వచ్చినట్లయితే ఈ దేవదత్త దేవల వివాహము జరుగదు. ఆ వివాహానికి బ్రహ్మ ఆధ్వర్యం వహించేవాడు కాడు. దేవతాజనమంతయును, బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు తమ పత్నులతో వచ్చి దీవించేవారుకాదు. అసలు సూర్య భగవానుడు, శివుడు ఈ వివాహం జరుగునట్లు చేయకుందురు. ఆ వివాహము జరిగింది కావున దేవలునికి శూద్రత్వం లేదు అని స్పష్టమగుచున్నది.

## రంభా శాప పరిణామాలు

రంభ శాపము దేవలునికి కీడుకన్నా మేలే ఎక్కువ జేసినది. లోకకళ్యాణ కారకమైన పనులు చేయుటకు తోడ్పడినది. అతని ప్రభావం నశించి, శత్రువులకు చిక్కి బంధింపబడతావు అను శాపమువలన దేవదానవ యుద్ధమునందు రాక్షసులను చిత్తుచిత్తుగా మొదటలో ఓడించినాడు దేవలుడు. ఆ తరువాత కాని శాపప్రభావమువలన దేవలునికి యుక్తాయుక్త జ్ఞానం నశించినట్లుగా అయినది. దీనివలన ఏ పని చేయవచ్చు, ఏ పనిచేయకూడదు, తక్షణ సమయానికి అవసరమైన పని చేయుటయందు నిర్బలుడై యుండినాడు. అందువలన వజ్రదంష్ట్రుని అనుచరుడు దేవతల వేషంవేసుకొని నన్ను ఇంద్రుడు పంపినాడు. నందిధ్వజము త్వరగా తీసుకురమ్మని అని చెప్పగానే నమ్ముట జరిగినది. ఇది రంభా శాప ప్రభావమే. ఎందువలనంటే మహా మహిమాన్వితమైన అమోఘశక్తి కలిగినటువంటి వృషభధ్వజమును అన్యుల చేతిలో పెట్టరాదు. సాక్షాత్తు ఇంద్రుడు వచ్చి అడిగినను అతనికి ఇవ్వరాదు. శివుడు తనకు మాత్రమే ఇచ్చినాడు కావున ఆ నందిధ్వజమును తనే ఉపయోగించవలెను. తాను దేవతలవైపు యుద్ధానికి వెళ్ళినను ఇంద్రునకుకూడ నందిధ్వజమును ఇవ్వరాదు. ఆ నంది ధ్వజమును ఎంతో నమ్మికతో వుండి

దేవలునికి మాత్రమే శివుడు ఇచ్చినాడు. అంతకు మునుపు ఇటువంటి శక్తివంతమైన ఆయుధం ఎవ్వరికీ ఇవ్వలేదు. దీనిముందు దేవతలు, దేవేంద్రుడుకూడ నిలువలేదు. దీనిద్వారానే గదా రాక్షసులను చిత్తుచిత్తుగా ఓడించినది. కావున దీనిని ఇతరుల చేతికి ఇవ్వరాదు అని తెలిసికూడ రంభాశాప ప్రభావమువలన ఇంగిత జ్ఞానం మరచి ఒక దూత చేతికిచ్చినాడు. నందిధ్వజ ప్రభావమువలననే రాక్షసులు దేవతలను ఓడించినారు. ఆ నందిధ్వజమువలననే దేవలుడు ఓడింపబడినాడు. బంధిగావింపబడినాడు. దేవలుని అమితమైన భుజపరాక్రమశక్తి నందిధ్వజముముందు ఎందుకు పనికిరాకుండా పోయినది. రాక్షసుల చేతికి బంధీగా చిక్కినాడు. కాని దేవలుని అమితపరాక్రమశక్తి నిర్వీర్యమవటంతో బంధీగా చిక్కినాడు. ఈ విధంగా రంభ శాపంలోని ఒక అంశమైన శత్రువుల చేతికి చిక్కి మహా దైన్యస్థితి పొందుతావు అనునది అనుభవమునకు వచ్చినది. అనగా రంభా శాప ప్రభావం నిజ జీవితానికి వర్తించినది. ఇది దేవదానవ యుద్ధమునందే ప్రారంభమైనది. దేవదానవ యుద్ధానికి ముందే దేవలుడుకు ముగ్గురు కుమారులు దివ్యాంగుడు, విమలాంగుడు, ధవళాంగుడు అనువారు కలిగి వారికి వివాహములు కూడా అయినాయి. దేవలుడు తన ప్రథమ కుమారుడు దివ్యాంగునకు యువరాజ పట్టాభిషేకముకూడ జరిపించినాడు. శివుడు దేవలునికి దేవదానవ యుద్ధమునందు అతని కుమారులనుకూడ తీసుకొని వెళ్ళవలయునని ఆజ్ఞాపించినాడు. కాబట్టి దేవదానవ యుద్ధము నకు ముందు వరకు రంభాశాపము ఫలించలేదు. దేవదానవ యుద్ధములోని వ్యాఘ్రువక్త్రున్ని వధించి నంతవరకు దేవలునికి శాపప్రభావం ఏమిలేదు. వ్యాఘ్రువక్త్ర సంహారం తరువాత నుండి దేవలునికి రంభాశాపం ఫలించుట ప్రారంభమయినది. అందువలన శత్రువులకు దేవలుడు బంధీగా చిక్కినాడు. దేవలున్ని బంధీగాచేసి రాక్షసులు తమ స్థావరాలకు తీసుకువెళ్ళినారు. రంభయొక్క శాపములో **"ఐదు వేల సంవత్సరాలు శూద్ర సముదువుగా ఉందుము"** అనునది ఇప్పటినుండి అనుభవానికి వచ్చినది. దేవలుడు శూద్రులకు జన్మించితే శూద్రుడవుతాడు. కాని శివమానస పుత్రుడుగా జన్మించినాడు. కాని శూద్రులైన రాక్షసులతో కలసి వారితో వుండి అక్కడనే వారితో జీవించడము జరిగినది. భోజనాదులు వగైరాలు అన్నీ వారితోపాటే తీసుకోవడం వలనను, నిత్యం వారి మధ్యనే



వుండుట వలనను శూద్రసమానుడుగా జీవించినాడు. అంతేకాదు వజ్రదంష్ట్రుడు రాక్షసరాజుయొక్క కన్య పద్మిని అను పేరుగల దానిని వివాహము చేసుకోవలసి వచ్చింది. ఆమెతో సంసారం చేసి ముగ్గురు కుమారులను హలుడు, బలుడు, శలుడు అను వారిని జన్మింపజేసెను. కావున శూద్రసమముగానే జీవించుట జరిగినది. కాబట్టి రంభ శాపం ఐదు వేల సంవత్సరాల కాలం శూద్రసమము అనునది నెరవేరినది. ఐదు వేల సంవత్సరాల అనంతరము "బ్రాహ్మణులయందు శ్రేష్టుడైన గురువుగా ఉందువు'' అని చెప్పినది. ఇది మాత్రము కలియుగములోజరిగినది. భోజరాజు ఆస్థాన కవిగా వరరుచి అవతారము ద్వారా నిరూపితమైనది. ఆనాడు బ్రాహ్మణులు శబ్ద జ్ఞానము లేనివారు అయి వున్నారు. వేదముయొక్క పదక్రమము జటలు తెలుసుకోలేని శక్తిహీనులుగా వున్నారు. ఆనాటి వ్యాకరణము, ఆగమశాస్త్రములు, ధర్మశాస్త్రములు మొదలగునవి అన్నియు అపశబ్ధములతో నిండివుండినవి. వాటిని సుశబ్ధములుగా తీర్చిదిద్ది శాస్త్రములను తిరిగి వ్రాసినాడు వరరుచి. బ్రాహ్మణులకు వేదములను స్వరయుక్తముగా బోధించినాడు. ఈ విధముగా బ్రాహ్మణ వంశస్థులకు గురువుగా వుండి వారికి బోధ చేసినందున బ్రాహ్మణ శ్రేష్టుడని పిలుచుచున్నాము. దీనిద్వారా రంభశాపము పరిపూర్తి అయినది. అయితే రంభ శపించినది దేవలున్ని మాత్రమే.

## దేవాంగ వంశస్తులు శాపగ్రస్తులా?

దేవలుడి సంతానమునుగాని, వంశాన్నిగాని శపించలేదు. రంభాశాపము సమయానికి దేవలునికి వివాహము కాలేదు. అనగా అప్పటికి పుత్రులు లేరు. పుత్రులు లేకపోతే పుత్రులను ఎట్లా శపిస్తుంది. కావున రంభ దేవల వంశాన్ని శపింపలేదు. రంభాశాపము పూర్తిగా దేవలునికి సంబంధించినది. కలియుగములోని ఐదు వేల సంవత్సరాల కాలంవరకు దేవాంగ వంశంవారు శూద్రసములు అని రంభాశాపంలో ఎచ్చటనూ లేదు. కృత, త్రేత, ద్వాపర, కలియుగాదుల విషయం రంభాశాపంలో లేనేలేదు.

దేవాంగుని వివాహము తరువాత అతనికి జన్మించిన పుత్రులు సహజ సిద్ధ నిత్యబ్రాహ్మణులు. అతని పుత్రుల వంశంనందు జన్మించినవారు దేవాంగులు.

## కామముగలవారే రసికులా?

రంభ దేవలున్ని నీవు రసికుడవుగావు అని నిందించినది. రసికుడు అని అనగా ఇతర స్త్రీలను కామదృష్టితో చూచుట అని సాధారణ అభిప్రాయముగావున్నట్లుగా వున్నది. రంభకూడ ఇదే అని అనుకున్నది. అంటే ధర్మవిరుద్ధంగా ఇతర స్త్రీలతో రమించినచో వారు మాత్రమే రసికులు అవుతారా? అధర్మమార్గంలో పరస్త్రీ వాంఛను నెరవేర్చుటయే రసికత్వం అవుతుందా. ఇతరుల స్త్రీలను మోహించి వారితో నర్మగర్భమైన సరసపు మాటలుపలుకువాడు సరసుడు అవుతాడా. ఇదేపని తన స్వభార్యయందు చేయుటను రసికత్వం అనిపించుకోదా. ధర్మం తప్పకుండా స్వభార్యయొక్క మనస్సు మెప్పించి ఆమెను పరవశురాలుగా చేసినచో అది రసికత్వం క్రిందకు రాదా. ఇతర స్త్రీలను మెప్పించినవారే రసికులా. కావున రంభ అధర్మ అన్యాయ మార్గంలో వుండి దేవలున్ని నీకు రసికత్వం లేదు అని అన్నది. పురుషులను రమణుడు అని పిలిచెదరు. అనగా తన భార్యయొక్క తనువును పరవశింపజేయువాడిని రమణుడు అని మనోహరుడు అని పిలచెదరు. కాబట్టి దేవలుడు వివాహము జరిగిన తరువాత తన భార్య దేవదత్తయొక్క మనస్సును హరించినాడు. కాబట్టి అతను ఆ తరువాత ఎత్తిన సప్తావతారములయందు దేవదత్తయే భార్యగా జన్మించినది. వివాహంకాక పూర్వం బ్రహ్మచారిగా నియమం పాటించాలి. రంభ దేవలున్ని సమీపించునాటికి దేవదత్తా దేవల వివాహం జరపాలని నిశ్చయించినారే గాని ఇంకా వివాహము జరుపలేదు. వివాహం దాక బ్రహ్మచర్య దీక్షలో వుండవలయును. అందువలన దేవలుడు తన వ్రత దీక్షలో వుండినాడు. తన వ్రతమునకు భంగం కాకుండా చూచుకొనినాడు. శివుని మానస పుత్రుడు దేవలున్ని రంభ జయించలేకపోయినది. ఈ విషయంలో దేవలుడు తండ్రికి తగ్గ తనయుడుగా వ్యవహరించినాడు. రంభాశాపమువలన దేవదానవ యుద్ధమునందు రాక్షసులు మాయోపాయముతో శివునిచే ఇవ్వబడిన నంధి ధ్వజమును తస్కరించిరి. అందువలన దేవదానవ యుద్ధమునందు రాక్షసులు గెలుపొంది దేవలున్ని ఓడించి రథమునందు కట్టివేసి రాక్షసులు తమ రాజ్యానికి తీసుకుపోయిరి. దేవలుని పరాక్రమము ఎటూగాకుండాపోయినది. దైన్యమునుపొంది శత్రువులకు చిక్కినాడు. బంధింపబడినాడు. తనకంటూ ఎవరూలేరు, తనను బంధించకుండా



నివారించడానికి ఎవ్వరునూ ముందుకు రార్రైరి. రాక్షసులతోపాటు వుంటూ వారితో కాలము గడిపినాడు. వారి కుమార్తె పద్మినిని వివాహమాడినాడు. ఆమెద్వారా హలుడు, బలుడు, శలుడు అను ముగ్గురు పుత్రులను కనినాడు. వారికి నేత విద్య నేర్పి, రాక్షసులకు కూడా వస్త్ర ప్రదానము చేసినాడు. కావున రంభ శాపము దేవదానవ యుద్ధసమయములోనే ఫలించినది. అంతకు ముందుఫలించలేదు. అనగా అనుభవానికి రాలేదు. కావున దేవలుడు దేవదత్తల వివాహము శివుని కచేరినందే ఇంతకు ముందు నిర్ణయింపబడినది. కావున దేవదత్త దేవల సంతానము పొందినప్పుడు కూడా రంభ శాపము అంటలేదు కాబట్టి దేవలునియొక్క కుమారులు శూద్ర సములు కారు. వారు తన తండ్రియొక్క నిజ తత్త్వమైన సహజ సిద్ధ పుట్టుకతోనే బ్రాహ్మణత్వం కలిగిన అప్రాకృత బ్రాహ్మణులే. వారి సంతతే దేవాంగ వంశీయులు. బ్రాహ్మణ శ్రేష్టుడుగా అవుతావు అని రంభ శపించినది. అది భోజరాజు కాలంలో వరరుచిగా అవతరించి భూలోకములోవున్న బ్రాహ్మణులందరికి సుస్వర వేదమును అపశబ్దములేని నవ వ్యాకరణములు బోధించినాడు. అపశబ్దములతో కూడిన ఆగమ, ధర్మ, వ్యాకరణ శాస్త్రములను సుశబ్దములు కలుగు విధముగా తిరిగి రచించినాడు వరరుచి. కావున రంభ శపించినట్లుగా దేవలుడు వరరుచి అవతారమునందు బ్రాహ్మణశ్రేష్టుడుగా విలసిల్లినాడు. రంభ శాపము రాక్షస జాతికి వస్త్రములు నేసే విద్యను నేర్పించుట జరుగుటకొరకు అని తెలియుచున్నది. అంతేకాకుండా భూలోకమలో వేదవిద్యను పరిరక్షించుటకును, దేవభాషను భూలోకములో విస్తృతంగా వ్యాపించుటకొరకును ఉపయోగపడినది. బంగారాన్ని పరీక్షించుటకు ఒరిపిడి రాతిమీద రుద్దినప్పుడు అపరంజి బంగారమా? కాదా ? అని తెలుస్తుంది. లేకపోతే బంగారం సాంద్రత తెలియదు. అదే విధముగా రంభ దేవలున్ని కామించివచ్చినందువలన దేవలుడి వ్యక్తిత్వం విశదపడినది. ఒక విధముగా రంభ వలన దేవలుని మహాత్వం లోకానికి వెల్లడి అయినది. దేవాంగ వంశస్థులు శాపగ్రస్తులు కారు అను విషయముకూడ స్పష్టమగుచున్నది.



# దేవాంగుని వివాహ మహోత్సవము

## పండ్రెండవ అధ్యాయము

మహా ప్రకాశవంతుడైన సూర్యుడు తన చెల్లెలు దేవదత్తను దేవలునకిచ్చి వివాహము చేయవలయునని స్థిర నిశ్చయము చేసుకొనినాడు. తరువాత విశ్వానికి ప్రభువైన బ్రహ్మ వద్దకు సూర్యుడు వెళ్ళి ఈ విధముగా చెప్పినాడు. సమస్త లోకములయందు పూజింపబడు బ్రహ్మ దేవుడా నీకు నమస్కారము. నా తోడబుట్టిన దేవదత్తను మిక్కిలి పరాక్రమ వంతుడైన దేవాంగునికి ఇచ్చి వివాహము చేయగోరి యున్నాను. ఈ వివాహమునకు మీ సిద్ధాంతము ప్రకారము మంచి శుభకరమైన సుముహూర్తమును చెప్పుము. సర్వ ప్రపంచమునకు ప్రభువైన స్వామీ మాకు నీవే ప్రభుడవు. అందువలన ఈ విషయం నీతోనే చెప్పుకొనుచున్నాను అని ఈ విధముగా సూర్యుడు చెప్పగా దానికి బ్రహ్మదేవుడు చెప్పుచున్నాడు. ఓ సూర్యుడా! రాబోయే వైశాఖ మాసమునందలి శుక్లపక్ష పంచమితిథి సోమవారం రోజున సూర్యాస్తమయము అయిన పిదప ఏడు ఘడియలు దాటిన తరువాత ధనుర్లగ్న పుష్కరాంశమునందు వివాహము జరుపుటకు మిక్కిలి శుభప్రదమై యున్నది. ఇది నేటికి ఎనిమిదవ రోజున వచ్చును. అనగా చైత్ర బహుళ త్రయోదశి రోజున ఆ సుముహూర్తము నందు వివాహము జరిపించుము ప్రశస్తముగావుండును అని చెప్పుచూ ఈ లగ్నమును నిర్ణయించగానే లోకమంతా ప్రకాశింప జేయునట్టి ఆ సూర్యుడు మిక్కిలి సంతోషమును పొంది లోకములకు ప్రభువైన వాడు అగు సూర్యుడు బ్రహ్మదేవునితో సరేస్వామీ ఆ విధముగానే జరిపించుతాను మీరు మీ పరివార సమేతముగా వివాహమునకు రావలయును అని ఆహ్వానం పలికినాడు. తరువాత బ్రహ్మ భార్యఅగు సరస్వతి మొదలగువారిని పేరుపేరున పిలిచినాడు. తరువాత దేవదేవుడైన పార్వతీ పరమేశ్వరులకు తెలియ పరచటానికికైలాస లోకమునకు వెళ్ళి సాంబశివుని సమీపమునకు వెళ్ళినాడు. లోకములకు నాధుడవైన మహాదేవుడా దేవలునికి నా చెల్లెలు దేవదత్తను ఇచ్చి వివాహము చేయగోరి



బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి వివాహ ముహూర్తం నిశ్చయింప చేసుకొని వచ్చినాను. వచ్చే నెలఅయిన వైశాఖమాస శుక్లపక్ష పంచమి సోమవారంనాడు జరుప నిశ్చయించినాను. కావున మీరు పార్వతీదేవి సమేతులై మీ ప్రమథగణ సపరివారముగా ముహూర్తమునకు రావలసినదిగా మిమ్ములను ఆహ్వానించుచున్నాను అని పలుకగా దానికి పరమేశ్వరుడు బాగుబాగు మేము తప్పని సరిగా వివాహ కార్యమునకు వచ్చెదము అని బదులు చెప్పినాడు. సూర్యుడు మిక్కిలి సంతోషము చెంది పరమేశ్వరుని అనుజ్ఞ తీసుకొని అచ్చటవున్న గణపతి, కుమారస్వామి, వీరభద్రుడు, నందీశ్వరుడు ఇంకను అక్కడ వున్న ప్రమథ గణముల వారిని వేరువేరుగా కలసి వివాహానికి ఆహ్వానించినాడు. అక్కడనుండి శ్వేతద్వీపము వద్దనున్న క్షీరసాగరము వెళ్ళి జగన్నాధుడైన శ్రీమన్నారాయణున్ని సమీపించి లోకములకు ప్రభువైన నారాయణుడా పంచమీ సోమవారం నాడు నా తోడబుట్టినదైన దేవదత్తను దేవాంగునికి ఇచ్చి వివాహముచేయ నిశ్చయించినాను. మీరు పరివారముతోడ రావలయునుమహానుభావా అని సూర్యుడు ఆ విధముగా చెప్పగా విష్ణువు సరే అదేవిధముగా మేము మాపరివారముతో సహా వచ్చెదము అని బదులు ఇచ్చినాడు. అంతట సూర్యుడు మహాలక్ష్మిని, సమస్త విధములైన ధనమును ధరించి యుండెడి భూదేవిని మరియు చక్రాయుధమును ధరించిన ఆ విష్ణువునకు గల పరిజనులందరిని ఆహ్వానించినాడు. ఆ తరువాత స్వర్గలోకమునకు వెళ్ళి శచీదేవితో కూడియున్న దేవనాయకుడైన ఇంద్రుని, ఇంద్రుని కుమారుడగు జయంతుడుని సమీపించి అక్కడవున్న బ్రహ్మర్షులను. ద్వాదశ ఆదిత్యులను, అష్ట వసువులను, ఏకాదశ రుద్రులను, దేవతలు, గంధర్వులు, మరియు వివిధ దేవతలను వారినందరిని వివాహమునకు ఆహ్వానించి తన లోకమునకు వెళ్ళినాడు.

ఈ వివాహము ఈ సృష్టి ఏర్పడినప్పటినుండి 7114 సంవత్సరాలు నిండి 7115 వ మానవ సంవత్సరములో జరిగినది. మానవ సంవత్సరము 365 రోజుల 6 గంటలు. దేవతలకు ఒకరోజు మానవులకు 365 రోజలతో సమానము.

| గ్రహము | భగణములు | రాశి | భాగ | లిప్త | లిలిప్త |
|---|---|---|---|---|---|
| రవి | 7114 | 0 | 7 | 54 | 51 |
| చంద్ర | 95102 | 1 | 24 | 23 | 28 |
| కుజ | 3782 | 9 | 8 | 37 | 08 |
| బుధ | 29538 | 0 | 8 | 37 | 08 |
| గురు | 599 | 8 | 12 | 32 | 42 |
| శుక్ర | 11564 | 11 | 12 | 41 | 05 |
| శని | 241 | 6 | 7 | 29 | 21 |
| రాహువు | 382 | 5 | 22 | 57 | 41 |

దేవతల కాలమానం ప్రకారము సృష్టి ఆరంభం నుండి 19 సంవత్సరాలు నిండి 20 వ సంవత్సరము జరుగుచుండగా ఇది జరిగినది.

అహర్గణం : 2598341 మానవరోజులు

| శు కే | ర బు | చ | |
|---|---|---|---|
| | వివాహ ముహూర్త చక్రము | | |
| కు | | | |
| గు ల | | శ | రా |

వైశాఖ శుద్ధ పంచమి సోమవారం రాత్రి గం. 8-44 ని.లకు వివాహము జరిగినది.

అహర్గణము 2598341

శ్రీరామచంద్రుని జనన సమయంలో ఐదు గ్రహాలు ఉచ్ఛరాశులలో వున్నవి. శ్రీకృష్ణపరమాత్మ జనన సమయంలో ఐదు గ్రహాలు ఉచ్ఛరాశులలో వున్నవి. శ్రీ దేవదత్తదేవల వివాహ ముహూర్త చక్రంలో ఐదు గ్రహాలు ఉచ్ఛరాశులలో వున్నవి. ఒక వివాహ ముహూర్త చక్రంలో ఐదు గ్రహాలు ఉచ్ఛరాశులలో వుండుట అద్భుతం. పరమాద్భుతం. జనన సమయాలలో ఐదు గ్రహాలు ఉచ్ఛరాశులలో వుండినవి కాని వివాహ ముహూర్త చక్రంలో ఐదు గ్రహాలు ఉచ్ఛరాశులలో వుండుట శ్రీ దేవదత్త దేవల వివాహానికే చెల్లినది.



ఆమోదపట్టణములో ఉన్న దేవాంగ మహారాజు తన మంత్రులు సుబుద్ధి, కార్యదక్షులను పిలిచి మీరు సూర్యుడువద్దకు వెళ్ళి వివాహలగ్నము ఎప్పుడు నిర్ణయింపబడినది తెలుసుకొని వెంటనే రావలసినదిగా ఆజ్ఞాపించినాడు. ఆ మంత్రులు సూర్యునివద్దకు వెళ్లగానే వారిని తగు విధముగా గౌరవించినాడు. మార్తాండుడు బ్రహ్మదేవునిచే నిర్ణయింపబడిన ముహూర్తము గురించి దేవాంగుని మంత్రులకు తెలియపరచినాడు సూర్యుడు. వెంటనే మంత్రులు ఆమోదపట్టణమునకు వచ్చి దేవాంగునికి వివరించిరి. సూర్యుడు వెంటనే తన మంత్రియైన వీరమార్తాండుని పిలిచి, నీవు దేవాంగ మహారాజును సపరివార సమేతముగా వివాహముహూర్తమునకు రమ్మని ఆహ్వానించి వారిని స్వయముగా తోడ్కొని రావలసినదిగా ఆజ్ఞాపించినాడు. వీరమార్తాండ మంత్రి చతురంగబలముతో బయలుదేరి ఆమోదపట్టణమునకు వెళ్ళగా ఆ విషయం దేవాంగుడు తెలుసుకొని తన మంత్రులను పిలిచి ఎదుర్కొనుటకు (ఎదురుకోలు) పంపెను. వారు వీరమార్తాండుని మేళతాళములతో ఊరేగింపుగా పట్టణములోనికి తీసుకు వచ్చిరి. వీరమార్తాండుడు దేవాంగుని అంతఃపురములో తగిన సత్కారములు పొందిన అనంతరము దేవాంగునిని కలిసి వివాహమునకు ఆహ్వానించుటకు మరియు తోడ్కొని తీసుకురమ్మని సూర్యభగవానుడు పంపిరని చెప్పెను. దేవాంగునితో రాజా! నేటికి మూడవ రోజున పంచమి సోమవారంనాడు వివాహముహూర్తము నిర్ణయింపబడినది గనుక నాతో సపరివారముగా బయలుదేరి రండి అని చెప్పి దేవలుని మంత్రులందరిని వేరువేరుగా కలసి వారందరినీ ఆహ్వానించినాడు వీరమార్తాండుడు. అందరము కలసి వెళ్ళెదము అని వీరమార్తాండుడు చెప్పగా దేవాంగరాజు మార్తాండునితో మహాభాగా! నీవు ఇప్పుడు వెళ్ళుము. రేపు తెల్లవారుఝామున మేమందరము బయలుదేరి వచ్చెదము అని చెప్పగానే మంచిది అని దేవాంగునికి చెప్పి సూర్యలోకానికి వెళ్ళి సూర్యునకు జరిగినదంతయు వివరించినాడు వీరమార్తాండుడు. సూర్యుడు కళ్యాణమంటపము నిర్మించుటకొరకై తన మామగారైన విశ్వకర్మవద్దకు వెళ్ళి వివాహ మంటపము సిద్ధము చేయవలసినదిగా కోరినాడు. విశ్వకర్మ శుభకరమైన 4 మైళ్ళ వెడల్పు 8 మైళ్ళ పొడవుగల మంటపమును నిర్మించెను. అది ఒక యోజనము వెడల్పు

కలదిగా నిర్మించెను. అది బంగారు ప్రాకారములతోను, పగడముల స్థంభములతోను శోభిల్లుతున్నది. వజ్రపు పలకలతో కప్పబడినది. నవరత్నములతో జిగీషీయమానముగా ప్రకాశించుచున్నది. పుష్యరాగముతో చేయబడిన తలుపులు అమర్చబడినవి. ఆ మంటపము అద్వితీయమానముగా శోభిల్లుతున్నది. ఆ మంటపము మధ్యలో ఒక ముత్యాల మంటపము నిర్మించిరి. దానికి క్రిందను నలుపలకలుగా ఒక అరుగు కట్టబడెను. వధూవరుల నిమిత్తము దానియందు రెండు పీఠములు ఏర్పరచిరి. బ్రాహ్మణులకొరకు ఎన్నియో పీఠములు నిర్మించిరి. యోజన పర్యంతం ఉన్న ఆ కళ్యాణమంటపములో నానారత్న వినిర్మితములైన సింహాసనములు ఉన్నతమైనవి మరియు హ్రస్వమైనవి కల్పింపబడెను. ఆ విధముగా కళ్యాణమంటపము మిక్కిలి మనోహరముగా తీర్చిదిద్దబడెను. దేవాంగుడు కైలాసమునకు వెళ్ళి తన వివాహమునకు మూలకారకుడైన శంకరుడిని ఆహ్వానించినాడు. క్షీర సముద్రమునకు వచ్చి లక్ష్మీనారాయణులను పిలిచి అచ్చటనుండి స్వర్గలోకమునకు వెళ్ళి ఇంద్రుడును, బ్రహ్మను, దిక్పాలకులను తన వివాహమునకు రావలసినదిగా కోరినాడు దేవలుడు. భూలోకములో వున్న రాజులను, మంత్రులను సపరివారముగా వివాహమునకు రమ్మని తన మంత్రులతో పిలిపించినాడు. తరువాత దేవాంగుడు తెల్లవారుఝామున చతురంగ బలముతో బ్రాహ్మణులను పురోహితులను వెంటబెట్టుకొని మంగళవాయిద్యఘోషతో వందిమాగదులు స్తుతి చేయుచుండగా బయలుదేరి సూర్యలోకమునకు వెళ్ళెను. ఆ తరువాత పార్వతీపరమేశ్వరులు, లక్ష్మీనారాయణులు, బ్రహ్మ సరస్వతులు, ఇంద్రశచీదేవులు మొదలగు భాగవతోత్తములు దేవాంగుని వివాహమునకు వేంచేసిరి.

## వివాహము జరిగిన విధానము

మహాతేజశ్శాలియగు సూర్యుడు దేవతల అందరియెదుటకు తన సోదరి త్రిలోకసుందరియగు దేవదత్తను తీసుకొని వచ్చి, దేవాంగునికిచ్చెను. ఆ దేవదత్త ముల్లోకములను మోహింపచేయుచుండెను. బ్రహ్మదేవుడు ప్రయత్న పూర్వక ముగా దేవదత్తను సృజించినట్టులుగా వున్నది. శచీదేవి ఇంద్రునికివలె దేవదత్త దేవాంగునికి తగియున్నది అని అందరు మెచ్చుకొనుచుండిరి. దేవాంగ మహారాజు దేవతలందరి సమక్షములో దేవదత్త కంఠమునందు



మంగళసూత్రమును సుముహూర్త సమయమున గట్టెను. బ్రాహ్మణులు మంత్రములను చదువుచు అక్షతారోపణము (తలంబ్రాలు) చేయించిరి. సువాసినులు మంగళ గానములు పాడుచు నీరాజనమునిచ్చిరి. అనంతరము అందరికి భోజనములు సమకూర్చబడినవి. వచ్చిన వారందరికి నూతన వస్త్రములచే సత్కారము జరిగినది. ఈ విధముగా దేవాంగుని వివాహ మహోత్సవము నాలుగు రోజులుపాటు జరిగినది.

శ్రీ దేవదత్త దేవాంగమనుబ్రహ్మల వివాహము నాలుగు రోజులు జరిగినది. ఈ వివాహ తంతులోని కర్మలు కొన్ని కేవలం వధువును శారీరక శుద్ధి మరియు పవిత్రత కొరకు చేస్తారు. మరికొన్ని కర్మలు వరుని (పెండ్లికుమారుడు) యొక్క శారీరక శుద్ధితోపాటు పవిత్రత కొరకు చేసేవి వుంటవి. ఇంకొన్ని కర్మలు వధూవరుల కిరువురికి శారీరక పవిత్రత కొరకు చేసే సంస్కారాలు వున్నవి. ఈ విధముగా దేవాంగుని వివాహ కర్మ నాలుగు రోజులపాటు జరిగినది. సమంత్రకమైన వివాహమునకు ధార్మిక, సామాజిక ప్రాధాన్యతలున్నవి. మంత్రం అంటే వేదమని అర్థం. దైవానుగ్రహము కోసము జరిపించే శబ్దాలే మంత్రాలు. వివాహము జరిగినట్లుగా కొందరు పండితులు సుముహూర్తానికి వధూవరుల శిరస్సున జీలకర్ర బెల్లం పెట్టిస్తున్నారు నేడు. కాని అది వివాహము జరిగినదిఅని నిరూపించే చిహ్నముకాదు. జీలకర్ర బెల్లం పైన తెలిపిన విధముగా వధూవరులను ఇరువురిని పవిత్రీకరించటానికి చేసే సంస్కారము మాత్రమే. మంగళసూత్ర ధారణయే వివాహము అయినట్లుగా ప్రామాణీకరించబడింది. అందువలననే దేవాంగ బ్రహ్మ సుముహూర్త సమయానికి దేవదత్త మెడలో మాంగల్యము కట్టినాడు. వివాహ క్రతువులో వధువు శిరస్సున కాడిని వుంచి ఆవుపాలద్వారాశిరస్సును అభిమంత్రించుట అనునది వధువు దేహము, ఆత్మను పవిత్ర పరుచుటకు ఉద్దేశింపబడినది. వధువునకు నడుముచుట్టూ దర్భత్రాడును కట్టుటకూడ వధువును సంస్కరించుట మాత్రమే. పెండ్లికుమారునకు అత్తమామలు ద్వితీయ యజ్ఞోపవీతమును , మధుపర్కములను, పెరుగు బెల్లం పెట్టడము మొదలగునవి వరుని సంస్కారానికి చెందినవి అని తెలియవలయును. వివాహ క్రతువులో కొన్ని సంస్కారాలు పూర్తిగా పెండ్లికుమార్తెకు సంబంధించినవి.మరికొన్ని సంస్కారాలు వరుడుకు

సంబంధించినవి. ఇంకొన్ని సంస్కారాలు వధూవరులకు కలిపి చేసే సంస్కారాలు. ఈ సంస్కారాలు అయిన పిదప అనగా శరీరమును పవిత్రీకరించబడిన తరువాత మంగళసూత్రధారణ జరుగుతుంది. ఈ విషయములన్నియు శ్రీ దేవాంగ వివాహము నిరూపించుచున్నది.వధూవరులను పవిత్రీకరించబడిన తరువాత జరిగే గర్భాదాన క్రియవలన ఉత్తమ దివ్యమైన సంతానము కలుగుతుందని ఋషులు పలికినారు. మంగళసూత్రధారణ తర్వాత తలంబ్రాలు, బ్రహ్మముడి, ముత్తైదువుల ఆశీర్వచనపూర్వక ఫలదానాలు, నల్లపూసలధారణ, అరుంధతీదర్శనము, పెద్దల ఆశీర్వచనం ఇవి అన్నియు ఇప్పటి దేవాంగకులంలో ఆచరిస్తున్నారు.

## సప్తపది

వివాహములో ప్రధాన హోమము అనేది వధూవరుల ఆయుష్యము,సౌభాగ్యము, పుత్రసంవృద్ధికొరకు చేయబడుతుంది. ఈ హోమములోనే సప్తపది ఏడుఅడుగులు భార్యాభర్తలు ఇరువురు చేయిపట్టుకొని అగ్నిహోత్రం చుట్టూ ప్రదక్షణచేస్తారు. ఓచిన్నదానా- నీవు నన్ను అనుసరించి నడువుము అంటు మొదటిఅడుగు ఆహారంకోసము, రెండవఅడుగు బలంకోసము, మూడవది వ్రతాలకోసము, నాల్గవదిస్నేహంకోసము, ఐదవది పశుసంవృద్ధికోసము,ఆరవది సంపదకోసము, ఏడవఅడుగు యజ్ఞముచేయించే హోత, ప్రశాస్త, బ్రాహ్మణాచ్ఛంసి, పోత,నేష్ట, ఆచ్ఛాదిక, అగ్నీంద్రులనే ఏడుగురు ఋత్విజుల దీవెనలకోసము వేద్దాము. నాతో ఏడడుగులు వేసిన సఖీ నీవు నా స్నేహితురాలివి- నేను నీ స్నేహాన్ని అనుభవించుదునుగాక. అని అగ్నిహోత్రం చుట్టూ ఏడుసార్లు తిరుగుతూచేసే సాప్తపదిక ప్రమాణాలే వివాహ క్రతువులో ముఖ్యమైనవి. కన్యాదాన సమయములో పలికే నాతి చరామి కూడ ప్రముఖమైనదే.

**లాజహోమం:-** దంపతులు దీర్ఘమాయుష్యం కొరకు పేలాలుతో హోమం చేస్తారు.

**వివాహ ప్రవేశహోమం:-** నూతన వధూవరుల ఆయుష్యఅభివృద్ధి కొరకు చేస్తారు. ఈ హోమం అనంతరం సప్తఋషులకు పూజచేసి అరుంధతీ దర్శనం చేయిస్తారు.



**స్థాలీపాక హోమం:-** దంపతుల ఆయుష్షు, వర్చస్సు, యశస్సు, బలము, వృద్ధికొరకు ఈ హోమము చేయించెదరు. ప్రాజాపత్య హోమమును కూడ చేస్తారు. అనంతరము ఫలదానములు ఇప్పించుతారు. వధూవరులను ఆశీర్వదించుతారు. మంగళహారతి ఇస్తారు.

**నిత్యతండుల హోమము:-** ప్రాతఃకాలములో చేయించుతారు. గౌరీపూజను పుత్ర పౌత్రాభివృద్ధి , ధన ధాన్యాభి వృద్ధి, ఆయుష్యాభి వృద్ధికొరకు దంపతుల చేత చేయించెదరు. బ్రహ్మాది పంచపాలికలను పూజించుతారు. దీనినే **ఐరిణీపూజ** అందురు.

వివాహ నాల్గవ దినమున అలక నామకోత్సవం జరుపుతారు. రాత్రి సమయమున శేషహోమమును దంపతీరక్షణార్థము సుమాంగల్య సుసంపదకొరకు చేయిస్తారు. ఈ శేషహోమము అనంతరము వధూవరుల చేత మంగళస్నానం చేయించుతారు. శుభ్రమైన వస్త్రములను, బాషికములను ధరించి నాక దేవతకు బలిఇస్తారు. తరువాత గౌరీనీలలోహితపూజజరిపి వధువు కంఠమునందు నల్లపూసలు, సూత్రంను వరుడు కడతాడు. ఆ తరువాత గర్భాదానము జరుగుతుంది. ఐదవరోజు ఉదయం కంకణ విసర్జన చేయుటద్వారా వివాహకార్యక్రమం ముగిసినదిగా భావించుతారు. శ్రీ దేవదత్త దేవాంగ వివాహము ఈ సృష్టి ఏర్పడిన రోజునుంచి లెక్కించగా 2598341 మానవ రోజున జరిగినది. దేవాంగ వివాహ ముహూర్త లగ్నమునకు రవి, చంద్ర, కుజ, శుక్ర, శని గ్రహములు ఉచ్చరాసులలో ఉన్నవి. 5 గ్రహములు ఉచ్చరాసులలో ఉండి జరుపబడిన వివాహము అత్యద్భుతము. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు జన్మించినప్పుడు 5 గ్రహాలు ఉచ్చ రాసులలో ఉండినవి. ఈ విధముగ అత్యంత శ్రేష్ఠమైన శుభలగ్నములో దేవాంగుని వివాహము జరుగుటద్వారా నేటికి ఈ వంశము అభివృద్ధిలో ఉన్నది. వీరి సంతానము ద్వారా వస్త్రములు, యజ్ఞసూత్రములు లోకమునకు అందించబడుచున్నవి. తద్వారా వేదవిద్యలు యజ్ఞయాగాది కర్మలు ఆగమోక్త దేవతార్చనలు నిరాటంకముగా జరుగుచున్నవి. ఈ విధముగా శ్రీ దేవదత్త దేవాంగమనుబ్రహ్మల వివాహ ప్రక్రియ నాలుగురోజుల పర్యంతం జరిగినది. అనంతరం సూర్యుడు తన చెల్లెలగు దేవదత్తకును తన బావ దేవలుడుకు

అనేక విధములైన ఏనుగులు, గుర్రములు, రథములు, ఆభరణములు, దాసదాసీజనమును కానుకగా ఇచ్చినాడు. దేవాంగుడు తన భార్య దేవదత్తతో కలసి ఛాయామార్తాండుల వద్ద సెలవు పుచ్చుకొని తన ఆమోదపట్టణమునకు వెడలిపోయినాడు. ఈ చరిత్ర చదివిన వారికి శివానుగ్రహం కలుగుతుంది.

వివాహములో మేనరిక సంబధములు చేసుకొను ఆచారము దేవాంగ వంశములోనే మొదటగా ప్రారంభమైనట్లుగా తెలియుచున్నది. దేవలమహర్షికి దేవదత్తద్వారా ముగ్గురు కుమారులు దివ్యాంగుడు, విమలాంగుడు, ధవళాంగుడు అనువారు కలిగిరి. ఈ కుమారులకు సూర్యుని కూతురులు అయిన స్వర్ణప్రభ, పద్మాక్షి, చపలాక్షిలతో వివాహము అనంతర కాలంలో జరిగినది.





# దేవాంగ రాజ్యపాలన

## పదమూడవ అధ్యాయము

దేవల దేవదత్తల వివాహము తరువాత జరిగిన వృత్తాంతమును సూత మహర్షి శౌనకాది మునులకు చెప్పుచున్నాడు. దేవాంగ మహారాజు ప్రజలందరు సుఖ సంతోషములు కలిగి వుండునట్లును, భూదేవి మిక్కిలి సంతోషించునట్లు తన ఆమోద పట్టణమును పాలించుచుండెను. యధా రాజా తథా ప్రజా అను సూక్తి ప్రకారము రాజువుండే విధానమునుబట్టి ప్రజలును అదే విధముగా నుండెదరు. మరి ఆమోద పట్టణ పాలకుడు అసామాన్యుడుమరియు అద్వితీయుడు. వేదవేదాంగములు ధర్మశాస్త్ర ఆగమములను సర్వ విద్యలు తన యందుంచు కొన్నట్టి వాడు ఈశ్వరుడు. అటువంటి జ్ఞాన స్వరూపుడుయొక్క ఫాల నేత్రము అను జ్ఞాన నేత్రమునుండి ఉద్భవించినాడు దేవలుడు. కావున దేవలుడు 64 విద్యలయందు ఆరితేరినవాడు. లోకానికి పాలకుడు విద్యావంతుడైనచో ప్రజలను రంజింపజేయగల పాలనా పటిమ కలిగివుండును. ఆత్మజ్ఞానము మెండుగా వున్న దేవాంగుని పాలనవలన భూదేవి సంతుష్టి చెందినది. అందువలన ఆ రాజ్యములో నెలకు నాలుగు వానలు కురియుటవలన పాడిపంటలు సమృద్ధిగా వుండినవి. ఆహార ధాన్యాల లభ్యత పుష్కలంగా వుండుటవలన అతని రాజ్యములో అన్నార్తులు అనేవారు మచ్చుకైనా ఒక్కరుకూడా కనపడక వుంటిరి. రాజు ధర్మాత్ముడు కాబట్టి ప్రజలుకూడా ధర్మమను అవలంభించుట వలన సమాజములో దోపిడీలు, దొంగతనాలు మొదలగు దుష్కృతములు చూద్దామన్నా కనబడకపోవుచుండెను. పాలకులు ప్రజలనుండి ధర్మయుక్తమైన భూమి శిస్తు వసూలు చేయుట వలనను ప్రజలవద్ద అధిక ధనము వుండుట వలన తమ అవసరములకు తగిన వస్తువులను సమకూర్చుకొని సౌఖ్యవంతమైన జీవితం గడుపుచున్నారు. ఆ రాజ్యము పతివ్రతలైన స్త్రీలతో నిండి వున్నది. అందువలన ప్రజలుధర్మ మార్గములో తమ స్త్రీలయొక్క సంతోషానికి కృషి చేయుచుండిరి. అన్య మార్గములను అనుసరించకుండా తమ స్త్రీలను సంతోషపెట్టుచుండిరి. ఈ విధముగా ఆ రాజ్యమునందలి ప్రతి గృహిణి సుఖ సంతోషముకలిగి యున్నది. ఆమోద

పట్టణాధీశుడు దేవాంగుడు ప్రజలను తన కన్న బిడ్డలవలె ఆదరించుచుండెను.

## ఇంద్రుని పాలనకన్నా ధీటైన పాలన

సమస్త దేవతలకు ప్రభువైన ఇంద్రుడు పాలించురీతిగా దేవాంగుడు ఆమోద పట్టణమును పాలించుచుండెను. అందువలననే ఆ రాజ్యమందు అతివృష్టి అనావృష్టిలాంటి ఈతి బాధలుఅనేవి ప్రజలు ఎరుగరైతిరి. భూమి సమస్తమైన పంటలతో వుండి పతివ్రతయైన స్త్రీ గుణవంతుడైన భర్తను పొంది ఎట్లు ప్రకాశించునో ఆ విధముగా ఆ రాజ్యములోని భూదేవి ప్రకాశించుచుండెను. వర్షదేవత అధికముగా వర్షింపదు, ఎప్పుడును వానలేకుండా చేయదు. ప్రజలకు జంతువుల వలనను పక్షులవలనను బాధలు లేవు. శత్రువుల బాధలు అనేవి వారికి అసలు తెలియదు. వానదేవుడు కాలము తప్పక సువృష్టి కురిపించుచున్నాడు. భూమి సమస్తమైన ఔషధులచేత పూర్ణమై సమగ్రములైన పంటలను ఇచ్చునదిగావుండెను. అందువలన జనులు సంతోషము పొందినవారై సకల విద్యలయందు చాతుర్యము కలవారుగను, వినయము, సదాచారము పాటించువారుగను వుండిరి. అచ్చట బ్రాహ్మణులందరు తపస్సు చేయువారుగను, యజ్ఞయాగాదులు చేయువారుగా నుండిరి. క్షత్రియులు పరాక్రమము కలిగియుండినారు. సకల శిల్పములు తెలిసికొని యున్నారు. కీర్తిప్రతిష్టలతో కూడిన మంచినడవడిక కలిగివుండి వృద్ధిని పొందుచుంటిరి. వైశ్య జాతులు ఎల్లప్పుడు గోవులను పోషించుచుండిరి. వారు వ్యాపారమును నగదుతోను, ధాన్యముతోను, మారకముగా గలిగి మంచి మార్గములో వుండినారు. కీర్తియును, వినయమే అలంకారముగా కలిగినవారుగను వుండిరి. అంతేగాకుండా పురాణములు విను వారుగను, ఎల్లప్పుడు జ్ఞానమును పొందవలయునను కోరిక కలవారుగను, పెద్దలను పూజించుటయందు ఆసక్తి కలవారుగనువుండి వృద్ధి చెందుచుండిరి. శూద్రులు సత్పురుషులను పూజించుట తెలిసిన వారుగను, ధర్మమును వృద్ధి చెందించువారుగను, పనిపాటలయందు ఆసక్తి కలిగి దానిద్వారా విశేషముగా ధాన్యములు పండించుచు వృద్ధి చెందుచుండిరి. సమస్త జనులు ఆనందమును పొందుచున్నారు దేవాంగుని రాజ్యములో. ఆ రాజ్యములో కాళ్ళు లేనివారు లేరు. చెవిటివాండ్రు లేరు, గ్రుడ్డి వారును లేరు, ఎల్లప్పుడును రోగములతో



పీడింపబడువారును లేరు, మోసము చేయువారు లేరు, దుఖముతో బాధ పొందువారు లేరు, వికృతరూపముతో పుట్టినజనులు లేరు. ముసలివారు చూచుచుండగా బాలురకు పైతృక కర్మలుజరుగుట లేదు. అనగా అల్పాయుష్కులు అను వారు లేరు. స్త్రీ లందరు మంచి నడవడిక కలవారై దీర్ఘ సుమంగళు లుగా వుండిరి. అచ్చట గొడ్రాళ్ళు అయిన స్త్రీలు అనగా సంతానములేని స్త్రీలు లేరు. ప్రతి దంపతులు సంతానవంతులై యుండిరి. చెడు ప్రవర్తనగల స్త్రీలు లేనేలేరు. కోరిక తీరనిది లేదు. స్త్రీలు తమ పెనిమిటియందు భక్తిగలవారై ప్రకాశించుచుండిరి. ఎక్కడను జగడములు లేవు. ప్రజలు ఒకరిమీద ఒకరు అసూయా ద్వేషములు లేకుండా వుండిరి. మిక్కిలి సొగసైన ఆరాజ్యంలో దరిద్రులు అనగా యాచకులు అను వారు లేరు. అచ్చటి ప్రజలు ఒకరిపట్ల మరొకరు ప్రేమ, అనురాగము, ఆప్యాయతలతోకూడి వుండిరి. ఆచారములను, ఐక్యమత్యమును, వినయమును అధికముగాకలిగివుండి ధర్మమును అధికముగాపాటించు వారుగా వున్నారు. ప్రజలు తమతమ వర్ణమునకు చెందినధర్మమును పాటించువారుగా నుండిరి. అచ్చట భూమి సమస్త ఔషధములచేత అనేక రకాల పంటలు పండుట వలన ప్రజలందరూ సంతోషములు పొంది వుండిరి. ఈ ప్రకారముగ మహాపరాక్రమశాలియగు దేవాంగరాజు ఆమోద పట్టణం పాలించుచుండగా త్రేతాగ్నులు అనగా మూడు అగ్నులు వంటి తేజస్సుగల ముగ్గురు పుత్రులు దేవదత్త దేవాంగులకు కలిగిరి. అప్పుడు ఆ ముగ్గురు పుత్రుల వలన దేవదత్త దేవాంగులు మిక్కిలి సంతోషము పొందిరి. ఏ విధముగా అంటే జయంతునిచేత శచీదేవి ఇంద్రుడు ఎట్లు సంతోషము పొందినారో అదే విధముగా తమ కుమారులతో సౌఖ్య జీవనము పొందినారు దేవదత్త దేవాంగులు. కుమారుడైన మన్మథుని చేత మహాలక్ష్మి విష్ణువువలెను, కుమారస్వామి చేత పార్వతీ పరమేశ్వరుల వలెను, దేవదత్త దేవాంగుడు తమ పుత్రుల చేత ఆనందమును పొందిరి. మనస్సునందు ఎటువంటి చింత, విషాధము లేకుండా కాలమును గడుపుచుండిరి. పిమ్మట దేవాంగ మహారాజు తమ పిల్లలకు శాస్త్రము చెప్పిన రీతిననే జాత కర్మాది కర్మలను అన్నింటిని జరిపించినాడు. వారి పుత్రులు యౌవనము వచ్చునంతలో అన్నిటియందు అనగా అన్నిపనులను చేయుటయందు నైపుణ్యమును సంపాదించినారు. పాలకుని కుమారులు కాబట్టి సమస్తమైన ఆయుధములను

ప్రయోగించుట మొదలగు వాటిని తెలుపు శాస్త్రము లన్నిటిని అధ్యయనం చేసి వుండిరి. ధర్మమును కాపాడుటయే తమ ప్రధాన ధర్మముగా తెలుసుకున్న వారైరి.

## మేనరిక వివాహాలు

యుక్త వయస్కులై వివాహము చేసుకొను వయస్సు వచ్చిన వారైనందున దేవలుడు తన బావగారైన సూర్యుని కుమార్తెలు అగు స్వర్ణప్రభ, పద్మాక్షి, చపలాక్షి అను వారిని వరుసగా తన ముగ్గురు కుమారులైన దివ్యాంగుడు, విమలాంగుడు, ధవలాంగుడు అను వారితో వివాహములు చేసినాడు. ఈ విధముగా తన కుమారులకు దేవాంగుడు వివాహము చేసి కొడుకు కోడండ్రతో కలిసి సంతోషముగా జీవనము గడుపుచుండిరి. మేనమామయొక్క కూతుళ్ళను వివాహము చేసుకొనే ఆచారము దేవాంగ వంశంలో దేవలుడి కుమారుల కాలంనుండే వున్నది అని దీనివలన తెలియుచున్నది. ఆ తరువాత మహాబుద్ధిశాలి అగు దేవాంగుడు తన జ్యేష్ట పుత్రుడైన దివ్యాంగుడికి యువరాజ పట్టాభిషేకము చేసెను. మంత్రులతో కలసి దేవాంగుడు రాజ్యమును పాలించుచుండెను. ఈ విశ్వములో ఎవరి పాలన ధర్మపాలన, సుభిక్షమైన పాలన, ప్రజలందరు ధర్మాత్ములై సుఖ సంతోషాలతో కూడివుండిన పాలన, నెలకు నాలుగు వర్షాలు కురియు పాలన, ప్రకృతి వైపరిత్యాలు లేనిపాలన, ఆచారవంతులు, వినయ సంపన్నులు, ఐకమత్యమే బలము అని నమ్మిన ప్రజలు గలపాలన శత్రువులచేత పీడింపబడని పాలన, వికృత జన్మలు లేనిపాలన, అకాల మరణాలు లేని పాలన, బిచ్చ గాళ్ళు లేని పాలన, ఎవరిదై వుంటుంది అని అలోచిస్తే ఠక్కున సమాధానం వచ్చేది ఆమోదగిరి పట్టణ దేవాంగుని పాలన ఆ తరువాతే ఎవరి పాలనైనను. ఆదిశేషుని కూతురైన చంద్రరేఖ దేవాంగునకు సకల సాముద్రిక శుభ లక్షణములతో కూడినవాడును, ధర్మాచరణమే బుద్ధిగా గలవాడును, మిక్కిలి బలముగల వాడును అగు సుధర్ముడు అను ప్రసిద్ధి చెందిన కుమారుడు పుట్టెను. ఆ సుధర్ముడు సకల సంపదలు కలిగి శుక్లపక్ష చంద్రునివలె వృద్ధి పొందుచుండెను. కురూదేశముయొక్క ప్రభువు శూరసేనుడు మిక్కిలి గర్విష్ఠుడై దేవాంగుని రాజ్యమును అల్లకల్లోలము చేయుటకు ప్రయత్నించు చుండగా దేవాంగరాజు ఆ శూరసేనుని యుద్ధమునందు



సంహరించెను. ధర్మమును వృద్ధిచేయునట్టి తన కుమారుడైన సుధర్ముని కురూదేశానికి ప్రభువుగా పట్టాభిషేకం జరిపించినాడు. సకల ధర్మములు క్షుణ్ణంగా గ్రహించిన వాడైన సుధర్ముడు కురూదేశమునందలి పుండరీకము అను పట్టణమునందు తన తండ్రిచేత పట్టాభిషిక్తుడైనాడు. తన తండ్రివలెను ధార్మిక జీవనం సాగించుచు ధర్మయుక్త పాలన చేయుచుండెను. అవంతి రాజు కుమార్తె, దివ్యమైన దేహకాంతిగల పుష్కల అను పేరుగల కన్యతో సుధర్ముడికి వివాహం జరిపించినాడు దేవలుడు. సుధర్ముడు తన భార్యతో చక్కగా జీవించుచు ప్రజలు సంతోషించు విధముగా రాజ్యపాలన చేయుచుండెను. గొప్పదైన ధనస్సు కలిగివుండి ధైర్య శౌర్య పరాక్రమములయందు ఎవరు సాటిలేని వారైనటువంటి ఆ దేవాంగుడు తన కొడుకులుతో కలసి రాజ్యమును సుభిక్షముగా పాలించుచుండెను.



# రాక్షసుల యుద్ధ సంరంభం

## పదునాల్గవ అధ్యాయము

### దేవదానవ యుద్ధం జరుగుటకు ప్రధాన కారణము

సూతమహర్షి శౌనకాది మునులకు తరువాత జరిగిన సంగతిని చెప్పుచున్నాడు. దేవతలు, గంధర్వులు, యక్షులు, కిన్నర, కింపురుషులు, విద్యాధరులు, మొదలగు దేవజాతులందరు వస్త్రములను గ్రహించి ధరించి అలంకారము పొంది మిగుల గర్వముతో అటు ఇటు విహరించుచున్నారు. దేవతలు రాక్షసులకు వస్త్రములు లేకపోవుట వలన వాళ్ళనుచూచి ఎగతాళి చేయుచు అవమానించు చున్నారు అని రాక్షసులు భావించినారు. దేవతలు అహంకారులై వస్త్రములులేని మనలను అవమానించుట పుండుపై కారము చల్లిన విధముగా వున్నది. ఈ విషయమును రాక్షసులు తమ రాజైన వజ్రదంష్ట్రునితో చెప్పిరి. ఈ మాటవినగానే దేవతలకు వస్త్రములు లభించినందులకు కోపం చెందివున్న అతనికి దేవతలు తమవారికి వస్త్రములు లేనితనాన్ని చూచి హేళన చేయుట మిక్కిలి అవమానకరమైన విషయముగా రాక్షసరాజైన వజ్రదంష్ట్రుడికి తోచినది. దీనిని సహించుట ఎట్లు. కావుననే మూడులోకములకు అధిపతినైతే మూడులోకముల యందుండు సంపద అంతా మన రాక్షసులకేగదా దక్కేది. కావున దేవతల గర్వం అణచివేయాలి. వారికి తగిన సమాధానం చెప్పాలి. వారు వస్త్రహీనులమైన మనలనుచూచి జాలిపడవలసిన వారు జాతి శత్రుత్వం వలన మనలను హేళన చేయుచుండగా మనము సహింపరాదు. దీనికి ప్రతీకారము తీర్చుకోవలసినదే అని వజ్రదంష్ట్రుడు రాజు తలచి వెంటనే తన తమ్ముళ్ళను ఇద్దరిని వ్యాఘ్రువక్త్రుడు, సర్పజిహ్వున్ని పిలిచి ఓరీ తమ్ములారా ఇప్పుడు దేవతలు తమకు కలిగిన వస్త్రసంపద చేత మిక్కిలి గర్వించి మనజాతివారిని అసహ్యించు కొనుచున్నారు. ఇది భయంకరమైన అవమానకరమైనదిగా వున్నది. ఇంతకన్నా అవమానం వేరొకటి వుండదు. ఈ విధముగా మనలను అవమానిస్తుంటే మనము సహించి వుండవలసినదేనా? మనము చేసిన తప్పిదముఏమిటి, దేవతలు చేసిన ఒప్పు ఏమిటి. అందరికి వస్త్రములను ఇచ్చి మనకు ఇవ్వక పోవటానికి కారణమేమిటో



తెలియదు. వస్త్రములు నేసిన దేవాంగరాజు దేవతలందరికి చివరికి సర్వజాతుల వారికికూడా వస్త్రములు ఇచ్చినాడు. అతను దేవతలనే అనుసరించినాడు కాని మనలను పూర్తిగా నిర్లక్ష్యం చేసినాడు. కైలాసమునందు శివుని కచేరీలో దేవలుని వద్దనున్న వస్త్రములను తన చేతతీసుకొని తన కొలువులో వున్న వారందరికి శివుడు వస్త్రములను ఇచ్చినాడు. అక్కడనే వున్న మనవారికి వస్త్రములు ఇవ్వకపోయెను. ఇది చాలా బాధాకరమైన విషయము. అసలే దేవాంగుడు, శివుడు ఇద్దరు మనలను అవమానపరచినారను బాధను దిగమింగలేక పోతూవుంటే మధ్యలో ఈ దేవతలు వస్త్రాలను ధరించి మనలను చూచి నవ్వడం క్షమించరానిది. కావున మనము దేవతలను జయించి స్వర్గమును ఆక్రమించెదము. ఇంద్రున్ని సింహాసనమునుంచి దించుతాము అని వజ్రదంష్ట్రుడు తన తమ్ములతో చెప్పెను. అందుకు అతని తమ్ములు నిజమే రాజా! మీరుచెప్పిన రెండు మాటలు యదార్థమే. దేవతలు వస్త్రములు ధరించి మిక్కిలి గర్వముతో వుండి మన జాతివారిని అవమానించటం సహించరానిదే అది యదార్థమే. ఇక రెండవ మాట అయిన ఇంద్రున్ని జయించి స్వర్గలోకాన్ని ఆక్రమించెదము అనునది జరుగుట కష్టమే. ఎందువలనంటే రాక్షసులను జయించుట దేవతలకు వల్లకాదు. అందువలన వారు మన చేతిలో తప్పనిసరిగా ఓడిపోతారు. కాని ఆ తరువాత దేవేంద్రునికి కష్టము కలిగినది అని విష్ణుమూర్తి తెలుసుకొని తన సుదర్శన చక్రము చేతను, శారంగము అను మిక్కిలి విలువైన ధనస్సు చేతబట్టుకొని మనపై యుద్ధానికి వస్తాడు. అతడిని మనము జయించలేము. ఎన్నిసార్లు ప్రయత్నించినను మనము ఓడిపోవుటయే జరుగుతున్నది. కావున విష్ణుమూర్తిని ఓడించలేము. అందువలన వలన స్వర్గలోకము తిరిగి దేవేంద్రునికి కట్టబెట్టతారు. అని తమ్ములు అనగానే మిక్కిలి అసహనం చెందిన వజ్రదంష్ఘుడ్టు మీరు విష్ణుని ఓడించలేమని బెంబేలు పడుచున్నారు ఏమిటి? ముందుగా ఇప్పుడు జరుగవలసిన కార్యమును గూర్చి ఆలోచించవలయును. దేవతలు మిగుల గర్వముతో విర్రవీగుతూ మనలను హేళన చేయుచున్నారు. కాబట్టి దేవతలకి దేవేంద్రునికి తగిన విధంగా తీక్షణమైన బాణాలతో నొప్పింపజేయాలి .ముందు ఇంద్రునితో యుద్ధముచేసి అతనిని ఓడించుతాము.ఆ విధముగా దేవతలమీద ప్రతీకారము తీర్చుకొనెదము. ఆ తరువాత కదా విష్ణుమూర్తి మనతో యుద్ధానికి వచ్చేది ముందే రాడుకదా

కాబట్టి అప్పటి విషయమును తగురీతిగా ఆలోచించి నిర్ణయము అప్పుడు తీసుకుందాము.

## దేవతలను జయించటానికి తపస్సుచేసిన రాక్షసులు

కావున వెంటనే దేవతలకు తగిన బుద్ధి చెప్పాలి. అందుకొరకై మనము ముగ్గురము అవ్యయుడు అయిన పరమేశ్వరుని గురించి మిగుల నిష్ఠలను పాటించుచు తపస్సు చేస్తాము. శివునిచేత వరమును పొంది ఆ తరువాత దేవతలను జయించెదము. కావున మనము ముగ్గురము తపస్సుకు యోగ్యమైన స్థలము వద్దకు వెళ్ళి నిష్ఠాగరిష్టులను పాటించుచు దేహమును కృంగతీసుకోనైనా సరే పరమేశ్వరుడి నుంచి వరము కోరుకొనెదము. అని అనగానే వెంటనే తపస్సుకు అనుకూలమైన ఒక మంచి ప్రదేశం చూసుకొని శివునియందు మనస్సు నిలిపి ఘోరమైన తపస్సు చేయుట ద్వారా తమ శరీరములను కృశింపజేసుకొనిరి. వారి తపస్సుకు మెచ్చి పరమేశ్వరుడు మిక్కిలి సంతుష్టి చెందినాడు. పరమేశ్వరుడు రాక్షసులతో మీరు చేసిన తపస్సు నన్ను సంతోష పరచినది. కావునమీ మనస్సు యందుండు కోరికను తెలుపుము. దానిని నెరవేర్చెదనుఅని శివుడు చెప్పగా అప్పుడు రాక్షసులు ఓ షడ్గుణైశ్వర్య సంపన్నుడా! దేవదేవులందరికిని మారకుడైన ఓశంకరా మా తపస్సుకు ప్రీతిచెందితివి అని తెలిపినావు చాలా సంతోషం.

## సూర్యుని ఆవశ్యకత

మాకోరిక ఏమిటంటే ఎల్లప్పుడు సూర్యుని ప్రకాశము లోకమందు లేకుండునట్లుగా చేయుము అని రాక్షసులు వరము కోరగా శివుడు ఆ రాక్షసులతో ఈ వరము నేను ఇవ్వజాలను. ఇది ఇవ్వతగినది కాదు. కావున మరిమొక వరమును కోరుకొనుము. సూర్యుడు బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపుడు. సకల దేవతాస్వరూపుడు. జగత్తు నంతటికి నేత్రరూపుడు. కర్మలను చూచువాడు, రక్షించువాడు అతడే, శ్రేష్టములైన ధర్మములు ఆచరించిన వారికి ఫలములు ఇచ్చునది అతడే. లోకమునందు పుణ్యము ఆచరించిన వారికి శ్రేష్టమైన పొందదగిన చోటుకూడా అదే. అతడు ఉదయింపగనే గదా జనులు సర్వకర్మలను చేయుచున్నారు. సూర్యుడు ఉదయింపగనే జనులు మేలుకొనుచున్నారు.



అస్తమించినప్పుడు నిద్రపోవుచున్నారు. ఓ రాక్షసులారా లోకమునకు కన్నువంటిదైన సూర్యుడు ప్రకాశింపకపోతే లోకమందుండు జనసమూహము సూర్యుని ఉదయాస్తమయములు తెలియక మిక్కిలి గాఢాంధకారమునకు భయపడి ఎట్లు నిలిచెదరు. ఎట్లు సంచరించెదరు. తరువాత శ్రౌతస్మార్త కర్మలన్నిటికీ ఏమి గతి పట్టును. ఓ రాక్షసులారా! మీరు తెలియక అటువంటి వరము అడిగితిరి. అది ఇవ్వసాధ్యమైనది కాదు. కావున వేరొక కోరికను కోరుకొనుడు అను మాట శివుని నోటినుండి రాగానే మిక్కిలి నిరుత్సాహపడిరి. చివరకు పరమేశ్వరునితో ఆ రాక్షసులు ఓ షడ్గుణైశ్వర్య సంపన్నుడవై దేవతలకెల్ల ప్రభువైనవాడా స్వామీ భక్తులయందు ప్రీతి కలవాడా! అట్టైన మరొక వరము కోరెదము. అది ఏమిటంటే ఒక సంవత్సర కాలము పాటు సూర్యుని ప్రకాశము లేకుండా వుండు విధముగా చేయుము అని కోరగానే శివుడు అట్లే అగుగాక అని చెప్పి అంతర్ధానమయినాడు. వెంటనే అంతటా కాటుకవలె నల్లటి చీకటి బ్రహ్మాండమంతటనూ వ్యాపించెను. స్థావర జంగమములతో కూడి చరాచర జగత్తు అంతయూ అంధకారముతో క్రమ్ముకొని పోయినది. కొండలన్నియూ కాటుకలచేత కప్పబడి వున్న వలె ప్రకాశించెను. అంతట వజ్రదంష్ట్రుడు అను రాక్షసుడు వేగముగా తన వీరమహేంద్ర పట్టణము వద్దకు వెళ్ళి దూతలను పిలచి ఇట్లు చెప్పినాడు. మీరు ఇప్పుడు వెంటనే నాలుగు దిక్కులకు వెళ్ళి మన వారైన రాక్షసులు ఎక్కడెక్కడ వున్నారో వారందరినీ కూడగట్టుకొని దేవతలపై యుద్ధానికి రమ్మని చెప్పి వారిని వెంటబెట్టుకొని తీసుకురావలెను. కింకరులారా అని చెప్పి వారిని పంపినాడు. మిక్కిలి వేగముతో రాక్షసులవద్దకు వెళ్ళి రాక్షసరాజైన వజ్రదంష్ట్రుని మాటను అచట వున్న వారందరికీ చెప్పి ప్రేరేపించి యుద్ధమునకు సన్నద్ధులైన రాక్షసులందరితో కూడి ఆ దినమందే వచ్చిరి. మిక్కిలి మదము కలిగి గర్వించి వున్న రాక్షసులందరూ మిక్కిలి కావరము కలిగి దేవతలతో యుద్ధము చేయటానికి తయారై స్వర్గలోకమును గురించి ప్రయాణము చేసిరి.



# దేవదానవ సేనా యుద్ధము

## పదునైదవ అధ్యాయము

సూతమహర్షి శౌనకాది మునులకు దేవదానవ సంగ్రామమును గురించి చెప్పుచున్నాడు. మిక్కిలి పరాక్రమముగల ఆ రాక్షసులందరూ చేరి వజ్రదంష్ట్రుని ఆనతి ప్రకారము తమ పట్టణములనుండి బయలుదేరిరి. రాక్షసులకు ప్రభువైన వజ్రదంష్ట్రుడు చతురంగబల సమేతముగా అనగా కాల్బలము, గజబలము, అశ్వబలము, రథబలములతో కూడుకొని యుండెను. యుద్ధము చేయుటకు నిశ్చయించుకొని వీరమాహేంద్రపట్టణమునుండి స్వర్గలోకమునకు పోవుటకు బయలుదేరిరి. అతని తమ్ముళ్ళు రాక్షసులకు ప్రభువులైన వ్యాఘ్రవక్తుడు, సర్పజిహ్వుడును, అనేకమంది సైన్యముతో యుద్ధమునకు వెడలిపోయిరి. సూర్యునివలె కోపము కలిగి వుండుట వలన సూర్యకోపుడనియు, అగ్నివంటి కోపము గలవాడగుటచే అగ్నికోపుడను ఇరువురు వజ్రదంష్ట్రుని కుమారులు వీరిద్దరు మిక్కిలి పెద్ద సైన్యముతో తండ్రియైన వజ్రదంష్ట్రుని అనుసరించినారు. మహాబలముగల వారు అగు వజ్రముష్ట్యాది మేనళ్ళుళ్ళు ధూమ్రనేత్రుడు, ఖడ్గజిహ్వుడు వీరిద్దరు రథములచేతను, కాల్బలముల చేతను, గుర్రములచేతను, పెక్కురాక్షసుల చేత పరివేష్టింపబడి వుండిరి. వారందరూ యుద్ధము చేయుటకు సంసిద్ధులై వుండినారు. అప్పుడు అనేక విధములైన రణభేరులు వాయింపబడెను. శౌనకాదిమునులారా వినండి అని సూతులువారు చెప్పుచున్నారు. మిక్కిలి పరాక్రమవంతులు అగు రాక్షసులందరు యుద్ధము చేయు కోరిక కలిగి బహుసైన్యమును సమకూర్చుకొని స్వర్గమునకు బయలుదేరినారు. వారు ధనస్సుల అల్లెలను టంటం అని శబ్దింపజేయుచుండెను. గుండెలు అవిసిపోయినట్లుగా రొప్పుచూ స్వర్గమును చుట్టుముట్టిరి. స్వర్గలోక వాకిళ్ళను అడ్డగించిరి. రాక్షసుల రాకను తెలుసుకొనిన దేవతలు ఎక్కువమంది కోపమును కలిగియుండిరి. యుద్ధానికి తయారయినారు. రాక్షసులను అనేక విధములుగా బాధించినారు దేవతలు. రాక్షసుల తలలు నరకబడినవి. రాక్షసుల రథములను



తుత్తునీయములుగా చేయబడినవి. గుర్రములు, ఏనుగులు పదాతి దళముల వారిని పడగొట్టిరి. రాక్షసుల రథములను సారథులతో సహా పడగొట్టిరి. ఆయుధములు ధరించిన అశ్విక సైన్యమును యమదండము వంటి ఆయుధములతో కొట్టి పడవేసినారు. గజసైన్యమును కూడా పడగొట్టినారు దేవతలు. దేవతలు యుద్ధవిహారము చేసి రాక్షసుల సైన్యమును చెల్లాచెదురు చేసిరి. పెక్కు విధములుగా రాక్షససైన్యమును ఛేదించిరి. రాక్షసులను తరిమి తరిమి కొట్టుచుండిరి దేవతలు. దేవతల బలపరాక్రమముల ముందు రాక్షససైన్యము ఎందుకూ పనికిరాకుండా పోయినది దేవతలముందు. మిక్కిలి భయము చెందిన రాక్షస సైన్యము పదిదిక్కులకూ పారిపోయినది. మహాబలసంపన్నుడైన వజ్రదంష్ట్ర రాక్షస రాజు పారిపోవుచున్న తన సైన్యమునకు ఎదురు వచ్చి వారిని నిలుపుచేసినాడు. వారిలో యుద్ధ ఉత్సాహాన్ని తిరిగి నింపినాడు. రాక్షసులందరూ మిక్కిలి ధైర్యము తెచ్చుకొని మరలా దేవతలపై దండెత్తడానికి పయనమయినారు. తన సైన్యమును చెల్లాచెదురు చేసిన దేవతలపై విపరీత ఆగ్రహమును కలిగి కసిగా వున్నాడు వజ్రదంష్ట్రుడు. తన కొడుకులు, మేనళ్ళుళ్ళు వారితో కూడుకొని వుండి దేవతలపై తమ యుద్ధనైపుణ్యాన్ని ప్రయోగించినాడు. దేవతలు రాక్షసులు ఒకరినొకరు జయింప కోరుచుంటిరి. విజయమో వీరస్వర్గమో అను రీతిగా రాక్షసులు తెగించి యుద్ధముచేసిరి. దేవతలు రాక్షసుల మధ్య సంకుల సమరం సాగినది. దేవతలు రాక్షసుల రథాలను పడగొట్టడానికి ప్రయత్నించగా రాక్షసులు దేవతల రథాలను పడగొట్టడానికి ఇలా ఇరువురు ఒకరిపై మరొకరు తమ ఆధిపత్య పోరు సలిపినారు. ఇదే పద్ధతిలో కాల్బలముగల పదాతిదళము పరస్పరం ఒకరిమీద ఒకరు జయం కోసం తీవ్రాతి తీవ్రమైన పోరాటం చేయుచుండిరి. అదే పద్ధతిలో అశ్వికబలము కూడా ఒకరినొకరు కూలద్రోసుకోవటానికి శక్తివంచన లేకుండా పోరాడుచుండిరి. ఈ యుద్ధము ఒక ప్రత్యేక యుద్ధంగా సాగినది. దేవతలు ఎంత ప్రయత్నించిననూ ఈసారి రాక్షస సేనలముందు దిగజారిపోయినారు. రథికులు రథికులతోను, అశ్వబలమువారు అశ్వబలమువారిపైననూ, గజబలము వారు గజబలమువారితోను, పదాతిదళము పదాతి దళమువారితోనూ హెూరాహెూరీగా పోరాటం సాగుచున్నది. అంతేకాకుండా రథికులు కాల్బలము

వారిపైననూ, గజబలము వారిపైననూ, అశ్వికదళము వారితోనూ ఎదుర్కొన్నారు. ఇదే విధముగా అశ్వక దళమువారు గజబలము వారిపైనను, రథికుల పైనను, కాల్బలము పైనను ఈ విధముగా ఒక దళము వారు మిగతా దళములపై శక్తివంచన లేకుండా దేవతలు రాక్షసులు హోరాహోరీగా పోరాడుచుండిరి. వీరి మధ్య మహాసంగ్రామము వలె జరిగినది. పట్టాకత్తుల చేతను, రోకళ్ళ చేతను, శూలముల చేతను, గడ్డపారల చేతను, గండ్ర గొడ్డళ్ళ చేతను, కర్రల చేతను, ఇనుప రోకళ్ళ చేతను ఈటెలచేతను, నిప్పులు గ్రక్కుచున్న ఆయుధములచేతను,పరిఘల చేతను, గదలచేతను, కత్తెరల చేతను ఈ విధముగా అనేక విధములైన ఆయుధములతో ఒకరినొకరు కొట్టుకొనుచుండిరి, నరుకుకొనుచుండిరి. గ్రుచ్చుచు, చీల్చుచు, పడద్రోయుచు దేవతలు రాక్షసులు భీకరముగా యుద్ధము చేయుచుండిరి. ధైర్య సాహస పరాక్రమవంతులు అనేకమందిని చంపివేయుచుండిరి. రథములు ముక్కలు ముక్కలు చేయబడుచున్నవి. రథచక్రముల రాపిడి వలన కలిగిన చప్పుళ్ళు గజముల ఘీంకారములతో, గుర్రముల సకిలింపులతో, సిపాయిల అరుపులు, రొప్పులు, ధనస్సులయొక్క టంకార శబ్దములచేతను, నగారాలతోను, శంఖధ్వనుల చేతను, డప్పులు, బాకాలు శబ్దములచేత వచ్చెడి శబ్దము మూడులోకములందలి జనులందరిని చెవిటి వారిని చేసే విధముగ భయంకర ధ్వనులు వెలువడుచున్నవి. సముద్రములు పొంగి పొరలుచున్నవి. మహా గాఢాంధకారము అలుముకొని వున్నది. తమ ఆయుధముల తళ తళలాడు కాంతుల సహాయంతో అవతల వారి తలలను గొట్టుచుండిరి. మరికొందరి కిరీటముల కాంతులు వెదజల్లు చుండగా రాక్షసులు దేవతలను కొట్టుచుండిరి. రాక్షసుల విజృంభణకు దేవతలు బేజారి పోయినారు. చివరకు గత్యంతరము లేక స్వర్గ పట్టణమునకు పరుగెత్తుకొనిపోయి దాక్కొని ప్రాణాలను కాపాడుకొనుచుండినారు. ఈ విధముగా రాక్షసులది పైచేయిగా వున్నది. ఈ రోజుకు ఇక యుద్ధము చాలునని మిక్కిలి సంతోషముచెందిన వజ్రదంష్ట్రుడు ప్రకటించి తమ వీరమాహేంద్ర పట్టణమునకు వెళ్ళినాడు.

ఓ ఋషులారా! రాక్షసులచే మిక్కిలి బాధింపబడి, పీడింపబడి మిక్కిలి ఆక్రోశము చెందిన దేవతలు గత్యంతరము లేక మిక్కిలి వేదన చెందినారు.



వారందరు దేవేంద్రుని కలసి అతనితో ఆలోచనచేసినారు.

## దేవతలు సాంబశివుని ఆశ్రయించుట

రాక్షసుల విజృంభణ నుండి రక్షింపబడుటకు మనమందరము సాంబశివుని వద్దకు వెళ్ళెదము. రాక్షస సంహారము కొరకు తగిన ఉపాయమును ఆలోచించమని ప్రాధేయపడదాము అని నిశ్చయించుకొని వేగముగా కైలాస పర్వతమునకు వెళ్ళి శివుని అంతఃపురములోనికి ప్రవేశించిరి. అచ్చట అనుగ్రహవంతుడైనట్టి ముఖము కలిగిన వాడును, క్షేమము కలుగచేయునట్టియు, మహానుభావుడైనట్టియు, పార్వతీదేవికి ప్రియుడైనట్టి ఆ సాంబశివుని చూచి ఇంద్రునితోకూడా దేవతలందరు వారికి మ్రొక్కినారు. అప్పుడు దేవతలకే దేవుడైన, లోకనాధుడు అగు ఆ శివుడిని పలువిధములుగా బహుస్తోత్రములు చేసినారు. దేవతలు చేసిన స్తోత్రము ఈ విధముగ వున్నది. దేవతలకెల్ల ఈశ్వరుడవైన స్వామీ నీకు నమస్కారము. పరమాత్మ స్వరూపుడైన ఓ స్వామీ నీకు నమస్కారము. జ్ఞానముచేత తెలియదగినవాడా నీకు నమస్కారము. భక్తులయందు ప్రేమ గలవాడా నీకు నమస్కారము. సకలమైన వారిచేత నమస్కరింప దగినవాడా నీకు నమస్కారము. కడలేని (తుది,అంచులు) మూర్తిగలవాడా నీకు నమస్కారము. ఈ విధముగా అనేకములైన వాక్యములచేత పరమేశ్వరున్ని స్తుతిచేసినారు దేవతలు. అప్పుడు బోళాశంకరుడైన మహా స్వామిఅయిన శివుడు ఆ దేవతలను గూర్చి మాటలాడెను. ఓ దేవతలారా! మీరు క్షేమమేకదా! ఓ నూరు అశ్వమేధయాగములు చేసి స్వర్గమునకు అధిపతివైన ఇంద్రుడా నీకు క్షేమమేకదా! వజ్రాయుధముయొక్క క్రీడచేత రాక్షసులయొక్క మేడలను పగలగొట్టడంలేదా! ఈ విధముగా షడ్గుణైశ్వర్య సంపన్నుడైన శివునిచేత అడగబడిన దేవతలు ఆ శివునితో తమ మొర చెప్పుకొనుచున్నారు. స్వామీ! తమ అనుగ్రహము వలన మాకు అన్ని విధములుగ క్షేమము కలిగియుంటిమి. కాని ఇప్పుడు దుర్మార్గుడైన వజ్రదంష్ట్రుడు అను రాక్షసుడు మమ్ములను విపరీతముగా బాధించుచున్నాడు. నిన్నటిదినము పెక్కుసైన్యముతో వచ్చి స్వర్గ పట్టణమును ముట్టడిచేసినాడు. యుద్ధమందు మమ్ములను మిక్కిలి బాధపెట్టినాడు. అతను పెట్టే బాధలను భరించలేక మిమ్ములను శరణు వేడుచున్నాము. కావున దయాసముద్రుడా! మమ్ములను

కాపాడుము. శుభములను కలుగచేయుస్వామీ అతనితో యుద్ధము చేయు శక్తి మాకులేదు. సర్వ కార్యములయందు సమర్ధుడా ఆ రాక్షసుని చావునకు ఉపాయము చెప్పుము. మిక్కిలి బలముగల వారును, దగ్గరకు చేరరానివారగు అతని తమ్ములగు వ్యాఘ్రువక్త్రుడు, సర్పజిహ్వుడు అను రాక్షసులను యుద్ధరంగమునందు ఎవరు సహింపగలరు. బెదిరింప గూడనియు కాలాంతకుని తోడను,యమునితోడను సమానులైన ఆ వజ్రదంష్ట్రుడను రాక్షసుని కొడుకులు సూర్యకోపుడు, అగ్నికోపుడులు మిక్కిలి బలము కలవారు. అతని మేనల్లుళ్ళు అగు ధూమ్రనేత్రుడు, ఖడ్గజిహ్వుడుని ఎవరు సహింపగలరు. దగ్గరకు చేరరాని ఆ రాక్షసులను యుద్ధమందు మేము సహింపజాలము. మిక్కిలి బుద్ధిమంతుడైన ఓ స్వామీ వారిని చంపుటకు ఉపాయము ఆలోచింపుము. భక్తులయందు ప్రీతి కలవాడా ఆ రాక్షసులను చంపి మమ్ము కాపాడుము మమ్ములను రక్షించువారు ఎవరును లేరు. మీరే మాకుదిక్కు. మిమ్ములనే రక్షకునిగా పొందినాము అని ప్రార్ధించిరి.

## ఇంద్రునికి సహాయముగా యుద్ధం చేయుటకు దేవలున్ని పంపుట

ఈ విధముగా దేవతలచేత ప్రార్ధింపబడిన తరువాత మహాదేవుడైన ఈశ్వరుడు తల ఆడించి బాగుబాగు అనిచెప్పుచు కొంతసేపు ధ్యానముచేసి అచ్చుటవున్న దేవాంగుని ముఖమునుచూచి ఆ దేవలరాజుతో ఇట్లు పలికినాడు. గొప్ప భుజబలము కలిగిన ఓ దేవాంగుడా నీవు దేవతలతో కూడిన ఇంద్రునికి రాక్షసులకు జరుగుచున్న యుద్ధమందు నీవు దేవతలకు సహాయముచేయుము. ఓ రాజ శ్రేష్టుడా! నీవు నీ చతురంగ (అశ్వక, గజ, రధ, కాల్బలము) బలసైన్యముతో కూడి నీ కుమారులతో కూడుకొని ఇంద్రునితోను, దేవతలతోను, కూడుకొని శీఘ్రముగా ఆ రాక్షసులను జయింపుము. అని మహేశ్వరుడు చేత ఈ విధముగా చెప్పబడిన వాడైన దేవలుడు మంచిది అని తన అంగీకారమును శివునికి తెలియపరచినాడు. అప్పుడు శివుడు వేయికన్నులు కలిగిన ఇంద్రునితో ఓ ఇంద్రా నీవు యుద్ధము చేయుటకు సిద్ధముగా వుండుము. ఈ దేవాంగుడు నీకు సహాయముగా వచ్చును. వజ్రదంష్ట్రుడు మొదలగు రాక్షసులందరిని జయించెదరు మీరు. ఈ విధముగ శివునిచేత చెప్పబడిన వారైరి. ఇంద్రుడు



మిక్కిలి సంతోషము పొందెను. శివునితో ఇంద్రుడు ఈ విధముగా పలికెను. కైలాస పర్వతమునకు నాధుడా, దేవతల ప్రభుడా మీ మాట నెరవేరును గాక ఏ రాక్షసులు మమ్ములను ఎల్లప్పుడు బాధించుచున్నారో వారు ఓడిపోవుదురు గాక అనిచెప్పి దేవతలతో కూడా ఇంద్రుడు శివునకు మ్రొక్కి శలవుతీసుకొని ఆ కొలువు కూటమునుండి దేవాంగునితో బయటకు వచ్చినాడు. తరువాత దేవాంగముని ఇంద్రుని గూర్చి ఇట్లు చెప్పెను. ఓ ఇంద్రుడా! నీవు ఇప్పుడు దేవతలతో కూడి స్వర్గమునకు వెళ్ళుము. నేను వేగముగా ఆమోదపట్టణమునకు వెళ్ళి చతురంగబల సైన్యమును సమాయించుకొని నీ వెనుకనే వచ్చెదను అని ఇట్లు చెప్పగానే అంత ఇంద్రుడు దేవాంగునితో త్వరగా రండి అనిచెప్పి సంతోషమును పొందినవాడై దేవతలతో కూడి స్వర్గమునకు పోయెను. అంతట దేవాంగరాజు ఆమోదపట్టణమునకు వచ్చెను. వచ్చిన వెంటనే తన బంట్రోతుల ద్వారా సేనాధిపతులను పిలిపించుకొని రాక్షసులతో యుద్ధము జరుగుచున్నది. కావున మన చతురంగబల సైన్యమును త్వరగా కూర్చండివేగిరముగా స్వర్గలోకానికి వెళ్ళవలసి వున్నది అని వారిని ఆజ్ఞాపించెను. వెంటనే తన కుమారులను పిలిచి యుద్ధానికి సన్నద్ధులు కండి అని చెప్పినాడు. దేవాంగ మహారాజు తన కొడుకులతో కూడుకొనియుండి కోటిరధములతోను, ఏనుగులతోను, కాల్బలములతోడను, గుర్రాలతోడను స్వర్గమునకు బయలుదేరెను. సైనికులు మార్గమధ్యములో అనేక వాయిద్యములు వాయించుచు స్వర్గమునకు చేరినారు.స్వర్గమునకు చేరగానే దేవాంగరాజును దేవేంద్రుడు ఎదురువచ్చి తోడ్కొని తన అంత:పురమునకు తీసుకు వెళ్ళినాడు. దేవాంగరాజు సైన్యమునకు కోరిన పదార్ధములను తెప్పించి వారికి విందు చేయించినాడు. దేవతల రాజు దేవేంద్రుడు యుద్ధము చేయగోరు రాక్షసుల రాక సమాచారమంతయు తెలుసుకొని ఆ రాత్రి సుఖముగా నిద్రించినాడు. తరువాత మరునాడు దేవతలకు ప్రభువైన ఆ ఇంద్రుడు వార్తాహరులచేత దేవతలందరికి ఒక్కచోటికి రావలయునుఅని సమాచారమును పంపెను. ఆ ప్రయాణమును గురించి తెలియపరచునట్టి యుద్ధ నగారాలు మ్రోగించినాడు దేవతలందరు ప్రాత:కాలముననే చేయవలసిన ఆహ్నిక కృత్యములను తీర్చుకొని ఇంద్రుని వద్దకు చేరిరి. అంత దేవేంద్రుడు అందరు ఒక్కచోట చేరవలెనని దండోరా వేయించినాడు. ఇంతలో వజ్రదంష్ట్రుడు మొదలగు రాక్షసులందరిని

గూడుకొనివచ్చి దేవతలతో సంకుల సమరం చేయుచుండెను. ఆ రాక్షసులు దేవతలు ఒకరినొకరు కొట్టుకొనిరి. రథములమీదనున్నట్టియు, కాలుబలమును, అశ్వికబలమును, గజ దళమును గొప్పధనస్సులు చేతబట్టుకొని దేవతలచేత రాక్షసులు అనేక విధములుగ పీడింపబడినారు. దేవతల పరాక్రమమునందు రాక్షసులు నిలువలేక పోయిరి. అప్పుడు రాక్షసులు రక్షణకోరుచూ వ్యాఘ్రువక్త్రునిగూర్చి వెళ్ళినారు.



# వ్యాఘ్రు వక్త్ర వధ

## పదునారవ అధ్యాయము

సూతమహర్షి తరువాతి కథను శౌనకాది ఋషులకు చెప్పుచున్నాడు. రాక్షస సేనను దేవతలు విపరీతంగా బాధించగా వారునలుప్రక్కలకు పారిపోవుచుండిరి. మహాబలుడును, మహాప్రాజ్ఞుడునుశత్రుపాపస్సుడును అగు దేవలునివద్దకు ఒక రాక్షసుడు వచ్చి మహా మధురముగా మాట్లాడినాడు. ఏమని అంటే దేవాంగరాజా! నీవు యుద్ధములో ధనస్సు పట్టుకొని ప్రళయకాలపు మేఘునివలె ప్రకాశించుచున్నావు. నీ బాణముల వరముచే శత్రువులను ముంచివేయుచున్నావు. నీతో యుద్ధము చేయుటకు నేను తప్ప ఇంకెవ్వరునూ పనికిరారు. అడవిలోని సింహము మృగములను పరిగెత్తించినట్లు నా శత్రువులైన దేవతలను పరిగెత్తింతును. మహాగొప్పది అగు నా రథము ఘోష చేత భూమి ఆకాశములు నిండునట్లు శబ్దమును చేయుదును. అమ్ములపొది నుంచి బాణములను తీసి ప్రయోగించెదను. ఈశ్వరునితో అంధకాసురుడు యుద్ధము చేసినట్లు నీవు నా ఒక్కడితోనే యుద్ధము చేయుము అని ఈ విధముగ రాక్షసుడు అనగానే దేవాంగుడు నవ్వుతూ ఖడ్గముతో ఆ రాక్షసున్ని కొట్టినాడు. ఆ దెబ్బకు రాక్షసుడు నొచ్చుకున్నాడు. ఆ రాక్షసుడు మర్మభేధములగు బాణములచే దేవలున్ని కొట్టినాడు. వెంటనే 90 బాణములచే సకల మర్మ స్థానములయందు గొట్టెను. ఆ రాక్షసుడు ప్రయోగించిన బాణములు తగిలిన దేవలుడు కిరణములతో



కూడినసూర్యుడు ప్రకాశించినట్లు ప్రకాశించినాడు. తరువాత దేవలుడు కోపమును చెంది వేలకొలది బాణములను ఆ రాక్షసునిపై ప్రయోగించి వ్యాఘ్రవక్త్రుడను పేరుగల రాక్షసున్ని బాణములతో ముంచెత్తి సింహనాదము చేసినాడు దేవలుడు. వ్యాఘ్రువక్త్రుడు తన బాణములచేత దేవలుని బాణములను వారించిదేవలుని నుదుటమీద కొట్టినాడు. నుదుటయందు తగిలిన బాణముచేత ఆ దేవలుడు వనమునందు గర్వించియుండి సంచరించుచు ఉండు ఖడ్గ మృగమువలె కనబడుచున్నాడు. ఆ తరువాత దేవాంగుడు నవ్వుచు ఆ రాక్షసుడి నుదుటికి తగులునట్లుగా వాడియైన మూడు బాణములను ప్రయోగించినాడు. ఆమూడు బాణములు తగిలిన వ్యాఘ్రువక్త్తుడు రక్తము కారుచుండ వర్షాకాలములోని ఉదకముచేత తడుపబడిన మూడు శిఖరములు కలిగిన కొండవలె కనబడుచుండెను. అప్పుడు ఆ వ్యాఘ్రువక్త్రుడగు రాక్షసుడు వేల తరబడి బాణములను దేవలునిపై ప్రయోగించినాడు. అవిఅన్నియు కొండను కదపలేనట్లుగా కంపింపజాలకపోయెను. అట్లే దేవలుడుకూడ రాక్షసుడిని కొట్టినాడు కాని జల ప్రవాహము కొండను ఏమీచేయలేనివిధముగా వ్యాఘ్రువక్తుని ఏమీ చేయలేకపోయినాడు. మహారధికులును, మహాశూరులును అయిన దేవలరాజును వ్యాఘ్రువక్తుడును రథంమీదనుండి రథమును ఇవతలకు అవతలకు పరిగెత్తించుచూ ఒకరిమీదనొకరు పెక్కు బాణములు ప్రయోగించినారు. లోకములను ధ్వంసం చేయుటకు దహించి వేసినట్లుగా తమ కిరణములచేత తీవ్ర ఎండలు కాయునట్లు ఇరువురు సూర్యులు వున్నట్లు దేవలుడు, వ్యాఘ్రువక్తుడు ఒకరినొకరు తపింపజేయు చున్నారు. మహా రధికులైన వారిరువురు ఒకరు చేయు కార్యమునకు ప్రతిగా దానికి తగినట్లుగా బాణ సమూహములచేత ఒకరు అంటే మరొకరు భయపడక ప్రతీకారమును తీర్చుకొను చుండిరి. పులి కోరల వంటి బాణములు గలిగి అదిలింప శక్యములేనటువంటి వారి చేత విల్లులుబట్టి భయంకరులై పెద్ద పులులవలె కొట్టుకొనుచుండిరి. ఒకరి బాణములు ఒకరిని కనబడకుండా కప్పగా మరొకరి బాణములు మరొకరిని అగపడకుండా చేసినవి. అప్పుడు వారిద్దరు మేఘములు గప్పిన చంద్ర సూర్యులవలె నుండిరి. ఒకమారు కనబడుట మరియొకమారు కనపడకవుండుట కలిగి యుద్ధము చేయుచుండిరి. అట్టి సమయమున వ్యాఘ్రువక్తుడు దేవలుని భయంకరములగు బాణములచేత గొట్టుచు అపసవ్యముగా చేసెను. దేవలుడు శత్రువుయొక్క

జయ చిహ్నాములను గమనించి, సహింపక తన రథమును సవ్యముగా వచ్చునట్లు చేసికొనెను. వ్యాఘ్రవక్త్రునకు దేవలునికి సంకుల సమరంగా పెద్ద యుద్ధము జరిగినది. అనేక విధములైన సర్పగతులు మండలాకారమైన నిలుపుదలను చేసి వారిద్దరు ఘోరముగ దొమ్మి యుద్ధము చేసిరి. ఒకరినొకరు చంపుకొనునట్లుగా బాణముల అల్లెత్రాడును చెవిదాకలాగి మిక్కిలి వేగముగా బాణములు వదులు చుండిరి. మహాస్త్రములను తెలిసియున్న వ్యాఘ్రవక్తుడు గొప్పవైన అస్త్రములను ప్రయోగింప నారంభించినాడు.

## మహా ఘోరమైన యుద్ధము

ఋషులారా! అప్పుడు ఆ యుద్ధము మహా ఘోరమైన అస్త్ర యుద్ధముగా మారినది. అది ఏవిధంగా వున్నదంటే అది ప్రళయాంత కాలమున లోకములను నాశనము సూచించు గ్రహ యుద్ధము వలె నున్నది వారి మధ్య జరుగుచున్న అస్త్ర యుద్ధము. ఆకాశమంతా అస్త్రములతో నిండిపోయినది. పరస్పర బాణముల రాపిడిచే అగ్ని జ్వాలలు పుట్టుచున్నవి. నాశనమునకు సంకేతముగా ఉల్కలు పడినట్లుగా వున్నవి. ఆ సమయమునందు అంతరాళమునందున్న సిద్ధులు, ఋషిశ్రేష్టులు యోగదృష్టి గలవారందరు ఈ విధముగ పలికిరి. మిక్కిలి యుద్ధములు అనేకములు జరిగినవి. ఈ యుద్దము జరుగుచుండెను. గతంలో జరిగిన యుద్ధములన్నియు ఈ యుద్ధమునకు సరిరావు. నూరుశాతంలో 5 శాతం మాత్రమే పూర్వపు యుద్దాలు ఈ యుద్ధమునకు సాటి వచ్చును. ఇకమీదట ఇటువంటి యుద్ధము జరుగబోదు. ఆహ్హాహ్హా దేవలరాజు, వ్యాఘ్రవక్తుడు ఇద్దరూ యుద్ధ విద్యలయందు ఆరితేరినవారు. ఇద్దరూ భయంకరమైన పరాక్రమము కలవారు. ఇద్దరూ అమిత ధైర్య సాహసములు, భయంకరమైన పరాక్రమము కలవారు. ఇద్దరూ అమిత ధైర్య సాహసములు కలవారు. ఈ యుద్ధమునందు వారిద్ధరి బలమును గురించి ఏమని వర్ణింపగలము. ఎంత చెప్పినను తక్కువగానే వుండును. వారు యుద్ధమందు ప్రదర్శించు అస్త్ర ప్రయోగ కౌశలము మిక్కిలి మెచ్చుకోదగినది. ఆహా! వీరి ప్రతాపము ఎంత గట్టిది. వీరిద్దరు ఎంత ఋజువైన వారు, వీరిద్దరూ నిలిచియుండగా ఒకరు యమున్ని సంహరించువారుగను మరొకరు యముడు వలె వున్నారు. వీరిద్దరూ రుద్రులవలె వున్నారు. ఇద్దరు సూర్యులు ఉదయించి



నట్లున్నారు. యుద్ధమందు భయంకరమైన రూపమును ధరించి యుండెడి వీరు యమధర్మరాజును మించిన పరాక్రమము కలవారుగా నున్నారు అని ఆకాశమందు సిద్ధులు ఈ విధముగా మాటలాడుకొనుచున్నారు. వారి మాటలు పలుమారులు వినబడుచున్నవి. ఆశ్చర్యకరమైనట్టి యుద్ధకార్యము చేయుచుండగ ఆకాశమందు రాక్షసులును, దేవతలును సింహనాదములు చేయుచుండిరి. యుద్ధమునందు శూరులును, అరివీర భయంకరులునై ఆ ఇద్దరు ఒకరికొకరు అపకారము చేసినవారై ఒకరికొకరు కోపముచేత గ్రుడ్లురిమి చూచుటచేత వారి కన్నులు ఎర్రబారినవి. పెదవులు అదురుచున్నవి. తమ పెదవులను కొరుకుకొనుచు, పండ్లు (దంతములు) గొరుకుచు ఒకరిమీద ఒకరు మరొకరు బాణ వర్షములు కురిపించుచుండిరి. ఆ బాణ వర్షముచేత సూర్యుని కాంతి భూమిమీద కానరాకుండా ఆఛ్ఛాదించుచుండిరి. ఒకరి గుర్రములను మరొకరు మిక్కిలి బాధ పెట్టుచుండిరి. మహా పరాక్రమ సంపన్నుడైన దేవాంగరాజు రాక్షసుని సారథిని నరికివేసినాడు. రెండు బాణములచేత రథముపై వున్న జెండా స్థంభమును పడగొట్టెను. నాలుగు బాణములచేత రథమునకు కట్టియున్న నాలుగు గుర్రములను నరికివేసినాడు. రథమును పడద్రోసినాడు. అర్ధ చంద్రాకార బాణము ప్రయోగము చేసి ఆ రాక్షసుని వింటినిముక్కలు చేసెను. శీఘ్రముగ మూడు వందలు బాణములచేత ఆ రాక్షసున్ని చురుకుగా కొట్టెను. శత్రువును జయించవలెనని ప్రయత్నం చేయుచున్న దేవలుడు వ్యాఘ్రవక్త్రుడిని ఒక చురుకైనతీక్షణమైన బాణముతో వ్యాఘ్రవక్త్రుని తలను ఖండించినాడు. మిక్కిలి పెద్ద శిరస్సు మణికుండలముల చేత ప్రకాశింపబడే కిరీటముతో కూడిన ఆ రాక్షసుని శిరస్సు ఆకాశమునుండి భూమిమీద పడి న సూర్యబింబమువలె ప్రకాశించుచు ఆశ్చర్యమును గొల్పు రీతిగా శిరస్సు తిరుగు చుండెను. అప్పుడు రాక్షసులందరు వ్యాఘ్రవక్తుని మరణమును చూచి భయభ్రాంతులు చెంది నలుదిక్కులకు పరుగులు తీసిరి. దేవతలు రాక్షసులను తరుముతుండిరి. దేవతలు అప్పుడు సింహనాదమును చేసినారు. ఈ విధముగా సమర్ధవంతుడైన పరాక్రమవంతుడైన దేవలరాజును దేవేంద్రుడు గొప్పగా పొగిడినాడు. అతి సంతోషము కలిగిన ఇంద్రుడు దేవలున్ని పూజించినాడు.



# నందిధ్వజ ప్రభావము - రాక్షస పరాభవము

## పదునేడవ అధ్యాయము

శౌనకాది మునులకు సూతుడు తరువాత కథను చెప్పుచున్నాడు. మిక్కిలి బలవంతుడైన వ్యాఘ్రువక్త్రుడను రాక్షసరాజు మృతిచెందగానే మిగిలిన రాక్షసులు దెబ్బలు తినజాలక వజ్రదంష్ట్రుని యొద్దకుపారిపోయి జరిగిన వృత్తాంతమంతయు తెలిపిరి. తన తమ్ముడు చనిపోవుట అను వార్త విన్న వజ్రదంష్ట్రుడు దుఃఖము తోడను, కోపము తోడను గూడినవాడై సగరేశ్వరుడు అగు దేవాంగుని మీదకు పరిగెత్తి వచ్చినాడు. అప్పుడు దేవాంగుడు వజ్రదంష్ట్రుని ఎదుర్కొనినాడు. పరస్పరము జయము కోరుచుండిన వారిద్దరు దేవేంద్రునకు వృత్తాసురునకు జరిగిన యుద్ధంవలె ఈ వజ్రదంష్ట్రుడు దేవాంగునికి జరిగిన యుద్ధము అదే విధముగవున్నది. వజ్రదంష్ట్రుడు దేవాంగునిపై అనేకములగు బాణములను కురింపించెను. కాని జలప్రభావము కొండను ఏమీచేయ జాలనిదిగా వుండు రీతిగా ఆ యుద్ధమున్నది. రాక్షసుడు ప్రయోగించిన బాణములను దేవలుడు తన బాణములచే నివారించుకొని తాను వానిని ఘోరములగు బాణములచేత గొట్టెను. దేవాంగునిచే కొట్టబడిన బాణములచే రక్తమును స్రవించుచున్న ఆ రాక్షసుడు వర్షాకాలములో జేగురుకొండవలె ప్రకాశించుచున్నాడు. ఆ రాక్షసులు చాలా దెబ్బలుతిని పాములవంటి తమ బాణములతో దేవాంగునిని కొట్టిరి. అనేక బాణములచే సారధిని, రెండు బాణములచే ధ్వజమునుగొట్టి, మూడు బాణములచే దేవాంగుని నుదుటి మీదను గొట్టెను. ఆ బాణములు నుదిటికి తగులుట వలన సగరేశ్వరుడు అగు దేవాంగ మహారాజు త్రికూట పర్వతమువలె ప్రకాశించెను. ఆ తరువాత దేవాంగుడు కోపగించుకొని ధనస్సును గుండ్రముగా చేసుకొని డెబ్బైమూడు బాణములచే వజ్రదంష్ట్రుని గొట్టినాడు. ఒక బాణముచే ధనస్సును మరియొక బాణముచే ధ్వజమును, నాలుగు బాణములచే నాలుగు గుర్రములను కొట్టి పడవేసెను. మరల అన్నే బాణములు వేసివాని రథమును పొడిపొడిగా చేసినాడు. అంతే కాకుండా అనేక బాణములు సంధించి రాక్షసున్ని మిక్కిలి పీడించెను. ధనస్సు



పోయినది, సారధి చచ్చినాడు, రధము లేదు, గుర్రములు చచ్చినవి గట్టిగా వజ్రదంష్ట్రుని కొట్టినాడు. అప్పుడు వజ్రదంష్ట్రుడు వేసవిలో పూసిన మోదుగ వలె వున్నాడు. అట్టి రాక్షసుడు గాలిలోని చెట్టువలె కంపించి గద పట్టుకొని దండపాణి యమునివలె దేవాంగుని మీదకు పరుగెత్తినాడు. అట్లు వచ్చుచున్న వజ్రదంష్ట్రుని చూసిన దేవాంగుడు పిడుగులవంటి బాణములు ప్రయోగించి వాని చేతిలోని గదను ఛేదించినాడు.మదించిన ఏనుగువలె అప్పుడు దేవాంగుడు ధ్వనిచేసెను. దేవతలందరు సంతోష సూచకముగా కేకలు పెట్టిరి. దేవదుందుభులు మ్రోగినవి. ఆ రాక్షసుడు గదపోయి నిరాయుధుడై దిక్కులు చూచుచూ ఏమిచేయుటకు పాలుపోక హేమకూటము యొక్క శిఖరమును పెళ్ళగించి చేతపట్టుకొని దేవాంగరాజుతో ఓ రాజా! పోకుము పోకుము, క్షణమాత్రము నిలిచియుండుము. నీవేమో గర్వించి కేకలు వేయుచున్నావు. ఇదిగో చూడు ఈ కొండశిఖరము నీప్రాణమును తీయును. పిడుగు పడినట్లుగా పడి నిన్ను నీరథమును పొడిపొడిగా చేయును.ఇంద్రుడు మాతో యుద్ధము చేయలేక నిన్ను తోడుగా తెచ్చుకున్నాడు.గదా!ఇప్పుడు ఈ కొండ శిఖరము వలన నీవు పడిపోగా ఇంద్రుడు వాని సైన్యముకూడా భయపడి పారిపోవును. నా తమ్ముడు వ్యాఘ్రువక్త్రుడను చంపి గర్వించుచున్నావు నీవు, నేను భ్రాతుడు మరణించినాడు అను విచారముతో వున్నాను. నేను నిన్ను చంపి వాని ఋణమును తీర్చుకొందును. దేవతల అహంకారమును అణచెదను. అప్పుడు నాతమ్ముడు సంతోషించును. ఓరీ! మాకు వస్త్రములు ఇవ్వక తక్కిన వారందరికి ఇచ్చినావు గదా! ఇప్పుడు నీవు నా చేతికి చిక్కినావు. ఇక ఎక్కడకు పోగలవు. నాఎదుటపడిన నిన్ను కాపాడువాడు ఎవ్వడున్నాడు.? చూచెదవుగాక అని ఈ విధముగా బిగ్గరగా అరుస్తూ రాక్షసుడు దేవలునిపై కొండశిఖరమును విసిరివేసినాడు. అప్పుడు దేవసైన్యమునందు హాహాకారములు పుట్టినవి. దేవలునికి క్షేమమగు గాక అని సిద్ధులు పలికినారు. దేవాంగుడు ఆకాశ మార్గాన వచ్చుచున్న కొండశిఖరమును వజ్రములవంటి తన బాణములచే దానిని పొడిపొడిచేసి క్రిందపడవేసెను. దేవలుడు చేసిన ఈ అద్భుత కార్యమును చూచి దేవతలు సాధువచనములు పలికిరి. కొండశిఖరమును కూల్చివేసి నవ్వుచు ఆ రాక్షసుడి మీదను, వాడి తోడివాండ్రమీదను లెక్కకు మిక్కిలిగా బాణములు

ప్రయోగించినాడు దేవాంగుడు. కాలాంతకుని ఆకృతి దాల్చినవాడై అమిత బరువుగల తన ధనస్సునుండి టంకారము చేయుచు తన రథమును నాలుగువైపులకు త్రిప్పుచు ఆకాశమును బాణమయముగా చేసినాడు దేవాంగుడు. అనేక రాక్షసుల శిరస్సులను ఖండించుచు మిగిలిన వారిని నాలుగు వైపులకు పరుగెత్తించు చుండెను. శారంగమనే ధనస్సును చేతపట్టిన విష్ణువు ఏవిధముగా యుద్ధంచేయునో అదే విధముగా దేవాంగుడు రాక్షసులతో యుద్ధము చేయుచుండెను. చాలామంది రాక్షసులు చావగా మిగిలినవారు ప్రాణములను రక్షించుకొనుటకై పిడికిలి బిగించి పారిపోయిరి. అప్పుడు వజ్రదంష్ట్రుడు దేవాంగునితో యుద్ధము చేయజాలక మహామాయను కల్పించినాడు. దేవతల సైన్యముపై పర్వత వర్షమును కురిపించినాడు. అవి ప్రపంచమును గాడాంధకారముగ చేసినవి. ఎక్కడ చూచినను పిడుగుల వలె రాళ్ళు పడుచుండెను. మాయామేఘములు ఎడతెరిపి లేకుండా వర్షింపదొడిగినవి. మహా గాలులు బయలుదేరి దేవతలను కంపింపజేసినవి. దేవతలు ఈ పరిస్థితికి దీనులై పోయినారు. ఈ రాక్షసమాయను సహింపజాలక దేవలునికి మొరపెట్టుకొను చుండిరి.

## దేవలుడు యుద్ధమునందు నందిధ్వజమును ప్రయోగించుట

ఆ రాక్షసుడు ఎవ్వరికి కనబడకుండా వుండి మాయను ప్రదర్శించుచు దేవతలను పీడించుచుండెను. అప్పుడు దేవాంగ మహారాజు మాయాసముద్రములో మునిగి భయకంపితులై వున్న దేవతలను కాపాడుట కొరకును, అదృశ్యరూపుడుగా వున్న ఆ వజ్రదంష్టుని జయించుట కొరకు మనస్సులో నిశ్చయించుకొని తనకు శివభగవానుడు ఇచ్చిన శత్రు సంహారక శక్తి కలిగిన వృషభధ్వజమును రాక్షసుల వైపుకు విసిరినాడు. ఆ ధ్వజము అమోఘమైనది. కావున ప్రయోగించిన క్షణములోనే రాక్షస మాయను పోగొట్టినది. అనేక రాక్షసులను చంపినది. కోట్లకొలదిగా వృషభములు బయలుదేరి రాక్షస సేనాసమూహమును మట్టుపెట్టుచున్నది. అవి తమ రెక్కలతోడను,కొమ్ములతోడను, తోకలతోడను రాక్షసులను చంపుచుండెను. మహా సర్పములతోను, సింహములతోడను, పులులతోడను, భయంకరములైన పర్వతములను, మిక్కిలి భయముగొలుపు గండభేరుండ పక్షులచేతను,



శరభాదులగు మహామృగములును, ఉల్కశని మహాపాతములై దానవుల సైన్యములో ప్రవేశించి వారిని రూపుమాపినవి. ఇవి అన్నియు దేవాంగుడు ప్రయోగించిన వృషభధ్వజముచేత పుట్టింపబడినవి. రాక్షసులలో చాలామంది చచ్చిరి. ఆ విధముగా చావగా మిగిలిన రాక్షసులు వజ్రదంష్ట్రుడును తమ పట్టణమునకు పారిపోయిరి. వజ్రదంష్ట్రుడు తన కొడుకులును , మంత్రులును, తమ్ములను, సైన్యమును మొదలగు వారందరు చచ్చుటచే దుఃఖించుచు పారిపోయినాడు. అప్పుడు దేవాంగుడు ఇంద్రునితోకూడి సంతోషముగా వుండినాడు. తన వారినందరితో కూడి స్వర్గమునకు దేవలుడు వెళ్ళినాడు. ఇంద్రుడు దేవాంగున్ని తగినవిధముగా సత్కరించినాడు. తరువాత తన ఆమోద పట్టణమునకు వెళ్ళినాడు దేవాంగుడు.

ఇట్లు శ్రీ బ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరితమున పదిహేడవ అధ్యాయము పరిపూర్ణము



# దేవాంగుని అవతార పరిపూర్తి

## పదునెనిమిదవ అధ్యాయము

దానవులకు రాజైన వజ్రదంష్ట్రుడు మిక్కిలి దుఃఖముతో మునిగిపోయినాడు. భయము కలిగి వున్నాడు. గొప్పగొప్ప సర్పముల వలె నిట్టూర్పులు విడచు చున్నాడు. దేవాంగుని చేతిలో తన కుమారులు, తమ్ముళ్ళు, మేనల్లుళ్ళు హతులైనారు. అంతేకాకుండా అనేకమంది బంధువులు రాక్షససైన్యము నశించిపోయినది. అందువలన దుఃఖాన్ని దిగమ్రింగలేక మాటి మాటికి ఏడ్పువచ్చుచుండెను. ఆ బాధను సహింపలేక క్రోధమును పొంది ఎటులైనను దేవతల మీదతగిన ప్రతీకారము తీర్చుకోవాలి అని ఆలోచించుచుండెను. అప్పుడు తన బావమరిది విద్యుత్కేశుని ఇంటికి వెళ్ళినాడు. తన ఇంటికి వచ్చిన రాక్షసరాజు మరియు బావగారైన వజ్రదంష్ట్రుడు రావటం చూచినతోడనే వెంటనే ఎదురేగి లోనికి తీసుకవచ్చి తగిన సింహాసనంపై కూర్చుండబెట్టెను. అప్పుడు వజ్రదంష్ట్రుడు దుఃఖమును దిగమింగుకొని ఒక్కక్షణముపాటు మౌనము వహించిన తరువాత విద్యుత్కేశునితో బావమరిది నీవలన నాకు ఒక సహాయము కావాలి. నేను ఎంతో నిరాశ నిస్పృహలతో కూడుకొని వున్నాను అని అనగా మహాప్రభో! రాక్షసరాజా! మాకు ప్రభువు అగు మీరునాకు ఏది చెబుతోరో దానిని వెంటనే చేసెదను అనుజ్ఞ ఇవ్వండి అని వినయ విధేయతలతో విద్యుత్కేశుడు పలికినాడు. ఓ విద్యుత్కేశుడా! జరిగిన విషయమంతయూ నీకు తెలుసుగదా. దేవాంగుడు చేసిన కార్యమంతయూ నీవు సందేహము లేకుండా తెలుసుకొని వుంటావు. వ్యాఘ్రవక్త్రుడును బలవంతుడగు సర్పజిహ్వుడును, సూర్యకోపుడును, అగ్నికోపుడును, మిక్కిలి బలముగల ధూమ్రనేత్రుడును, మకరాక్షసుడును, ఖడ్గజిహ్వుడును వీరందరు యుద్ధరంగమందు పరాక్రమించిన దేవాంగుని చేతహతులైనారు. పరాక్రమము చేత గర్వించియున్న దేవాంగునిచేత కొడుకులను, యజ్ఞాంతకుడను, కలహమందు ఉత్సాహముగల యుద్ధోన్మత్తుడును వీరిద్దరును చంపబడిరి. అంతేగాకుండా మనలో మిక్కిలి వీరులుగా యుండెడి వారందరూ చంపబడిరి. కొడుకుల చావును తమ్ముళ్ళ చావును చూడగా నా హృదయము



విలవిలలాడుచున్నది. నేను రథములేని వాడనైతిని. యుద్ధమందు మిక్కిలిగా కొట్టబడితిని, హింసింపబడితిని. దేవతల యెదుట అప్పుడు దేవాంగరాజుచేత మిక్కిలిగా పరిహసింపబడితిని. మహా భయంకరమగు పరాక్రమముగల దేవలునియొక్క మహా విలయమును చేయుచున్న వృషభధ్వజముచేత నా మాయా ప్రభావము నశింపబడినది. నా సేన అంతయును నశింపజేసినది. ఆ వృషభ ధ్వజమును స్మరించగానే నా దేహము అంతయు భయముతో వణుకుచున్నది. దానికి మరింతగానే భయపడి సింహమును చూడగానే దుష్ట మృగములు ఏ విధముగా పారిపోవునో అదే విధముగా నేను కూడా పారిపోవలసి వచ్చినది. ఇంద్రుడు ఇప్పటిదాకా మనకు శత్రువుగా వుంటే ఆ ఇంద్రునికి తోడుగా సహాయము చేయువాడుగా వచ్చి ఇంద్రునకు జయమును చేకూర్చుచున్నాడు దేవలుడు. అందువలన ఇంద్రుడు జయముపొంది సంతోషముతో స్వర్గమునకు వెళ్ళినాడు. దీనికంతటికి అసలు కారణము దేవాంగరాజు తోడ్పడటమే. ఇంద్రుడును, గొప్పరాజైన దేవలున్నిజయించుట నావలన కాని పని. సగశ్వరుడైన దేవలుని సహాయమును పొందినందువలన ఇంద్రునికి విజయం తథ్యము అగుచున్నది. ఇదే విధముగా వుంటే రాక్షసులు ఎల్లప్పుడు అపజయమును పొందుతారు.

## నందిధ్వజమును తస్కరించి తీసుకురమ్మని విద్యుత్కేశుని అడుగుట

కావున విద్యుత్కేశుడా అరవీర భయంకరమైన వృషభధ్వజము దేవాంగుని చేతిలో ఉన్నంతవరకు విజయమువాడిదే. కావున ఆనందీధ్వజమును ఏదో విధముగా దేవాంగునివద్దనుండి సంపాదించాలి. బావమరిది విద్యుత్కేశు డా! నీ మాయోపాయమును అనుసరించి ఎట్టి పరిస్థితులలోను దానిని సంపాదించి నాకు ఇమ్ము. అప్పుడు విజయము రాక్షసులది అవుతుంది అని ఈ విధముగా వజ్రదంష్ట్రునిచేత చెప్పబడగానే వెంటనే విద్యుత్కేశుడు అదే విధముగా చేసెదను. వృషభధ్వజమును నామాయలు ఉపయోగించి ఏదో విధముగా దానిని సాధించి తెచ్చుటకు నా ప్రయత్న మంతయు చేసెదను. మీరు నిశ్చింతగా ఉండండి. విజయము రాక్షసులదే అవుతుంది ప్రభూ అని వజ్రదంష్ట్రునికి ప్రీతి కలిగించు మాటలు చెప్పినాడు విద్యుత్కేశుడు.

## విద్యుత్‌కేశుని మాటలకు మోసపోయిన దేవలుడు

వెంటనే విద్యుత్కేశుడు మాయారూపధారియై దేవతల వేషముతో ఆమోద పట్టణమునకు వెళ్ళి దేవలుని వద్దకు వచ్చి దేవలరాజా! జయము ఓ రాజ శ్రేష్టుడైన దేవలుడా! మిక్కిలి దయగలవాడా! అమితమైన పరాక్రమము గలవాడా! సగరేశ్వరుడా! జయము. నేను దేవేంద్రుని దూతను నీకు మ్రొక్కు చున్నాను. ఆ దేవేంద్రుని ఆజ్ఞ ప్రకారము నేనునీవద్దకు వచ్చితిని. వజ్రదంష్ట్రుడు అను గొప్ప రాక్షసరాజు లెక్కలేని రాక్షసులను తోడ్కొని వచ్చి మామీద యుద్ధానికి వచ్చినాడు. ఎవరివలనను భయపడకుండా మామీద పగ తీర్చుకొనే విధముగా విజృంభిస్తూ దేవతలను మిక్కిలి బాధించుచున్నాడు. నిన్నటిదినమునందు మిక్కిలి భయంకరముగాజరిగిన యుద్ధమునందు నీ సేన అంతయు భయంకరమగు పరాక్రమముగల రాక్షసుల చేతిలో శ్రమపడి యుండినది. నీవును యుద్ధ శ్రమమును పొందియున్నావు కాబట్టి నీకుమరలా శ్రమమును కలుగజేయకూడదని దేవేంద్రుడు రాక్షసులతో యుద్ధము చేయుటకు స్వయముగా వెళ్ళినాడు. బహు సేనలతోకూడిన వజ్రదంష్ట్రుడు అను రాక్షసరాజుతో యుద్ధము చేయుచూ నన్ను నీ దగ్గరకు పంపినాడు. ఎండు పొదలను నిప్పు ఏవిధముగా కాల్చి వేయునో శత్రువులను ఆ విధముగా కాల్చు నట్టి నంది ధ్వజమును నా చేత తీసుకొనిరమ్మని ఇంద్రుడు నన్ను పంపినాడు. మహానుభావా! కాబట్టి ఓ దేవలరాజా! ఆ ధ్వజమును త్వరితముగ నాకు ఇవ్వుము. ఆ విధముగాఇచ్చినచో యుద్ధమందు చెడు క్రొవ్వుపట్టిన ఆ రాక్షసులందరు దానిచేత ధ్వంసం కాబడెదరు. నిన్నటి దినము మిక్కిలిమహిమగల ధ్వజముయొక్క ప్రభావముచేత కఠినచిత్తులను, మాయలునేర్చిన వారైన రాక్షసులు పెక్కుమంది చంపబడినారు. ఓ ప్రభూ! చావగా మిగిలినదుష్ట బుద్ధిగల వారందరూ ఆవజ్రదంష్ట్రుని ముందు చేర్చుకొని మరలా మాతో యుద్ధము చేయుటకు వచ్చిరయ్యా రాజవర్యుడా! ఏ ధ్వజముచేత యుద్ధమందు ఆ రాక్షసులందరూ ధ్వంసం చేయబడి పోగలరో అట్టి శత్రు నాశకరమగు ధ్వజమును శీఘ్రముగా నాకు ఇమ్ము రాజా! ఈ విధముగా ఆ కపట దూత వినయమునుఅనునయిస్తూ దేవతల పక్షమున మాట్లాడు విధముగా మాట్లాడేసరికి దైవగతివలన ఇదినిజమేమో అని భావించినాడు దేవలుడు. ఇంద్రునకు ఇష్టమును కలిగించుటకొరకు



ఆధ్వజమును ఆ దూతకు ఇచ్చినాడు. అంతట ఆ కపటి దూత వేషధారియైన రాక్షసుడు దేవల మహారాజుయొక్క నందిధ్వజమును తీసుకొని సంతోషించి వేగముగా రాక్షసరాజు పట్టణమైన వీరమహేంద్ర పురమునకు వెళ్ళినాడు. వృషభ ధ్వజమును తెచ్చిన విద్యుత్కేశుని చూచివజ్రదంష్ట్రుడు మిక్కిలి సంతోషము చెందినాడు. విద్యుత్కేశునితో ప్రీతితోగూడిన వాక్యములతో అతనిని సంతోషపరచినాడు ఓఋషులారా! అని సూతుడు శౌనకాది మహర్షులకు చెప్పినాడు.

ఆ తరువాత రాక్షసనాథుడైన వజ్రదంష్ట్రుడు తన వద్దనున్న యావత్తుసేనను సమీకరించుకొని చతురంగబల సమేతుడై దేవతలపై యుద్ధానికి బయలుదేరెను. స్వర్గము వద్దకు చేరి స్వర్గద్వారములను అడ్డగించి దేవేంద్రుని యుద్ధము చేయుటకు పిలిచినారు రాక్షసులు. రాక్షసుల రాకను తెలుసుకున్న దేవేంద్రుడు మిక్కిలి కోపమును పొందినాడు. వెంటనే దేవతలందరినీ కూడగట్టుకొని రాక్షసులతో దేవేంద్రుడు యుద్ధము చేసినాడు ఋషిశ్రేష్ఠులారా.

## ఇంద్రుడు దేవలున్ని వెంటనే రమ్మని దూతను పంపుట

అప్పుడు దేవేంద్రుడు దేవలుడు వచ్చినచో రాక్షసుల గర్వమును శీఘ్రంముగా అణచివేయవచ్చును. వీరందరినీ అతి సులభముగా జయింపవచ్చును అని తలచి దేవలుని రాకకై ఆమోదపట్టణమునకు దూతను పంపినాడు. ఆ దూతపోయి వజ్రదంష్ట్రుడు రాక్షసుడు వచ్చి చేయుచున్న దురాగతాలను దేవేంద్రుడు నీకు తెలియపరచమన్నాడు. ఓ దేవాంగరాజా! ఇప్పుడు దేవతలకు రాక్షసులకు యుద్ధము జరుగుచున్నది. ఆ ఇంద్రుడు ఇప్పుడు నన్ను నీ వద్దకు పంపినాడు. నా నోటి వలన మాట వినగానే శీఘ్రముగా రావలెనని ఇంద్రుడు చెప్పినాడయా. ఇప్పుడు ఆలస్యము చేయగూడదు. వెంటనే రావలయును స్వామీ. ఇట్లా ఇంద్రుని దూత చెప్పిన ఇంద్రుని సమాచారము విని దేవాంగ మహారాజు తనలో తాను మిక్కిలి ఆశ్చర్యపడినాడు. ఇది ఏమి? ఇంద్రుడు ముందు ధ్వజమును తెమ్మనెను. ఇప్పుడు నన్ను రమ్మని దూతను పంపినాడు. దీనికి గల కారణము ఏమై వుండునా అని ఆలోచిస్తూ వుండినాడు. మహామిక్కిలి అధికశక్తివంతమైన వృషభ ధ్వజము యొక్క శక్తి యుద్ధమందు జబ్బుపడినదా, లేక ధ్వజము నాది కావున ఇంద్రుని యందు

పనిచేయలేకపోయినదా, మిక్కిలి బలవంతులైన రాక్షసులు ఒక వేళ ఇంద్రుని జయించి ధ్వజమును అపహరించి తీసుకొనినారా అని ఈ ప్రకారముగా దేవల మహారాజు తర్జన భర్జన పడుతూ తన కుమారులతో కూడినవాడై మిక్కిలి ధైర్యవంతుడైన దేవలుడు తన సేనలతో కూడుకొని ఇంద్రుడు దేవతలతో కూడి ఎచ్చట వుండెనో అచ్చటికి వెళ్ళినాడు.

## వజ్రదంష్ట్ర రాక్షసరాజు యుద్ధమునందు గెలుచుట

ఈ దేవల రాజు రాకకంటె ముందుగా దేవతలతో వజ్రదంష్ట్రుడు యుద్ధముచేసి పాపకార్యములు చేయునట్టి ఆ రాక్షసుడు దేవతల సేన మీద ఆ ధ్వజమును విడిచినాడు. ఆ ధ్వజము ఎవనిచే పూజింపబడి యుద్ధమందు విడువబడునో అతని శత్రువులనే జనులను యమధర్మరాజు సంహరించినట్లు సంహరించును. అట్టి ఆ ధ్వజమును వజ్రదంష్ట్రుడు పూజా విధానము ప్రకారము పూజించి దేవతల మీదకు విడచినాడు. కనుక దేవతలనందరినీ కలత పరచినది. అనేక విధములుగా కష్టపెట్టినది. తరువాత దేవతలందరూ ఆ ధ్వజముచేత కొట్టబడిన వారై పరుగులెత్తి పారిపోయినారు ఋషిశ్రేష్ఠులారా! ఇంద్రునితో కూడిన దేవతలందరూ మిక్కిలిగా కొట్టబడినారు. అమితముగా బాధింపబడినారు. అటువంటి సమయములో దేవాంగరాజు తన సైన్యముతో అచ్చటకు వచ్చినాడు. ఈ లోపల రాక్షసరాజు వజ్రదంష్ట్రుడు ఆ నంది ధ్వజమును ఉపసంహ రించినాడు. ఆ రాక్షసరాజును చూడగానే దేవలుడు అతని మీదకు బాణవర్షము కురిపించినాడు. అప్పుడు ఆ రాక్షసుని సంఘములన్నియు దేవలుని చుట్టుముట్టి అనేక విధములుగా ఆయుధముల చేత నాలుగు ప్రక్కలా విసిరిరి. అప్పుడు వజ్రదంష్ట్రుడు దేవలుని సేనలమీద వృషభధ్వజమును విసిరినాడు. ఆ ధ్వజము అప్పుడు దేవలసేనను తరిమి తరిమి కొట్టినది ఋషులారా. ఆ విధముగా ఆ ధ్వజము క్షత్రియులందరినీ బెదిరించినది. పది దిక్కులకు వేగముగా పారిపోయినారు దేవాంగుని సేన. యుద్ధమందు ఆ వృషభధ్వజముచేత మిక్కిలి కొట్టబడుచున్న వారైన క్షత్రియులు మృత్యువునకు కోపము వచ్చినచో ఏ విధముగా భయపడెదరో ఆ విధముగా అప్పుడు ఆ సైన్యమంతయు భయము చెంది పరుగులు తీసినది. ఒకరినొకరు చూచుకొనుటలేదు. మిక్కిలి కలతచెంది దశదిశలకు పారిపోయినారు. కారు చిచ్చు అడవులను రగుల్చునప్పుడు



ప్రాణంమీది తీపికొలది ఏ విధంగా భయపడి మృగములు పారిపోవునో ఆ విధముగా తమ ప్రాణములను కాపాడుకొనుటకు దేవలుని సేన పరుగులు తీసినది. అప్పుడు రాక్షసుల సేన అన్ని విధములుగా ప్రయత్నించి దేవలున్ని చుట్టుముట్టి ఆదేవలునిపై తమ ఆయుధములన్నియు ప్రయోగించినది. వజ్రదంష్ట్రుడు మొదలగు రాక్షసులందరు బెదిరించుచు మిక్కిలి కోపగించిన వారై కొందరు దేవలుని రథమును ఎక్కిరి. మరికొందరు రథముల పగ్గములను చేజిక్కించుకొనిరి. ఇంకొందరు సారథిని పట్టుకొనిరి. మరికొందరు దండెకొయ్యను విరగగొట్టిరి. కొందరు దేవాంగరాజుయొక్క ధనస్సును తీసికొనిరి. మరికొందరు దానిని పట్టి విరిచిరి. ఇంకొందరు అంబులపొదులను పెరికివేసినారు. అట్లే మరికొందరు అతని ఆయుధములన్నిటిని తీసి నాలుగు ప్రక్కల విసిరివేసినారు. మరికొందరు గుర్రములను దండకొయ్యను పొడిచిరి. అప్పుడు దేవాంగ మహారాజు మిక్కిలిబలముగల రాక్షసులచేత తిరస్కరింపబడిన వాడయ్యెను. తనను తానువిడిపించుకొనుటకు శక్తి లేనివాడాయెను. దేవలుడు. ఋషులారా! అప్పుడు ఆ రణరంగమందు దేవలరాజుకు తనవాడైన వీరుడు ఒక్కడుకూడా అగుపడలేదు. దేవాంగునిని రక్షించుటకు దేవతల సైన్యము నుండిగాని, దేవల సైన్యమునుండిగాని ఎవ్వరూ లేకపోయిరి. చివరికి అతని కొడుకులుగూడ ఏమీ చేయలేకపోయిరి. వృషభధ్వజ తాకిడికి దేవసేనలుగాని, దేవాంగుని సేనలుగాని తమయావత్ శ్శక్తిని కోల్పోయి నామమాత్రావశిష్టంగా వుండిపోయినవి. ఆవృషభధ్వజమును నిలువరించు శక్తి ఆ సాంబశివుడిక తప్ప ఇతరులకు సాధ్యపడదు. అందువలన ఇంద్రుడైనా బయటకు వచ్చి రాక్షసులను ఎదురింపజాలకపోయెను.

## దేవలుడు చింతించుట

రాక్షసులు దేవతల వేషములో దూతగావచ్చి తనను దారుణంగా మోసపుచ్చినారని తెలుసుకొని దేవలుడు విచారముచెందినాడు. దేవతల కార్యము నెరవేర్చడానికి ఉపయోగించవలసిన ధ్వజము దేవతల శత్రువులకు చిక్కి దేవతలను బాధించినది. తన తండ్రి శివునిచే ఆజ్ఞాపింపబడి ఇంద్రునికి యుద్ధమందు సహాయము చేయటానికి వచ్చి చివరికి తన ప్రభువు అనుయాయులు అయిన దేవతలను ఓడింపబడటానికి కారకుడైతిని. నా వలన

దేవతలు అపజయము పొందినారు. రాక్షసులను ఎదురించడానికి శక్తి ఇక ఎవ్వరికీ లేకుండాపోయినది. నా వలన ఎంతదారుణమైన పని జరిగిపోయినది అని నిస్సత్తువతో వుండిపోయినాడు. ఉత్సాహము నశించి పోయినది. చివరికి తన తండ్రి యిచ్చిన నంధీధ్వజమును ఎదురించవలసి వచ్చిన పరిస్థితి వచ్చినది. దైవము ఈ విధముగా జరిపించినది ఏమిటి అని పరిపరి విధములుగా తనలోతాను మదనపడుతున్నాడు. అమితమైన భుజ పరాక్రమ శక్తివంతుడైన తను ఏమీ చేయలేకపోవుచున్నానే, రాక్షస విజయానికి కారకుడనైతినే, తండ్రి యాజ్ఞకు వ్యతిరేకంగా ప్రవర్తించినానే అని ఆలోచిస్తూ దీర్ఘనిట్టూర్పులు విడచినాడు దేవలుడు.

## దేవలున్ని బంధించుట

అప్పుడు వజ్రదంష్ట్రుడు రాక్షసరాజు దేవలరాజును తన రథమునందు బంధించినాడు. ధ్వజమును ఉపసంహరించి, ఎల్ల రాక్షసులతో గూడిన వాడై శ్రేష్టమైన విజమును పొంది, సంతోషముతో తన వీరమాహేంద్ర పట్టణమునకు దేవాంగుని బంధీగాచేసుకొని వజ్రదంష్ట్రుడు పయనమయినాడు. మిక్కిలి భుజబలముగల దివ్యాంగుడు దుఃఖమను సముద్రమున మునిగినవాడాయెను. అమితమైనపరాక్రమముగల దేవాంగుడుని యుద్ధమందు శత్రువులు పట్టి కట్టి బంధించి తీసికొనిపోవుటను తలచుకొనుచు దివ్యాంగుడు తన తమ్ములతో కూడినవాడై తన సేవకులతోటి ఆమోద పట్టణమునకు చింతాగ్రస్తుడై వెళ్ళినాడు. దివ్యాంగుడు ఆమోద పట్టణమందున్న తల్లి దేవదత్తకు ఈ దుర్వార్త చెప్పి మిగుల విచారపడినాడు. దివ్యాంగుడు తన తల్లిని ఊరడించి మంత్రులతోకూడి ఆమోదపట్టణమును జాగ్రత్తగా పాలన చేయుచుండెను.

## దేవలున్ని ప్రసన్నం చేసుకొనుట

అచ్చట వజ్రదంష్ట్రుడు రాక్షస వీరులతో కలసి వీరమాహేంద్ర పురమునకు వెళ్ళి దేవాంగుని మిక్కిలి గౌరవించినాడు. సన్మానముకూడ చేసినాడు ఋషులారా! అప్పుడు ఆ రాక్షసరాజు వస్త్రములను నేయునట్టి ఆ దేవాంగ మహారాజును మిక్కిలి చతురులైన తన మంత్రులతోగూడి అనేకమైన ప్రియముతోకూడిన మాటలు దేవలునితో చెప్పుచుండెను. దేవలునియొక్క



కోపమును పోగొట్టి అతనితో స్నేహము చేసి మంచి చేసుకొనినాడు. మహా సౌందర్యవంతురాలును, మంచిభాగ్య సూచకమగు సాముద్రిక లక్షణములతో కూడిన తన కుమార్తె పద్మిని అను పేరుగల దానిని దేవాంగునకు ఇచ్చి వివాహము చేయ సంకల్పించినాడు.

## పద్మిని దేవదత్తగా మారుట

రాక్షస కన్యను గ్రహించుట గురించి దేవాంగుడు ఆలోచించుకొనుచుండగ పరమ పావనీయుడు అయిన అగ్ని దేవుడు అక్కడ సాక్షాత్కరించి దేవలునితో దేవలా! ఈ కన్య రాక్షస జాతిలో జన్మించినను పరమపావనమైనది. శుభ లక్షణములు గలది. కావున సందేహపడ వలదు అని అగ్ని దేవుడు వజ్రదంష్ట్రుని కుమార్తె పద్మినియొక్క చేతిని తన చేతిలో తీసుకొని దేవలుడి చేతిలో పెట్టినాడు. అందువలన వజ్రదంష్ట్రుని కుమార్తె అయిన పద్మినిని అగ్ని దేవుడే దేవలుని చేతిలో పెట్టినందునను, దేవలునిచే స్వీకరింపబడిన ఆ కన్యను ఇప్పటినుండి అగ్నిదత్త అని పిలువబడినది. అగ్నిదత్త అనగా అగ్నిదేవునిచే ఇవ్వబడినదానా అని అర్థము. వజ్రదంష్ట్రుని కూతురు పేరు పద్మిని. ఆమెను ఆ పేరుతోనే పిలిచెడి వారు. కాని దేవాంగునికి ఇచ్చి వివాహమైన పిదప ఆ కన్య దేవలునికి భార్య అయిన నాటినుంచి ఆమెను అగ్నిదత్తగానే పిలువబడినది. వజ్రదంష్ట్రుడు తన కుమార్తెను దేవలుని చేతిలో తన కుమార్తె చేతినివుంచితే ఆమె వజ్రదంష్ట్రుని కుమార్తె పద్మినిగానే పిలువబడేది. కాని ఇచ్చట సాక్షాత్తు అగ్నిదేవునిచే దేవలునికి ఇవ్వబడింది కాబట్టి దేవలుని భార్య అగ్నిదత్తగాపేరు స్థిరపడినది. వజ్రదంష్ట్రుని కుమార్తెగా భావించరాదు. అగ్నిదేవుడు కన్యాదాతగా వుండినాడు కాబట్టి ఆమె రాక్షసజాతి స్త్రీ కాదు ఇప్పుడు. అగ్నిదేవుని స్పర్శ కలిగి పవిత్రవంతురాలైనది కావున దేవలునికి భార్యగా వుండవలసిన పవిత్ర లక్షణములతో కూడుకొని వున్నది పద్మిని. అందువలన ఇప్పటినుండి అగ్నిదత్త దేవతా స్త్రీగానే పరిగణించవలయును. ఈమె పేరు పద్మిని అంతేగాని పద్మినీ జాతి స్త్రీ లక్షణముగలది కావున పద్మినీ అని పిలచినారు అని భావించరాదు. ఆమె శుభసూచకమైన సాముద్రిక లక్షణములుగలది. దేవలుడు అగ్నిదత్తతో కూడి ముగ్గురు కుమారులను పొందినాడు. వారిపేర్లు శ్యాలుడు, హలుడు, బలుడు అని పేర్లు కలిగినవారు.

వీరు ధగ ధగ మెరియు ప్రకాశము కలిగి వుండిరి. వారు దినదినాభివృద్ధి కలిగివుండిరి. తరువాత దేవలుడు వారికి నేతపనిని చక్కగా నేర్పించినాడు. ఆయన తన కుమారులచే నేయబడిన వస్త్రములను రాక్షసులకు ఇప్పించినాడు. తరువాత సకల సంపదలు కలిగి పరాక్రమము కలిగిన ఆ దేవలుడు తన నంది ధ్వజమును వజ్రదంష్ట్రుని వద్దనుండి తీసుకొని ఆ రాక్షసునితో చెప్పి అతనిచేత పంపబడినవాడాయెను. అప్పుడు దేవలుడు తన నిజపట్టణమైన ఆమోదపట్టణమునకు వెళ్ళినాడు.

## దేవలుడు విద్యాధరుడవు కమ్మని శివునిచే శపింపబడుట

ఆ తరువాత దేవలుడు శివుని సేవింప కోరికగలవాడై కైలాసపట్టణమునకు వెళ్ళి శివుడిని కలిసినాడు. తాను తీసుకువచ్చిన నంది ధ్వజమును తిరిగి శివునకు సమర్పించినాడు. శివుడిని ప్రాధేయపడి తన తప్పును క్షమించమని అడగాలని వున్ననూ అవకాశం లేకుండా పార్వతీ కాంతుడగు శివుడు దేవలున్ని చూడగానే అతనిపై మిక్కిలి కోపమును పొందెను. ఓరీ దుష్టబుద్ధిగలవాడా! నీవు వివేకము మాలినవాడవై మిక్కిలి పవిత్రమైనది శక్తివంతమైన నా వృషభధ్వజమును రాక్షసుల కొరకు ఇచ్చి దానిని అపవిత్రముగా చేసినావు. దేవతలందరినీ మిక్కిలి కష్టపెట్టినావు కాబట్టి నీవు నీ మహిమను పోగొట్టుకొని విద్యాధరుడవు అగుదువు గాక. పొమ్ము అని సకల లోక శుభం కరుడగు ఈశ్వరుని చేత ఆ దేవలుడు శపింపబడినాడు. అంత ఆమోద పట్టణమునకు వచ్చి జరిగిన సమాచార మంతయూ తమ కుటుంబ సభ్యులకు చెప్పెనోయి ఋషులారా.

## దేవలుడు రామలింగేశ్వరునిగా లింగంగా మారుట

అప్పుడు తన యొక్క మహిమను కోల్పోయిన దేవాంగరాజు యొక్క దేహము లింగముగా మారినది. ఆ లింగము ఆమోదపట్టణమునందు వుండినది. ఇప్పుడు ఆ ఆమోదపట్టణమందు రామలింగేశ్వరుడని ప్రసిద్ధికెక్కిన యొక దేవుడై వున్నాడు. ఆ రామలింగేశ్వరుడు ఎవరంటే దేవలుని శరీరం లింగంగా మారినదే. ఆ దేవల శరీరం లింగంగామారి రామలింగేశ్వరునిగా పేరుగాంచినది. కాబట్టి రామలింగేశ్వరుడు అని ప్రసిద్ధిగాంచినాడు.



రామలింగేశ్వరుడిగా ఆమోదపట్టణమందువున్న దేవాంగుడిని జ్యేష్ఠ పుత్రుడు దివ్యాంగుడు రామలింగేశ్వరునుని నిత్యము పూజించుచూ ఆమోద పట్టణమును మితిలేని పరాక్రమవంతుడై సకల సంపదలతో కూడి పాలించినాడు. ఈ విధముగా దేవలుడు ఇప్పటికీ రెండు శాపములను పొందినాడు. ఒకటి రంభ చేతను, రెండవది శివుని చేతను పొందినాడు. ఇంద్రియనిగ్రహము కలిగి పరస్త్రీని మాతృమూర్తిగా భావించినాడు. శివుని సాయుధ్య స్థితిలో వుండి లోకములకు మేలు చేయుటకొరకై జన్మించినాడు దేవలుడు.

## చతుర్విధ మోక్షములు

మోక్షము నాలుగు విధములుగా సాలోక్య సారూప్య సామీప్య సాయుజ్యగా వున్నది. ఇవి ఒక దానికొకటి మిగుల బలవత్తరమయినవి. మొదటిది మోక్షమునకు ప్రాథమికమైనది. దేవుడు వుండు లోకమునకు ప్రవేశించి వుండుట అచ్చట ప్రతినిత్యము ఆ దేవుని సందర్శించి దేవకార్యము చేయుటను సాలోక్య మోక్షమందురు. అయితే భగవంతుడి లోకములో వున్ననూ భగవంతున్ని దూరమునుండియే దర్శించుకొందురు భక్తులు. భక్త బృందంలో చేరి దేవకార్యములు చేయుదురు. రెండవ మోక్షస్థానము సారూప్యము. ఈ స్థాయిలో శివుని యొక్క వేషభాషలతో వుండి శివునికి ఇతనికి బేధం లేని విధంగా ఒకే రూపంలో వుండగలరు. మూడవ మోక్ష స్థానముసామీప్యము. శివుని రూపముతో శివునికి అత్యంత సమీపములో వుండి సేవచేసుకొనుట వుండును. నాల్గవ మోక్షస్థానము సాయుజ్యము అనగా ఆ శివునిలోనే ఐక్యమై లీనమై తనయొక్క ఉనికి లేకుండా వుండును. మొదటి మూడు మోక్షస్థానములయందు తన ఉనికి వుంటుంది కాని సాయుజ్య స్థితి యందు శివునిలో ఐక్యమైయుండి తనకంటూ ప్రత్యేకమైన ఉనికి లేకుండా శివునిలో ఐక్యము చెందుట. దీనినే మహామోక్షము అందురు. ఇటువంటి ఉన్నతోన్నతమైన మోక్షస్థితిని పొంది లోకకళ్యాణకారకమైన వస్త్ర యజ్ఞోపవీతములను లోకములకు అందించుట కొరకు అవతరించినాడు దేవలుడు. సాయుజ్య స్థితిలో వుంటే శివునికి ఈతనికి బేధము అసలు వుండదు. ఐహిక కోరికలన్నింటినీ జయించి పరమపావనమైన స్థానమును పొందినటువంటి శివమానసపుత్రుడైన దేవలుని వెంట పడటము రంభ చేసిన పొరపాటు. యుక్తాయుక్త వివేక జ్ఞానము నశించి మహా

మోహమును చెందినది రంభ. మన్మధున్ని భస్మము చేసినవాడు శివుడు. శివ మానస పుత్రుడు దేవలుడు అందునా సాయుజ్య స్థితిలో వుండి నటువంటివాడు నశించు స్వభావముగల దేహమును స్థిరమని ఏ విధముగా భావించుతాడు. ధర్మ కార్యములు నెరవేర్చుటకొరకు ఈ దేహమును ఉపయోగించుకొనే ధర్మతత్పరుడు. క్షణికమైన సుఖాలకొరకు ఈ దేహమునకు లొంగిపోయేవాడు కాదు. ఆ విధముగా క్షణికావేశాలకు లొంగిపోయేవాడు అయితే సాయుజ్య స్థితిని ఎలా పొందుతాడు. అట్లా అని అతడు విరహుడు కాదు. సన్యాసి కాదు. రతికి వ్యతిరేకికాడు. ధర్మ మార్గంలో ధర్మ శాస్త్రానుసారముగా ఆ కోరికను తీర్చుకొనువాడే. దేవలునిలో రసికత్వం లేకపోతే ముగ్గురు భార్యలను వివాహము చేసుకోడుగదా! అందువలన రసిక ప్రియత్వంకలవాడు అని అనవలసియున్నది. దానిని ధర్మ పద్ధతిలో తనభార్యలను ఆనందింప జేయటానికొరకై వినియోగించినాడు.

## దేవలునికి ఇతర ఋషులకువున్న భేదము

మిగతా ఋషులలో అధికమంది చతుర్విధ మోక్షసాధనములలో మొదటి స్థానమైన సాలోక్య స్థితిని పొందుటకొరకై తీవ్రమైన తపస్సు చేయుచుందురు. వారు తనలోని అరిషడ్వర్గములను జయించినారో లేదో అని తెలుసుకొనుటకు, అరిషడ్వర్గములలో మరీ ముఖ్యమైనది యగు కామమును జయించినారో లేదో అని తెలుసుకొనుటకొరకు తపస్సు చేయుచున్న ఋషులను పరీక్షించుటకు రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమలాంటి అప్సరసలగు త్రిలోక సుందరీమణులను వారియెదుట పంపెదరు. త్రిలోక సుందరీమణులను చూడగానే వారిలో నిద్రాణ స్థితిలోవున్న కామకోరిక ప్రకోపించి మోహానికి లొంగి అప్సరస స్త్రీలతో సుఖమును పొందుదురు. అటువంటి వారు తన తపస్సును చెరచుకొని మరలా మొదటికివచ్చినవారు అవుతారు. అటువంటి ఋషులను దేవాంగునితో సమముగా పోల్చుటచే రంభ వివేకవంతమైన పనిచేయలేదు. అందముగా పుట్టటం కూడా తప్పేనా? దేవాంగుడు మహాఅందంగా జన్మించినాడు. అయితే నీతి నియమము లేకుండా విశృంఖలముగా స్త్రీల వెంబడి పడవచ్చా? తనవెంటపడినవారితో కలిసి పోవచ్చా? అట్లా వారితో కలిస్తేనే వారి మంచి వారా? రసికులా? లోకములో



అందంగా జన్మించినవారు లోక వ్యతిరేకముగా వ్యవహరించినచో అది సరియైనది అవుతుందా? వ్యక్తిత్వమును చెడకొట్టుకుంటారా? అసామాన్యమైన సాయుజ్య స్థితిని పొందినవారు ఇటువంటి మోహాలను జయించితేనేవారు ఆ స్థితిని పొందేది. మిక్కిలి అందమైన దేహముకలవారికి అంతేఅందమైన బుద్ధి కలవారైతేనే లోకములో పూజింపబడుదురు. కాని బుద్ధి సరియైనదికాకపోతే అందగత్తెలయినను పూజింపబడరు. కావు రంభ దేవలుని స్థాయి గమనించకుండా అతని వెంబడించడం మహా తప్పు. సవినయముగా బోధ చేసినప్పుడు కూడ వివేకము పొందకుండా వుండడం మరొక తప్పు. తప్పు చేయి అని మిక్కిలి బలవంత పెట్టినను తనవ్యక్తిత్వం కాపాడుకున్న వానిని తనఅందచందాలకు లొంగని వాడని చూచి సిగ్గు చెందాల్సిపోయి శపించుట అనేది మరొక తప్పు.

## రంభా శాప ప్రభావం

వాక్కుకు అమోఘమైన శక్తి వున్నది. కావున అదిఎప్పుడో ఒకప్పుడు అనుభవానికి రాక తప్పదు. అందువలన రంభ దేవలుడిని శపించింది. మహా భుజబల పరాక్రమము గలవాడగు నీవు శత్రువుల చేతికి చిక్కి బంధింపబడతావు, దీనావస్థను పొందుతావు నీ పరాక్రమము క్షీణించిపోవును. శూద్ర సమముగా 5 వేల సంవత్సరాలు బ్రతుకు. ఆతరువాత బ్రాహ్మణ కులంలో మహా శ్రేష్టుడిగా అవతరిస్తావు అనిశపించింది. దేవదానవుల యుద్ధములో నందీధ్వజమును రాక్షసులు మాయోపాయముచేత తస్కరించినారు. ఆ తరువాత అతడి భుజబల సంపన్నత, పరాక్రమము ఏమీచేయలేకపోయినాయి. చివరికి శత్రువులకు చిక్కి బంధింపబడి వారి స్థానానికి కొనిపోబడినాడు. కావున రంభ శపించినట్లు దీనావస్థను పొందినాడు. అతని పరాక్రమము ఎందుకూ పనికిరాకుండా పోయినది. శత్రువులచే బంధింపబడినాడు. రంభ శపించినట్లు శత్రువులకు చిక్కినాడు. శూద్ర సముడవై 5 వేల సంవత్సరాలు జీవిస్తావని శాపము. మరి దేవదానవ యుద్ధములో ఓటమిచెందిన దేవలున్ని రాక్షసులు బంధీగావించి తమ పట్టణానికి తీసుకు వెళ్ళినారు. దేవలుడు రాక్షసుల ఇండ్లలో నివసించినాడు. వారితో కలిసి జీవించినాడు. చివరకు రాక్షసుల కన్య అయిన పద్మినిని వివాహము చేసుకున్నాడు. కాబట్టి రాక్షసులు అంటే తమో గుణము అధికముగా

గలవారు. కావున వారివద్దనేవుండి శూద్ర సముడిగా జీవించినాడు. 5 వేల సంవత్సరాల కాలం ఇచ్చట నివసించినాడు. ఈ దేవదానవ సంగ్రామము త్రేతా యుగములో జరుగలేదు. ఇదికృత, త్రేత, ద్వాపర, కలి యుగాలు దేనిలో జరిగినదో స్పష్టముగా చెప్పబడలేదు. 5 వేల సంవత్సరాల కాలము వరకు శూద్ర సమానుడువుగా వుంటావని రంభ శపించింది కాని కలి యుగములోని మొదటి పాదములోని 5 వేల సంవత్సరాలని లేదా కృత యుగ, త్రేతా యుగ, ద్వాపర యుగమని చెప్పలేదు. కావున ఊహించరాదు. అనగా దేవలుడు పద్మినిని వివాహమాడి శ్యాలుడు, హలుడు, బలుడు అను ముగ్గురు కుమారులను కని పెంచి పెద్ద చేసి వారికి నేత వృత్తి నేర్పి వస్త్రములు నేయించివాటిని రాక్షస జాతివారికి ఇప్పించి ఆ తరువాత వజ్రదంష్ట్రుని వద్ద నందీధ్వజమును స్వీకరించి ఆమోద పట్టణమునకు వచ్చు సరికి 5 వేల ఏండ్లు గడచిపోయినాయి. ఎందువలనఅంటే శూద్ర సముడు అన్నప్పుడు శూద్రులతో వారి జీవన విధానముతో పాటు వారిని పెండ్లాడి జీవించుటను శూద్ర సముడు అనవచ్చును. దానిని అధిగమించి అనగా ఆ 5 వేల సంవత్సరాల కాలం అనంతరము శూద్ర సమత్వం తొలగిపోయిన తర్వాత దేవలుడు తన నిజపట్టణం ఆమోద పట్టణమునకు వచ్చి కుటుంబ సభ్యులను కలిసి జీవించినాడు.

## దేవాంగ వంశస్తులు శాపగ్రస్తులా?

కుటుంబంలో సహజ సిద్ధమైనటువంటి బ్రాహ్మణత్వం కలిగిన కుటుంబం కావున దేవలుడు ఆమోద పట్టణానికి వచ్చునప్పుడు అతనికి వచ్చిన శాప ప్రభావం పూర్తిగా తొలగినదని తెలియవలయును. దేవలుడు రంభతో సంగమిస్తే తన బీజ పవిత్రత చెడుతుందని కులానికి ఆదిపురుషుడిని నేనే కదా. ఈ దేవాంగ వంశము నా వలన ఏర్పడుతుంది కాబట్టి తన బీజము (వీర్యము) పవిత్రత కలిగి వుంటే తనకు జన్మించిన బిడ్డలవలన వారి వంశముకూడ పవిత్రముగా ఉంటుందని తనలో తాను అనుకుంటుంటే దానిని రంభ గ్రహించి నీ వంశముకొరకు ఆలోచిస్తున్నావా అని ఆలోచన చేసి రంభ దేవలున్ని కాక దేవలుడికి పుట్టే సంతాన వంశమును శపించినట్లుగాను, ఈ కలియుగములో అనగా 28వ మహాయుగానికి చెందిన కలియుగము ప్రారంభమునుండి 5 వేల సంవత్సరాల వరకు నీ సంతానం శూద్రులుగా



వుంటారని ఆ తరువాత బ్రాహ్మణోత్తములు అవుతారని అందువలన కలియుగములో ఇప్పటికి క్రీ.శ. 2015 నాటికి 5118 సంవత్యరాలు గడచినవి కాబట్టి గడచిన 5 వేల సంవత్సరాలుగా దేవాంగ వంశస్తులు శూద్రులుగా జీవించినట్లుగను 5 వేల సంవత్సరాలు గడచిన పిదప ఇప్పుడు దేవాంగ వంశస్తులు అప్రాకృత బ్రాహ్మణులు అనగా సహజ సిద్ధ పుట్టుకతోనే బ్రాహ్మణత్వము కలవారు అయినారని భావించరాదు. వారికి అసలు శాపమే లేదు. దేవలునికి సూర్యుని చెల్లెలు దేవదత్తద్వారా కలిగిన సంతానము అప్రాకృత బాహ్మణులుగా చెలామణి అగుదురు. వారే నేటికి వున్న దేవాంగ కులస్తులు. కొందరు కవులు అన్నట్లుగా దేవతలలో కొందరుదేవాంగునికి సూర్యునిచెల్లెలు దేవదత్తను ఇచ్చి వివాహము చేయుచున్నారని, ఈర్ష్యచెంది దేవాంగునికి ప్రాముఖ్యతను తొలగించాలనే కుట్రతో రంభను దేవలుని వద్దకు పంపినట్లు ఏదో విధముగా అతనిని తన బుట్టలో వేసుకొమ్మనట్లుగా భావించరాదు. రంభ మోహనాకారుడైన దేవలుని బాహ్యా సౌందర్యాన్ని మోహించి తనకుతానుగా వచ్చినది. అంతేగాని దేవలోక కుట్ర అనుకోరాదు.

రంభ శాపప్రభావముచే శూద్ర సముడుగా జీవించాలి కాబట్టిఅటువంటి పరిస్థితి ఏర్పడినప్పు కదా అతడు శూద్రుడుగా జీవించేది. అనగా అప్రాకృత బ్రాహ్మణత్వం కలిగిన దేవలుడు జన్మతో దేవబ్రాహ్మణుడు. కానీ శూద్రుడుగా పుట్టమని శపించలేదు. శూద్రసముడుగా వుంటావు అని అన్నది. అనగా పుట్టుకతో దేవ బ్రాహ్మణ వంశంలో పుట్టినను కొంతకాలం అనగా ఐదువేల సంవత్సరాలు శూద్రునితో సమానమైన జీవనం కలిగి వుంటావు అనిఅన్నది. అది నెరవేరుటకు వజ్రదంష్ట్రుని బావమరిది విద్యుత్కేశుడు ఇంద్రుని దూతగా దేవతావేషం వేసుకొని నంది ధ్వజమును మోసకారి తనముతో దొంగిలించినాడు. ఆ వృషభధ్వజము దేవలుని వద్ద వుంటే దేవలుడు అజేయుడు. ఇంద్రుడికి సహాయంగా వెళ్ళినాడు కాబట్టి ఇంద్రుడు అజేయుడుగా వుంటాడు. నంది ధ్వజముదేవలుని వద్ద లేనప్పుడు శివుని శక్తి అతనివద్ద లేనట్లేగదా! శివుని శక్తి లేనప్పుడే కదా ఆతని పరాక్రమం క్షీణించేది. అప్పుడే కదా శత్రువుల చేతిలో చిక్కేది. కావున రంభ శాపము జరగటానికి విదివ్రాత ప్రకారము జరుగుట కొరకు దేవలుడు ఈ శక్తివంతమైన ఆయుధమును ఇతరుల చేతిలో పెట్టినాడు.

అనగా రంభాశాప ప్రభావం వలన యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం నశించి పోయినది. సందర్భాను సారముగా ఆలోచించలేక పోయినాడు. ఆ వచ్చిన వాడు ఎవరు అని పరిశీలించలేక పోయినాడు. మహాజ్ఞాన సంపన్నుడు తొందరపాటుతనముతో ఆలోచనా విచారణ లేకుండా ఎటువంటి పనులు చేయరాదు కాని చేసినాడంటే రంభయొక్క శాప ప్రభావమే అని తెలియుచున్నది.

## వ్యభిచారమును నిరాకరించిన దేవలుడు

ఈ శరీరముతో ఇంకా ఉత్తమ జన్మలు వచ్చురీతిగా వ్యవహరించాలే కాని ప్రస్తుతము వున్న స్థితిని నాశనంచేసుకోరాదు. ఇంకా ఈ దేహముతో ఉత్తమ కార్యములు నిర్వర్తించి ఇంతకంటే అనగా ప్రస్తుతమున్న స్థితికంటే ఇంకా మేలైన ఉన్నత స్థితికి జన్మలకు ప్రాకులాడాలి అని దేవలుడు చెప్పినాడు. పరస్త్రీ సంభోగం పంచమహా పాతకములలో ప్రప్రథమమైన మహా పాపకార్యము. దీనిని ఆచరించుట ద్వారానేను అనేక జన్మలనుండి సంపాదించుకున్న పుణ్యము క్షీణిస్తుంది కాబట్టి వ్యభిచార పనిని నేను చేపట్టను అని దేవలుడు అన్నాడు. అంతేగాని అతడు రసికుడు కాదు, విరహజ్ఞానం కలవాడు, సన్యాసి అని అనరాదు. పరస్త్రీ సంభోగం పాపమునకు కారణం అవుతుంది అనిఅన్నాడే కాని స్వభార్యయందు సంభోగం పాపమునకు కారణము అవుతుందిఅని అనలేదే. విరహుడు అయితే భార్యతో కూడా రమించలేడు.కాని ముగ్గురు భార్యలను వివాహం చేసుకొనినాడు. ముగ్గురు భార్యలద్వారా పుత్రులను కనినాడు. కాబట్టి స్వభార్యతో కామక్రీడలు జరుపుట ధర్మాన్ని వృద్ధిపరుస్తుంది, వంశం ఏర్పడుతుంది, సృష్టి కొనసాగుతుంది. కాబట్టి పరస్త్రీని కోరనందువలన అతనికి తేనెయొక్క మాధుర్యం తెలియనివాడు అవుతాడా. ఆ తేనె మాధుర్యం స్వభార్యయందలి రతిలోవున్నది అని భావించి వుంటాడు దేవలుడు. రంభ శాపంలో మరోముఖ్యమైన అంశం బ్రాహ్మణ శ్రేష్టుడివిగా జన్మించెదవు. ఇది శాపంగా చూడకూడదు. బ్రాహ్మణ శ్రేష్టుడు అన్నది కాబట్టి యధావిధిగా నీ నిజస్థాయిని పొందుతావు అనే అర్థంలోనే దీనిని చూడాలి.

## రంభా శాపము లోకములకు మేలు కలిగించుట కొరకే

రంభ శాపము వలన అనగా శూద్ర సముడు అనుదాని వలన లోకమునకు ఒక విధముగా మేలే జరిగినట్లున్నది. ఎందువలననగా



దేవలోకములోనిసకల జాతులవారందరికి దేవలుడు వస్త్రములు ప్రదానము చేసినాడు. దేవతలు తమ అంగములను (శరీరావయవములను) తన వస్త్రముచే అలంకరింప చేసుకొను విధముగా చేసినాడు. కాబట్టి దేవలునికి **"దేవాంగుడు"** అను ప్రసిద్ధమైన పేరు ఏర్పడినది. జంబూద్వీపమేకాదు సప్త ద్వీపములలో వున్న మానవజాతి అందరికి వస్త్రములను ఇచ్చి వారి శరీరావయవములను తన వస్త్రముతో అలంకరింపబడుట చేత దేవలున్ని **మానవాంగుడు** అనికూడ సంభోదించవచ్చును. సృష్టిలోని ఒక్క రాక్షస జాతికి తప్ప సకల జాతులవారికి దేవలుడు వస్త్రములను ఇచ్చినాడు. కైలాసమునందలి శివుని కచేరిలో శివుడు దేవలుని చేతిలోని వస్త్రములను తాను తీసుకొని తన కచేరీలో వున్న అన్ని జాతుల వారందరికి (ఒక్క రాక్షసజాతికి తప్ప) శివుడు స్వయముగా వస్త్రములను ఇచ్చినాడు. అంటే సృష్టిలోని అందరికి వస్త్రములు ఇవ్వలేదని స్పష్టమౌతుంది గదా! ఇప్పుడు రంభా శాప ప్రభావము వలన రాక్షస జాతితో సంబంధాలు ఏర్పడి వారికి నేత విద్య నేర్పి వస్త్రములను దేవాంగుడు ఇచ్చినాడు. ఇప్పుడు ఈ విశ్వంలోని సకల జాతులవారికి వస్త్రములు ఇచ్చినందున దేవలున్ని **విశ్వాంగుడు** అని కీర్తించవచ్చు. **ఈ విధముగ దేవలుడు దేవాంగుడు, మానవాంగుడు, విశ్వాంగుడు అని కీర్తింపబడినాడు.** కావున రంభాశాపము ఒక విధముగా లోకానికి మేలు కలిగించింది. లేకపోతే రాక్షసజాతికి దిగంబరత్వం తొలగిపోయేదికాదు. తన తండ్రి శివుడు రాక్షస జాతికి వస్త్రములు ఇచ్చుటను వ్యతిరేకించినను ఆ లోపమును దేవలుడు సరిదిద్ది విశ్వశాంతికి మార్గదర్శుడు అయినాడు. వస్త్రములు ఇవ్వకపోవటము, వస్త్రాలు ధరించిన దేవతలు రాక్షసులను చూచి హేళనచేయటము ఈ కారణముగానే కదా దేవదానవ యుద్ధం జరిగింది. ఇప్పుడు దేవలుడు రాక్షసజాతికి వస్త్రములు ఇచ్చి, మరొక దేవదానవ యుద్ధం జరగకుండా వుండుటకు ప్రయత్నించినాడు. పరస్పరం ఒకరిని ఒకరుచూచి అసూయపడటం, హేళన చేయటం వంటి వాటిని దూరం చేసినాడు.

## లోకములో విద్యావ్యాప్తికొరకై బ్రాహ్మణ శ్రేష్టుడు అగుదువు అని అన్న రంభ

సృష్టిలోని సకలజాతుల వారికి వస్త్రములు ఇచ్చి దిగంబరత్వాన్ని

పారద్రోలి సృష్టికి రమణీయతను కలిగించినాడు దేవలుడు. అదే విధముగా లోకములో వేదవిద్యలు, వేదాంగములు, ఆగమ శాస్త్రములు, ధర్మశాస్త్రము వృద్ధి పొందుటకు, దేవతలకు ప్రతి నిత్యం అర్చనచేసి వారికి నివేదన చెల్లించడానికి, లోకంలో కరువు కాటకాలు ఏర్పడకుండా పంటలు సుభిక్షంగా పండటానికి సకాలములో వర్షాలు కురవటానికి, దేవతలను సంప్రీతులుగా చేసుకోవడానికి యజ్ఞ యాగాల ద్వారా వారికి హవిష్యన్నం ప్రసాదించి వారిని తృప్తిపరచి లోకాభివృద్ధికి వారి తోడ్పాటు పొందవలసియున్నది. ఈ పనులు జరగాలంటే మనుషులు దివ్యజ్ఞానము పొంది ద్విజులుగా మారాలి. అనగా తిరిగి జన్మించాలి. అనగా ఈ లోకములోనే, ఈ జన్మలోనే మరలా తిరిగి జన్మించాలి. ఆ విధంగా జన్మించిన వారినే ద్విజన్ములు, ద్విజులు అని అంటారు. ఈ ద్విజత్వం ప్రాప్తించాలంటే యజ్ఞోపవీతం ధరించాలి. యజ్ఞోపవీతము అను సంస్కారాన్నే ఉపనయనము అని అంటారు. తల్లి గర్భంనుండి అందరూ సాధారణంగా సమంగానే పుడతారు. ఇది అందరికీ సాధారణమే. కాని పునరావృత్తి రహిత మోక్షము పొందాలంటే దానికి బ్రహ్మ జ్ఞానము అవసరము. ఆ జ్ఞానము పొందాలంటే యజ్ఞోపవీతము ధరించి గాయత్రీ మంత్ర జపం చేయుట మోక్ష జ్ఞానానికి నాంది అవుతుంది. యజ్ఞోపవీతానికి అధిదేవత గాయత్రీదేవి. యజ్ఞోపవీతం ధరించిన వారే వేదాలుచదివే అర్హత పొందుతారు. కావున యజ్ఞోపవీతం అధిదేవత అయిన గాయత్రీ అనుగ్రహం వలననే కదా వేదం చదివేది. అందువలన గాయత్రీదేవిని వేదమాతగా కొలుస్తారు. మోక్షానికి, దేవతల హవిస్సు, యజ్ఞయాగాలు, దేవాలయ అర్చనలు జరగడానికి ఆధారభూతమైన యజ్ఞోపవీతమును సృష్టించినది దేవలుడు. దేవతలకును, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకును యజ్ఞోపవీతమును మంత్ర యుక్తముగా ప్రసాదించినది దేవలుడు. కావున లోకములో వేదవిద్యలు జీవింపబడడానికి మూలకారకుడు దేవలుడు. ఈవిషయమును వేదోక్త మూల స్తంభనములనే గ్రంథమే కాకుండా ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణ వేదం, ఉపనిషత్తులు, నారద సంహిత, తత్త్వనిధి, రుద్రయామళం, కాత్యాయన స్మృతి, తత్త్వ ప్రకాశిక, నిగమ రహస్యము, వివేకసిందువు, అగస్త్య సంహిత, సిద్ధాంత చంద్రిక, ధర్మనిధి, శ్రీశైల మహాత్త్యము, స్కాంధ పురాణము, సిద్ధాంత తత్త్వ



ప్రకాశిక, ఆగ్నేయ పురాణము మొదలగునవి ఘంటాపథముగా తెలుపు చున్నవి. కాబట్టి దేవలుడు వస్త్ర నిర్మాతయేగాక యజ్ఞోపవీతమును నిర్మించి దేవతలకు, మనుష్యులలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు ప్రదానం అనగా ఇచ్చినాడు.

లోక కళ్యాణము కొరకు దేవలుడు వస్త్రములు, యజ్ఞోపవీతములు నిర్మించి సకల లోకముల వారికి ఇచ్చినాడు. దేవలునికి వివాహమయి వారికి సంతానం కలిగినది. వారి సంతానము, వారి వంశం వారు యజ్ఞ సూత్ర, వస్త్రములును స్త్రీలకు మంగళ సూత్రములును ధరించుటకు అవసరమైన దారములను అందజేయుదురు. కావున దేవాంగుడు అవతరించడానికి అవసరమైన ప్రధాన పనిముగిసినది. అనగా లోకములో వస్త్రములు, యజ్ఞోపవీతములు సృష్ఠింపబడి తయారు చేయబడుచున్నవి. దేవలుడు ఆవిర్భవించినది ఆ కార్యం కొరకు గదా! ఆ కార్యం నెరవేరుచున్నది. అందువలన అతడు జన్మ చాలించవలసియున్నది. కావున దేవాంగుడు తనజన్మను చాలించ వలసియున్నది. కాని ఇంకను ఏడు జన్మలు అవతరించ వలసియన్నది. ఆరుజన్మలయందు ప్రసిద్ధమైన పనులు నిర్వర్తించి కీర్తి ప్రతిష్టలు పొంది ఏడవ జన్మమున తిరిగి నాయందు సాయుజ్యము పొందుదువు అని దేవలునికి అవిర్భావ సందర్భములోనే శివుడు చెప్పినందువల్ల మిగిలిన ఏడు జన్మలు అవతరించడానికి, ప్రస్తుతమున్న జన్మ చాలించడానికి శివుడు దేవలున్ని నీ మహిమను కోల్పోయి విద్యాధరుడువుగా జన్మింపుమని శపించటానికి ఇదియే కారణము. దీనితో దేవలుని ప్రధాన అవతార జన్మ సమాప్తి పొందినది.

ఇట్లు శ్రీ బ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరితమున
పదునెనిమిదవ అధ్యాయము పరిపూర్ణము

## విద్యాధర ప్రశంస
## పందొమ్మిదవ అధ్యాయము

పరమేశ్వరుడు తన నొసటనున్న మూడవ కన్నునుండి ఒక దివ్య తేజస్సు బయటకు వెలువరించినాడు. ఆ కాంతి పుంజము మరుక్షణమే పురుష

రూపం ధరించింది. శివుడు తన కొలువులో ఉన్న వారందరి సమక్షములో ఈ పురుషునికి దేవల అనే నామకరణము చేయుచున్నాను. అని పలికినాడు. అప్పుడు ఆ దేవల పురుషుడు సాంబశివునికి నమస్కరించి ఈ విధముగా పలికినాడు. నిరతిశయ అనందంతో నీయందు సాయుజ్యస్థితి మోక్షస్థితిలోనున్న నన్ను మరల ఎందుకు దేహధారిని చేసినావు అని అడిగినాడు. అప్పుడు పరమేశ్వరుడు దేవలున్ని ఉద్దేశించి నీవలన లోకములకు ఉపకారము కలుగు మహత్కార్యమైన వస్త్రనిర్మాణ నిమిత్తము నిన్ను దేహధారిని చేసినాను. నీవు ఇంకా ఏడుజన్మలు ఎత్తుతావు. ఈజన్మ కాకుండా ఇంకా ఏడు జన్మలు ఎత్తవలసివున్నది. ఆరు జన్మల వరకు లోకక్షేమ కార్యములు చేయటద్వారా నీ కీర్తి ప్రతిష్టలు దశదిశలకు వ్యాప్తి గావింపపడుతుంది. ఏడవజన్మయందు తిరిగి యథావిధిగా నాయందు సాయుజ్య స్థితి మోక్షమును పొందుతావు అని చెప్పినాడు పరమేశ్వరుడు. వస్త్ర నిర్మాణము కోసమైతే ఆ ప్రథమ జన్మచాలు. వస్త్రములు నిర్మించి నేర్పించి అందరికి ఇచ్చి ఆ జన్మలోనే తిరిగి శివునియందు సాయుజ్యమును పొందవచ్చును. కాని పరమేశ్వరుడు కేవలం వస్త్రనిర్మాణం మాత్రమే కాకుండా ఇంకా ఇతర ప్రయోజనాలు లోకమునకు కలుగ చేయటానికై ఏడు జన్మలు ఎత్తవలయును అని దేవలునికి తెలిపినాడు.

## దేవలుడు విద్యావ్యాప్తికొరకు సప్తావతారములుగా అవతరించుట

అనగా వస్త్రనిర్మాణం, యజ్ఞోపవీతం సూత్రదారం అటువంటి వానితోపాటు వాటితో సమానమైన ఇతర ప్రయోజనాలను లోకానికి అందించటానికి దేవలున్ని ఉపయోగించ దలచినాడు శివుడు. దేవలుని ద్వారా సాధించవలసిన కార్యము ఏమిటి, ఆ కర్మ సాధింప బడుటకు ఏడుజన్మలు ఎత్తవలయునని అనగా అంత సమయం అవసరమై వున్నదని శివుడు గ్రహించినాడు. ఆ విషయము బ్రహ్మాండపురాణములోని దేవల చరిత్రయందు తెలుపుటయే కాక వేదసారోపనిషత్ నందుకూడా దేవల సప్తావతార నిర్ణయము అని దానిలోకూడా చెప్పబడినది ఏమిటంటే పూర్వము నిరుపమాన సద్గుణ శ్రేష్టుడునైన శాండిల్య మహర్షి సకల లోకములను నిర్మించిన బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి ఓ స్వామీ! దేవాంగునియొక్క సప్తావతార స్వరూపమును తెలుసుకొన వలెనని కోరికతో వున్నాను. అతడు ఏఏ అవతారమునందు ఏఏ కార్యములు



చేసినాడో దానినంతయును వినవలయునని నాకు కోరిక కలిగియున్నది. కావున పితామహా నాకు వివరించి చెప్పవలసినదిగా శాండిల్యుడు బ్రహ్మదేవుడిని ప్రార్థించినాడు. అప్పుడు బ్రహ్మదేవుడు ఈ విధముగా శాండిల్య మహర్షికి చెప్పినాడు. ఓ మునీంద్రా “ఈశాన స్సర్వ విద్యానామ్” అనెడు ప్రమాణమునుబట్టి సాక్షాత్ మహేశ్వరుడే సకల విద్యలకు అధీశ్వరుడని తెలియుచున్నది గదా! అట్టి పరమేశ్వరుడు సమస్త విద్యలను భూలోకమునందు వ్యాపింపజేయవలయునను ఆలోచన కలిగియుండిఆ కార్యమును నెరవేర్చుటకై తన జ్ఞాన నేత్రము నుండి ఉద్భవించిన అనగా తన మానస పుత్రుడైన దేవలునిద్వారా ఆ కార్యమును నెరవేర్చ వలయునని భావించి, దేవాంగుని వస్త్ర నిర్మాణ బృహత్ కార్యము ముగిసిన తరువాత అంతే బృహత్ కార్యమైన విద్యనుకూడా భూలోకమందు వ్యాపింపజేయ నిశ్చయించినాడు. ఆపని చేయుటకొరకై దేవాంగున్ని ఏడు జన్మలు అవతరించాలి అని ఆజ్ఞాపించినాడు. మానవులకు, పశువులకు దిగంబరత్వం వున్నది. మానవులకు మిగిలిన జంతుజాలమునకు లేనటువంటి విశిష్ట శక్తి బుద్ధి బలము ఈ బుద్ధిబలము వలన మానవులు ఇతర జంతువులనుండి వేరు చేయబడినారు. అందువలన దేవతలతోపాటు మానవులకువున్న తమ దిగంబరత్వమును రూపుమాపుట కొరకై వస్త్రముల నిచ్చి ఇతర జంతుజాలమునుండి మావునికి ఒక ప్రత్యేకతను కల్పించినాడు దేవలుడు. మానవులకు జంతువులకు ఆహార, నిద్ర, మైథునము అను మూడు సమానమే. కాని మానవుడు జంతువులవలె వాటితో సమానంగా బ్రతుకరాదు.

## విశ్వ విద్యా ప్రదాత

అందువలన మనుష్యులలో జ్ఞాన నేత్రము ఏర్పర్చ వలసియున్నది. ఈ జ్ఞాన్న నేత్రముద్వార యుక్తాయుక్త విచక్షణా జ్ఞానము కలిగి మానవుడు బుద్ధి జీవుడుగా అవతరించును. అతను ఈ సృష్టి కార్యకలాపమును నిర్వర్తించుటకు తోడ్పడును. కావున భూలోకములో విద్యావ్యాప్తి గావించి పశు తుల్యుగా వున్న అప్పటి మానవ జాతిని శ్రేష్టమైన మానవ జాతిగా మరలించడానికి శివుడు దేవలుని ద్వార ప్రయత్నంచేసినాడు. విద్యయే మానవునికి మూడవకన్ను అనగా జ్ఞాననేత్రము. ఈ విధముగా సకల

ఖండములయందు, సప్త ద్వీపముల యందుండు ప్రజలందరిని విద్యద్వారా తననుతాను తెలుసుకొనుటకు వీలుపడు వంటి విద్యా వ్యాప్తి గావించడానికి దేవలుడు ఏడు అవతారములు ఎత్తి పరమేశ్వరుని విద్యావ్యాప్తి కర్తవ్యమును దేవలుడు నెరవేర్చినాడు. అందువలన దేవలున్ని **విశ్వ విద్యాప్రదాత**గా కొలువవచ్చును. సాయుజ్య స్థితినుండి దిగువకు వచ్చి అనగా తను పొందు ప్రయోజనమును తగ్గించుకొని, లోక క్షేమమే పరమావధిగా సమస్త లోకాః స్సుఖినో భవంతు, సర్వే జనాః స్సుఖినో భవంతు ఇత్యాది వేద జనిత వాక్యములకు కార్య రూపము కల్పించినాడు. కావున పర జన హితములోనే తన హితముకూడా ఇమిడి వున్నది. అందరి క్షేమము సాధించు పనిలో తనకు కొంత నష్టము జరిగినను దానిని ఆనందంగా స్వచ్ఛందముగా స్వీకరించాలని దేవలుని సప్తావతార నిర్ణయించుట ద్వార పరమేశ్వరుడు లోకానికి తెలియపరచినాడు. అటువంటి బుద్ధిమంతులే సమాజానికి అవసరమైనటువంటి శాశ్వత ప్రయోజనములు చేకూర్చే పనులను సమర్ధవంతంగా నిర్వర్తించగలరని దానికి దేవలున్ని ఉదాహరణగా లోకానికితెలిపినాడు. కావున లోకానికి శాశ్వత ఉపకారము కలుగు విద్యావ్యాప్తిని దేవలుడు చేసినందున **విశ్వవిద్యాప్రదాత** అని కీర్తింపబడుచున్నాడు. ఈ బృహత్కార్య సాధనకు దేవలుడు ఏడు అవతారములుగా కార్తీక మాస శుద్ధ పూర్ణిమయందు విద్యాధరుడుగాను అవతరించినాడు. ఆశ్వయుజ శుద్ధ పంచమి తిథినాడు పుష్పదంతుడుగా అవతరించినాడు భూలోకములో. వైశాఖ శుద్ధ పూర్ణిమయందు బేతాళుడుగాను, మార్గశిర శుద్ధ దశమియందు వరరుచిగాను, శ్రావణ శుద్ధ దశమియందు చిత్ర యోగిగను, మాఘ శుద్ధ ఏకాదశియందు దేవశాలిగను, చైత్ర శుద్ధ పంచమియందు దేవదాసుడుగను దేవాంగుడు ఈ విధముగా ఏడు అవతారములు గావించినాడు.

ఈ బృహత్కార్య నిమిత్తమై పరమేశ్వరుడు దేవాంగుడిని తన మహిమపోగొట్టుకొని విద్యాధరుడవు కమ్ము అని శపించుటలో ఇదియే పరమార్థము. దేవతలవంటి తేజస్సుతో మానవలోకానికి వెళ్ళి వారికి కర్తవ్య బోధ చేయుట తగదు కాబట్టి దేవలుని మహిమను తగ్గించి భూలోకములో నివసించుటకు అనువైన దేహధారుడుగా చేసినాడు. నేరుగా భూలోకములోనే ప్రథమఅవతారముగా జన్మించమని అనకుండా ప్రథమంగా విద్యాధరుడవు



కమ్ము అని శపించినాడు. మానవ కాంతకు దేవజాతికి చెందిన విద్యాధరుడుకు జన్మించునట్లుగా మొదట దేవలుని అవతారం ఏర్పరచినాడు. ఆ తరువాత రెండవ జన్మ పుష్పదంతుడుగా భూలోకములోనే మానవ దంపతులకు జన్మించునట్లుగా ఏర్పరచి ఈ విధానం ఏడవ జన్మ వరకు కొనసాగించినాడు. దేవలుని ప్రథమావతారము విద్యాధరుడు. ఈ విద్యాధరులు దేవతలలోని ఉపదేవతలకు చెందినవారు. వీరు అప్సరసలు యక్షులు, రాక్షసులు, గంధర్వులు, కిన్నరులు అను ఉపదేవతలలో వీరు కూడా ఒకరు. వీరు పూలదండను హారముగా ధరిస్తారు. ఆకాశములో నివసిస్తారు. ఋక్షవంత పర్వతమునందు గూడ సంచరించెదరు.

సూతుడు తరువాత జరిగిన కథను చెప్పుచున్నాడు. మేరు పర్వతమునకు ఉత్తరము వైపున పాంచాల దేశమని ఒక దేశము వున్నది. ఆ దేశమును అమిత పరాక్రమము కలవాడును, సత్యమునే ఎల్లప్పుడు మాటలాడు వాడును అయిన ఒక రాజువుండెను. ఆ రాజు దయగలవాడు, కీర్తిప్రతిష్టలు కలవాడు. లౌకిక విషయములలోను, పాండిత్య విషయములను తెలిసివుండినవాడు. పరాక్రమవంతుడు, ప్రజలందరి మన్ననలను పొందినవాడు అయిన **సత్యసంధుడు** అను పేరుగల వాడు ఆ పాంచాల దేశమునకు రాజుగా వుండినాడు. అతనికి మంచి శుభలక్షణములు కల ఒక కూతురు గలదు. ఆమె పేరు ఇందుమతి. ఆమె కాంతి విశేషముల యొక్క గుంపునంతను ఒక చోట పోసినట్లుగా ప్రకాశించుచుండెను. ఆమెకు యవ్వనము వచ్చిన పిదప ఒకనాడు తన చెలికత్తెలతో కూడి ఉద్యానవనమునకు వెళ్ళినది. ఆ ఉద్యాన వనము ఘుమఘుమలాడే సువాసన కల్గి మిక్కిలి రమణీయముగా వున్నది. ఆ ఉద్యానవనమునందు ఆ ఇందుముఖి చెలులతో కూడి చెట్ల వద్ద సంచరించుచుండెను. అచట వున్న విద్యాధరుడు రాజకుమార్తె ఇందుముఖి సౌందర్యమును చూచి ఆమెయందు అపేక్ష కలిగి యుండినాడు. ఆమెతో మాటలాడుటకొరకు సమయం కోసం వేచివున్నాడు విద్యాధరుడు. ఆమెతో మాటలాడి ఆమెతో సఖ్యతను సంపాదించవలయునని అచ్చటనే నిలచివున్నాడు. కాని ఆ రాజకుమార్తెను విడచి చెలికత్తెలు ప్రక్కకు పోకుండా ఆమె వద్దనే వుంటున్నారు. ఏకాంత సమయములో వుంటే ఆమెను కలిసి స్నేహము

సంపాదించాలని విద్యాధరుడు అభిలాష కలిగి యుండినాడు. కాని అవకాశము కుదరకపోవుట వలన సమయం కోసం ఎదురుచూచుచున్నాడు. తనకున్న ఇంద్రజాల శక్తి వలన ఇందుముఖికి మాత్రమే తను కనపడునట్లుగాను అచ్చట వున్న చెలికత్తెలకు మాత్రము కనపడకుండా వుండు రీతిగా తన ప్రభావం చూపినాడు. దీని ద్వారా ఆమె మనస్సును తెలుసుకొనవచ్చునని ఆమెకు ఇష్టమైతే తనను కలవటానికి ప్రయత్నించునని ఈ విధమైన ఆలోచన కలిగి ఇందుముఖి రాకకై వేచివున్నాడు విద్యాధరుడు. ఇందుముఖి రెండవ మన్మధుని వంటి సుందరాంగుని చూచి తన మనస్సును అధీనంలో వుంచుకోలేకపోయినది. ఆ సుందరుడును కలవాలని ఆమె యందు కామకోరిక జనియించినది. విద్యాధరుడు యొక్క కోరిక కూడా అదేనేమో అని భావించినది. కావున అతనితో ఏకాంతముగా కలసి అతనిని గూర్చి తెలుసుకొనవలయునను తలంపు కలిగినదై తన వెంట వున్న చెలికత్తెలను అచ్చటనుంచి పంపివేసి ఆ మన్మథాకారుడి కోసం ఎదురుచూచుచున్నది. ఆ సౌందర్యవతి యొక్క మనస్సును గ్రహించిన విద్యాధరుడు వేగంగా ఆమెను సమీపించినాడు. అప్పుడు ఇందుముఖి తన వద్దకు వచ్చిన సుందరాంగుడును చూచి అతని మనోభిప్రాయమును గ్రహించినది అయి అతనితో కలసి ఒక చెట్టు వద్ద వుండి ఆ పురుషునితో ఈ విధముగా మాటలాడినది. ఓ పురుషులలో మిక్కిలి గొప్పవాడా నీవు ఎవరవు, నీ పేరేమిటి, నీవు నివసించేది ఎక్కడ. ఈ విషయమంతయూ నాకు వివరించవలయును. అసత్యము చెప్పరాదు, విషయము దాచరాదు అని ఇందుముఖి అడిగినది. దానికి విద్యాధరుడు ఓ సుందరమైన ముఖము కలదానా మిక్కిలి తేజస్సు కల బ్రహ్మదేవుని కొడుకైన వజ్రమౌళి అను విద్యాధర శ్రేష్ఠుని యొక్క కుమారుడను. **నా పేరు హేమవర్ణుడు.** నీవు నన్నడిగితివి కావున నా వృత్తాంతమంతయూ నీకు తెలిపితిని. తామరపువ్వుల రేకులవంటి కన్నులుగల ఓ చిన్నదానా నిన్ను చూచినప్పటి నుండి నా మనస్సు నీ యందు కలిగినది. ఓ కులుకులాడే నీ చల్లని బెళుకు చూపులతో నన్ను చూచి నా దేహ తాపమును తీర్చుము. ఈ విధముగా హేమవర్ణుడు పలికినాడు. అప్పుడు రాజుకుమార్తె అయిన ఇందుముఖి కూడా హేమవర్ణుడిపై ఉదయించుచున్న అనురాగం కలిగి అతనికంటే రెండింతలు మన్మథబాణముల తాకిడికి బాధింపబడినదై అతనిని అంగీకరించినది. ఆ ఇందుముఖి హేమవర్ణుడితో మాటలాడవలసిన



మాటలన్నియు మాటలాడిన తరువాత ఈ విద్యాధరుడు సత్యవంతుడు అని, యోగ్యుడు అని ఇందుముఖి భావించినది. అప్పుడు ఆ విద్యాధరుడితో తన ఇష్టమును సూచించు సంకేతము తెలిపినది. అతనితో ఈ శృంగార పట్టణమునకు ప్రభువైన సత్యసంధుడు అను రాజుగారి కుమార్తెను నేను. ఓయీ సకలసంపదలూ గల విద్యాధరుడా ఆ సత్యసంధుని ఇంటికి ఉత్తరము వైపున చంద్రుని వంటి కాంతితో మెరియుచుండు అత్యున్నతమైన మేడయందు నా నివాసము. ఆ మేడయందు సకల భోగములకు లోటు వుండదు. మిక్కిలి సుందరమైన ఆ మేడయందు నేను నా చెలికత్తెలతో కలిసి నివసిస్తాను. ఇక ఎవ్వరూ వుండరు. ఈ రోజు రాత్రికి నీవు అక్కడకు రావలయును. ఆ తరువాత నీవు అనుకున్న వన్నియు జరుగును అని రాజకుమార్తె ఇందుముఖి విద్యాధరుడికి చెప్పి ఆమె తన చెలికత్తెలతో వెళ్ళినది. ఆ విధముగా ఆమె తన ఇష్టమును తెలిపినది కావున విద్యాధరుడు బహుకాలము ఆమెతో కూడి సకల విధముల సంతోషమును పొందుచూ ఆమెతో క్రీడించుచుండెను. ఇట్లు ఆ రాజు కూతురు ఇందుముఖి విద్యాధరుడు అయిన హేమవర్ణుడు అన్యోన్యముగా ఒకరియందు మరియొకరు ధృడమైన అనురాగము కలిగి యుండినారు. ఇతరులకు ఎటువంటి సమాచారం లేకుండా జాగ్రత్త పడినారు. ఆ విధముగా ఒక సంవత్సరకాలము వారిరువురు ఆనంద సంతోషములతో విహరించినారు.

## దేవలుని ప్రథమావతారం కమలాక్షుని జననము

అప్పుడు హేమవర్ణుడు అను విద్యాధరుడు ఈ రాజపుత్రిక ఇందుముఖియందు తేజస్సుల నిధి అయిన ఒక కుమారుని పుట్టించినాడు. సమస్త శుభలక్షణములు గల ఆ కొడుకుకు **కమలాక్షుడు** అను పేరుని పెట్టిరి. ఆ బాలుడు ప్రాతః కాలమున ఉదయించు సూర్యుని వలె వృద్ధిపొందుచున్నాడు. ఈ బాలుడు అయిన కమలాక్షుడు గురించి ఇందుముఖి తన తల్లితండ్రులకు ఇతరులకు తెలియకుండా సమాచారమును రహస్యముగా వుంచినది. ఆ బాలకుడు ఆ మేడయందు మూడు నెలలు వుండినాడు. అప్పుడు ఇందుముఖి ఆ విద్యాధరుని గాంచి ఈ విధముగా పలికినది. మిక్కిలి భుజబలము కలిగిన హేమవర్ణుడా, నా ప్రాణమునకు ప్రియుడా, సకల సంపదలూ గలవాడా నేను ఇప్పుడు నీతో సహేతుకముగా మాటలాడుబోవుచున్నాను. దానిని నీవు వినుము.

ఇంతవరకూ మనమిద్దరమూ ఒకరినొకరము కామక్రీడలలో మునిగి తేలినాము. ఓ మిక్కిలి బుద్ధిశాలీ ఇకమీదట నీవు ఇచట వుండరాదు. నీవు నీకు ఇష్టము వచ్చిన చోటికి దయచేసి వెళ్ళుము. ఇక మీదట నీవు ఇక్కడ వుంటే మన ఇద్దరికీ పెద్ద అపవాదము కలుగవచ్చును. కావున నా ప్రాణేశ్వరుడా మన కొడుకైన ఈ కమలాక్షుడును కూడా నీవు తీసుకొనిపోవలయును. నీకు మేలు కలుగును. నీవు చింతపడవద్దు. ఇంతవరకూ మన ఇద్దరికీ చెలిమి కలిగినది. ఇది దైవప్రేరణ వలన కలిగినది. ఇక మీదట నీవు ఇచ్చట వుండరాదు. ఇచ్చటనుండి వెళ్ళుము. విచారము చెందకుము. ఓ మిక్కిలి బుద్ధికలవాడా ఈ నీ కుమారుడైన కమలాక్షుని నీ వెంట తీసుకొని వెళ్ళుము అని ఈ విధముగా చెప్పగా హేమవర్ణుడు ఇందుముఖితో అట్లే చేసెదను అని చెప్పి మిక్కిలి దుఃఖపడుచూ బాలుడు అయిన కమలాక్షుడిని తీసుకొని నేరుగా స్వర్గమునకు చేరినాడు. హేమవర్ణుడు.

## విద్యానిధిగా కమలాక్షుడు

స్వర్గలోకమునందు కమలాక్షుడు యవ్వనవంతుడైనాడు. సకల విద్యలయందు గొప్ప పాండిత్యమును పొంది విద్యావంతుల నందరితో చర్చా గోష్ఠులు జరుపుచూ వారిని ఆనందపరుచుచుండెను. ఈతడు 6 శాస్త్రములు అనగా తర్కమీమాంస, న్యాయ, వైశేషిక, బాట్ట, ప్రభాకర అను విద్యలయందు ఆరితేరినాడు. మన్మథవిద్యయైన కామశాస్త్రమునందు పాండిత్యము సంపాదించినాడు. సంగీత విద్యయందు మంచి మేధ కలిగినాడు, మంత్రశాస్త్రమందును, నాట్యశాస్త్రమందును, ధర్మశాస్త్రమందును నైపుణ్యము కలిగివున్నాడు. నీతిశాస్త్రమునందు చతురత కలిగివున్నాడు. అతడు మూడువేదములయందును వేదాంగములయందును నేర్పు కలవాడుగా వుండినాడు. ఆత్మజ్ఞాన విద్యలయందు, ఇంద్రజాల, మహేంద్రజాల విద్యలయందును జాగ్రత్తకలవాడు. పరకాయ ప్రవేశ విద్యయందునూ, వైద్యమందునూ ఘటికుడు. ఈ విధముగ 64 విద్యలయందు పరిపూర్ణ పాండిత్యమును పొంది సకల కళా ప్రవీణుడయినాడు. అందువలన కమలాక్షుడు ఎల్లప్పుడూ విద్యా పాండిత్యము గల వారితో నిరంతరమూ చర్చాగోష్ఠులను జరుపుచుండినాడు. మహాబుద్ధిశాలి అగునట్టియును, పండితుడును అయి విద్యాధరులందరికీ శిరోభూషణుడిగా కమలాక్షుడు వుండెను. ఒకానొకప్పుడు



శివుని సన్నిధియందుండు దేవతలు మొదలగు వారైన దేవఋషులు, బ్రహ్మర్షులు, దేవతలు, ఇతర దేవతలు, ఉపదేవతలు వారి సమక్షములో తన విద్యను ప్రదర్శించినాడు. ఆతని విద్యను అచ్చట వున్న వారందరూ మెచ్చుకొనిరి. కాని షడ్గుణైశ్వర్య సంపన్నుడైన పరమేశ్వరుడు మాత్రము మౌనముగా వుండినాడు. ఈ విధముగా సకలలోక నాయకుడైన ఈశ్వరుని సన్నిధియందు మిక్కిలి బుద్ధిశాలియైన ఆ హేమవర్ణుడు కొడుకైన కమలాక్షుడు తన విద్యలను శివుని సన్నిధానము నందున్న వారందరికీ వినిపించుచుండెను.

## కమలాక్షునికి వివత్సునకు విద్యా వివాదము

ఈ విధముగా జరుగుచుండగా ఒకనాడు పార్వతీ దేవికి భక్తుడు అగునట్టియు, మిక్కిలి బుద్ధిశాలియును, సకలవిద్యా ప్రవీణుడైన వివత్సుడను విద్యాధరుడికి, కమలాక్షునికి విద్యలయందు వివాదం జరిగి చివరికి వివత్సుడు అపజయమును పొందినాడు. అంత వివత్సుడు కమలాక్షుడిని అణచివేయదలచిన మనసు కలిగి వుండి పార్వతీ దేవిని ప్రార్థించినాడు. ఆ అంబికకు వివత్సుడు ఈ విధముగా చెప్పినాడు. అంబా! నీకు నమస్కారము. భక్తులయందు ప్రీతి గలదానా నీకు నమస్కారము. అమ్మా! నీ భక్తుడనై వుండియూ నేను కమలాక్షుని చేత విద్యలయందు తిరస్కరింపబడితిని. భక్తులను పాలించునట్టి ఓ అమ్మా! నా కొరకు ఎట్లయిననూ కమలాక్షుని అణచివేయవలయును అని వివత్సుడను విద్యాధరుడిచే ప్రార్థింపబడెను. ఆ పార్వతీదేవి తన భక్తున్ని అప్పటికీ సంతోషపెట్టుటకు అట్లే కానిమ్ము చేసెదను అని చెప్పి అప్పటికి అతనిని సంతోషపరచినది. ఆ తరువాత ఒకానొకప్పుడు కమలాక్షుడు శివుని ఎదుట పండితులందరి ముందు తన విద్యావినోదముల చేత అందరినీ సంతోషపరచెను. అప్పుడు షడ్గుణైశ్వర్య సంపన్నుడైన శివుడు తప్ప అచట వున్నవారందరూ సంతోషపడిరి. కాని శివుడు మాత్రము కొంచెమైననూ సంతోషము చెందలేదు. ఈ విషయమును గమనించిన పార్వతీదేవి తన భర్త శివునితో ఈ విధముగా పలికినది. స్వామీ! మీరేల కమలాక్షుని విద్యచేత సంతోషింపకున్నారు. ఓ మహానుభావా అటువంటి పాండిత్యము కలిగిన సమర్ధ పండితుడు లేడు గదా అని పార్వతీ దేవి అడుగగా శివుడు పార్వతీదేవితో ఓ సొగసైన పార్వతీ విద్యలచేత కమలాక్షునికి సమానుడైన వాడు లేడు వాస్తవమే. కాని ఇతడు చిరకాలము

ఇచట వుండు వాడు కాదు. అందువలన నేను సంతోషింపనైతిని. ఓ శుభాంగీ కమలాక్షుడు దేహమును విడచి ఇక మీదట పుష్పదంతుడు అను పేరు గలవాడుగా అగును అని ఇట్లు దేవతా నాయకుడగు ఈశ్వరుడు చెప్పుచుండగా అప్పుడు భక్తులను పోషించుటయందు ఆసక్తి కలిగిన పార్వతీదేవి ఈశ్వరుని మాటననుసరించి కమలాక్షుని ముఖము చూచుచూ అతనితో ఇట్లనెను. మిక్కిలి అదృష్టవంతుడును, విద్యాధరులకెల్ల ప్రభువును అగు కమలాక్షుడా నీవు ఇక సాంబమూర్తి యొక్క ఆజ్ఞ ప్రకారము పుష్పదంతుడవు కమ్ము. కావున ఇచట నుండి వెళ్ళుము అని ఈ విధముగా పార్వతీదేవి చేత చెప్పబడినవాడైన కమలాక్షుడు దుఃఖముతో నమస్కరించి అంతట తన ఇంటికి వెళ్ళినాడు.

ఈ కమలాక్ష విద్యాధరుడిగా దేవలుడు విశ్వవిద్యావ్యాప్తి కొరకై ప్రథమ అవతారం గావించినాడు. తన పాండిత్యమును శివుని సన్నిధియందలి దేవఋషులు, బ్రహ్మర్షులు, సిద్ధులు, ప్రమథగణము ముందర ప్రదర్శించి అందరి మెప్పు పొందినాడు. పార్వతీ దేవి భక్తుడగు వివత్స విద్యాధరున్ని కూడా తన విద్యలతో జయించినాడు. పార్వతీదేవియే గాక పరమేశ్వరుడు కూడా కమలాక్షుని విద్యలను చూచి సంతోషపడినాడు. ఈ విధముగా ప్రథమముగా దేవలుడు తన విద్యావ్యాప్తి ఉద్యమమును కైలాసలోకమునందు ప్రారంభించి ఆ తరువాత పుష్పదంతుడుగా భూలోకమున జన్మించి భూలోకమందు విద్యావ్యాప్తి గావించదలచినాడు. ముందుగా ఇంట గెలిచినవాడు రచ్చ గెలవటానికి భూలోకమునకు వచ్చినాడు దేవలుడు.

ఇట్లు శ్రీ బ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరితమున
పందొనిమిదవ అధ్యాయము పరిపూర్ణము



## పుష్పదంతోపాఖ్యానము - బేతాళ శాప ప్రదానము

### ఇరువదవ అధ్యాయము

సూత మహర్షి శౌనకాది మునులకు తరువాత జరిగిన కథను ఈ విధముగా చెప్పుచున్నాడు. యుగంధర దేశమునకు హేమవతి అనుపేరుగల



రాజధాని నగరము వున్నది. ఆనగరమునందు అమిత పరాక్రమశాలి అగు శ్రుతకీర్తి అను పేరుగల రాజు పాలించుచుండెను. ఈతని పట్టమహిషి పేరు సోమవతి. ఈ దంపతులకు కమలాక్షుడు పుష్పదంతునిగా జన్మించినాడు. ఇది దేవలుని ద్వితీయ అవతారము. సింధు దేశపు రాజు మిక్కిలి బుద్ధిమంతుడు. అతనిపేరు విరూపాక్షుడు. దేవలుని భార్య ఆయిన దేవదత్త ఈ విరూపాక్షునికి కూతురుగా జన్మించినది. ఆమె పుట్టిన వెంటనే ఆకాశ దేవత అశరీరవాణిగా ఓరాజా! నీకు జన్మించిన శిశువునకు దేవదత్త అని పేరు పెట్టవలెను అని పలికెను. అంతట విరూపాక్ష మహారాజు తనకు జన్మించిన ఈ శిశువుకు దేవదత్త అని నామకరణము చేసినాడు. పుష్పదంతుడు యుక్త వయస్సు వచ్చినప్పుడు శ్రుతకీర్తి మహారాజు విరూపాక్షుని కుమార్తె అయిన దేవదత్తను తనకుమారుడైన పుష్పదంతునికిచ్చి వివాహము జరుపులాగున విరూపాక్షునితో మాటలాడి నిశ్చయించినాడు. పుష్పదంతుని వివాహము వైభవోపేతముగా జరిపించినాడు శ్రుతకీర్తి రాజు. అతను వార్ధక్యము పొందియుండి తన రాజ్య బాధ్యతలను తన కుమారుడైన పుష్పదంతునికి అప్పజెప్పి అతను తన భార్యతోకలిసి తపోవనమునకు వెళ్ళినాడు. రాజ్యబాధ్యతలను స్వీకరించిన పుష్పదంతుడు తనతండ్రియొక్క కీర్తి వృద్ధి చెందులాగున ప్రజలు హర్షించు రీతిగ జనామోద పాలనచేయుచుండినాడు.

## పుష్పదంతుని శివపూజ

పుష్పదంతుడు ప్రతిరోజు ప్రాతఃకాలమున పదకొండు వేల దివ్య శివలింగములకు అర్చన చేసిన తరువాతనే ఆహారము సేవించేవాడు. అప్పటిదాకా జలముకూడ త్రాగకుండ వుండును. శివుని పూజయందు మిక్కిలి భక్తి కలిగినియమ నిష్ఠలతో అర్చన చేయుచుచుండెను. పుష్పదంతుడు ప్రతినిత్యము ఎల్లవేళలయందు తన మనస్సునందు సాంబశివుడిని స్మరించుచునే యుండును.పరమేశ్వరునికి సమర్పించిన నైవేద్యమునే తనకు ఆహారముగా స్వీకరించును. అందువలన రుద్రాక్షలచేత తన కిరీటమును చేయించుకొని ధరించినాడు. రుద్రాక్షలను కంఠమునందు హారములుగా ధరించినాడు. బాహువులకు, మణికట్టు వద్దను రుద్రాక్షలను కడియములుగా ధరించినాడు. తన దేహము అంతటను విభూతిని అలంకరించుకొని వుండును. శివునియందు

ధృఢ భక్తి కలిగి శివుని కథలను వినుచుండును. శివునిని నిరంతరము ధ్యానించుచుండును. ఈ విధముగా శివరూప ధారణ చేసి తన ఆత్మను శివుని రూపముతో నింపి వేసినాడు. పుష్పదంతుడు తనకోటనందు ఉ ద్యానవనమును అనగా పూల తోటను ఏర్పరచినాడు. ఆ పూలతోటలో రకరకములైన పుష్ప మొక్కలను నాటి వాటికి ప్రతిరోజు తానే స్వయముగా నీరుపోయుచు ఆ పూల చెట్ల బాగోగులు అన్నియు స్వయముగా చూచుకొనుచుండెను. పుష్పముల యందు ప్రీతి గల పుష్పదంతుడు తన పూలవనము నందలి రకరకములైన పుష్పములనుకోసి ప్రతిరోజు పదకొండువేల శివలింగములను పూజించి పుష్పములచే అలంకరించే వాడు. మిక్కిలి భక్తి శ్రద్ధలతో కూడినవాడై ఒక శివరాత్రిరోజున శివాలయమునకు పోయి గొప్ప దేవుడైనటువంటి సాంబశివుడిని పూజించినాడు. ఆ పూజ అనంతరము 32 శ్లోకములతో ఆ శివుడిని స్తోత్రము చేసినాడు. పుష్పదంతుడు చేసిన ఈ స్తోత్రమునకు శివుడు సంతోషముచెంది అతనికి ప్రత్యక్షమై పుష్ప దంతా ! నీవు చేసిన స్తోత్రము నాకు సంతోషము కలిగించినది. కావున నీకు వరము ఇవ్వదలచినాను. నీ యిష్టము వచ్చిన కోరికను కోరుకొనుము. దానిని నేను నెరవేర్చెదను అని సాంబశివుడు పలికెను.

## పుష్పదంతుడికి శివుడు వరమిచ్చుట

తన కళ్ళముందు సాంబశివుడు సాక్షాత్కరించేసరికి మహా ఆనందపడినాడు పుష్పదంతుడు. దేవదేవా! మహాదేవా! పరమేశ్వరా! నీ రూపమును నాకనులారా గాంచి మహా ఆనందము చెందితిని. కావున నాకు నా భార్యకు మిమ్ములను ప్రతిరోజు చూచుకునే భాగ్యము నాకు కలుగజేయుము. దాని వలన మేము మహా ఆనందము చెందుతాము శంకరా! ఈ కోర్కెను నెరవేర్చుము. మాకు ఇంతకన్నా ఇంకేమీ కోరికలు లేవయ్యా అని ప్రార్థించినాడు. పరమేశ్వరుడు పుష్పదంతుని కోరిక విని సంతోషించి మీరు కోరినట్లుగానే మీ దంపతులకు ప్రతిరోజు దర్శనము యిచ్చెదను అని పలికి అంతర్ధానమైనాడు శివుడు. ఈ విధముగా శివునిచే వరమును పొందిన పుష్పదంతుడు ప్రతిరోజు తమ పూలతోటలయందు పుష్పించిన పుష్పములను



కోసి వాటిని మాలలుగా చేసుకొని తనభార్య దేవదత్తను వెంటనిడుకొని పుష్పదంతుడు కైలాసమునకు వెళ్ళి అచట పార్వతీ పరమేశ్వరులను దర్శించి తాము తెచ్చిన పుష్పమాలలతో శివపార్వతులను అర్చించి ఆ తరవాత తమరాజ్యానికి తిరిగి వచ్చేవారు. ఈ విధముగా పుష్పదంతుడు దంపతులు ప్రతిరోజూ తమపూలతోటలోని పూలతో కైలాసమునకు వెళ్ళి పార్వతీ పరమేశ్వరులను అర్చించుట వారికి దైనిక కృత్యముగా వున్నది. ఇట్లా జరుగుచుండగా ఒకానొకప్పుడు పుష్పదంతుడు పూలను తీసుకొని తను ఒక్కడే కైలాసమునకు వెళ్ళినాడు. పుష్పదంతుడు వెళ్ళుసరికి పార్వతీ పరమేశ్వరులు ఏకాంతముగా రహస్య స్థలమునందు వుండినారు. వారికి తన పుష్పములను ఇవ్వదలచినవాడై పార్వతీ పరమేశ్వరులుండు చోటుయొక్క వాకిలి దగ్గరకు వెళ్ళగానే పార్వతీ పరమేశ్వరులు మాటలాడుకొనుచున్నారు.

## పార్వతీదేవి శివుని రహస్యమైన కథను చెప్పమని అడుగుట

అంతకు ముందు పార్వతీదేవి చెలికత్తెలు పార్వతీదేవితో ఓదేవీ! మీరు మాకు ముచ్చటగొలిపే ఒక రహస్యమైన కథను ఇంతవరకు ఎవ్వరు వినని కథను చెప్పవలయునని అడిగి వుంటిరి. పార్వతీదేవి తనచెలికత్తెల మాటను అప్పుడు గుర్తుకు తెచ్చుకొని తనతో ఏకాంతముగా వున్న తనభర్త శివుడుతో స్వామీ! మీరు నాకుఇప్పుడు ఒక రహస్యమైన కథను చెప్పవలయును. ఇప్పటివరకు ఎవ్వరూ వినని కథను నాకోసం నాపై ప్రేమతో చెప్పవలయును అని పార్వతీదేవిఅడుగగా ఓశుభాంగీ! నీవు కోరిన విధముగనే ఇప్పటి వరకు ఎవ్వరికీ తెలియని కథను నీకు ప్రేమతో చెప్పెదను వినుముఅని శివుడు పార్వతీదేవికి ప్రీతికలుగు విధముగా రహస్యమైన కథను చెప్పుచున్నాడు. వాకిటి దగ్గర నిలబడ్డ పుష్పదంతుడు పార్వతీపరమేశ్వరులను త్వరగా పుష్పములతో పూజించుకొరకై ఆ ద్వారము సమీపముననే వేచియున్నాడు. పరమేశ్వరుడు పార్వతీదేవికి చెప్పుచున్న కథను పుష్పదంతుడు కూడా విన్నాడు. శివునిచే చెప్పబడుచున్న కథ అయిపోయిన తర్వాత పుష్పదంతుడు పార్వతీ పరమేశ్వరులను దర్శించి వారిని పుష్పములతో పూజించి తరువాత తన యింటికి వచ్చేసరికి చాలా పొద్దుపోయినది. బాగా ఆలస్యమైనది. ఇచ్చట దేవదత్త తనభర్త రాకకై ఎదురుతెన్నులు చూచిచూచి ఎంతో విసుగు చెందినది. తన భర్త రాకకై

ఎంతో ఆతృతతో ప్రేమతో నిరీక్షించినను రాత్రి బాగా జరిగిపోయినను ఇంక రాకపోయేసరికి తనభర్త తనపై ప్రేమను విడచి అన్యస్త్రీ సంపర్కముతో అచటనే వుండి వుంటాడు లేకపోతే శివుడికి పూలు సమర్పించి రావడానికి ఇంత సమయం ఎందుకు అవుతుందని భర్తపై కోపము తెచ్చుకొని అలిగి నిద్రపోయినది.

## దేవదత్త పుష్పదంతుని నిందించుట

పుష్పదంతుడు ఇంటికి వచ్చేసరికి దేవదత్త నానా విధములుగా దూషించుచున్నది పుష్పదంతుడిని. నీవు వ్యభిచారమునకు వెళ్ళినావు అందువలననే ఇంత రాత్రి అయినది అని పలుపలు విధములుగా పుష్పదంతుడిని నిందించుచున్నది. పుష్పదంతుడు పరాకు చెందక తన భార్యయందలి అనురాగముతో నేను అటువంటివాడనా నీవు చెప్పు అని అనేసరికి వెంటనేఅతని భార్య దేవదత్త మరి ఎందుకు ఇంత ఆలస్యమైనది. నీకొరకు ఎదురుచూచిచూచి విసుగెత్తిపోయినది అని తెలుపగా అప్పుడు పుష్పదంతుడు తన ఆలస్యానికి గల కారణమును తన భార్యతో చెప్పినాడు. ఓప్రియురాలా! శుభాంగి! నా రాక ఆలస్యమవుటకు కారణము చెబుతాను వినుము. నన్ను నిష్కారణముగా నిందించుచున్నావు అని, నేను పుష్పములను తీసుకొని కైలాసమునకు వెళ్ళగానే పార్వతీ పరమేశ్వరులు ఏకాంతముగా రహస్య స్థావరమునందు ఉన్నారని తెలిసి వారువుండు చోటువద్దకు వెళ్ళి వాకిలి వద్ద నిలబడి వున్నాను. అప్పుడు పార్వతీదేవి పరమేశ్వరునితో ఓ నాథా! ఇంతవరకు ఎవరూ విననటువంటిది మిక్కిలి కుతూహలము కలిగించునటువంటి రహస్యమైన కథను నాకు చెప్పుము అని అడుగగా పరమేశ్వరుడు పార్వతీదేవికి కథ చెబుతుండగా నేను వాకిటి వద్దనే వుండి వారి కథ అయిపోయిన తరువాత నేను వెళ్ళి వారిని దర్శించి వచ్చుసరికి ఈ కాలము అయినది. నిజానిజాలు తెలుసుకోకుండా తొందరదరపడినన్ను నిందించుచున్నావు నీవు అంటే నాకు ఎంత ప్రేమ కలదో నీకు తెలియదా నేను అన్య స్త్రీ దగ్గరకు వెళతానా అని ఈ విధముగా భార్యను ఊరడించు చుండగా ఆ దేవదత్త లాలనతో అయితే ఆ కథ వినాలని నాకు కోరిక కలుగుచున్నది.

## పుష్పదంతుడుని కథచెప్పమని వత్తిడి చేయుట



దానిని ఇప్పుడే నాకు చెప్పుము అని భర్తను బ్రతిమిలాడినది. పుష్పదంతుడు ఆలోచనలో పడినాడు. పార్వతీపరమేశ్వరులు రహస్యముగా చెప్పుకున్న వాటిని నేను వినగూడదు. పాపం చేసినాను.కాని దేవదత్త పీడించుచున్నది. ఆ కథను ఈమెకు ఎట్లా చెప్పేది అని మధనపడుచుండగా భార్య వత్తిడి మేరకు ఆ కథను చెప్పినాడు పుష్పదంతుడు. ఆ మరునాడు దేవదత్త పుష్పదంతుడు దంపతులు ఇరువురు తమ పుష్పవనములోని పుష్పములను కోసుకొని మాలలుగా చేసుకొని కైలాసమునకు వెళ్ళినారు. దేవదత్త పార్వతీదేవి వద్ద వున్నది. అంతట పార్వతీదేవి తన చెలికత్తెలతో మీకు ఒక రహస్యమైన ఇంతవరకు ఎవ్వరూ విననిది అయిన కథను చెబుతాను అని పార్వతీదేవి తనచెలికత్తెలకు కథనుచెబుతుండగ ఇంతలో దేవదత్త మిగతాకథను నేనుచెబుతాను అని పార్వతితో అనగా పార్వతీదేవి చెప్పుమని దేవదత్తకు అనుమతి ఇచ్చినది. దేవదత్త క్రితం రాత్రి తన భర్త చెప్పగా విన్న కథనుపూసగ్రుచ్చినట్లుగా మొత్తం విశదముగాచెప్పినది. దేవదత్త చెప్పినదంతా పరమేశ్వరుడు రాత్రి నాకు చెప్పిన విధముగానే వున్నదే అని భావించి పరమేశ్వరుని వద్దకు పార్వతీదేవి సమీపించి మిక్కిలి కోపపడుతూ మీరు ఎంతో గొప్పప్రభువులు దేవతలకే దేవుడవు అటువంటి మీరునాకు అబద్ధం చెబితే ఎలా సహించేది అని నిష్టూరమును పలుకుతున్న పార్వతినిగాంచి పరమేశ్వరుడు నీ కోపానికి కారణం ఏమిటి? నీవు ఎందులకు అకారణముగా కోపము తెచ్చుకొన్నావని పార్వతిని అడిగినాడు పరమేశ్వరుడు. ఏమి చెప్పమంటావు ఇంతవరకు ఎవ్వరూ వినని రహస్యమైన కథను చెప్పమంటే రాత్రినాకు ఒక కథ చెప్పినావు. ఆ కథను నేను నా చెలులతో ఇంతవరకు ఎవ్వరికీ తెలియని అతి రహస్యమైన కథను చెబుతాను వినండి అని చెబుతుండగా ఇంతలో పుష్పదంతుని భార్య దేవదత్త మిగతా కథను నేను చెబుతాను అని రాత్రి మీరు నాకు చెప్పినకథనే ఆమె నా చెలికత్తెలకు చెప్పినది. నా చెలికత్తెలముందు నాకు పరాభవము జరిగినట్లుగా వున్నది. ఎవ్వరికి తెలియనిది అని చెప్పితిని. వేరే వారికి తెలిసిన కథను చెప్పితివి. కావున నేను నీవద్దమోసపోతిని. అసత్యమాడినావని పార్వతి అనేసరికి శివునికి ఆగ్రహం కట్టలు త్రెంచుకొని వచ్చినది.

## శివుడు పుష్పదంతుని నిలదీయుట

వెంటనే దేవదత్తను పిలిపించి ఈకథను నీకు ఎవరు చెప్పినారు, ఎప్పుడు చెప్పినారు నిజము చెప్పమని హూంకరించినాడు పరమేశ్వరుడు. అప్పుడు దేవదత్త గజగజ వణుకుచూ రాత్రి నా పెనిమిటి ఈ కథను చెప్పినాడు అని చెప్పినది. దేవదత్తనోట ఈ మాట వినిన పరమేశ్వరునికి మహా తీవ్రమైన కోపముకలిగినది. పుష్పదంతుని పిలిచి అతిశయించిన కోపముతో ఓరీ! దుర్మార్గుడా! భార్యా భర్తలు ఏకాంత సమయములో వుండి మాటలాడుకునే మాటలురహస్యముగా వుండి వింటావంటరా! ఈ కథను నీవు ఎవ్వరివలన వింటివో చెప్పుము అని నిలదీయగా పుష్పదంతుడు గడగడ వణుకుచూ మిక్కిలి భయముచెందినవాడై స్వామీ! నన్ను క్షమించుము. రాత్రి మీ దంపతులు ఇద్దరూ చెప్పుకొనుచున్న కథను నేను వింటిని. దానిని రాత్రినా భార్య దేవదత్తకు చెప్పితిని తప్పంతా నాదే. నా భార్య తప్పు ఏమీ లేదు. కాబట్టి నన్ను శిక్షించండి అని పరమేశ్వరుడుని వేడుకొనినాడు పుష్పదంతుడు.

సత్యవంతుడైన శివుడు పార్వతీదేవిచేత అనత్యమాడినావు అనిఅనిపించుకోవటం, తను తనభార్య కోరిన ప్రకారం రహస్యమైన కథ చెప్పినను చివరికి ఆమె ఆగ్రహం పొందటం, రహస్యంగా వుండి భార్యాభర్తలు మాట్లాడుకొనే మాటలు వినడం, ఆ వినినవాటిని పుష్పదంతుడు తన భార్య దేవదత్తకు చెప్పటం, ఆ దేవదత్త ఆకథ నాకుకూడా తెలుసులే అని పార్వతీదేవికి బదులుగా ఆమె చెప్పటానికి ముందుకు రావడం, పుష్పదంతుడు తప్పునాదికాని నా భార్యదు కాదు ఆమెను దండించవద్దు నన్నే శిక్షార్హునిగా చేయండి అని అనటం, పుష్పదంతుడు మహా భక్తుడు అని నమ్మి తమకు సేవ చేయడానికి అంగీకరించినందులకు అతను చేసిన ఈ అపరాధము వీటినన్నింటిని గమనించిన పరమేశ్వరుడు మిక్కిలి కోపము పొందినాడు.

## శివుడు పుష్పదంతుడిని బేతాళుడుగా జన్మింపమని శపించుట

అందువలన ఓరీ! కామము చేత మైకం కమ్మిన నీచ స్వభావము కలవాడా, మూఢుడా, నీ బుద్ధిని గూర్చి ఇక ఏమియును చెప్పవలనురా! మేము



రహస్యముగా మాటలాడుకొను మాటలను వివేకములేక వింటివి. మోహముచేత భ్రమపడి ఆ కథను నీ భార్యకుకూడ చెప్పితివి. కావున ఓ దుష్టబుద్ధి కలవాడా! నీవుమహా భయంకర రూపముతో బేతాళుడవు కమ్ము. పార్వతీ చెలులకు అవమానము కలుగజేసినది కనుక నీ భార్య మిక్కిలి దుర్మార్గురాలు. ఆమె ఆడలేడిగా అవుతుంది. ఈ ప్రకారము శపించిన ఆ దేవదేవున్ని పుష్పదంతుడు భయముచేత తొట్రుపాటుపడుచు భార్యతోగూడినవాడై దుఃఖపడుచు పరమేశ్వరునితో దయకు సముద్రము వంటివాడా! దేవతలకెల్ల దేవుడా! భక్తులయందు ప్రీతి కలవాడా! స్వామీ! నన్ను రక్షించుము. తామిచ్చిన శాపమునకు అంతము తెలియకున్నది స్వామీ నా యందు దయయుంచుము. ఓశుభములను కలుగజేయు స్వామీ! ఇప్పుడు మీరు మాయిద్దరకూ ఇచ్చిన ఈ శాపమునకు అంతము తెలుపుము. దాటటానికి గట్లుగా లేనటువంటి ఈ శాప సముద్రమును ఏరీతిగ దాటగలము అని ఈ విధముగా పుష్పదంతుడు ప్రాధేయపడుతూ అడిగినాడు. అప్పుడు శివుడు పుష్పదంతునిగూర్చి ఓయీ!నీ భార్య పగలు లేడిగాను, రాత్రిపూట యక్ష కన్యగాను అగును. ఎప్పుడు నీవు నీ భార్య పరస్పరము ఒకరినొకరు చూచుకొందురో అప్పుడు నేనిచ్చిన ఈ కష్టతరమైన శాపంనుండి మీరు విముక్తులగుదురు. ఇక మీదట కలియుగమునందు విక్రమార్కుడను పేరుగల ఒక రాజు మిక్కిలి దయగలవాడు, సత్య ప్రతిజ్ఞ కలవాడును, తేజోవంతుడును, మిక్కిలిపరాక్రమము గలవాడును పుట్టగలడు. అతడు మిక్కిలి భుజబలము కలవాడు. అతనిచేత నేను చెప్పినదెల్లా జరుగును. ఈవిధముగా పుష్పదంతునిగూర్చి చెప్పి అనంతరము సాంబమూర్తి తన అంతఃపురమునకు వెళ్ళెను. దేవాంగునకు ఇది మూడవ శాపము.

## దేవదత్త వలననే ఇది జరిగినది

తొందరపాటు మనస్సత్వం కలిగిన స్త్రీలవలన కష్టాలే గాని సుఖాలు ఎక్కడ వుంటవి. తనభర్త కైలాసలోకానికి వెళ్ళివచ్చుటలో ఆలస్యమైనందునతన భర్తను జారుడు అని అనరానిమాటలతో బాధించినది. పార్వతీ పరమేశ్వరులు ఏకాంతముగా చెప్పుకున్నమాటలను తనకుచెప్పమని దేవదత్త పుష్పదంతున్ని పీడించినది. ఒక భార్యాభర్తల రహస్య సంభాషణ వినరాదు అనే వివేకము లేకుండాప్రవర్తించినది దేవదత్త. అంతేనా కైలాస లోకంలో పార్వతీ సమక్షంలోని

అతిపెద్దదైన ఫాలతలము కలిగి అందరికన్నా అతి భయంకరమైన ఆకారము కలవాడై మరియు ఘోరమైన లక్షణములతో కూడుకొని భూత సమూహములకు అధిపతియై పెద్ద జడలను ధరించి సకల రాజబృందమునకు ఖడ్గ యుద్ధము ఉపదేశించుచు ధనుర్విద్య ఉపదేశించుచూ బేతాళుడుగ అయినాడు పుష్పదంతుడు. సింహములు, పెద్దపులులు మొదలగు కౄర జంతువులచే సేవింపబడుతూ అంతటి భయంకరములైన వానరములు, ఎలుగుబంట్లు, కొండముచ్చులతో పరివేష్ఠింపబడి ఉజ్జయినీ పట్టణమునకు తూర్పుగానుండు మహారణ్యములో ప్రవేశించి అతి భయంకరమై శతయోజన విస్తీర్ణముగల ఆ అడవిలోని ఒక మర్రి చెట్టును చూచి ఆ చెట్టుపైన తూర్పు వైపున వున్న కొమ్మను ఆశ్రయించుకొని వుండినాడు బేతాళుడుగా మారిన పుష్పదంతుడు. ఆహా! ఏమి ఆశ్చర్యము. సృష్టిలోనే మహా అందగాడుగా కీర్తింపబడిన దేవలుడు చివరకు మహా ఘోరాతిఘోరమైన భయంకర రూపముదాల్చి అందరినీ భయపెట్టు వాడయినాడు. ఆతని భార్యయగు దేవదత్త పుష్పిణి అని ప్రసిద్ధి చెందినది. ఆమె పార్వతీపరమేశ్వరుల శాపము వలన లేడి రూపమును పొంది ఆ మహారణ్యములో లేడి మందలతో కలసి అటుఇటూ పరుగులెత్తుచూ నాలుగు దిక్కులను చూచుచు మాటిమాటికి తన నీడను చూచుకొనుచు తలపైకెత్తి భయపడుతూ పగటిపూట దర్భాంకురములను లేత గడ్డిని తినుచు ఎండమావులను చూచి జలమను భ్రాంతిచేత మాటిమాటికి పరుగులెత్తుచూ వుండినది. మరియు ఆ ఆడ లేడి రాత్రిపూట ఒక యక్షజాతి స్త్రీగా మారి నృత్య గీతములయందు సరిగమపదనిస అను స్వరములతో కూడుకున్నట్లుగా వీణానాదము వినిపించుచుండినది. ఆవీణానాదమును వినువారికి చెవులు బహు మధురమైన శివస్తుతితో కూడిన సంగీతమును గానము చేయుచూ ఆ వనము నందే దేవదత్త శాపగ్రస్తురాలై యున్నది.

ఇట్లు శ్రీ బ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరితమున
ఇరువదవ అధ్యాయము పరిపూర్ణము





## చంద్రశర్మోపాఖ్యానము

### ఇరువై ఒకటవ అధ్యాయము

సూతపౌరాణికుడు ఋషులకు తరువాత కథను చెప్పుచున్నాడు. భూలోకమున కలియుగమున మిక్కిలి దారుణముగా పాపము వృద్ధిని పొందుచుండెను. వేదనారాయణ పురమునందు విష్ణుశర్మ అను బ్రాహ్మణుడు వుండెడి వాడు. అతనికి మిక్కిలి తేజస్సు కలిగిన నలుగురు కుమారులు జన్మించినారు. వారు యజ్ఞనారాయణుడు, వేదనారాయణుడు, వీర నారాయణుడు, చంద్రశర్మ అని వారి పేర్లు. మొదటిముగ్గురు సర్వ శాస్త్రములను అభ్యసించి దానియందు ప్రవీణులైనారు. నీతిశాస్త్ర పారంగతులు, వ్యవహార జ్ఞానము కలవారు ఆలోచనలు చెప్పుటయందు మహాబుద్ధిమంతులుగాను, గుణవంతులుగను అయి వుండిరి. ఈ ముగ్గురు తమ పాండిత్యమును సభలయందు చూపించి బహువిధములుగా బహుమానింపబడిరి. విష్ణుశర్మ యొక్క చివరి కొడుకు చంద్రశర్మ విద్యలయందు రాణించ లేక పోయినాడు. అందువలన ముగ్గురు అన్నలు తమకు శుశ్రూష చేయటానికి చంద్రశర్మను ఉపయోగించు కొనుచుండిరి. ఈ విధముగా కొన్ని సంవత్సరములు జరిగినవి. చంద్రశర్మ వారి అన్నలకు శుశ్రూష చేయుచు అతనికి కూడా విద్యాభ్యాసం చేయవలయునని, విద్యపొందిన వారైన తన ముగ్గురు అన్నలు సభలలోను, సమాజములోను పేరు ప్రతిష్టలు పొంది అనేక కానుకలు పొందుటచే సంతోష జీవనము చేయుచున్నారు. నాకు విద్యలేక పోవటం వలన నేను వారికి సేవ చేయటానికి మాత్రమే పనికివస్తున్నాను. నేను కూడా పాండిత్యం సంపాదించి తన అన్నలలాగా గౌరవ మర్యాదలు తమ పట్టణంలో పొందవలయునను బలమైన కోరిక చంద్రశర్మకు కలిగినది. ఎంతకాలం ఈ శుశ్రూష చేస్తాము అని తను చేసే పనిపై విసుగుదల కలిగినాడు.

### చంద్రశర్మ ఇంటినుండి వెడలిపోవుట

ఈ విషయము తన అన్నలకు తెలుపలేదు. దైవ ప్రేరణ వలన ఒకానొక రోజు అర్ధరాత్రి సమయమందు ఎవ్వరికి చెప్పకుండా ఇంట్లోనుంచి బయటకు వచ్చినాడు. మార్గమును బట్టిపోవుచున్నాడు. తెల్లవారేసరికి చాలా దూరము

ప్రయాణము చేసినాడు. ఆరోజు సాయంత్రము దాకా నడచి ఒక అగ్రహారమును చేరుకొనినాడు. అచ్చట వున్న నదిలో స్నానముచేసి సంధ్యావందనము ఆచరించినాడు. వేదమాతయగు గాయత్రీ దేవి జపమును చేసుకొను చుండెను. అప్పుడు ఆనది ఒడ్డున వున్న రావిచెట్టుపై ఎంతోకాలంగా కనిపెట్టుకొని ఒక బ్రహ్మరాక్షసుడు వున్నాడు. ఆ బ్రహ్మరాక్షసుడు ఈ బ్రహ్మచారి అయిన చంద్రశర్మను చూచి సంతోషముచెంది బ్రాహ్మణ వేషమును ధరించి చంద్రశర్మ వద్దకు వచ్చి నాయనా! నీవు ఎవరవు.ఎచటనుండి వచ్చుచున్నావు. ఎచ్చటికి పోవాలను కొనుచున్నావు. నాకుచెప్పుముఅని అడిగినాడు బ్రాహ్మణ వేషములో వున్న బ్రహ్మరాక్షసుడు. చంద్రశర్మ ఆ బ్రాహ్మణుని చూచి ఇతడు నిజముగా బ్రాహ్మణుడే అని తలచి అతనితో అయ్యా! వేదనారాయణపురమున విష్ణుశర్మ అనెడు ఒక బ్రాహ్మణుడు వుండినాడు. ఆయనకు నలుగురు కొడుకులు గలరు. ఆ నలుగురిలో నేను చిన్నవాడను. నా పేరు చంద్రశర్మ. నేను మహాగురువులను ఆశ్రయించి వారి దయవలన విద్యను అభ్యసించాలను కొనుచున్నాను. అందు కొరకై ప్రయాణము చేయుచున్నాను. ఇది నా సంగతిఅని బ్రాహ్మణరూప వేషధారి అయిన బ్రహ్మరాక్షసునికి చంద్రశర్మ చెప్పినాడు.

## బ్రహ్మ రాక్షసుడు చంద్రశర్మకు విద్యను చెపుతానని చెప్పుట

అప్పుడు ఆ బ్రహ్మరాక్షసుడు ఇట్లు చెప్పినాడు. నాయనా! నేను నీకు వేద వేదాంగములగు విద్యలను చెప్పగలను నీకు.అంగీకారము అయినచో నా వద్ద చదువుకొనుము అనుమాట అతని వలన వినిన చంద్రశర్మ మిక్కిలి సంతోషము చెందినాడు. దైవకటాక్షము వలన వెదకబోయే తీగ కాలికి తగిలినట్లున్నది అని భావించిన చంద్రశర్మ ఆ బ్రాహ్మణునితో అట్లే చేయుదును అని అతనికి తన అంగీకారమును తెలిపినాడు. చంద్రశర్మ సంకల్పము తెలుసుకున్న ఆ బ్రాహ్మణ వేషధారి చంద్రశర్మతో నాయనా! నారూపమును చూడవలయును.నీవు భయపడవద్దు అని ఆ బ్రాహ్మణుడు తననిజరూపమైన బ్రహ్మరాక్షసునిగా కనిపించినాడు. భయంకరమైనటువంటి ఆ రాక్షస రూపమును చూచిన చంద్రశర్మ వెంటనే తన కన్నులు మూసుకొని మిక్కిలి భయపడినాడు. వెంటనే బ్రహ్మరాక్షసుడు ఇంతకుముందు ధరించిన బ్రాహ్మణ వేషమును ధరించి చంద్రశర్మకు కనపడినాడు. అప్పుడు చంద్రశర్మ భయమునుండి



తేరుకొనినాడు. తరువాత చంద్రశర్మను ఆ రావిచెట్టు యొక్క కొమ్మమీదకు తీసుకువెళ్ళి రాత్రింబవళ్ళు నిద్రాహారములు లేకుండా విద్యలను చెప్పుచుండెను. ఈ విధముగా ఆరు మాసములు గడచిన పిదప బ్రాహ్మణుడు ఓసుందర రూపముగల చంద్రశర్మా, నేను నీకు అన్నివిద్యలను నేర్పితిని. అందువలన నీవలన నాకు శాపవిమోచనము కలిగినట్లే. నేను ఇప్పుడు బయలుదేరి గంగాస్నానము చేయాలి. కావున ఇక మీరు మీఊరికి వెళ్ళండి. నీ దయవలన నేను కాశీకి వెళుతున్నాను. నీకు ఇక నుండి చాలా మంచిజరుగును. నీకు గుణవంతులైన నలుగురు కుమారులు జన్మించెదరు. వారు సామ్రాజ్యమును స్థాపించి పాలించెదరు అని ఆశీర్వదించి ప్రయాణమునకు సమాయుత్తము అగుచుండగా అప్పుడు చంద్రశర్మ ఆ బ్రాహ్మణునితో ఓ గురువు గారు! తమరు వేదవేదాంగ పారంగతులు, సర్వ శాస్త్రముల తత్త్వమును బాగుగా తెలిసినవారు. ఇట్టి తమకు ఈ బ్రహ్మరాక్షసత్వము రావటమేమిటి? దానికి కారణమేమిటి?ఈ విషయములు నాకు తెలుపవలయునుఅని చంద్రశర్మ అడుగగా!ఆ బ్రాహ్మణుడు సమాధానము చెప్పుచున్నాడు. చంద్రశర్మా నా కథను వినుము.

## బ్రహ్మ రాక్షసుడు తనకు కలిగిన శాపం గురించి చెప్పుట

పూర్వము కృష్ణానదీ తీరమున సరస్వతీ పురము అను ఒక అగ్రహారము కలదు. ఆ ఊరిలో వున్న వారందరూ పండితులే. నేను ఆ ఊరికి చెందిన వాడను. వేద శాస్త్రాది విద్యలన్నియు నేర్చుకొంటిని. నాదగ్గరకు ఒక విద్యార్థి వచ్చి నాకు నమస్కరించి అయ్యా! నాకు విద్యాదానము చేసి నన్ను రక్షింపుము అని అనగా నేను గర్వముతో ఈ లోకములో నేను ఎవ్వరికిని వేదాది విద్యలు నేర్పదలచుకోలేదు గనుక వెంటనే ఇక్కడనుండి వెళ్ళుము అని పలికినాను. అప్పుడు ఆ బ్రాహ్మణ విద్యార్థి కోపించి నేను మరియొక గురువు ద్వారా సమస్త విద్యలను నేర్చుకొందును "బ్రాహ్మణాధమా! నీ విద్యలన్నియు నిష్ఫలములు అయి నీయొద్దనే యుండుగాక" అని నన్ను బ్రహ్మరాక్షసుడవు కమ్మని శపించినాడు. తరువాత నేను భయమునుపొంది గడగడ వణకుచు బ్రాహ్మణుడా! నాయందు దయవుంచి నన్ను అనుగ్రహించుము. శాపవిమోచనము తెలుపుము అని అతనిని యాచించితిని. నా ప్రార్థన విన్న ఆ బ్రాహ్మణుడు కొంతకాలము గడచిన తరువాత చంద్రశర్మ అనునతడు దేశాంతరములనుండి విద్యలు

నేర్చుకొనుటకై రాగలడు. నీకు అతనితో కృష్ణా తీరమున సమావేశము కలుగుతుంది అతనికి నీ విద్యలన్నియు చెప్పుము. ఆతరువాత గంగాస్నానము చేయుము శాపాంతము అగును అని చెప్పి విద్యార్థి తన ఇష్టము వచ్చిన చోటుకు వెళ్ళినాడు. అది మొదలు నేను బ్రహ్మరాక్షసుడనై ఈ చెట్టును ఆశ్రయించి దీనిమీదనే వున్నాను. నీరాక కొరకు ఎన్నాళ్ళనుండియో ఎదురు చూచుచున్నాను. దైవ వశమున ఇప్పటికి నీవు వచ్చితివి. శిష్యుడవగు నీకు అన్ని విద్యలను చెప్పితిని నాయనా! ఇక నేను గంగా స్నానము చేయుటకు పోవుచున్నాను. నీకు సదా భద్రమగుగాక. ఎక్కడకు వెళ్ళినను నీకు జయము కలుగును గాక సుఖవంతుడవై వుండుము అని ఆశీర్వదించి బ్రహ్మరాక్షసుడు చెట్టుమీదనుంచి చంద్రశర్మను కిందికి దించి తానుదిగినాడు. చంద్రశర్మనుండి సెలవు పుచ్చుకొని పాపపరిహారము కొరకు గంగాస్నానము చేయుటకు బ్రాహ్మణుడు బయలుదేరినాడు. తరువాత చంద్రశర్మ యు తాను విద్యా పారంగతుడు అయినందుకు సంతోషముచెందినాడు. తన సొంత ఊరికి వెళ్ళవలెనని నిర్ణయించుకొని ప్రయాణము చేయుచుండగా మార్గమధ్యములో దారితప్పి మరియొక త్రోవన నడచినాడు. తిన్నగా ఉజ్జయినీ పట్టణమున ప్రవేశించి వేశ్యామందిరమును చూచి ఆరు నెలలపాటు ఆహారము నిద్ర లేకుండుట వలన శ్రమను చెందినటువంటి వాడై యుక్తాయుక్త విచక్షణా జ్ఞానము నశించి అది బ్రాహ్మణ గృహమే అను బుద్ధితో ఆ ఇంటి అరుగుమీద గుడ్డ పరచుకొని శరీరమును ఎరుగక నిద్రపోవుచున్నాడు.

## చంద్రశర్మ వేశ్య గృహమున పరుండుట

సౌందర్యవతి అను పేరుగల ఆ ఇంటి వేశ్యకన్యక చంద్రశర్మను చూచి "ఇతడు నా భర్త అగుగాక" అని తన మనసులో నిశ్చయించుకొని తల్లిదగ్గరకు వెళ్ళి అమ్మా! నీ అల్లుడుని చూడుము. నా మనోహరుడు రెండవ మన్మధునివలె ఆ అరుగుమీద నిద్రపోవుచున్నాడు అన్నది. తల్లి కూతురుమాట విని వేగముగా వచ్చి నగలు,నాణెములు లేని ఆ బ్రాహ్మణుని చూచి "వీడు శుద్ధ దరిద్రుడు" అని తలచి కోపము తెచ్చుకొని కూతురుని చూచి అమ్మా! నీకు వీడు తగినవాడు కాడు. వీడు శుద్ధ దరిద్రుడు. దరిద్రుని వరించుటకంటె వేశ్యబ్రతుకుకు అంతకంటె అవమానము వుండదు. ఎట్టి వాడుకాని మనకు ధనవంతుడే



మన్మధుడు. తక్కిన వానితో మనకెంత మాత్రము పనిలేదు. ధనమును మాత్రమే మనము చూడవలయును. కావున లేనిపోని ఆశలు పెట్టుకోకుండా ధనముగల మరొక సంపన్నుని వరింపుము అని తల్లి చెప్పినది. కాని కన్య వినియు విననట్టే చేసి "నాకు ఇతడే భర్త" అని మరల తల్లితో అన్నది. ఎట్టకేలకు కూతురు అభిప్రాయమును వేశ్యమాత అంగీకరించినది. ఆరు నెలల నుండి నిద్రాహారములు లేకుండా వుండుట వలన ఆ బ్రహ్మచారి కాళ్ళు చేతులు కూడా కదపకుండా ఆలోపలి అరుగుమీద పరుండి చలనము లేకుండా నిద్రించుచున్నాడు. రాత్రి అయినను పగలు అయినను అట్లేపడివుండి నిద్రించుచున్న ఆ బ్రాహ్మణుని చూచి ఆ వేశ్య వేగముగా రాజు వద్దకు వెళ్ళి వృత్తాంతమంతయు చెప్పినది. ధ్వజకీర్తి అను రాజు ఆ వేశ్య మాటలు విని మిక్కిలి ఆశ్చర్యము పొందినాడు. వైద్యులను పిలిపించి ఓ వైద్యులారా! మీరు వేగముగా వెళ్ళి వేశ్యామందిరమున నిద్రించుచున్న బ్రాహ్మణుని చూచి అతని నాడిని బాగుగాపరీక్షించి అట్టి గాఢనిద్రకు కారణము ఏమయి వుండునో శాస్త్రములనుబట్టి తెలుసుకొని వేగముగా వచ్చి మాతో విన్నవించండి అని ఆజ్ఞాపించినాడు. వెంటనే రాజవైద్యులు తిన్నగా వేశ్యాగృహమునకు వెళ్ళినారు. అచ్చట నిద్రించుచున్న ఆ బ్రాహ్మణుని చూచి అతని ధాతువులు పరీక్షించి అతని వృత్తాంతమంతయు ఈ విధముగా రాజునకు విన్నవించినారు.

రాజోత్తమా! ఆ బ్రాహ్మణుడు నిద్రాహారములు లేకుండా ఎందుకు వుండినాడో గాని ఆరు మాసములనుండి నిద్రాహారములు లేకుండా వుండినాడు. కారణము మాత్రము తెలియరాలేదు. కాని అతనికి చికిత్స చేయవలయును. అతని దేహమునకు అన్నమును లేపనముగా చేయవలయును. అదియునుకూడా అన్నమును మెత్తగానూరి దానిలో ఆవుపెరుగు కలిపి శరీరమునకు పట్టించవలయును. అని రాజుగారితో విన్నవించి వైద్యులు తమ ఇండ్లకు పోయిరి. తరువాత మహారాజు ఆ వైద్యులు చెప్పినట్లుగానే చికిత్సను చేయించినాడు. ఈవిధముగా ఆరునెలలు అన్నలేపనము చేసిన తరువాత ఆ బ్రహ్మచారి నిద్ర విడిచి నేను ఎచ్చటను నిద్రపోతిని?

## సౌందర్యవతి నీవే నా భర్త అని భీష్మించుట

ఈ ఇల్లు ఎవరిది? ఈ సుందరాంగి ఎవరు? అని మనసులో

మాటిమాటికి ఆలోచించు చుండెను. తరువాత తనతోవను తాను పోవుటకు సమాయుత్తుడు అగుచుండగా ఆ వేశ్య కన్యక అడ్డుకొని అతని వస్త్రాంచలము పట్టుకొని ఇట్లనినది. ప్రియా! నన్ను విడచి నీవు ఎచ్చటికి పోయెదవు. నేను ఆరుమాసములనుండి ఎప్పుడు నిదురనుండి లేచెదవో అని ఎదురు చూచుచుంటిని. నీకు సేవ చేయుచుంటిని నీవే నాభర్తవని మనసులో నిశ్చయించుకొంటిని. మా అమ్మతో ఈ విషయమై ఘోరముగా జగడము ఆడితిని. కావున నీవు నన్ను పరిగ్రహింపుము అట్లు నీవు చేయనిచో నీఎదుటనే నాప్రాణములు విడుచుటకు సిద్ధంగా వున్నాను అని వేశ్యకన్యక సౌందర్యవతి బ్రహ్మచారి అయిన చంద్రశర్మతో అన్నది అని సూతుడు శౌనకాది మునులకు చెప్పినాడు.

ఇట్లు శ్రీ బ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరితమున
ఇరవై ఒకటవ అధ్యాయము పరిపూర్ణము



## విక్రమార్కోపాఖ్యానము
### ఇరవై రెండవ అధ్యాయము

సూతపౌరాణికుడు ఋషులకు తరువాత జరిగిన సంగతినితెలుపు చున్నాడు. అప్పుడు చంద్రశర్మ ఆ వేశ్య కన్యతో ఇట్లు చెప్పినాడు. సుందరీ! నేను బ్రాహ్మణుడను. నీవు శూద్రస్త్రీవి నీకు నాకు పాణిగ్రహణము ఎట్లు సంభవించును. అని నిరాశ కలుగునట్లు ఎన్ని విధములుగ చెప్పినను ఆ కన్య తన పట్టుదల విడనాడలేదు. ఆ ప్రాంత ప్రజలందరు ఈ వృత్తాంత మంతయు రాజుగారికి తెలియపరచినారు. అది విని రాజుగారు దయగలవాడై వారిద్దరిని తన ఆస్థానమునకు పిలిపించినాడు. వారితో మాట్లాడినాడు. వారిరువురిని సమాధానపరచ లేకపోయినాడు. అప్పుడు తన ఆస్థానములోవున్న బ్రాహ్మణ పండితులను పిలిపించి ఈ వృత్తాంత మంతయు వారికి వినిపించి దీనికి పరిష్కారము ధర్మశాస్త్రములో వున్నదా అని అడిగినాడు రాజు. రాజుగారి మాటలు వినిన బ్రాహ్మణులు శాస్త్రములను పరిశీలించినారు. స్మృతులలో అనిరి.



ఇట్లు బ్రాహ్మణులు చెప్పగానే రాజు చాలా సంతోషించినాడు. చంద్రశర్మయు సంతోషించినాడు. తరువాత రాజు మంచి ముహూర్తమున తన పురోహితుని కన్యను మొదటగా చంద్రశర్మకు ఇచ్చి వివాహము జరిపించినాడు. తరువాత శృతకీర్తి మహారాజు తన కుమార్తెను చంద్రశర్మకు ఇచ్చి వివాహము జరిపించినాడు. రాజు తన అల్లుడు చంద్రశర్మకు చతురంగ బల సమేతముగా అర్థ రాజ్యమును ఇచ్చి సుఖముగా వుంచినాడు. తరువాత వైశ్య కన్యను, ఆ తరువాత వేశ్య కన్య సౌందర్యవతిని చంద్రశర్మకిచ్చి వివాహము జరిపించినాడు. చంద్రశర్మయు తన నలుగురు భార్యలతోడను సంతోషించుచు సుఖముగానుండెను. ఇట్లు చంద్రశర్మ ఉజ్జయినీ పట్టణములోనే కొన్నాళ్ళు వుండగా అంతట ఆ పట్టణరాజైన ధ్వజకీర్తి మరణించినాడు. ఆ తరువాత మంత్రులు ఆలోచన చేసి వెంటనే చంద్రశర్మనే రాజుగా అభిషేకించిరి. తరువాత చంద్రశర్మకు బ్రాహ్మణ స్త్రీయందు వరరుచియు, క్షత్రియ స్త్రీయందు రాజాధిరాజగు విక్రమార్కుడును, వైశ్య స్త్రీయందు భట్టియు, శూద్ర స్త్రీయందు భర్తృహరియు అనువారు పుట్టిరి. ఆ నలుగురును మిక్కిలి బుద్ధిమంతులు, సర్వ విద్యానిపుణులు, నీతిశాస్త్ర విశారదులునయి ఒప్పుచుండిరి.

### విక్రమార్కుడిని రాజుగా చేయుట

వారిలో విక్రమార్కుడు మహాబలుడు, సాహసాది గుణవంతుడు, మహాదాత అని గ్రహించిన చంద్రశర్మ ఇతడు ధ్వజకీర్తి మహారాజునకు దౌహిత్రుడని (అనగా పుత్రికయొక్క కుమారుడు) ఆలోచించి యదావిధిగా విక్రమార్కుడిని ఆ రాజ్యమునకు పట్టాభిషిక్తుని చేసి సర్వ దేశములకు రాజునుగాచేసేను. వైశ్య స్త్రీయందు పుట్టిన భట్టివిక్రమార్కుడిని మంత్రిగా చేసెను. తరువాత విక్రమార్కుడు చిరకాలము కాళికాదేవిని గూర్చి తపస్సు చేయగా ఆమె ప్రత్యక్షమై రాజా!నీ తపమునకు మెచ్చితిని. నీవు వేయి సంవత్సరములు జీవించి రాజ్యపాలన చేయుము. నీకు శాలివాహనుడు తప్ప తక్కినవారు ఎవ్వరూ శత్రువులు గారు. అని అతనికి వరమిచ్చి అచటనే అంతర్ధానమయ్యెను. తరువాత విక్రమార్కుడు ఇంటికి వచ్చి తనకు కాళీమాత ఇచ్చిన వరప్రదానమును మంత్రియగు భట్టికి తెలుపగా అతడు సంతోషించి రాజా! నేనును నీకట్టి వరమును ఇచ్చెదను గైకొనుము అనగా వెంటనే విక్రమాక్కుడు ఓయీ! నీవు

నాకెట్లు ఇట్టి వరము ఈయగలవు అని అడుగగా భట్టి "సహస్రాయువు గలవాడవగు మనెను". ఇదియెట్లనగా నీవు ఆరు మాసములవరకు రాజ్యపాలన చేయుచుండుము. తరువాత ఆరునెలలు లోకసంచారము చేయుచుండుము. ఇట్లు చెయుచుంటివేని రెండువేల సంవత్సరముల వరకును జీవించవచ్చును అని చెప్పిన భట్టి మాటలకు ఎంతయో సంతోషించినాడు. భట్టియొక్క యుక్తివైచిత్రియమును మెచ్చుకొని నీవు మంత్రివైనందులకు యుక్తియుక్తముగా చెప్పితివి. నీవు ఉత్తమ మంత్రివి. ఇక మీదట నీవు ఏమిచెప్పినను అదే నేను చేసెదను అని అతనిని అనేక విధములుగా సన్మానించి విక్రమార్కుడు రాజ్యమేలుచుండెను. సూర్యునివలె తేజశ్శాలియును, సాహసియు, ధైర్యవంతుడును. ఇంద్రియ నిగ్రహము కలవాడును, విక్రమాకాంత లోకుడును, చతుషష్ఠి కళాధీశుడును, శత్రువన దవాలనుండును, నిర్భయుడును, మహాశూరుడును, వీరనిషేవితుడును, సత్యసంధుడును, ఉజ్జయినీ నాయకుడును, రారాజును, చక్రవర్తి లక్షణ విరాజమానుడును అగు విక్రమార్క మహారాజు రాజులు, మిత్రులు, మంత్రులు, కవీశ్వరులు, వంధిమాగులు, విద్వాంసులు, గాయకులు, చంద్రముఖులగు స్త్రీలు, భటులు మొదలగు వారితోగూడిశ్రేష్టమైన ముత్యములతోను, మాణిక్యములతోడను ప్రకాశించుచు దేవేంద్రుని సభవలె విరాజిల్లుచున్న సభలో ప్రవేశించి తనకు దేవేంద్రుడు ఇచ్చిన అనన్యదుర్లభమగు నవరత్న ఖచితమైన దివ్య సింహాసనముపై కూర్చుండి వందిమాగధులు స్తుతి చేయుచుండగా రాజకార్యములను నిశ్చలముగా వినుచు భట్టితో మాటలాడుచుండెను.

## కాలపురుషుడను యోగి విక్రమార్కుని ఆస్థానమునకు వచ్చుట

అప్పుడు జటాజూట విరాజమానుడును, భస్మోద్ధూళిత దేహుడును, స్ఫటికమాలను చేతియందుంచుకొనినవాడును, జటగట్టిన దండముకలవాడును, పులితోలు కట్టుకొనినవాడును, పాదములయందువారాదమానములగు దంత పాదుకలుగలవాడును, మొలను చిరుగంటలు గలవాడును, రుద్రాక్షమాలలు ధరించినవాడును అగు కాలపురుషుడు అను పేరుగల వాడునుఅగు ఒక సిద్ధశ్రేష్టుడయిన యోగివచ్చి రాజునుచూచి "విభూ" దీర్ఘాయుష్మంతుడవును విజయము గలవాడును అగుము" అని ఆశీర్వదించి మిక్కిలి సంతోషముతో



వుండి ఒక దానిమ్మపండును విక్రమార్క మహారాజునకు ఇచ్చినాడు మరియు ఆ యోగి ప్రతిదినము రాజు సింహాసనము అలంకరించి యుండగా అట్లే వచ్చి ఉత్తమమైన ఫలమును తెచ్చి ఇచ్చుచుండెను. అతడు తెచ్చి ఇచ్చుఫలములను కోశాగారములో భద్రముగా వుంచమని కోశాధిపతికి ఇచ్చుచుండెను. మరలా ఒకనాడు సిద్ధయోగి వచ్చి రాజు సింహాసనము అలంకరించి యుండగా అట్లే దానిమ్మపండు తెచ్చి ఇచ్చెను. అప్పుడు ఎచటి నుంచో వచ్చిన కోతిని చూచి కుతూహలముతో రాజు దానికి ఇవ్వదలచినవాడై దానికి ఇచ్చినాడు. అది ఆ పండును అప్పుడే చీల్చినది. ఆ పండులోనుండి వెలలేని ముత్యాలు, రత్నములు క్రింద పడినవి. అవి చూచి విక్రమార్కుడు ఆశ్చర్యపడి వెంటనే కోశాధ్యక్షుడిని పిలిచి నేను ఇదివరకు ఇచ్చిన దాడిమ ఫలములన్నియు తెమ్మనెను. వెంటనే కోశాధికారి పోయి వాటిని తెచ్చి రాజు ఎదుట సమర్పింపగా రాజు వానిని చీల్చెను. మితిలేని రత్నములు, ముత్యములు చూచి రాజు పరమానందభరితుడై యోగితో ఇట్లనెను. యోగీంద్ర నీకీ ఫలములు ఎచ్చట ప్రాప్తించినవి. నందన వనము నుండి తెచ్చితివా, లేక చైత్ర రధమను కుబేరుని ఉద్యానవనము నుండి తెచ్చుచుంటివా? అది గాక ఇటువంటి అత్యద్భుత ఫలములను ప్రతిరోజునూ తెచ్చి నాకు ఎందుకు ఇచ్చుచుంటివి. మీ పేరేమి? నా వలన నీకు కావలసిన ప్రయోజనమేమున్నది? నీ నివాస స్థలమెక్కడ? నా వలన నీకు ఏదియైనను కావలసి యున్నచో సిద్ధమైనది అని నమ్ముకొనుము అని ఇట్లు చెప్పుచున్న రాజు మాటలు విని సంతోషించిన యోగి ఇట్లు చెప్పినాడు. రాజేంద్రా? ఈ ఫలములు దేవీ ప్రసాదము వలన లభించినవి. నాకొక మహా కార్యము ఉండు టచే ఇవి తెచ్చి తమకు సమర్పించుచున్నాను. నా పేరు కాలపురుషుడు అందురు. నా నివాసము స్మశానభూమి. కందమూలాలే నాకు భోజనము. నేను మత్స్యేంద్రుని శిష్యుడను. నా కార్యము మహా రహస్యమైనది. రెండవ వారికి తెలియకుండా చేయవలసినది. ఒక్కనికి తెలిసిననూ నీటి మీద నూనె బిందువువలె అంతటనూ వ్యాపింపక మానదు. అట్లు అగునేని నా కార్యమునకు భంగము కలుగును. నీవు ధ్వజకీర్తి మహారాజునకు దౌహిత్రుడగు(కూతురు కుమారుడవు) చంద్రశర్మకు కుమారుడవు. నీతో సమానుడు ఈ ముల్లోకముల యందు లేదు లేదు లేదు. నేను ఎందరి రాజులనో చూచియుంటిని. నీ గుణములలో కోటికి ఒక వంతు

అయిననూ వారి యందు ఎన్నడునూ చూడలేదు. అదిగాక దేవేంద్రుడు ఇచ్చిన నవరత్న ఖచిత దివ్య సింహాసనమును అధిష్ఠించి విరాజిల్లుచున్నావు. సూర్యభగవానుడు ఇచ్చిన కుండలములు నవరత్న ఖచితములై చెవులను ధరించియున్నావు. నీవు ఉదయపర్వతమెక్కితివి. సూర్యుని ప్రసాదము వలన అభేధ్యమైన కవచముగల వాడవు అయితివి. నీ మాదిరి ధర్మముగా పాలించు రాజును గురించి నేను వినలేదు. సాహసి అన్ననూ, సూర్యుడు అన్ననూ, సర్వవిద్యా విశారధుడు అన్ననూ, ధైర్యశాలి అన్ననూ నీతి కోవిదుడు అన్నను నిన్నే చెప్పవలయును. కావున నా కార్యము నీతో విన్నవించెదను. నేటికీ పదిహేనవ(15) రోజున నీవు ఏకాకిగనే స్మశానభూమికి రావలయును. అచ్చట నా కార్యము వినిపించెదను. వెంటనే చేయుము అని యోగి చెప్పుకోగా దయాలుడైన రాజు అట్లే అని అంగీకరించినాడు. యోగి రాజు వద్ద శెలవు పుచ్చుకొని తన నివాసమునకు వెళ్ళెను. రాజు రాజకార్యములు నిర్వర్తించి అంతఃపురములోనికి పోయెను. తరువాత యోగి చెప్పిన పదిహేనవ రోజు వచ్చినది. భట్టియును మంత్రితోడను, నీతివిశారధులగు సభ్యుల తోడను సభలో ప్రవేశించి అప్పటికీ ఆవశ్యకరమైన పనులు నెరవేర్చి అంతఃపురమునకు పోయినాడు విక్రమార్కుడు. సూర్యభగవానుడు అస్తమించినాడు. క్రమముగా చీకటి వ్యాపించినది. అర్ధరాత్రి అయినది. అందరూ నిద్రించుచున్నారు.

## విక్రమార్కుడు కాలపురుషునివద్దకు వెళ్ళుట

సిద్ధుని సంగతి గుర్తుకు వచ్చి రాజు లేచి స్మశానమునకు పోవటానికి సిద్ధపడుచున్నాడు. దివ్యాంబరములను, దివ్యాభరణములను ధరించి అభేద్యమైన సూర్యుడు ఇచ్చిన కవచమును ధరించినాడు. చెవులకు సూర్యుడిచే ఇవ్వబడిన కుండలములను కూడా ధరించినాడు. పుష్పమాలలు ధరించి మహా శృంగార వేషముతో ధైర్యసాహసములు మూర్తివంతమై యుండినట్లు పాదుకలు తొడుగుకొని శత్రు భయంకరమగు కత్తిని చేతబట్టి తన తేజస్సుచే దశదిశలు వెలిగింపజేయుచూ స్మశానము వైపుకు బయలుదేరి త్రోవలో ఎవరికీ కనపడకుండానే మహాభయంకరమగు రుద్రభూమిలోకి ప్రవేశించినాడు. విక్రమార్కుడు రుద్రభూమిలోకి ప్రవేశించునప్పుడు భూత ప్రేత పిశాచ శాకినీ ఢాకినీ గణములు వేలకొలదిగా కూడి రాజును సంహరించటానికి ఉ



ద్యమించుచున్నవి. సాహసవంతుడైన ఆ రాజు వాటినన్నిటినీ ఛేదించినాడు. అవి అన్నియూ తమ గర్వము విడిచి వచ్చిన త్రోవనే పోయినవి. తరువాత రాజు యోగియొక్క పేరు పెట్టి పిలచినాడు. ఎక్కడున్నావయ్యా! అని పిలిచి పిలిచి వేసారి వెదకడం ప్రారంభించినాడు. ఎంత పిలచిననూ ఎంత వెదకిననూ యోగి యొక్క జాడ కొంచెమైననూ తెలియకపోయెను. ఎంత ప్రయత్నించిననూ యోగి జాడ దొరకడం లేదు. ఒకవేళ నేను దారితప్పి వేరొక చోటికి వచ్చితినా? ఇది యోగి యుండు స్మశానమేనా లేక యోగికి చెవుడా లేదా నిదిరించుచున్నాడా ఇట్లు అనేక విధములుగా ఆలోచించుచూ యోగీంద్రా! నీ మాట ప్రకారము నా మాటను యదార్ధము చేసుకొనుటకు వచ్చి వున్నాను. ఓ యోగీశ్వరా నీవు ఈ స్మశానములో ఎంత పిలిచిననూ పలుకుట లేదు. ఎంత వెతికిననూ కనపడుట లేదు. కారణం ఏమై వుండును నీవు ఎచ్చటనైననూ మౌనమును వహించి జపము చేయుచున్నావా? నీవే యదార్ధము తప్పినవాడవైపోతివి. సరే ఇదిగో నేను వెను తిరిగి నా ఇంటికి పోవుచున్నాను అని రాజు పలుకగా అప్పుడు యోగి రాజువద్ద ప్రత్యక్షమైనాడు.

ఇట్లు శ్రీ బ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరితమున
ఇరవై రెండవ అధ్యాయము పరిపూర్ణము



# విక్రమార్కోపాఖ్యానములో బేతాళ గ్రహణము

## ఇరవై మూడవ అధ్యాయము



సూతమహర్షి ఋషులకు తరువాత జరిగిన సంగతిని తెలుపుచున్నాడు. విక్రమార్క మహారాజు వద్దకు వచ్చిన ఆ యోగి రాజును తన చేతితో పట్టుకొని రాజా! నేనింతసేపు నీకు కనపడకుండా మాటలాడకుండా వున్నది ఎందుకంటే మిమ్ములను పరీక్షించదలచినందువలన నాపై కోపం వద్దు. నిజముగా రాజరాజువన్నను సత్యసంధుడవన్నను నీవే. నీవంటి సాహసిని, శూరుడిని నేనింత వరకూ చూడలేదు. వినలేదు. నీవు నా కార్యమును పూర్తి చేయుటలో నాకు ఎట్టి సందేహము లేదు. ఇక నా కార్యము చెబుతాను వినుము. ఇక్కడికి

ఒక యోజన దూరములో ఒక మఱ్ఱిచెట్టు వున్నది. ఆ చెట్టు మీద పెద్ద శరీరము కలిగిన వాడును, మహాబలపరాక్రముడును, కోట్లకొలది భూతప్రేత పిశాచ శాకినీ ఢాకినీ బ్రహ్మారాక్షసాది సంఘములతో కూడియుండువాడును, నా తపస్సుకు మాటిమాటికినీ విఘ్నములు చేయుచుండు వాడును మహామాయా దురంధరుడును, పర్వతములను ఎత్తగలవాడును, తేజస్సుచే శంకరుని వంటి వాడును, జటాధారియు, భయము లేని వాడును, సర్వశత్రు నిబర్హణుడును అగు బేతాళుడు ఒకడు వున్నాడు. నీవు పోయి వానిని జయించి నాయొద్దకు తీసుకొని రమ్ము. నేను ఈ కాళీ ఆలయములో వుండెదను. నీవు వేగముగ పొమ్ము అను యోగి మాటలు వినిన విక్రమార్కుడు కత్తి చేతబట్టుకొని తిన్నగా మఱ్ఱిచెట్టు వున్నచోటికి పోయి చూడగా ఆ మఱ్ఱిచెట్టు రెండవ వింధ్యపర్వతములాగా కనపడినది. మరియు అది భూమిని ఆకాశాన్ని అంటి మిక్కిలి భయంకరముగా వున్నది. దానియందున్న భూతప్రేతాదుల సంఘముల సంఖ్యకు హద్దులేదు. అటువంటి మఱ్ఱిచెట్టు మీద తలక్రిందులుగను, కాళ్ళు పైకి వుంచి వేలాడుచున్నవాడును, నరమాంసమును తినుచుండు భూతప్రేత పిశాచాది సంఘములచే చుట్టు వారు కూర్చోబడినవారై వున్న పిశాచాదులను చూచి విక్రమార్కుడు ఇట్లనెను.

## విక్రమార్కుడు భూతములను హెచ్చరించుట

నేను లోకములో శత్రుభయంకరుడను అను పేరు సంపాదించిన విక్రమార్కుడను. సిద్ధుని ఆజ్ఞచే మీ ప్రభువగు భేతాళుని తీసుకొని పోవుటకు వచ్చితిని. నేను ఎట్లయిననూ వానిని తప్పక తీసుకుపోతాను. ఇందు సందేహము లేదు. ఓ పిశాచాదులారా! మీరు మీ ప్రాణములను రక్షించుకొనుడు. ఎటు అయినను పారిపొండు. నేనిప్పుడు స్మశానములోవుండు భూత ప్రేత పిశాచాదులను చాలా వరకు చంపి ఇచ్చట వుంటున్న మిమ్ములను చంపుదామ అనే ఉద్దేశముతో వచ్చి యుంటిని. కావున మీరు మీకు ప్రాణములయందు ఇష్టము కలదేని దూరముగా పారిపోండి అని చెప్పుచున్న విక్రమార్కరాజుతో పిశాచములు ఇట్లు అనుచున్నవి. రాజా! స్వల్పబలము కలిగియు, గర్వించి మాటలాడుచున్నావు. నీ బెదిరింపులకు మేము భయపడము. మిక్కిలి ప్రేమాస్పదములైన నీ ప్రాణములను నీవు రక్షించుకోవలయును అను ఆలోచన



కలిగివుంటే మా దగ్గర నుండి వేగముగా పారిపొమ్ము అట్లు చేయలేదేని నిన్ను చంపి మేమందరమూ భక్షించెదము. రాజాధమా! నీవు రుద్రుడవా! విష్ణుడువా! బ్రహ్మవా! దుర్బుద్ధీ నీవు వచ్చి మమ్ములను బెదిరించుచున్నావు. గ్రుడ్డువచ్చి పిల్లను ఎక్కిరించినట్లుగా వున్నది నీ వ్యవహారము. కావున పొమ్ము పొమ్ము దూరముగ తొలిగిపొమ్ము. నీవెక్కడ? భేతాళుడెక్కడ? మీకిద్దరికినీ హస్తి మశకాంతమంత (అనగా ఏనుగుకు దోమకు మధ్య ఉన్నంత తేడా) అంతరము వున్నది. పిల్లి పెద్ద పులితో ఎదుర్కోబోయినట్లున్నది. ఓరీ రాజాధమా! ఇంకనూ పారిపోవేమిటిరా? నీకు బ్రతకవలెనని ఆశ లేదు కాబోలును. సరియే అటులేని మేమిపుడే నీ కంఠమును నులిమి నురుగులు గట్టుచున్న వేడి వేడి రక్తము త్రావి తాండవ మాడెదము. నీ కాళ్ళను, చేతులను, తొడలను, రొమ్మును నువ్వుగింజలంతగా చేసెదము.ఇచ్చటనుండి త్వరగా వెళ్ళుము అనిచెప్పిన ఆ భూత ప్రేత పిశాచములు విక్రమార్కుని చుట్టుముట్టినవి. అతనిపై మాంసపు ముక్కలను, నెత్తురును వెదజల్లినవి. మల మూత్రములను అతనిపైచల్లినవి. రాళ్ళను, చెట్లకొమ్మలను, కొండరాళ్ళను కోపముతో విసిరినాయి. అప్పుడు విక్రమార్కుడు తన భుజబలమునుబట్టి సింహము చిల్లర మృగములమీద పడునట్లు వానిని చంపుటకు తరుమనారంభించెను. సింహనాదము చేయుచు మాటిమాటికి గర్జించుచు మహాపదునుగల కత్తిని చేతబట్టి అనేక భూతములను ఛేదించినాడు. ఇట్లు భూతములు నరుకగా ఆ భూత ప్రేత పిశాచాదులలో కొన్నిటికి ముక్కులు తెగినవై కొన్నిటికి చేతులు పోయినవై కొన్నిటికి మెడలు తెగినవై కొన్నిటికి కన్నులలో దెబ్బలు తగిలినవై యుండి మిక్కిలి బాధను పొందుచున్నవి. మరియు ఆ విక్రమార్కునిచేత పదునైన కత్తితో నరకబడిన ప్రేతములకు కొన్నింటికి కాళ్ళును, కొన్నింటికి తల వెంట్రుకలును పోయినవి. కొన్ని పిశాచములకు కన్నులు పోయెను. కొన్నింటికి చెవులు పోయెను. శాకిని ఢాకిని గణములకు విక్రమార్కుని కత్తిదెబ్బకు అన్ని అవయవములు విలవిలలాడినవి. ఈ విధముగా విక్రమార్కుడు భూత ప్రేతములను బాగుగా కొట్టినాడు. కొన్ని మూర్ఛపోయినవి,కొన్ని ఏడ్చినవి, కొన్ని నేలనుపడ్డవి. మాటిమాటికీ విక్రమార్కుడు సింహం మృగములను చంపురీతిగా వానిని చంపుచుండెను. పెద్దపులి మేకలగుంపును చంపి చీల్చినట్లు ప్రేతసంఘము

లన్నింటిని విక్రమార్కుడు చంపినాడు. ఈ విధముగా భూత ప్రేత పిశాచ శాకిని ఢాకిని గుంపులను చంపి సింహంవలె గర్జించుచు యుద్ధమందు రావణుని చంపిన రాముడువలె ప్రకాశించినాడు.

## బేతాళునితో విక్రమార్కుడు మాటలాడుట

ఈ ప్రకారము వాటినన్నింటిని జయించిన విక్రమార్కుడు బేతాళుడు వుండునట్టి చెట్టు దగ్గరకు వెళ్ళినాడు. ఆ బేతాళుని చూచి విక్రమార్కరాజు ఇట్లనెను. ఓయీ బేతాళుడా నీ సేన లన్నింటిని సింహము ఏనుగులను చంపునట్లు నేనుచంపితిని. నిన్ను ఎత్తుకొని తీసుకు పోవుటకు నేను వచ్చితిని. నిన్ను కట్టి తీసుకొనిపోవుటకు నీ వద్దకు వచ్చినాను. నిన్ను కట్టివేసి తీసుకొనిపోయి కాలపురుషునకు ఇవ్వటానికి నేను ఇక్కడకు వచ్చినాను. కాబట్టి శీఘ్రముగా నా దగ్గరకు రమ్ము. ఇట్లా విక్రమార్కుడు గర్వముతో చెప్పిన మాటను విని ఆ బేతాళుడు భయపడి తన మంత్రులను పిలిచి వారితో ఇట్లు చెప్పెను. ఓ మంత్రులారా ఈ విక్రమార్కుడు నా పరివారమును తన ఖడ్గముతో చంపి నన్ను కట్టి తీసుకొనిపోవుటకు వచ్చినాడు. ఇతడు కుబేరుడో, ఇంద్రుడో, నాలుగు ముఖములు గల బ్రహ్మదేవుడో, విష్ణుమూర్తియో, కాలరుద్రుడో నేను ఎరుగనోయి మంత్రులారా ఏమి చేయమంటారు? నేను ఎక్కడికి పోవుదును? ఇప్పుడు నాకు రక్షకుడు ఎవరు అని భేతాళుడు చెప్పగా అతని ఏడుగురు మంత్రులు అయిన బేతాళుళ్ళు పటపటపండ్లు కొరుకుతూ తమ రాజుతో మాట్లాడుచుండిరి. ఓ మహారాజా ఇక్కడకు వచ్చిన అధముడైన విక్రమార్కరాజువలన నీవు ఏల భయపడుచున్నావు. ఓ రాజా నీ ఆజ్ఞను పాటించేందుకు, నిన్ను రక్షించుకునేందుకు మేమందరము వున్నాము. బలము నందు నీవు విష్ణువుతో సమానుడవు. ధైర్యములో హిమవంతుడితో సమానుడవు, కోపములో రుద్రునితో సమానుడవు, ఇతరులను చంపుటయందు యమునితో సమానుడవు. నీ పేరు చెప్పిన యెడల మూడు లోకములయందుండు వారు భయపడుదురు. ఓయీ భేతాళరాజా! ఆయుధములను ధరించి వచ్చిన ఆ రాజును చంపుటకు మమ్ములను పంపుము. భేతాళరాజు అనగా ఎంతటి గొప్పవాడు. నీతో పోల్చుకుంటే మనుష్య మాత్రుడైన ఆ విక్రమార్కుడు ఎక్కడ అని ఈ ప్రకారము మంత్రులు స్తోత్రములు చేయగా అప్పుడు భేతాళరాజు ఉ



త్సాహముగలవాడై వారితో ఇట్లు చెప్పినాడు.

## బేతాళ మంత్రులు విక్రమార్కునితో యుద్ధము చేయుట

యుద్ధము చేయుటలో సమర్థులైన మీరందరూ త్వరగా వెళ్ళండి. ఆ రాజశ్రేష్ఠుని చంపి జయమును పొంది నా వద్దకు రండి అని బేతాళ రాజు ఆజ్ఞాపించగా ఆ భేతాళమంత్రులు ఏడుగురు ఆ విక్రమార్కుని వద్దకు వచ్చి గర్వముతో పలికినారు. ఏమని అంటే ఓ అల్పుడైన రాజా మిక్కిలి బలము కలిగి సాంబశివునితో సమానుడుగాను, కాలాగ్నితో సమానుడుగా నుండు మా ప్రభువును కట్టుకొనిపోవు శక్తి నీకు ఎక్కడిది. ఓ రాజా సాధారణమైన భూత ప్రేత పిశాచాలను చంపి నీవు గర్వపడుతున్నావు. మేము అట్టి వారమని భావించవలదు. మేము భుజశక్తిచేత కొండలను పెళ్ళగించగలవారము. యుద్ధమునందు మా ఎదుట నిలబడుటకు నీకు శక్తి ఎక్కడిది. ఆ ఏడుగురు భేతాళ మంత్రులు ఇట్లు వీరనాదములు పలుకుచూ విక్రమార్క మహారాజుతో యుద్ధము చేయుటకు సిద్ధపడినారు. విక్రమార్కునితో యుద్ధము చేయగోరుచున్న మిక్కిలి బలవంతులైన భేతాళ మంత్రులు సింహము క్షుద్ర మృగములను చూచినట్లు చూచిరి. అప్పుడు విక్రమార్కుడు వారికి ప్రతిగా తాను సింహనాదములు చేయుచూ వజ్రాయుధముతో సమానమైన కాంతి కలిగినట్టిది పర్వతములను పగలగొట్టునట్టియుది శత్రువులకు భయంకరముగా నుండెడి తన ఖడ్గమును డ్రిప్పుచూ ఆ భేతాళ మంత్రులతో యుద్ధము చేయుటకు ఉద్యుక్తుడయ్యెను. పిమ్మట రాజచంద్రుడైన ఆ విక్రమార్కునికి భేతాళ మంత్రులకు గగుర్పాటు కలిగించునట్టి సంకుల సమరము సాగుచుండెను. అది వరకు ఎన్నడునూ జరుగని ఆ యుద్ధమును చూడగోరి వచ్చినవారైన దేవేంద్రుడు మొదలగు దేవతలను, గంధర్వులను, కిన్నరులను, విద్యాధరులను, యక్షులును, ఋషులును, సర్పములను, నారదుడును, తుంబురుడును, అప్సరసలును సూర్యునితో సమానముగా ప్రకాశించుచున్న విమానమును ఎక్కి వచ్చి విక్రమార్క రాజునకు జయము కలుగవలెనని కోరుచుండిరి. ఇట్లు వచ్చియున్న దేవతల గుంపును చూచి ఆ విక్రమార్క మహారాజు పున్నమినాటి సముద్రము పొంగినట్లు ఉప్పొంగిపోయినాడు. ఈ ప్రకారము యుద్ధమందు వృద్ధిపొందుతున్న మిక్కిలి కాంతివంతుడైన విక్రమార్కుని చూచి ఆ బేతాళ మంత్రులందరు రాహువు

చంద్రుని ఆచ్ఛాదించునట్లు అతనిని ఆచ్ఛాదించిరి. అప్పుడు ఖడ్గమును చేతబట్టి నాలుగు ప్రక్కల చూచుచు తిరుగుచున్న ఆ విక్రమార్క మహారాజు ఆ బేతాళ మంత్రులను ఖడ్గములతోను, గండ్రగొడ్డళ్ళతోను, రోకళ్ళతోను , ఈటెలతోను, లాటీకట్టెలతోను మరియు శత్రు సమూహములను భంగపరచుచు ఎల్ల ఆయుధములతో కొట్టినాడు. అప్పుడు ఏడుగురు బేతాళ మంత్రుల ముక్కులను కోసివేసినాడు. తుదకు అందరి కంఠములనుకూడ తెగకోసినాడు. ఇట్లు బేతాళ మంత్రులను విక్రమార్కుడు చంపగ దేవతలును, సిద్ధులును, చారణులును సంతోషము చెందినారు. దేవతల దుందుభి ధ్వనులు మ్రోగినవి. ఆకాశమునుండి పుష్ప వర్షములు కురిసినవి. గంధర్వులు మధురముగా పాడినారు. అప్సరసలు మనోహర నృత్యములు చేసినారు. దేవతలందరు ఓ రాజా! నీకు జయము కలుగుకాక! అని చెప్పిరి. కలహముతో సంతోషించునట్టినారదుడు ఆశ్చర్యకరమైన ఆ యుద్ధమును చూచి పరమానందము అను సముద్రమున మునిగిన మనస్సు గలవాడయ్యెను.

## దేవతలు విక్రమార్కుని వరము కోరుకో మనుట

పిమ్మట ఆ దేవతలందరు విక్రమార్కుని వద్దకు వచ్చి ఓరాజరాజా! వరము కోరుకొమ్ము అనిరి. అప్పుడు విక్రమార్కుడు తనకు వరము ఇవ్వడానికి వచ్చిన దేవతలను చూచి ఉత్సాహము చెంది వినయముతో తనకోర్కెను ఈ విధముగా తెలిపినాడు. ఓ దేవతలారా! మీరు నా విషయమునసంతోషము చెందినట్టయితే ఈ బేతాళ రాజు ఎల్లప్పుడు నాకు స్వాధీనుడై వుండులాగున వరము ఇవ్వవలయును అని అనగా దేవతలందరూ నీవు కోరిన విధముగానే జరుగును అని చెప్పి తమ త్రోవన తమ నివాసములకు వెళ్ళినారు. అంతట విక్రమార్కుడు బేతాళుడు వుండు మర్రిచెట్టు దగ్గరకు పోయి ఏడుగురు బేతాళు లకు నాయకుడువైన ఆ బేతాళ రాజుతో ఇట్టు చెప్పినాడు. నీవు పంపిన ఆ మంత్రులు ఆయుధములతో నాతో యుద్ధము చేసినారు. వారందరూ ఆయుద్ధములో చచ్చినారు. కావున నీ గర్వము ఇప్పుడు నశించివుంటుంది అని చెప్పి ఖడ్గమును చేత ధరించిన ఆ రాజశ్రేష్టుడు మర్రి చెట్టునెక్కి ఆ బేతాళుని జడలను పట్టుకొన్నాడు. ధృడమైన తాళ్లతో బేతాళుడిని కట్టి ఆ చెట్టు దిగి ఆ యోగీశ్వరుడు వుండు చోటుకు పోవనారంభించినాడు. ఇట్లు బయలుదేరి



పోవునప్పుడు మార్గమధ్యములోనే ఆ బేతాళుడు రాజునకు కనపడకుండా ఉండేసరికి విక్రమార్కుడు మరలా ఆ మర్రిచెట్టు వద్దకు వచ్చి పెక్కుకొమ్మలుగల ఆ మర్రిచెట్టును మరలా ఎక్కి బేతాళుని పట్టుకొని ఆ చెట్టునుండి దిగి జడలు ధరించిన బహు మాయలు నేర్చియున్న ఆ బేతాళుని చురుకైన త్రాళ్ళతో గట్టిన తర్వాత ఆ రాజరాజు యోగీశ్వరుడున్న ప్రదేశమునకు బేతాళుని తీసుకొని వచ్చుచుండెను. ఇట్లు వచ్చుచున్నప్పుడు ఆ బేతాళుడు మరలా అదృశ్యమై మర్రిచెట్టు వద్దకు మరలా చేరినాడు. ఆ రాజు మరలామర్రిచెట్టు వద్దకు వెళ్ళి బేతాళుడితో ఇట్లు అనెను.

## విక్రమార్కుడు బేతాళుడిని నిలదీయుట

ఓరీ బేతాళా! చెడు బుద్ధి గలవాడా, మిక్కిలి మాయలు కలవాడా, నీ మాయలను నేను ఇప్పుడు తెలుసుకొన్నాను. ఇక నిన్ను ఎక్కడకు పోనియ్యను. ఇంద్రలోకమునకు వెళ్ళినా, బ్రహ్మలోకమునకు వెళ్ళినా, విష్ణులోకమునకు పోయినా, శివలోకమునకు వెళ్ళినా లేదా పాతాళమునకు వెళ్ళినా, దితి కడుపున చొచ్చినను నిన్నువిడువను బేతాళరాజా. నీవు మాటిమాటికి మర్రిచెట్టుమీదకు చేరుచున్నావు. కావున నేను ఈ మర్రి చెట్టును పెళ్ళగించి తీసుకొని పోవలయునని ఆలోచించుచున్నాను అని విక్రమార్కుడు అనినాడు. ఈ ప్రకారముగా చెప్పిన అతి సాహసముతో కూడిన మిక్కిలి పరాక్రమవంతుడు, ధైర్యశాలియైన అన్ని విషయములు తెలిసినవాడు అయిన విక్రమార్కునితో ఆ బేతాళ రాజు ఇట్లు చెప్పినాడు. నేను నీకు ఇరువది ఐదు కథలను చెప్పెదను. వానిలో నేనడిగిన ప్రశ్నలకు సరియైన సమాధానము తెలిసి చెప్పితివా అప్పుడు నేను వశ్యుడును అగుదును ఓ విక్రమార్క రాజా! దీనికి సందేహములేదు అని చెప్పి బేతాళుడు చెట్టు మీద నిర్భయముగా వుండెను. మరియు విక్రమార్కునితో ఆ బేతాళుడు ఇట్లు చెప్పినాడు. నీవు నేను చెప్పిన కథ విని దానికి సమాధానము తెలిసియుండి చెప్పకపోతివా నీ తల అనేక వ్రక్కలు (ముక్కలు) అగును అని ఇట్లు చెప్పిన బేతాళునితో విక్రమార్కుడు ఏమి చెప్పినాడంటే నాకు తెలిసియున్న కథకు నీ వడిగిన ప్రశ్నకు సమాధానమును తప్పని సరిగా ఇచ్చెదను అని చెప్పి ఆ రాజు వేగముగా బేతాళుని పట్టుకొని తన వీపుమీద ఎక్కించుకొని బయలు దేరినాడు.

## బేతాళ కథలు

ఈ విధముగా బేతాళ కథలు అప్పటినుండి నేటి వరకు ప్రజలలో ప్రచారములో వున్నవి. భారతీయ ప్రాచీన సాహిత్యమునందు ఈ కథలు ప్రముఖముగా చోటు చేసుకొన్నవి. మహాసంక్లిష్టమైన కథలను బేతాళ కథలుగా ఇప్పటికీ చెప్పుకొనుచున్నారు. పాకృత భాషలోని కథాసరిత్సాగరమునందు ఈ కథలను గురించి వున్నది. కాని ఈ బేతాళుని చరిత్ర మాత్రము తప్పుగా వ్రాయబడి వున్నది. దేవాంగుని సప్తావతారములలో మూడవ అవతారం బేతాళుడుగా అవతరించినట్లుగాను, పుష్పదంతుని శివుడు శపించి బేతాళుడు కమ్మని అన్నట్లుగాను విషయము వుండదు. ఈ కథాసరిత్సాగరంలో బేతాళుడు చరిత్ర గురించి నిజమైన విషయం తెలియజేయకుండా కథలను మాత్రము విశేష ప్రాచుర్యము కల్పించినారు. అందువలన దేవలునియొక్క బుద్ధి కుశలత లోకానికి తెలియకుండా పోయినది. ఇటువంటి సమస్యా పూరకమైన కథలు ప్రపంచంలో అప్పటికి ఇప్పటికి లేవు. ఈ కథలననుసరించి, కొన్ని కల్పనలతో, మార్పు చేర్పులతో బేతాళ కథలని కొన్ని ప్రచారములోకి ఇటీవల కాలంలో వచ్చినవి. కావున బేతాళుడు చెప్పిన కథలను ఆసక్తితో చదివిన వారు ఆ బేతాళుడు ఎవరని తెలుసుకోవలసిన అవసరంవుంది. కాని క్లుప్తంగా ఒకానొక గంధర్వుడు బేతాళుడుగా మారినాడు అని ప్రాధాన్యతగల విషయాన్ని అప్రాధాన్యత చేయుట వలన మనో వికాస పూరితమైన కథలు మొట్టమొదట భారత దేశంలోనే రచింపబడినవని చాలా మందికి తెలియకపోవుచున్నది. పంచతంత్ర కథలు విష్ణుశర్మ వ్రాసినాడని ప్రచారం బాగా జరిగింది. కాని ఈ బేతాళ కథలకు వచ్చేసరికి పురాణములను చరిత్రను పరిశీలన చేసిగాని, చేయకగాని దేవాంగుని మూడవ అవతారము బేతాళావతారమని విశ్వంలో విద్యా వ్యాప్తి కొరకు ఏడుఅవతారములను అవతరింపమని శివుడు చెప్పినట్లుగా అనుమాట మాత్రము ప్రచారములో లేకుండాపోయినది. బ్రహ్మాండ పురాణము తొలి పురాణము. ఈ కథలు బ్రహ్మాండ పురాణములోనివి. బ్రహ్మ నారద సంవాదము అను దానిలో రెండవ (ఉత్తర) భాగమున దేవాంగ చరిత్ర అను దానిలో ఇరవైమూడవ అధ్యాయముగా వున్నవి.

ఇట్లు శ్రీ బ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరితమున
ఇరవై మూడవ అధ్యాయము పరిపూర్ణము



# బేతాళ పంచ వింశతి కథాకథనము

## ఇరవై నాలుగవ అధ్యాయము

సూతుడు శౌనకాది మునులకు బేతాళరాజు విక్రమార్కునితో చెప్పిన కథలను చెప్పుచున్నాడు బేతాళుడు. విక్రమార్క మహారాజుతో వినుము. పూర్వము కృతయుగమున విశాల అను పట్టణము కలదు. అందు వీరమాహేశ్వరుడు అను రాజు పరిపాలించుచుండెను. అతడు సత్యవంతుడు, ఇంద్రియ నిగ్రహము కలవాడు. చాలాకాలం తరువాత అతనికి సంతానం కలిగినది. ఆడపిల్ల పుట్టినది. ఆమెకు పద్మావతి అని పేరు పెట్టినాడు. తండ్రి పద్మావతిని అల్లారు ముద్దుగా పెంచుకొనినాడు. ఆమెకు అన్ని శాస్త్రములను చెప్పించినాడు. ఆమెకు వివాహము చేయదలచి ఎవ్వరికి ఈ కన్యను ఇవ్వాలి అని ఆలోచన చేయసాగెను. మంత్రిని పిలిచి రాజు నా కుమార్తె పద్మావతి యౌవ్వనవంతురాలైనది. కావున పెండ్లిచేయాలని నిశ్చయించు కొనినాను. కావున నీవు తగిన వరుడును వెదకి తీసుకొనిరమ్ము అనిమంత్రితో చెప్పి వెంటనే పంపించినాడు. మంత్రి మంచిదే అని వెళ్ళినాడు. రాజ పురోహితుడిని పిలిచి మంత్రికి చెప్పినట్లే చెప్పి పంపించినాడు. తరువాత రాజు తనకుమార్తెకు తగిన వరుడుని తానే పిలుచుకొని వచ్చినాడు. పురోహితుడు ఒక వరుడిని తెచ్చెను. మంత్రి ఒక వరుని తెచ్చినాడు .ఇట్లు ముగ్గురును ముగ్గురు వరులనుతెచ్చిరి. ముగ్గురు వరులు చతురంగ బల సహితులుగా పెండ్లికి వచ్చి ఊరిబయట విడిది చేసినారు. అప్పుడు రాజు ఈ ముగ్గురు వరులలో ఎవరికి తన కుమార్తెను ఇవ్వాలి అని ఆలోచించుచుండెను. ఇంతలో అతని రాణి తన అన్న కొడుకును రప్పించినది. అతడుకూడా తన మేనత్త కూతురిని పెండ్లి ఆడుదామని సంతోషముగా వచ్చి ఊరి బయట విడిది చేసినాడు. అప్పుడు రాజుఅసలేనేను సంకటములో పడివుండితిని. ముగ్గురులో ఎవరికివ్వాలి ఒకరికిస్తే మిగతా వారు రాజ్యంపై దాడి చేస్తారేమో అని నేను విచారపడుతుంటే నీవు నాకు తెలియకుండా నీ అన్న కుమారుడను రప్పించితివి. ఇలా ఎందుకు చేసినావు అని రాజు తన భార్యను మందలించుచుండెను. ఓసీ! దుర్మార్గురాలా ముగ్గురు వచ్చి ఊరు చుట్టుకొనియుండగా నీ మేనల్లుడినికూడ ఎందుకు పిలిపించితివి? నాకు మొదలే

మతిపోయినట్లుగా యున్నది అని అనేక విధములుగా భార్యను తిట్టుచుండగా ఆ రాణి నీవు మన కూతురుని నా అన్న కొడుకుకు ఇచ్చి వివాహము చేయకపోతే నేను ఇప్పుడే నీ యెదుటనే విషము త్రాగి ప్రాణాలు విడిచెదను అని ఇట్లు చెప్పిన భార్య మాటలు విని రాజుఅతి కాముకుడు కావున భార్యమాట దాటజాలక పోయెను. ఆరాజు తన భార్యతో ఇట్లు అన్నాడు. లోకములో ఎక్కడనో గాని సామాన్యముగా ప్రతి పురుషుడును స్త్రీకి స్వాధీనుడే అయి వున్నాడు గదా! ఆడు దానికి లొంగియున్నవారు సత్యమును, ధర్మమును, కొడుకులను, బంధువులను, పెద్దలను, గురువులను విడుచుటకు ఎవ్వరూ వెనుదీయలేరు. ఆడది అనగా ఆది శక్తి స్వరూపిణి గదా! ఇందు ఆశ్చర్యమేమి వున్నది. తరువాత రాజు వచ్చియున్న ముగ్గురు వరులను నిరాకరించి భార్య మేనల్లునికే తన కూతురును ఇచ్చుటకు నిశ్చయించెను. రాజుగారి అభిప్రాయము తెలుసుకొని మొదటి ముగ్గురు వరులు కోపించిరి. రాజుతో యుద్ధానికి సన్నద్ధులైరి. రాజు వారితో నాతోను, నా బావమరిది కొడుకుతోను యుద్ధముచేసి మమ్ములను జయించిన తరువాతనే పెండ్లి చేసుకోవలసినది అని వర్తమానము పంపినారు. తరువాత పెండ్లి సంగతి చూసుకోవచ్చును అని ముందు యుద్ధమునకు రండి అని వర్తమానమును పంపిరి. దూతలవలన వారి అభిప్రాయము తెలుసుకొని రాజు మంత్రులను పిలిపించి ఆలోచింపసాగెను. అప్పుడు మంత్రులు బాగుగా ఆలోచించి రాజుతో ఇట్లనిరి. రాజా! ఇప్పుడు తన కుమార్తెను ఎవరికిచ్చుటయందు నీ నిశ్చయము మాకు తెలియకుండా మేము ఎలా పరిష్కారము ఆలోచించమంటావు. పైగా ఆవచ్చిన ముగ్గురు వరులు మహాబలవంతులు. వారితో యుద్ధము చేయుటకు మాకు సాధ్యపడదు. వారు మహా బలవంతులు అయినను మేము ఒక ఆలోచన చేసినాము అది చెప్పెదము. తమరు కోపము తెచ్చుకొనక విందురేని అని మంత్రులు చెప్పగా రాజు వారిని మంచి మాటలాడుతూ ఇట్లు అనినాడు. మంత్రులారా! మీ మనస్సుకు ఇష్టపడిన విషయము మాకు మాత్రము ఎందులకు ఇష్టపడదు? భయపడక మీకు తోచిన ఆలోచన ఏదియో నాతో చెప్పండి అని రాజు అడుగగా మంత్రులిట్లనిరి. రాజా! పట్టణమునకు వెలుపల గొప్ప అగ్ని గుండము ఒకటి ప్రజ్వలింపజేసి దానియెదుట తమ కుమార్తెను నిలబెట్టుడు. నలుగురు వరులు నాలుగు వైపుల నిలబెట్టించి మీ నలుగురిలో ఎవడు



ముందుగా వచ్చి నా కుమార్తె చేతిని ఎవడు పట్టుకొనునో వాడికి ఇచ్చి పెండ్లి చేయుదును అని ప్రకటించు అని చెప్పిరి. అప్పుడు నలుగురు ఒక్కసారే వచ్చి ఆమె చేతిని పట్టుకొనిరి. ఆమె వారి ఈడుపులకు సహింపక ఆమె ఆ కుండములో పడినది. అగ్నిజ్వాలలో మిడతవలె ఆ బాలిక కాలిపోయినది. నలుగురు హా!సుందరీ! అని ఏడవటం మొదలుపెట్టిరి. వారిలో ఒక సాహసియగు ఒకడు ఆ కుండములోనే పడినాడు. మరియొకడు ఆమెయందలి మోహముచే వైరాగ్యవంతుడై తీర్థయాత్రకు పోయినాడు. ఇంకొకడు సన్యసించి భిక్షాటన చేసికొనుచు దేశదేశములు తిరుగుచుండెను. నాల్గవవాడు మాత్రము ఆ పట్టణములోనే భిక్షావృత్తిచే కాలముగడుపుకొనుచు ఆ అగ్నిగుండము పైన చక్కటి మంటపము ఒకటి కట్టి ఆ సమీపప్రాంతముననే ఒక పూలతోట వేయించి ఆ మంటపముమీద గౌరీదేవిని ప్రతిష్ఠించి ప్రతి దినమున పూజించుచుండెను. సన్యసించి దేశాటనము చేయబోయినవాడు క్రమముగా కాశీ పట్టణము చేరి కొన్నాళ్ళు అక్కడ వుండెను. ఒకప్పుడు అతడు ఆకలిగొనిఒక దరిద్రుని ఇంటికిపోయి అతనిభార్యను చూచి ఆతిథ్య మిమ్మనెను. పతి భక్తి వశవందురాలైన ఆమె అతనిని పూజించి తన యింట ఏమియును లేకుండుటచే అతనితో ఇట్లనినది. ఓ స్వామీ! నాపెనిమిటి యాచనకు వెళ్ళినాడు ఇంట ఏమియును లేవు ఆయన వచ్చువరకును దయచేసి వుండి భుజించి వెళ్ళతగునని ఆమెఅనగా ఆ సన్యాసి కోపించి నేనంతవరకు వుండలేను నన్ను ఆకలి చాలాబాధ పెట్టుచున్నది. నీమగడు ఎంతసేపటికి వచ్చునో ఏమో? లేదంటే నేను పోయెదను. లేదా ఇప్పుడే నాకు భోజనము పెట్టుము అని అతడు అనగానే ఆమె పొరుగింటికి పోయి వెంటనే కొన్ని బియ్యము పప్పు తెచ్చి అన్నము వండుతుండగా ఆమె శిశువు ఏడ్చుచుండెను. వంట పనికి అడ్డము వచ్చిన కుమారుడిని ఆమె వంటపొయ్యిలో పడవేసెను. తరువాత వంటచేసి వడ్డించి ఆ సన్యాసిని తినమన్నది. మొదటినుండియు ఆమె చేయుచున్నదంతయు చూచిన వాడు ఆవ్వటం వలన ఆ సన్యాసి ఆహా! అని విచారించి శివశివా! నేను ఎచ్చటను ఇట్టి ఘోరకృత్యమును చూడలేదు. అమ్మా! నీ బిడ్డనుపొయిలో పడవైచి అన్నము తినమందువు. శిశుహత్య చేసిన పరమ పాపాత్మురాలి చేతి అన్నమును నేనెట్లు తిందును. ఎట్లా వున్నాడో అట్లా వుండే విధముగా నీ బాలుడు వచ్చినచో నీ అన్నము తింటాను అని అనుచుండగా ఆ సన్యాసిని అనేక విధములుగా

ఆమె బ్రతిమిలాడుకున్నది. ఎంత బ్రతిమిలాడినను సన్యాసి అంగీకరించక పోయెను. సన్యాసి యొక్కయు తనభార్య యొక్కయు వివాదమును ఇంటి యజమాని వినినాడు . అతడు వెంటనే నీళ్ళు మంత్రించి పొయిలో చల్లెను. ఆ బాలుడు మునుపటి వలె కలకల లాడుచూ వెలుపల వచ్చెను. సన్యాసి ఆ బ్రాహ్మణుని మంత్ర ప్రభావమునకు ఆశ్చర్యపడి ఇట్లు అనినాడు. దయాసముద్రుడవు అగు ఓ బ్రాహ్మణుడా! ఆ మంత్రము నాకు ఉపదేశించుము. దానివలన నాకోరిక పూర్తిఅగును. అనిన సన్యాసిని చూచి ఆ ఇంటి బ్రాహ్మణుడు ఉపదేశింపను అని బదులు చెప్పెను. చేతిలో ఔపోసనము పట్టుకొని నీవు నాకు ఆ మంత్రము చెప్పవేని నేను భోజనము చేయను. ఆతిధ్య మిచ్చునప్పుడు కోరిన దానికి అభ్యంతరము చెప్పకూడదు గనుకవిధిలేక అతనికి ఆమంత్రమును ఉపదేశించెను. తరువాత సన్యాసిభుజించిశుచియై మంత్రమును పరీక్షింపనెంచి అచ్చట చచ్చిపడివున్న ఒక గాడిదమీద నీరు మంత్రించి చల్లిన వెంటనే ఆగాడిద బ్రతికినది. వెంటనే సన్యాసి విశాల పట్టణమునకు వచ్చెను. వెంటనే రాజకుమార్తె పడిన కుండమును త్రవ్వించి నీరుమంత్రించి చల్లేసరికి ఆమె అప్పటికప్పుడు బ్రతికి పైకివచ్చినది. ఆమె పడినప్పుడు ఆకుండములో పడినవాడు కూడా బ్రతికి పైకివచ్చినాడు. ఇంతలో వైరాగ్యముచే తీర్ధయాత్రలకు పోయినవాడును తిరిగి వచ్చినాడు. అతడు ఆమెయందలి మక్కువచే ప్రతితీర్ధమునందు పిండప్రదానాది క్రియలు ఆచరించుచుండెను. మరల నలుగురు ఒకచోటకు చేరిరి. ఈ రాజకుమార్తె నాదని ప్రతివాడు చెప్పమొదలిడినాడు. ఓ విక్రమార్క మహారాజా! ఆ నలుగురిలో ఎవరిది ఆకన్య చెప్పుమనగా బుద్ధిశాలిఅగు రాజు ఇట్లు అనినాడు. తీర్ధములలో పిండ ప్రదానాది క్రియలు చేసినవాడు కుమారుడు అగును. చచ్చినదానిని మంత్ర ప్రభావముచే బ్రతికించినవాడు తండ్రిఅగును. అగ్నికుండములో బడి చచ్చి మరలగూడా పుట్టినవాడు సోదరుడు అగును. ఇక ఆమె చచ్చినను ఆచోటు వదలక ఆమెనే తలచుచు ఆమె చచ్చినచోటు కాపాడుచున్నాడు గనుక ఆమె అతనికి భార్య కాతగ్గదిఅని సమాధానము చెప్పగానే బేతాళుడు విడిపించుకొని పారిపోయి మరల మర్రిచెట్టు ఎక్కెను. రాజు మరల వటవృక్షమును ఎక్కి బేతాళుడిని పట్టుకొని కట్టి భుజముపై ఎక్కించుకొని యోగియున్న చోటికి బయలుదేరెను. మరలబేతాళుడు కథను ప్రారంబించెను. ఇట్లు ఇరువది నాలుగు కథలుచెప్పగా అన్నింటికి తగిన



సమాధానమును విక్రమార్కుడు చెప్పగా, బేతాళుడు ఇట్లు అన్నాడు. రాజా! నీవు సర్వజ్ఞుడవు . సాక్షాత్తు బృహస్పతివి, ఈ భూలోకములో నీతో సమానుడు లేడు. నేనిప్పుడు ఇరువది ఐదవ కథను చెప్పెదను. దానికి కూడా సమాధానము చెప్పినచో నీవు ఈ కార్యమునందు జయించిన వాడవు అగుదువు. అని ఇరువది ఐదవ కథను చెప్ప ప్రారంభించినాడు.

రాజా! పూర్వము వంగ దేశమున చక్రపురమను పట్టణము కలదు. అందు సుందరి అనియు, రూపవతి అనియు ఇద్దరు వేశ్యలు తల్లీ కూతుండ్లు గలరు. వారిద్దరును స్వధర్మమునందు ఆసక్తికలవారై వుండిరి. వారికి ఆవూరులో ఎటువంటి లాభము లేకుండుట వలన మరియొక పట్టణమునకు పోవుదమని బయలుదేరిరి. రాముడు అను పేరుగలవాడు ఆ పట్టణరాజు శత్రువులచే ఓడిపోయి భార్యకూడా చచ్చిపోవుటచే కుమారునితో కూడి మరియొక వూరికి పోవుచు వేశ్యలిద్దరును పోయిన దారినే వీరు పోవుచుండిరి. దారిలో ఆ అడుగులుచూచి తండ్రితో కొడుకు ఇట్లనెను. తండ్రీ ఈ దారిన ఇద్దరు ఆడవాండ్రు పోవుచున్నారు. పెద్ద అడుగుల దానిని నీవు పెండ్లి ఆడుము. చిన్న పాదములుగల దానిని నేను పెండ్లి ఆడెదను అనగానే తండ్రి మంచిది అనెను. కొంతదూరము పోవునప్పటికి ఆ ఇద్దరు స్త్రీలు కనబడినారు. మొదట అనుకున్న ప్రకారము తల్లిని కొడుకు, కూతురుని తండ్రి పెండ్లి చేసుకొనిరి. ఏమనగా పెద్దపాదములు గలది కూతురు, చిన్న పాదములు గలది తల్లి. తరువాత వారికి కూతుళ్ళు, కొడుకులు జన్మించిరి. ఆపుట్టినవారు శాంతులై వృద్ధి చెందుచున్నారు. వారు తమలో నేమివరుసలో పిలుచుకో దగువారో చెప్పుము రాజా!! అని బేతాళుడు అడుగగా శాస్త్రనిందితమైన ఈ సంబంధము తెలియజాలక సంశయ గ్రస్తుడై బేతాళుని మోసుకొని తన తోవను పోవుచున్నాడు విక్రమార్క మహారాజు.

ఇట్లు శ్రీ బ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరితమున
ఇరవై నాల్గవ అధ్యాయము పరిపూర్ణము



# బేతాళ శాప విమోచనము
## ఇరువది ఐదవ అధ్యాయము

సూతమహర్షి తరువాత కథను శౌనకాది ఋషులకు ఈ విధముగా చెప్పుచున్నాడు. బేతాళుని విక్రమార్క మహారాజు తనవీపున (భుజాన) వేసుకొని మోసుకుంటూ చాలా దూరం పోవుసరికి అక్కడ మధురమైన సంగీతధ్వని వినబడుచున్నది. గాన శాస్త్రములో ప్రవీణుడు అయిన విక్రమార్కుడు ఎప్పుడు ఇటువంటి గానమును వినలేదు. ఈ గానమును మగవారు పాడుచున్నారా, ఆడవారు పాడుచున్నారా అను సందేహము కలిగి అతివేగముగా నడచి చూచునప్పుడు ఒక మహాశిలపై మంజుల స్వరము కలిగి ఈశ్వరుని స్తోత్రముతో గూడియున్న సంగీతమును పాడుచు మధురమైన కంఠానాదము కలిగియున్న యౌవ్వన మధ్యస్తురాలగు ఒక దివ్య స్త్రీని చూచినాడు విక్రమార్కుడు. ఆమె దగ్గరకు పోయి ఆమె సౌందర్యమునకు ఆశ్చర్యపడినాడు. ఆ యువతితో యుక్తియుక్తముగా ప్రియము కలుగు విధముగా ఒక మాటను రాజు అడిగినాడు ఆమెను. వీణ వాయించుచు పాటపాడుటయందు చతురురాలైన ఓ కమలముల వంటి కనులు గలదానా నీవు ఎవరవు వీణ వాయించుటయందు ఇష్టము కలిగియుండెడి మాతంగి అను దేవతవా, లేక సొగసైన దేహముగల బ్రాహ్మియను దేవతవా, గానమందు ఆసక్తి కలిగిన కచ్ఛపి అను దేవతవా, సుందరమైన భుజములు కలిగిన లక్ష్మీదేవతవా, శంఖమువంటి కంఠము కలదానా మదపుటేనుగు నడచునట్లుగా నడిచే ఇంద్రుని భార్యవా, సొగసైనటువంటి అరటి స్థంభములవలె నుండెడి తొడలు కలదానా, దొండపండు వంటి పెదవి కలదానా, కమలముల వంటి మోముగలదానా నీవు రంభవా, సుందరమైన దేహము గలిగి నృత్యమందును పాటలయందును చతురురాలైన ఊర్వశివా, చకోరములవంటి నేత్రములు కలదానా నీమొఖము చంద్రుడిని పరిహాసము చేయుచున్నది, నీపండ్లు దాడిమ (దానిమ్మ) విత్తులను పరిహాసము చేయుచున్నవి. నీనడుము ఆకాశమువలె కనబడుచున్నది. నీవు పాడే పాటను విని ఆడలేడులు కదలక అట్లే నిలబడి వున్నవి. ఎండినచెట్లు నీపాట వలన చిగురించుచున్నవి. ఓ సొగసుకత్తే



నీపేరేమిటి, నీతండ్రి పేరేమిటి, నీభర్త ఎవరు, నీకు కుమారులున్నారా? ఈ విషయములను నేను అడుగుచున్నాను. దీనికి సమాధానము ప్రీతితో చెప్పవలెను అని విక్రమార్క మహారాజు బేతాళుడిని వీపుపై మోయుచూనే అడిగినాడు ఆ సుందరాంగిని. ఓ మీనములవంటి కన్నులు గలదానా యేలోకమునుండి ఈలోకమునకు నీవు వచ్చినావు. లోకములను సృష్టించే బ్రహ్మదేవుడు నిన్ను సృష్టించిన తరువాతనే సొగసైన సృష్టిని చేసివుంటాడు అని అనుకుంటున్నాను. సౌందర్యమునకు గనిలాంటి దానవై సమస్త విద్యలను తెలిసినట్టి నీవు ఎవరవు, నేను ప్రేమతో అడుగుచున్నాను. నాకు నిజముచెప్పుము. నీ సొగసును వర్ణింపను బ్రహ్మకును, విష్ణువునకును, శివుడికిని శక్తిలేదు నీవు ఎవరవు, ఇక్కడ ఎందుకు వున్నావు అని ఈ విధముగా అడిగినాడు విక్రమార్కుడు. అప్పుడు మిక్కిలి బుద్ధివంతురాలైన ఆ యక్షకన్య ఆ రాజశ్రేష్టుడు అగు విక్రమార్కునికి ఈ విధముగా సమాధానము చెప్పినది.

## దేవదత్త విక్రమార్కునితో మాటలాడుట

నా పేరు దేవదత్త. నా తండ్రి సింధురాజు. నేను మిక్కిలి పరాక్రమముగల పుష్పదంతుడు అను రాజునకు భార్యను. శ్రుతకీర్తి అను రాజునకు కోడలును. నా స్థావరము హేమవతీ పట్టణము. నాభర్త సాంబశివుని శాపమువలన బేతాళుడైనాడు. నేను అతని విరహముతో తిరుగుచున్నాను. నాకేవిధమైనను కాలము గడవటంలేదు. నాకు పగలు లేడిరూపమును, రాత్రి ఈరూపమును వుండును రాజా. నా భర్త మొఖమును చూచుట ఎప్పుడు కలుగునో అప్పుడు పిశాచాలకు నాయకుడైవున్న నాభర్త అట్లే నన్ను చూచినచో అప్పుడు మా ఇద్దరి శాపము తీరును. ఓయీ మిక్కిలి కీర్తిగలవాడా మాకు శాపము ఇచ్చునప్పుడు శివుడు ఇట్లు చెప్పినాడు. నేను నాభర్తయున్న ప్రదేశమునకు పోయి అతనిని చూచుటకు శక్తురాలను కాను. కావున ఆ శాపముచేత జ్ఞానహీనుడై వుండినటువంటి నాభర్త నన్ను చూడజాలడు. సాంబమూర్తి పూర్వమే మాకు శాప విమోచనమును విక్రమార్క మహారాజుచేత అగునని చెప్పినాడు. రాజశ్రేష్టుడు అయిన ఆ విక్రమార్క మహారాజు మేము ఒకరినొకరు చూచుకొను నట్లుగా ఏవిధముగా ఎప్పుడు చేస్తాడో అప్పుడు అతనిచేత మా శాపము తీరును. సర్వేశ్వరుడి మాట ఎప్పటికి తప్పదుగదా.

ఆ విక్రమార్కుని ద్వారానే మాకు శాపము తీరును. అని చెప్పి మరల దేవదత్త ఆరాజును ఇట్లడిగినది. ఓ పురుష శ్రేష్టుడా! నీవు ఎవడవు, నీపేరేమి వేదశాస్త్రములకు అర్ధము తెలిసిన నీవు దేవుడవా, బ్రాహ్మణుడవా, ఇంద్రుడవా, విష్ణువువా, సరస్వతి భర్తయైన బ్రహ్మవా లేక రాజ శ్రేష్టుడైన విక్రమార్కుడివా. ఓయి మిక్కిలి బలవంతుడా అర్ధరాత్రివేళ ఇప్పుడు ఇక్కడకి ఎందుకు వచ్చినావు అని ఈ విధముగా దేవదత్త అడిగినది. అప్పుడు విక్రమార్కుడు నవ్వుచూ ఆమెకు సమాధానము చెప్పెను. నేను ఉజ్జయినీ పట్టణమునకు అధిపతిని నన్ను విక్రమార్కుడు అంటారు. ఓ శ్రేష్టమైన మొఖముగల యక్షిణీ మిక్కిలి బుద్ధిశాలియైన కాలపురుషుడను యోగిశ్రేష్టుడు నన్ను బేతాళుడుని తెచ్చి తనకు అప్పగించమని అడుగగా అప్పుడు మిక్కిలి పొడవైన కొమ్మలు కలిగి అత్యంత ఎత్తుకు ఎదిగివున్న మర్రిచెట్టు దగ్గరకు పోయి అచ్చటవున్న భూతముల అధిపతియైన బేతాళరాజును చూచినాను. ఆ బేతాళరాజు వినటానికి మిక్కిలి ఆశ్చర్యకరమైన, ఊహించటానికి వీలుపడనటువంటి కథలు చెప్పినాడు. అనేక మాయలు కలిగిన ఆ బేతాళుడుని యుక్తితో అతనికి సమ్మతమైనటువంటి సమాధానములు చెప్పి అతనిని జయించినాను. ఇప్పుడు అతనిని వెంటబెట్టుకొని యోగీశ్వరుడున్న చోటికి పోవుచున్నాను అని ఈ విధముగా చెప్పిన విక్రమార్క మహారాజుతో ఆ శ్రేష్టమైన స్త్రీ అయిన దేవదత్త నవ్వుచు పలికినది. భూత బేతాళురకు ప్రభువైన నాపెనిమిటి ఇప్పుడు ఎక్కడ వున్నాడు నాభర్తను పట్టుకుంటివా, నీచేత ఇప్పుడు తేబడినదా. అతనిని చూచినగాని నామనసు సంతోషము కలుగును. కనుక అతనిని ఇప్పుడు నాకు కనబడునట్లు చేయుము రాజా అని ఈ విధముగా అడిగినది. అప్పుడు విక్రమార్క మహారాజు జడలచేత కట్టబడి తన వీపుమీదవున్న మిక్కిలి మాయలు కలిగినటువంటి బేతాళుడిని ఆమెకు కనిపించునట్లు చేసెను. అప్పుడు నల్లని కన్నులు గల ఆదేవదత్త ఆ విక్రమార్కుడి వీపుమీద విమానమునందు దేవతయున్నట్లుగా ఆ బేతాళుడుని చూచినది.

## బేతాళుడి శాప విమోచనము

ఆ బేతాళుడును సొగసైన నవ్వుతో సొగసైన దేహముగల ఆతని భార్యనుచూచి చాలా సంతోషించినాడు. వారిద్దరు ఒకరినొకరు చూచుకొనుట



వలన శాపము తీరినది. కనుక ఇద్దరు మునుపటి రూపములను విడచి దివ్యరూపములను పొంది దేవతలచేతను, గంధర్వులచేతను సేవింపబడుచున్నారు. ఇద్దరు శ్రేష్టములైన వస్త్రములను కట్టుకొని దివ్యమైన చందనమును పూసుకొని సొగసులైన సొమ్ములచేతను , పువ్వులచేతను అలంకరించుకొనిన వారై ఆకాశమందు దివ్యమైన విమానమును ఎక్కి ప్రకాశించిరి. అప్పుడు తన తేజస్సుచేత పదిదిక్కులను వెలిగించుచున్న ఆ ఇద్దరిని ఒకరినొకరు ఎంతసేపు చూసుకొనినను తృప్తి చెందకపోతిరి. ఇంతకుముందు జరిగిన సంగతులు ఒకరితో నొకరు మాటలాడుకొనుచు సంతోషమును పొందినవారై దేవతలచేతను, విద్యాధరులచేతను స్తుతింపబడుచున్నారు వారు. విశ్వావసువు మొదలగు గంధర్వులు తమ చరితలను పాడుచుండగా వారు విమానమునందు ప్రకాశించుచుండిరి. అప్పుడు అప్సరసలు అందరు సొగసైన పాటలతోడ అందరికి సంతోషము వుండులాగున పాడుట ఆరంభించిరి. దేవతల నగారాలు మ్రోగినవి. పూలవాన కురిసినది. కైలాసమందున్న వారందరు మిక్కిలి సంతోషము చెందిరి. పార్వతీ పరమేశ్వరులు అధికమైన సంతోషమును పొందినారు. బ్రహ్మయు, విష్ణువు, ఇంద్రుడును పరమానంద భరితులైనారు. అప్పుడు విక్రమార్క మహారాజు విమానమునందున్న దేవదత్తతోగూడా కూర్చొనివున్న సూర్యునితో సమానమైన తేజస్సుతో ప్రకాశించుచుండిన ఆ దేవాంగుని చూచి ఆశ్చర్యపడినాడు. సంతోషమనే సముద్రములో మునిగి వుండినాడు. అప్పుడు విక్రమార్క మహారాజుతో దేవదత్త దేవాంగుడు విక్రమార్కుడు మాటల నేర్పరి గనుక తన మాటల నేర్పరితనము కనబడునట్లు ఓయి రాజరాజువైన విక్రమార్కుడా! మిక్కిలిబలమును, పరాక్రమమును కలవాడా నీవు పరిశుద్ధమైన వాడవు అగుటచేత నేను ఈ శాప సముద్రమును దాటితిని. నీవుచేసిన ఉపకారమునకు నేను ప్రత్యుపకారము చేయగలవాడను. నీకు ఏది ఇష్టమైనదో దానిని నాతో చెప్పుము. తప్పక చేయుదును అని ఇట్లు భార్యతో కూడి వున్న దేవాంగుడు ఆదరణతో చెప్పినాడు.

## దేవాంగుడు విక్రమార్కుడిని వరము కోరుకో మనుట

అప్పుడు మిక్కిలి బుద్ధిమంతుడైన ఆ విక్రమార్కుడు కొంతసేపు ఆలోచించి ఆ దేవాంగునికి నమస్కరించి తన కోరికను ఈ విధముగా చెప్పినాడు.

ఓయీ దేవాంగుడా నీవు సాంబమూర్తి భక్తుల సమూహమున మొదటివాడవు. మిక్కిలి బుద్ధిశాలివైన నీవు సంతోషమును పొందినట్లయినచో నాకు వరము ఇవ్వు. దేవాంగుడా దేవతా సమూహములచేత పూజింపబడువాడా నేను నిన్ను ఎప్పుడు తలచెదనో అప్పుడు నీవు భేతాళ రూపముతో నా వద్దకు రావలెను. నేనేమి చెప్పెదనో దానిని నీవు చేయవలయును నేను కోరిన ఈ వరము నీకు ఇష్టమైన ఎడల నాకు ఇవ్వవలెను అని ఈ విధముగా విక్రమార్కుడు వేడుకొనినాడు. అప్పుడు దేవాంగుడు నీవు అనుకొనినట్లుగానే జరుగును అని సమాధానం చెప్పినాడు. ఈ విధముగా వరము ఇవ్వబడగా సంతోషము చెందిన విక్రమార్కుడు ఆ దేవాంగుని వద్ద శెలవు పుచ్చుకొని కాలపురుషుడివద్దకు తిరిగి పోవటానికి సిద్ధమౌచున్నాడు. అట్లు బయలుదేరుచున్న మిక్కిలి సొగసైన ఆ విక్రమార్కుడిని చూచి ఆ దేవాంగ మహాముని తన భార్య దేవదత్తచే ప్రేరేపింపబడినవాడై మరల ఇట్లు చెప్పినాడు.

## కాలపురుషుడి మోసబుద్ధిని విక్రమార్కునికి తెలుపుట

ఓయీ మంచి బుద్ధిగల రాజశ్రేష్ఠుడా కాలపురుషుడను యోగీశ్వరుడు నిన్ను కాళీమాతకు బలిఇవ్వటానికై సిద్ధముగా ఉండినాడు అని తెలుసుకోవలయును. జాగ్రత్తగ వుండుము. ఓయీ రాజా ఎప్పుడు నిన్ను కాలపురుషుడు స్నానము చేయమని చెప్పునో అప్పుడు నీవు కూడా అతనిని ముందుగా స్నానము చేయమని అడుగవలెను. ఎప్పుడు కాలపురుషుడు నిన్ను నమస్కరింపుము అని అడుగునో అప్పుడు నీవు అతనిని ముందుగా నమస్కరించుమని అడుగుము. కాలపురుషుడు నమస్కరించుచున్నప్పుడు నీవు నీ చంద్రహాసము(కత్తి) పైకెత్తి కాళికాదేవికి బలి కొరకు వెంటనే అతని తలను నరుకుము. అప్పుడు కాళికాదేవి నీకు అనుగ్రహము కలుగచేయును. అప్పుడు శుభకరురాలైన ఆ కాళికాదేవి భేతాళరూపధారుదును అయిన నన్ను నీకు వశ్యునిగా చేయును. సందేహం లేదు. భక్తులకు చింతామణి అయిన ఆ దేవి నీకు చక్రవర్తిత్వమును, దీర్ఘాయువును ఇచ్చును అని ఇట్లు చెప్పి ఆ దేవాంగుడు తన భార్యయైన దేవదత్తతో కూడినవాడై ఆ విక్రమార్కుని వద్ద శెలవు తీసుకొని కైలాస పర్వతమునకు పోయెను. శివమానసపుత్రుడు అయి ఎందరికో శాపవిమోచనము కలిగించిన దేవలుడు చివరికి తన తండ్రి చేతనే శపింపబడి



మరొకరి చేత శాపవిమోచనము పొందటం దురదృష్టకరమైనదే.

## దేవదత్త తొందరపాటుతనము

భార్య తొందరపాటు కలదై యుక్తాయుక్త వివేకజ్ఞానము లేనిదై సమయస్ఫూర్తి కూడా లేనిదై వుండి పెద్దలవద్ద తన నడవడిక ఎలా వుండాలో తెలుసుకోలేకపోయినది. కనీసం తన భర్తను చూచి అయిననూ అనుసరించలేకపోయినది. భర్తను తన గుప్పెట్లో పెట్టుకోవటానికి ప్రయత్నించినది. తన భర్త స్వభావము ఎటువంటిదో తెలిసి కూడా కావాలని భర్తను నిందించినది. నిలుపుదనం లేని ప్రవర్తన వలన తనకే కాదు తన భర్తకు కూడా అష్టకష్టములు తెచ్చినది దేవదత్త. ఆడవారికి కోపము వుండవచ్చు కాని విపరీతమైన కోపము వుండరాదని, ఎప్పటికినీ సంయమనం కోల్పోకుండా భర్తకు అండగా వుండవలసినది పోయి ఒక మహా శివభక్తుడైన తన భర్త ప్రతిరోజు శివుడిని దర్శించుకొని పుష్పములతో సేవచేసుకొనే మహాభాగ్యమును పోగొట్టినది. ఎప్పుడూ ఆలస్యముగా ఇంటికి రాని భర్త ఏదైనా ఒకరోజు ఆలస్యముగా ఇంటికి వస్తే దానికి కారణం ఏవైౖ వుంటుందా అని ఇష్టపూర్వకముగా నమ్రతతో అడిగి తెలుసుకొని తన కాపురాన్ని నిలబెట్టుకొనవలసిన స్త్రీ చివరకు తనకే కాదు భర్తకు కూడా నరకప్రాయము చేసినది. శివుడు శపించుటకు సిద్ధమైనప్పుడు పుష్పదంతుడు తప్పు అంతా నాదే నన్నే దండించండి, నా భార్యయందు పొరపాటు లేదు ఆమెను దండించవద్దు అని శివుడిని ప్రాధేయపడి అడిగినాడు. తప్పు తన భార్యదైనా ఆ తప్పును తనపైన వేసుకొని భార్యను రక్షించుకోవడానికి చేతనైనంత వరకు ప్రయత్నించినాడు. కావున తొందరపాటులు, అపోహలు భార్యాభర్తలమధ్య వుండరాదని తెలియజెప్పుచున్నది. తన జ్ఞాననేత్రమునుండి పుట్టినవాడు, మానసపుత్రుడు తన తల్లిదండ్రులనే మోసం చేస్తాడు అని ఎవరు ఊహిస్తారు. తన చెలికత్తెలముందు పార్వతీదేవి పరువు పోయినది. అసత్యవంతురాలైనది. భర్తను ఎంతో ప్రేమగా కోరిక కోరగా తన భర్త తనను వంచించినాడు అని భావించిన పార్వతీదేవి జీర్ణించుకోలేక పోయినది. అందువలన వెంటనే పార్వతి తన భర్త శివునితో నీవు నాతో పరిహాసము ఆడినావు. దేవతలకే దేవుడైన నీవు నీ భార్యతోనే అబద్ధమాడినావు అని ఆవేదన చెందినది. శివుడు విస్తుపోయినాడు.

ఏమిటీ ఎంతో ప్రేమతో భార్యకు చెప్పిన రహస్యమైన కధను ఎట్లా బయటవారికి తెలిసినది. అంతఃపుర మర్యాదకు భంగం కలిగించిన వారు ఎవరు అని ఉగ్రుడు కావలసి వచ్చినది. భార్యాభర్తలు రహస్యంగా ఏకాంతంగా వుండినప్పుడు వాకిట్లో నిలబడి వుండుట వారు ఎప్పుడు బయటకు వస్తారు అని ఎదురుచూచుట అనగా ఇతను పూజ చేసుకొనుటకు వారు త్వరగా వాళ్ళ పని ముగించుకొని రావాలా? కొడుకు కోరుకునేది ఇలానా. తన తల్లిదండ్రులు రహస్య సంభాషణలో వుండినారు కావున అచ్చట అసలు వుండరాదు. దూరంగా వుండాలి అనే ఆలోచన కూడా లేకపోయినది పుష్పదంతునికి. తన కన్నబిడ్డే తమను అపహాస్యపాలు చేసినాడు అనే బాధతో ఈశ్వరుడు అగ్గిపై గుగ్గిలంలాగా మారిపోవలసి వచ్చినది. తన భార్యకు తనయందు గౌరవం తగ్గిందని ఆక్రోశం చెందినాడు. అందువలననే తన మానసపుత్రుడు అయినను శివుడు పుష్పదంతున్ని శపించినాడు. దేనికైననూ స్వేచ్ఛ కొంతవరకే వుండాలి. పూర్తి స్వేచ్ఛ ఇస్తే దుర్వినియోగం చేస్తారు కొందరు. తన ఫాలనేత్రం నుండి ఆవిర్భవించిన మానసపుత్రుడు దేవలుని అవతారమైన పుష్పదంతున్ని శపించటానికి ఎంత వ్యధ చెందాల్సి వుంటుందో తెలుస్తుంది. ఈ విధముగ తన కుమారుడిని తానే శిక్షించినందులకు మానసిక ఆవేదన వుంటుంది. ఆ శిక్ష ఎప్పుడు తొలిగిపోతుందా అని కళ్ళలో వేయి వత్తులు వేసుకొని ఎదురు చూస్తూ వుంటారు. అందువలననే భేతాళుడుగా శాపవిమోచనం పొందగానే పార్వతీ పరమేశ్వరులు అధికమైన సంతోషమును పొందినారు. కైలాసములో వుండిన మిగతావారు కూడా సంతోషం పొందినారు. కాని దేవదత్త ఆ విధంగా ప్రవర్తించకుండా వుంటే శివునికి కోపం రాదుగదా. తీవ్రాతి తీవ్రమైన ఆగ్రహం కలిగినప్పుడే కదా భయంకరమైన శాపం కలిగేది. కావున విధి నిర్ణయం వలన దేవదత్త ప్రవర్తన ఆ విధంగా వుంది. అందుకే కదా శివుడు ముందుగానే సప్తావతారములు అవతరించవలసి వున్నది అని ముందుగా దేవలునికి తెలియపరచినాడు. కావున దేవలుడు భేతాళుడుగా అవతరించవలసి వున్నందున విధి ప్రేరేపితముగా పుష్పదంతుని సంఘటన జరిగినది. దీనిలో ఎవ్వరి ప్రమేయమూ లేదు. విధి చేతిలో కేవలం పాత్రధారులం మాత్రమే. సృష్టి కార్యానికి దైవం చెప్పిన రీతిలో మన కార్యం వుంటుంది అని దీనివలన తెలియుచున్నది.



## విక్రమార్కుడు కాలపురుషునివద్దకు వెళ్ళుట

దేవాంగుని వద్ద శెలవు పుచ్చుకొని విక్రమార్కుడు కాలపురుషుడను యోగీశ్వరుడు వుండు చోటుకు పోయెను. అప్పుడు ఆ యోగి భేతాళుడెక్కడ అని ఆతురతతో అడిగినాడు. అప్పుడు విక్రమార్కుడు ఇట్లు అడుగుచున్న కాలపురుషునితో భేతాళుని సమాచారమంతయూ చెప్పినాడు. అంతట ఆ కాలపురుషుడు ఆ సమాచారమును విని త్వరితముగా ఆ విక్రమార్కునితోడ కాళికా దేవి గుడికి పోయెను. ఈ విధముగా కాళికాదేవి గుడికి పోయిన యోగీశ్వరుడు విక్రమార్కుని ఆ దేవికి బలి ఇవ్వకపోతే కోర్కెలు నెరవేర్చదు అను ఆలోచన కలవాడైనందున విక్రమార్కుని స్నానము చేయుమనెను. అంత విక్రమార్కుడు దేవాంగుడు తనకు చెప్పినదంతా గుర్తుంచుకొని యున్నాడు కనుక వెంటనే యోగితో నీవు ముందు స్నానము చేయుము అని విక్రమార్కుడు అనినాడు. అప్పుడు కాలపురుషుడు విక్రమార్కుడు చెప్పినట్లుగానే ముందుగా స్నానము చేసి ఆహ్నిక కృత్యములను తీర్చుకొనినాడు. ఈ విధముగా విక్రమార్కుడు ముందుగా యోగిచేత పనులు చేయించి ఆ తరువాతనే ఆ పనులు తాను నిర్వహిస్తున్నాడు. యోగీశ్వరుడు అమ్మవారికి నమస్కరించమని విక్రమార్కునితో అన్నాడు. వెంటనే విక్రమార్కుడు ముందుగా మీరే అమ్మవారికి నమస్కారం చేయండి అని చెప్పేసరికి వెంటనే కాలపురుషుడు అమ్మవారికి సాష్టాంగ నమస్కారం చేయఁగానే వెంటనే విక్రమార్కుడు తన చంద్రహాసం(కత్తి)చేత యోగీశ్వరుడిని ఒక్క వేటుతో శిరస్సు నరికి దేవికి బలియిచ్చినాడు. అప్పుడు ఆకాశమున దేవతలు నగారాలు మ్రోగించిరి. పుష్పవర్షము కురిపించిరి. అప్సరసలందరూ నాట్యమాడిరి. గంధర్వులు మధురముగా పాడిరి. దేవతలందరూ విక్రమార్కుని రాజా జయము జయము అనిరి. అప్పుడు దయానిధి అయిన భక్తుల యందు ప్రీతి కలిగినటువంటి ఆ కాళికా దేవి అనుగ్రహముతో విక్రమార్కునితో ఇట్లనెను. ఓయీ మిక్కిలి భుజబలము గల విక్రమార్కుడా నీకు వరము ఇవ్వదలచినాను. నీ ఇష్టము వచ్చిన వరము కోరుకొనుము అని దేవి చెప్పగా ఆ విక్రమార్కుడు మనస్సున సంతోషము పొందినవాడై ఇతరులు పొందగూడని వరమును కోరినాడు. ఎప్పుడు నేను దేవాంగుని స్మరించెదనో అప్పుడు దేవాంగుడు భేతాళ రూపముతో నా

వద్దకు వచ్చునట్లు ప్రసాదింపుము మరియు చక్రవర్తిత్వము, దీర్ఘాయుష్షు నాకు కలుగునట్లు దయచేయుము. సర్వాంగ సుందరి అయిన పార్వతీదేవి నీకు మ్రొక్కుచున్నాను అని ఆ దేవితో పలికినాడు. భక్తుల కోరికలన్నింటినీ ఇచ్చునట్టి కాళికాదేవి ఈ ప్రకారమతని చేత ప్రార్థింపబడగా అప్పుడు అతడు కోరిన వరములన్నియు ఇచ్చెను. పిమ్మట ఆ దేవి వద్ద శెలవు పుచ్చుకొని సంతోషముతో ఉజ్జయినీ పట్టణమునకు పోయినాడు విక్రమార్కుడు. తన ఆస్థానమందున్న వారికి జరిగిన విషయములన్నియు చెప్పినాడు. వారందరూ సంతోషము పొందినారు. ఆ తరువాత సింహాసనము ఎక్కి అందరి రాజుల చేత మ్రొక్కులు పొందుచూ దేవేంద్రుడు స్వర్గమును పాలించినట్లుగా విక్రమార్కుడు ఉజ్జయినీని పాలించినాడు. విక్రమార్కుడు భూమిని పాలించునప్పుడు జనులందరూ తమ తమ ధర్మములను అనుసరించుచూ సంతోషము చెందిన వారైరి.

ఇట్లు శ్రీ బ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరితమున
ఇరవై ఐదవ అధ్యాయము పరిపూర్ణము



## వరరుచి అవతారము
### ఇరవై ఆరవ అధ్యాయము



రంభ దేవలుని శపించినది అని ఇంతకు ముందు చదివియున్నాము. ఆ శాపములో 5000 సంవత్సరాల వరకు శూద్ర సముడుగా వుండుము. ఆ తరువాత బ్రాహ్మణ పండితులలో సర్వశ్రేష్టుడివిగా జన్మించుతావు అని రంభ పలికినది. శూద్ర సముడిగా దేవలుడు వజ్రదంష్ట్ర రాక్షస రాజుగారికి బందీగాను వుండి వారి అధీనములో వుంటూ వారితో కలిసి జీవించుట జరిగినది. శూద్రుడుగా పుట్టమని రంభ శపించలేదు. శూద్రసముడుగా వుంటావు అని అన్నది. అనగా ఉత్తమ బ్రాహ్మణునిగా జన్మించిననూ దేవతగా అవతరించినందువల్ల వారు పుట్టిన జాతికి చెందినవారుగనే గుర్తించాలి. అయితే వీరు ఏ జాతి జనులతో కలసి జీవించవలసి వచ్చినప్పుడు ఆ జాతిత్వము



తాత్కాలికంగా ఆపాదింపబడుతుంది. ఒక బ్రాహ్మణశ్రేష్ఠుడు క్షత్రియులతో సహవాసము వుండి వారితోనే కలిసి జీవించుతుంటే ఆ బ్రాహ్మణుని క్షత్రియ సముడు అని అంటారు. అనగా అంతమాత్రము చేత ఆ బ్రాహ్మణుడు తను పుట్టిన బ్రాహ్మణవంశ జాతిని వదులుకొని క్షత్రియత్వం శాశ్వతముగా వచ్చినట్టు కాదు. అతనికి జన్మించిన సంతానం బ్రాహ్మణులుగానే పరిగణించెదరు. కాని క్షత్రియులతో మెలగుచున్నాడు వారి వద్దనే వుంటూ జీవిస్తున్నాడు కాబట్టి క్షత్రియత్వమే అతనికి సరియైనది అని నిర్ధారించరాదు. అప్పుడు అతడు పుట్టిన బ్రాహ్మణ వంశత్వం పూర్తిగా పోతుందా అంటే పోదు. అతనిలో కొంత వరకు బ్రాహ్మణ లక్షణములు మరుగున పడివుండి కొత్త జీవనమైన క్షత్రియ విధానములోని లక్షణాలలో కొన్ని స్వీకరించినంత మాత్రమున అతనికి ప్రకృతి సిద్ధంగా అనగా సహజ సిద్ధంగా లభించిన బ్రాహ్మణత్వం తొలగిపోదు. అదే విధంగా దేవమునీంద్రుడు, శివమానసపుత్రుడు సహజసిద్ధ బ్రాహ్మణుడు అయిన దేవాంగుడు రంభ శాపం చేత అతను 5000 సంవత్సరాల పరిమితి కాలానికి శూద్రులతో కలసి జీవించుట జరిగినది. అందువలననే రంభ శాపములో శూద్రసముడువు అవుము అని అన్నది. కావున సహజసిద్ధత్వం కలిగిన బ్రాహ్మణత్వం దేవాంగునిలో తొలిగిపోలేదు. తాత్కాలికముగా రాక్షస రాజుల వద్ద బందీగా వుండినాడు. బందీగా తీసుకొనిపోయినారు కాని ఉద్దేశపూర్వకముగా ఇష్టపూర్వకముగా దేవలుడు రాక్షసుల వద్దకు తనంతట తాను వెళ్ళలేదు. కావున ఈ సహజ సిద్ధ బ్రాహ్మణుడు ఒక పరిమిత కాలం వరకు శూద్రులతో వున్నంత మాత్రమున అతనికి శూద్రత్వం ప్రాప్తించదు. కాని జీవన విధానం మారినందువలన శూద్రసముడు అని అంటారు. శూద్రులతో సమానమైన వాడే కాని పూర్తిగా శూద్రత్వం ప్రాప్తించని వాడు అని తెలియుచున్నది. ఇష్టపూర్వకముగా శూద్రుల వద్దకు వెళ్ళి వారితో కలిసిపోయి వారి సాంప్రదాయాలను స్వీకరించి అచ్చం వారిలాగా జీవించినట్లయితే అది జీవితాంతము వారితో వుండటానికి అతనే స్వతహాగా నిర్ణయించుకుంటే అతనికి కొన్నాళ్ళ తరువాత శూద్రత్వం వస్తుంది. ఎందువలనంటే ఇష్టపూర్తిగా మనసా వాచా కర్మణా అను త్రికరణశుద్ధిగా ఆచరిస్తున్నాడు కాబట్టి అటువంటి వారికి శూద్రత్వం లభిస్తుంది. ఇటువంటి

వారిని శూద్రులు అని అనాలే గాని శూద్రసముడు అని అనరాదు. కాని ఇచ్చట దేవలుడు ఇష్టపూర్వకముగా వారి వద్దకు వెళ్ళలేదు. మనస్ఫూర్తిగా వారితో కలిసి జీవించలేదు. బలవంతంగా బెదిరించి అదిరించి బంధించి తీసుకుపోయినారు. వారి జీవన విధానమును ఆయన జీవిత పర్యంతం ఆచరించలేదు. త్రికరణ శుద్ధిగా వాటిని పాటించలేదు. తప్పనిసరి పరిస్థితులలో విధిలేని పరిస్థితులలో మనసుకు వ్యతిరేకమైన పరిస్థితులలో కాబట్టి ఉదాసీనంగా వుంటూ వారితో కలిసి జీవించుచున్నాడు. కాని వారితో శారీరక సంబంధములు ఏర్పరచుకొనలేదు. కాని దేవలుడు వజ్రదంష్ట్ర రాక్షస రాజు కుమార్తె పద్మినిని వివాహమాడినాడు కదా. ఆమె ద్వారా ముగ్గురు పుత్రులు కూడా కలిగినారు కదా. కావున రాక్షస జాతి స్త్రీతో క్రీడించినందున దేవలుని రక్తము పవిత్రత పరిశుద్ధత్వం కోల్పోయినది కదా అని సందేహము కలుగవచ్చు కొందరికి. కాని నిశితముగా పరిశీలించినచో దేవలునికి రాక్షసరాజు వజ్రదంష్ట్రుడు కన్యాదానం చేయలేదు. రాక్షసరాజు కన్యాదానం చేస్తే పద్మినీ అప్పుడు రాక్షసజాతి స్త్రీ అవుతుంది. కాబట్టి ఆమెతో రతిక్రీడలు జరిపినందు వలన దేవలుని రక్తం మలినమైనదని పవిత్రత కోల్పోయినదని భావించుటలో అర్థము కొంతవరకు వున్నది. కాని ఇచ్చట దేవలునికి పద్మినీ అను కన్యను సాక్షాత్తు పరమ పావనుడు పవిత్రుడు అయిన అగ్నిదేవుడు దానం చేసినాడు. అగ్నిదేవుడు రాక్షసరాజు కూతురు పద్మినిని తాకినాడు. అమృతస్వరూపుడైన అగ్నిదేవుని స్పర్శచేత ఆమె పునీతమైనది. ఒక గ్లాసు నిండా అమృతముంటే దానిలో ఒక చుక్క విషం కలిపితే ఆ గ్లాసు నిండా వున్న అమృతం విషంగా మారుతుంది లేదా కలుషితం అవుతుంది అని అంటారు. అంటే ఒక పవిత్ర కార్యాన్ని చెరపటానికి ఒక చిన్న తప్పు జరిగినా సరే మిక్కిలి సూక్ష్మవిషయమైనా సరే ఆ పవిత్రకార్యం పవిత్రంగా ముగియదు. ఇది చెడగొట్టడానికి చేయు విషయములో చెప్పిన సామెత. ఒక గ్లాసులో ఒక పావు వంతు విషం వున్న దాంట్లో ముప్పావు వంతు అమృతం పోసినాము. అప్పుడు అధికమొత్తములో వున్న అమృతము విషమును నిర్వీర్యం చేయుచున్నది. అనగా ఒక వ్యవస్థను బాగు చేయుటలో దిద్దుబాటు చర్యగా దీనిని గమనించినట్లయితే **సత్సాంగత్యము వలన మనుషులలో వున్న చెడుభావాలు మంచి భావాలుగా మారుతాయి**. అది



సత్సాంగత్య ప్రభావము. అందువలననే లోకములో జనులు, స్వామీజీలు, పీఠాధిపతులు, గురువులు మొదలగు పెద్దల సన్నిధిలో వుండుట వలన వారితో సంభాషించుట వలన వారితో కలసి వుండుట వలన మహనీయమైన విషయాలు వారు తెలుసుకొనుట ద్వారా తమ వ్యక్తిత్వములో వున్న లోపాలను తెలుసుకొని వాటికి దూరమయ్యెదరు. ఇది దిద్దుబాటు విషయములో చెప్పబడే విషయం. అట్లాగే రాక్షసజాతిలో పుట్టిన కన్య పద్మినీ దేవతలకు హవిస్సును అందించే అగ్నిదేవుడు పరమ పవిత్రుడు. అగ్నిని స్పృశించినచో వస్తువులలో వున్న మలినత్వము పోయినట్లు పద్మినిలోకూడా మలినత్వముపోయినది. అందువలన ఆమె పవిత్రమయినది. కాబట్టి సాక్షాత్ అగ్ని దేవునిచే స్పర్శించబడి అతని చేతనే ఇవ్వబడ్డ కన్య కాబట్టి, అగ్నిచే ఇవ్వబడ్డ కన్య కాబట్టి అగ్నిదత్త అను కొత్త పేరును గ్రహించి తన పాత పేరును త్యజించినది కాబట్టి ఇది వరకు జీవించి వున్న విధానాలను పరిత్యజించి నూతన విధానాలను అనుసరిస్తున్నది కావున ఆమె రక్తం పవిత్రమైనది. పరిశుద్ధమైనది. అందువలన దేవలుడు ఆమెతో రతిక్రీడలు జరిపి సంతానము కనినను తన పవిత్రత పోగొట్టుకోలేదు. ఇంకా అగ్నిదత్తను పవిత్రీకరించినాడు. అనగా ఇతనిలో వున్న పవిత్రత వల్ల ఆ పవిత్రత ఆమె గ్రహించి ఆమె కూడా పవిత్రురాలు అయినది.

## దేవలుడు బ్రాహ్మణశ్రేష్టుడుగా అవతరించుట

ఈ విధముగా 5000 సంవత్సరాలు గడిచిన పిదప నీవు బ్రాహ్మణ పండితులలో శ్రేష్ఠుడిగా జన్మించెదవు అని రంభ దేవలునితో అన్నది. కాబట్టి దేవలుడు ఇప్పుడు బ్రాహ్మణశ్రేష్ఠ పండితులకే శ్రేష్ఠుడిగా జన్మించవలసి వున్నది. అదే దేవాంగుని వరరుచి అవతారంగా కీర్తి పొందినది. అనేక రత్నములతోను మందార వృక్షములచేతను, చక్కగా పూచిన వృక్షములతోను పారిజాత వృక్షములతోను, కల్పవృక్షములచేతను దివ్యమైన గొప్పగొప్ప పండ్లుగల హరిచందన వృక్షములచేతను వ్యాపింపబడి ఇతరముల చెట్లతోకూడా కూడినటువంటి విరాజిల్లునదియును, నారదుడు, అగస్త్యుడు, వాల్మీకి, పరాశరుడు వీరిచే సేవింపబడుచున్నవాడును, దివ్యమైన నగారాల ధ్వనులతో మారుమ్రోగుచున్నట్టి కైలాసమున సాంబశివుడు పార్వతితో కలసి సుఖాసీనుడై యున్నాడు. ఆ సమావేశములో ద్వాదశ ఆదిత్యులు, ఏకాదశ రుద్రులు,

బ్రహ్మర్షులు, దేవర్షులు మొదలగువారితో పరివేష్ఠింపబడి వున్నాడు. ఆ సమయములో త్రిలోక సంచారి అయిన నారదుడు భూలోక సంచారము చేసి కైలాసమునకు వచ్చినాడు. అప్పుడు సాంబశివుడు నారదా! లోకములో వున్న విశేషములుఏమిటి అని తెలుసుకోదలచి అడిగినాడు. దానికి నారదుడు స్వామీ! నేను చెప్పేదాన్ని ఆలకించండి అని తన భూలోక పర్యటనలో తాను గ్రహించిన వాటిని ఆ సదస్సులో చెప్పుచుండెను.

## నారదుడు భూలోకములోని విషయాలు చెప్పుట

ఓ ఆనంద స్వరూపుడవైన స్వామీ! ఇప్పుడు కలికాలము ముదురు చున్నది. భూమియందు జరుగుచున్న విషయములను చెప్పెదను అని మొదలుపెట్టినాడు. ఇప్పుడు భూమియంతటా అపశబ్దములు మాట్లాడువారు ఎక్కువ అయినారు. శాస్త్రయుతంగా అధ్యయనము చేసిన వ్యాకరణ పండితుడు లేడు. వ్యాకరణ శాస్త్ర స్వభావమును అర్థం చేసుకొనిన వారును లేరు. సాంగోపాంగముగ వేదమును వేదార్థమును తెలిసిన వారు లేరైరి. వేదమును స్వచ్ఛమైన స్వరముతో శబ్ద సౌష్టవముతో ఉచ్చరించువారు కరువు అయినారు. అందువలన ఇప్పుడు భూలోకములో వున్న వేద విద్య అపభ్రంశమైనది.శుద్ధ మైన స్వరముతో ఉచ్చరించువారు లేకుండా వున్నది. సర్వ కర్మముల విధులను తెలియజేయునటువంటివి అయిన ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణ వేదములలోని పద విభాగ క్రమము, జటలను, ఘనములను చెప్పువారులేనేలేరు. వేదములయందును, శాస్త్రములయందును, పురాణములయందును, శైవాగమములయందును వైష్ణవాగమములందును సుశబ్దములులేవు అవి అపభ్రంశములతో వ్యాకరణ దోషములతో నిండివున్నవి. వేదాంగములు అయిన తర్కమీమాంస న్యాయ, వైశేషిక బాట్ట ప్రభాకర అను ఆరు శాస్త్రములను, ఇతిహాసములును తెలిసినవాడు భూమియందు లేడు. బ్రాహ్మణులందరు పురాణఅర్థములు తెలిసి తెలియక వున్నారు. భూమియందు భోజరాజు తప్ప మరి ఎవ్వడును పండితుడు లేడు. ఈ ప్రకారముగ నారదముని సాంబశివుని ఎదుట చెప్పుచున్నప్పుడు అక్కడవున్న ఋషులందరు విని హాహా అని విస్మయము చెందినారు. అప్పుడు చంద్రున్ని తలపై ధరించిన ఆభగవంతుడైన ఈశ్వరుడు దీనినంతయు విని ఆ సభయందు వున్న మానసపుత్రుడైన దేవాంగుని వైపు చూచినాడు.



## దేవాంగుడు వరరుచిగా అవతరించుట

అప్పుడు దేవాంగుడు ఈశ్వరుని సన్నిధికి వచ్చినాడు. ఈశ్వరుడు దేవాంగునితో ఓయీ సమస్తము తెలిసిన దేవాంగుడా వేదశాస్త్రములను చక్కగా తెలిసినవాడా నీవు నా ఫాల (జ్ఞాన) నేత్రమునుండి ఆవిర్భవించినావు. కనుక నాయంత జ్ఞానము కలవాడవు అయినావు నీవు.. అరవైనాలుగు కళల విజ్ఞానం తెలిసినవాడవు నీవే నీవుతప్ప మరెవ్వరు చతుషష్టి కళలను గురించి తెలిసినవారుండరు. ఇందుకు ఎటువంటి సందేహము లేదు. ఓయీ మిక్కిలి బుద్ధిమంతుడా ఇప్పుడు నారదుడు చెప్పిన సమాచార మంతయు వింటివిగదా. కావున శీఘ్రముగా నీవు భూలోకమునకు వెళ్ళి అచ్చటవున్న వ్యాకరణ శాస్త్రాలను, ఆగమ శాస్త్రాలను వేదాంగముల యందును వున్న అపశబ్దములను సవరించి సుశబ్దములుగా చేసి తిరిగి వ్రాయుము వేదాలకు సరియైన స్వరమును కూర్చుము. అక్కడవున్న బ్రాహ్మణు లందరిచేతను వేదములు చదివించుము. శాస్త్రములను అధ్యయనము జరిపించుము. వారినందరిని పండితులుగా తయారుచేయుము. నీవు భూలోకమునందు వ్యాకరణములను, సకలశాస్త్ర ములను పద, జట విభాగములతోకూడిన నాలుగు వేదములను బ్రాహ్మణులకు నేర్పింపుము. ఈ ప్రకారముగ శివునిచే అజ్ఞాపింపబడిన పురుష శ్రేష్టుడైన దేవాంగుడు భక్తుల పాలిటి కల్పవృక్షమైన సాంబశివుడిని వేడుకున్నాడు. భూమియందు మనుష్య రూపమును ధరించి నేను ఎక్కడ వున్నను నాకు నీపాదములయందు భక్తి స్థిరముగా వుండునట్లు అనుగ్రహింపుము అని కోరగా చిరునవ్వుతో సాంబశివుడు బాగుబాగు అని అన్నాడు. అప్పుడు దేవాంగుడు కైలాసము నుండి విమానము మీద వచ్చి భూలోకమున దిగినాడు. పిమ్మట బ్రాహ్మణ రూపమును ధరించి నాడు. బ్రహ్మవర్చస్సుతో సూర్యునివలె ప్రకాశించుచున్నాడు. మంచి శ్రేష్టములైన వస్త్రములను ధరించినాడు. శ్రేష్టమైన ఆభరణములు ధరించినాడు. నొసటియందు విభూతితో మూడు రేఖలు దిద్దినాడు. చెవులకు ధరించిన కుండలములు వజ్ర వైఢూర్యములతో చేయబడినవి. మొలను బంగారు మొలత్రాడు ధరించినాడు. సమస్త అవయవములు సొగసుగా వుండులాగున నానావిదాభరణ భూషణములను ధరించినాడు. బంగారు జందెమును ధరించినాడు. చేతులయందు కడియములు

ధరించినాడు. భుజకీర్తులను ధరించి నిరంతరము శివ పంచాక్షరీ మంత్రమును స్మరించుచూ వుండెను. అప్పుడు ఈ వేషధారణలో ధారానగరము నందలి భోజరాజు ఆస్థానమునకు వెళ్ళి ఆరాజుచేత సత్కరింపబడి ఆస్థానపండితుడుగా నియమింప బడినాడు.

## బ్రాహ్మణ పండితులు చేయు దోషములను సరిచేయుట

ఆ భోజరాజు ఆస్థానములోని బ్రాహ్మణ పండితులతో వారితో ఇష్టాగోష్టులు జరిపి వారుచేయుచున్న దోషములను వారికి తెలియజేసినాడు. ఆపట్టణము నందలి బ్రాహ్మణులకు సుస్వర శబ్దసౌష్టవ రూపమైన వేదమును బోధించినాడు. వారిచేత అభ్యాసము చేయించినాడు. వేదవేదాంగములను ఆ రాజ్యమందలి బ్రాహ్మణులకు నేర్పి వారిని పండితులుగా తీర్చిదిద్దినాడు. అప్పుడు అక్కడవున్న వ్యాకరణ శాస్త్రములు, ఆగమశాస్త్రములు, వేదాంతశాస్త్రములు, ధర్మశాస్త్రములు, వేదవేదాంగమందలి అపభ్రంశ శబ్దములను దిద్ది శుభప్రదముగా మార్చినాడు. ఆవిధముగా భూలోకములో వ్యాప్తి చెందివున్న అపశబ్దములను సుశబ్దములుగా చేసి సకల శాస్త్రముల దోషములను సరిచేసినాడు. ఇప్పుడు అన్ని శాస్త్రములు సుశబ్దములుగా ఏర్పరచినాడు. ఆనాడు పండితులతో పాటు సామాన్య ప్రజలకు కూడా నిత్యవ్యవహారిక భాషగా దేవభాష (సంస్కృత) వుండెడిది. ప్రజలు ఈ భాషలో సంభాషించితేనే దేవతలు మనభావములను తెలుసుకో గలుగుతారు. దేవాలయములలో అర్చనాదులకు దేవతలకు తెలిసిన భాషలోనే మంత్రాలు వుండి ఉచ్చరించుటచేత దేవతలు మనము చేసే ఉపచార పూజలను గ్రహించుతారు. యజ్ఞయాగాదులు చేయుటవలన దేవతలకు హవిష్యాన్నము అందుతుంది. వర్షములు సక్రమంగా సకాలంలో కురిసి పంటలు బాగుగా పండును. కాని కలిమాయవలన గాని లేక ఏకారణము వలనగాని ఈ దేవభాషయందు అపశబ్దములు ప్రవేశించినవి. వ్యాకరణ శాస్త్రస్వభావము గ్రహించుటలో విఫలులైన వారు బోధించుట వలన వ్యాకరణ శాస్త్రం తారుమారుగా మారినది. దేవతలు మాట్లాడుకునే భాషలోనే కదా మనవేదాంగాలు శాస్త్రములు రచింపబడినవి. ఆ దేవభాష వ్యాకరణ దోషములతో భూలోకమున వ్యాపింపబడుట వలన, శబ్దసౌష్టవము లోపించుట



వలనను, స్ఫుటముగా పలుకలేనప్పుడు శబ్దములకు వున్న అర్థము మారిపోవుచున్నది. భూలోకములో జరిగే యజ్ఞయాగాదులలోను, దేవాలయ అర్చనలలోను వ్యాకరణ దూషితమైన పదములతో కూడిన మంత్రములు దేవతలకు అర్థంకాక మన భావన తెలుసుకొనుటలో విఫలులు అవుచున్నారు. అదేవిధముగా దేవతల సందేశములను సరియైన రీతిలో అర్థం చేసుకోవటంలో విఫలమౌచున్నాము. అనగా దేవతలచే మాట్లాటబడు భాష అయిన దేవభాష భూలోకములోఅపభ్రంశములతోకూడి వుండుట వలన భావ వ్యక్తీకరణలో ఆటంకమేర్పడినది. మనుషులప్రార్థనలు దేవుళ్ళకు అర్థంకావుట లేదు. దేవుళ్ళ శాసనములు మానవులు అర్థం చేసుకోవడంలో విఫలమైనారు. ఈ దేవభాష భూలోకములోని మనుష్యులు అపభ్రంశంగా మార్చినారు.

## సంస్కృత భాషా పితామహుడిగా వరరుచి

దేవలోకములో దేవతలు మాట్లాడేభాష సుశబ్దములతోకూడి అర్థవంతముగానే వున్నది. కాని భాషను సంస్కరించవలసినదల్లా భూలోకములో వాడబడే దేవభాషను దేవతలు మాట్లాడే భాష అయిన దేవభాష ప్రమాణముగా గ్రహించి భూలోకములోకూడ దేవలోకంలో వుండే దేవభాషలాగానే సుశబ్దములతో వ్యాకరణ దోషములు లేకుండా వుండాలి. అప్పుడు మాత్రమే మన మొరను దేవతలు వినగలరు. దేవతల సందేశములు మానవులకు బోధపడును. భూలోకములో చెడిపోయివున్న దేవభాషలో వున్న దోషములను సవరించవలసియున్నది అనగా బాగుపరచవలసి వున్నది. సంస్కరణ అనగా బాగుచేయుట. బాగు చేయుట అనగా ఏదైన చెడిపోతేనే గదా బాగు చేసేది. కాబట్టి భూలోకములో చోటు చేసుకున్న అపశబ్ధములు, అపస్వరములను, వ్యాకరణ దోషములను, సంస్కరించి అనగా మంచిగా చేసి అనగా స్వచ్ఛమైన భాష ఇది వరకు ఎలావున్నదో అలా వుండే విధముగా చేయుటను సంస్కరణ అంటారు. దేవలోకములో దేవతలు మాట్లాడే భాషకు భూలోకములో మనుష్యులు మాట్లాడే దేవభాషకు సారూప్యత వుండే విధంగా చేయుటనే సంస్కరణ అందురు. కాబట్టి భూలోకములో వుండే లోపభూయిష్టమైన దేవభాష సంస్కరింపబడి దేవతలు మాట్లాడే దేవభాషతో సరిసమానంగా చేసినాడు వరరుచి.. అందువలన సంస్కరణ చేయబడిన భాషను దేవభాషను సంస్కృత భాషగా

వ్యవహరించినారు. ఈ సంస్కృత భాష దేవభాషకు అనుగుణంగా సుశబ్దములు వ్యాకరణ అంశాలతో కూడి వున్నది. అందువలన భూలోకములో అప్పటి వరకు వాడుకలో వున్న దేవభాషను సంస్కరించుటచేతను సంస్కృత భాషగా వ్యవహరింపబడినది. ఈ భాషను సంస్కరించినది దేవలుని అవతారముగా వచ్చిన వరరుచి అందువలన వరరుచిని దేవభాషా సాహిత్య పరిరక్షకుడు, సంస్కృత భాషా పితామహుడుగా పిలువవచ్చును. ఈ భాషద్వారా తిరిగి దేవతలకు మానవులకు అనుసంధానము ఏర్పడినది. ఈవిధముగా శివునిచే ఆజ్ఞాపింపబడిన కార్యమును పూర్తి చేసుకొని కైలాసములోనికి వరరుచియైన దేవాంగుడు పార్వతీ పరమేశ్వరులను దర్శించినాడు.

ఇచ్చట రంభ శూద్రసముడవై అయిదు వేల సంవత్యరముల అనంతరము బ్రాహ్మణ పండిత శ్రేష్టుడివి అవుతావు ఇందు సందేహము లేదు.

శ్లో ॥ పంచవర్ష సహస్రాణి శూద్రత్వం సమవాప్యసి ।
తతః పరం బ్రహ్మవరో భవిష్యసి న సంశయః ॥

కావున దేవాంగుడు వరరుచిగా బ్రాహ్మణ పండితులలో సర్వశ్రేష్టుడిగా అవతరించినాడు. వేదవిధులను వేద విద్యను బోధించినాడు. వ్యాకరణ శాస్త్రమును, సకల శాస్త్రములను సుశబ్దములుగా వుండు విధంగా దిద్దినాడు. దేవభాషయే పండితుల భాష, పండితుల భాషయే దేవభాషగా తీర్చి దిద్దినాడు. వేదములకు మూలమైనఅసలైన దేవభాషను భూలోకములో వ్యాపింపజేయుటవలన భూలోకమందు వేదవిద్యలను పరిరక్షించిన వాడుగా పరిగణించ వచ్చును. కావున ఈనాటికి పండితులలో వున్న దేవభాష వరరుచిచే సంస్కరింపబడిన భాష యని గుర్తుంచుకోవాలి. అందువలన సంస్కృత భాషకు పితామహుడుగా వరరుచిని పిలువ వచ్చును. లేకపోతే సంస్కృత భాషా బ్రహ్మగా కీర్తించ వచ్చును. కాబట్టి రంభ చెప్పిన ప్రకారము బ్రాహ్మణ వరః అనగా శ్రేష్టతముడు అయిన బ్రాహ్మణ పండితుడుగా నీరాజనములు అందుకొనినాడు దేవలుడు.

ఈ దేవాంగ చరిత్ర బ్రహ్మదేవుడి స్వరూపమైన బ్రహ్మాండ పురాణములోని బ్రహ్మ నారద సంవాదము ఉత్తర ఖండము నందు చెప్పబడినది. 29 అధ్యాయములతో కూడియున్నది. 1913 వ సంవత్సరములో మహామహా



విద్వత్ సంపన్నుడు, వేదవిద్యావిధుడు అయినబ్రాహ్మణ శ్రేష్టుడు శ్రీ పురాణం సూర్యనారాయణతీర్థులవారు సంస్కృత భాషలో వున్న బ్రహ్మాండ పురాణములోని ఈ దేవాంగ చరిత్రను అనువాదం చేసినాడు. దానినివాణీ విద్యా నిలయము ప్రెస్సు వారు ముద్రించినారు. దానిని ప్రచురించినది (పబ్లిషర్స్) ది మద్రాస్ ప్రింటింగ్ హౌస్, పోస్టుబాక్సు నంబరు 195, మద్రాసువారు పబ్లిషర్స్ 1913లో చేసినారు. దేవాంగ వంశోద్ధారక సమాజము మద్రాసు వారు ఆ బాధ్యతలు చేపట్టినారు. ఈ దేవాంగ వంశోద్ధారక సమాజము, మద్రాసు వారు అప్పట్లో మద్రాసు నగరమునందు పేరగాంచియున్న శ్రీపురాణంసూర్యనారాయణ తీర్థులవారిని కలసి సంస్కృతభాషలో శ్లోక యుక్తముగాయున్న దేవాంగ చరిత్ర కలిగియున్న బ్రహ్మాండ పురాణమును ఆయనకు ఇచ్చి, అనువాదము చేసి పెట్టమన్నారు. ఆ మహానుభావుడు తగిన రీతిగా అనువాదము చేసినాడు. బ్రాహ్మణులకు యజ్ఞోపవీతము యిచ్చినాడు. వరరుచి భూలోకములో వున్న బ్రాహ్మణులకు వేద విద్యలను స్వరసహితముగా నేర్పించినాడు. తప్పులతడకలతో వున్న శాస్త్రములను సరిదిద్దినాడు. ఇటువంటి విషయములు అనేకములు ఈ చరిత్ర యందున్నవి. దీనిని తెలుగులోకి అనువాదం చేసేటప్పుడు ఇంతటి విశిష్టమైన దేవాంగులను చరిత్ర సహజసిద్ధ బ్రాహ్మణులు అని చెప్పినది. దేవతలకు, బ్రాహ్మణులకు యజ్ఞోపవీతము ఇవ్వబడినదని దీనిలో చెప్పబడినందున ఇది నా బ్రాహ్మణ జాతికి మించిన ఔన్నత్యము కలిగిన చరిత్ర అయినందున, సమకాలీన బ్రాహ్మణులకు జవాబుదారీ అవుతాడు కాబట్టి సంస్కృత భాషలో వున్న మూలమైన బ్రహ్మాండపురాణంలోని దేవాంగ చరిత్రకు సంబంధించిన శ్లోకములు దేవాంగ వంశోద్ధారక సమాజం వారు తెచ్చి ఇచ్చిన దేవాంగ చరిత్ర అను వ్రాతలిపి పుస్తకములయందున్న శ్లోకములను సరిపోల్చికొనియే వుంటాడు. శ్రీ పురాణం సూర్యనారాయణ తీర్థులవారు. సమకాలీన సమాజంలో తమ బ్రాహ్మణ కులస్తులు ఆక్షేపణ చేస్తే వారికి జవాబు చెప్పటానికి తన వద్ద వున్న వంశపారంపర్యంగా తమ కుటుంబనందుండిన బ్రహ్మాండపురాణములోని దేవాంగ చరిత్రకు సంబంధించిన విషయమును చూపించటానికి సిద్ధంగానే వుండి వుంటాడు. తగిన ఆధారాలు, ప్రమాణాలు లేకుండా ఈ గ్రంథమును అనువాదం చేయడు. అనువాదం చేసేనాటికి అంటే అతనికి సంతృప్తికరమైన ప్రమాణములు అనగా మూల బ్రహ్మాండపురాణములో

వుండి వుంటేనే చేసేది. ఆ నాటి దేవాంగ వంశోద్ధారక సమాజం వారు కాగితములపై వ్రాయబడి వున్న గ్రంథమును కాని, తాళపత్రములయందున్నది సేకరించి తగిన ఆధారాలు చూపించి వుండవచ్చు. అతను కూడా తన వద్దనున్న పురాణమునకు ఇది సరిపోయినదా లేదా అని పరిశీలించి వుండవచ్చును. ఈ దేవాంగ చరిత్రకు తగిన ఆధారాలు అప్పటి కాలంలో లభించకుండా వుంటే ఈ పుస్తకాన్ని ఖండిస్తూ రచనలు చేసేవారు. మరి అటువంటిది జరుగలేదు అంటే శ్రీ పురాణం సూర్యనారాయణులు తెలుగులో అనువాదం చేసిన గ్రంథానికి ఇటు ఆంధ్రప్రదేశ్ లో కాని తమిళనాడులో కాని పండితులందరూ ఆమోదం లేదా మౌన అంగీకారం తెలిపినట్లవుతుంది. శ్రీ పురాణం సూర్యనారాయణ తీర్థులవారు తెలుగు అనువాదం చేసిన పుస్తకం 1913లో ప్రచురణ జరిగితే 1914వ సంవత్సరంలో మద్రాసులోని శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షర శాలాధికారి త్యాగరాయ శెట్టిగారు సంస్కృత శ్లోకాలతో వున్నటువంటిదాన్ని, దానికి తెలుగు తాత్పర్యంతో కూడినది అయిన శ్రీ దేవాంగ పురాణమును ప్రచురించినారు. ఈ గ్రంథకర్త శ్రీ గోమేధికం ఓం శ్రీ శంకర స్వామివారు సంతపేట, నెల్లూరు జిల్లా వారు. శ్రీ గోమేధికం వారు మూలబ్రహ్మాండ పురాణమును సేకరించి అందులో వున్న దేవాంగ పురాణ సంబంధిత శ్లోకాలను సేకరించి వాటికి తాత్పర్యం వ్రాసినారు. మూలదేవాంగ పురాణం సంస్కృతంలో వున్నది. ప్రచారంలో వుంటే ఎవరైననూ తమ వద్ద నున్న బ్రహ్మాండ పురాణంలో ఈ దేవాంగ చరిత్ర వున్నది లేనిది తెలుసుకుంటారు అని ఆలోచించి దీనిని 1914లో ప్రచురించినారు. దీనిని పరిశీలించియే వుంటారు. తరువాత 1925లో వేదోక్త మూలస్తంభనము అను గ్రంథమును శ్రీ బొగ్గర ఆదినారాయణగారు ప్రచురించినారు. దానిలో వివిధ వేదాలు, వేదాంగాలు, ధర్మశాస్త్రములు, ఆగమశాస్త్రములు, ఉపనిషత్తులు మొదలగు వాటిలో వున్న దేవాంగ సంబంధిత చరిత్రను క్రోడీకరింపబడివున్న గ్రంథమును ప్రచురించినారు. 2014వ సంవత్సరంలో గుంటూరు నివాసి అయిన ఒక సద్బ్రాహ్మణుడు నా వద్ద వున్న ధర్మశాస్త్ర గ్రంథములను గురించి తెలుసుకొనుట కొరకు స్వయముగా నా గృహమునకు వచ్చినాడు. మాటల సందర్భంలో వారి ఇంటిలో వేదోక్త మూలస్తంభనము అనే గ్రంథము యున్నది అని తెలిపినాడు. కావున దేవాంగ పురాణం అనేది సంస్కృత భాషలోని వ్రాత ప్రతులయందును,



తాళపత్రములయందును వున్న బ్రహ్మాండపురాణములోనిది అని స్పష్టమగుచున్నది. కావున శివునిచే ఆజ్ఞాపించబడి పంపబడిన దేవాంగుడు వరరుచి అవతారం ప్రకారం బ్రాహ్మణ పండిత శ్రేష్ఠుడిగా ఘనకీర్తి వహించినాడు. సహజసిద్ధ అనగా పుట్టుకతోనే బ్రాహ్మణత్వం సిద్ధించే అప్రాకృత బ్రాహ్మణులు అయిన దేవాంగ వంశస్థులకు ఆదిపురుషుడు బ్రాహ్మణులకు వేదవిద్యలు నేర్పడానికి శివుడి చేత నియమింపబడినాడు. తనకు ఇవ్వబడిన కర్తవ్యమును నిర్వహించి దేవాంగుడు తిరిగి కైలాసమునుకు వెళ్ళినాడు. ఈ విధముగా రంభ చెప్పినట్లు బ్రాహ్మణ శ్రేష్ఠుడు అయినాడు వరరుచి. కావున దేవాంగులు బ్రాహ్మణ వంశస్థులు అనియు వేద శాస్త్ర అభ్యాసమునకు బోధనకు అర్హత వున్నవారని స్పష్టపరచబడినది.

ఇట్లు శ్రీ బ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరితమున
ఇరవై ఆరవ అధ్యాయము పరిపూర్ణము

## దేవశాలి అవతారము

### ఇరవై ఏడవ అధ్యాయము

ఆమోదపట్టణమునకు ప్రభువుగా వుండి పరిపాలించుచున్నాడు దివ్యాంగుడు. ఈతడు దేవలుని జ్యేష్ఠ కుమారుడు. అమితమైన తేజస్సు కలవాడు. ఈ దివ్యాంగునికి నంది అను కుమారుడు కలిగినాడు. నందికి నీలకంఠుడు అను కుమారుడు జన్మించినాడు. నీలకంఠునకు ఒక కుమారుడు వుండినాడు. అతడు సత్యవంతుడు. పరాక్రమవంతుడు. అతని పేరు శంభుదేవుడు. శంభుదేవునికి హేమాంగుడు అను కొడుకు కలడు. హేమాంగునకు ఒక కుమారుడు కలడు. ఆతని పేరు చంద్రాంగుడు. ఈ చంద్రాంగునికి ఒక కుమారుడు కలిగినాడు. ఆతని పేరు భద్రబాహువు. భద్రబాహువుకు వీరభద్రుడు అను కుమారుడు కలడు. వీరభద్రునికి ఒక కుమారుడు కలడు. అతని పేరు విందుడు. అయితే వీరభద్రునికి శూలపాణి, అరిందముడు అని ఇరువురు కుమారులు కలరు. అనగా వీరభద్రునికి మొత్తం ముగ్గురు కుమారులు. విందుడు, శూలపాణి, అరిందముడు అను వారు

కలరు. అరిందముడు జ్యేష్ఠుడైనప్పటికినీ అతనికి సంతానం లేకపోవుట వలన ద్వితీయ కుమారుడు శూలపాణికి ప్రసిద్ధి గల కుమారుడు ఉదయించినాడు. అతని పేరు జయసేనుడు. ఈ జయసేనుడికి చిత్రసేనుడు అను కుమారుడు కలడు. చిత్రసేనుడికి సువిక్రముడు అను కొడుకు జన్మించినాడు. సువిక్రమునికి గంగాధరుడు అను కుమారుడు జన్మించినాడు. ఈ గంగాధరునికి మరి ఒక పేరు వున్నది. అది విద్యావిలాసుడు అని పేరు. ఈ విద్యావిలాసుని భార్యపేరు విద్యావాణి. ఈ విద్యావిలాసుడు విద్యావాణి దంపతులకు చాలాకాలం వరకు సంతానం కలుగలేదు. పైన వివరించిన వంశవృక్షము నందు ఒకరికి ఒక పుత్రుడు వున్నట్లుగా చెప్పబడినది. కాని వారికి అనేక మంది పుత్రులు వున్ననూ జ్యేష్ఠపుత్రునికే వారసత్వం వున్నది కావున పైన తెలిపిన వారందరూ వారి తండ్రులకు ప్రథమ కుమారులని గ్రహించవలయును. అంతేగాని వారందరికీ ఒక్కొక్క పుత్రుడు మాత్రమే జన్మించినట్లుగా భావించవలదు. ఈ విద్యావిలాసుడు, విద్యావాణి దంపతులు సంతానం కొరకు ఎంతో కాలము నుండి ఎదురుచూచుచున్నారు. పుత్రుడు పున్నామనరకం నుండి కాపాడుతాడని, పుత్రులు లేని సంపద ఎంత వున్ననూ నిష్ప్రయోజనమని వారు మాటలాడుకొనుచుండగా ఆకాశము నుండి అశరీరవాణి ఒక మాట పలికినది. మీకు త్వరలో పుత్రసంతతి కలుగుతుంది అని ఆకాశమునుండి వినబడిన ఆ మాటకు విద్యావిలాసుడు విద్యావాణులకు కలిగిన ఆశ్చర్యమునకు అవధులే లేకుండినవి. ఎన్నో ఏళ్ళ నుండి ఎదురుచూచుచున్న వారికి ఆ మాట వినగానే పరమానందభరితులైనారు. అప్పుడు గంగాధరుడు అయిన విద్యావిలాసుడు తన భార్య విద్యావాణితో దైవం మాట తప్పదు. కాబట్టి మనము సంతోషముగా వుండెదము. పుత్రసంతానం కలుగుతుంది కావున మన జీవితేచ్ఛ నెరవేరబోతుంది అని ముచ్చట పడినారు.

## విద్యావిలాసుడు తీర్థయాత్రలకు వెళ్ళుట

అప్పుడు విద్యావిలాసుడు తన భార్య విద్యావాణితో ప్రియా! మనకు సంతానం కలుగుతుందని ఆకాశవాణి చెప్పినది కావున దేవతల ఆశీర్వాదములు తీసుకోవాలి. ఉత్తమ పుత్రుడు పుట్టు విధంగా దేవతలను ప్రార్థించాలి. అందువలన నేను తీర్థయాత్రలు చేసి ఆ ప్రసిద్ధ పుణ్యక్షేత్రములలో వుండే



దేవతలను పూజించి వస్తాను నాకు అనుమతి ఇవ్వుము అని భార్యతో చెప్పినాడు. భార్యను ఊరడించి ఆమె అనుజ్ఞతో బయలుదేరినాడువిద్యావిలాసుడు. తీర్థయాత్రలు చేయటానికి అవసరమైన దాసీజనం, వాహనం, సంపదతో మొదటగా గంగానది ఒడ్డున వెలసిన పవిత్ర కాశీ క్షేత్రమునకు వెళ్ళినాడు. అచట వున్న మణికర్ణిక స్నానఘట్టము వద్ద స్నానము చేసి కాశీ విశ్వేశ్వరున్ని పూజించినాడు. అచట నుండి గయ కు వెళ్ళి పితృదేవతలకు పిండ ప్రదానములు చేసినాడు. అక్కడనుండి బదరికారణ్యమునకు వెళ్ళి అచ్చట వేంచేసియున్న నారాయణుని దర్శించినాడు. అక్కడనుండి పశుపతీశ్వరుని క్షేత్రమునకు వెళ్ళినాడు. అచట వున్న గొప్ప దేవుడైన పశుపతీశ్వరుని పూజించినాడు. అచ్చట నుండి జ్వాలాముఖికి వెళ్ళి జ్వాలారూపుడైన దేవుడిని పూజించినాడు విద్యావిలాసుడు. అక్కడ నుండి విద్యావిలాసుడు మంగళకరమైనటువంటి శ్రీశైల పుణ్యక్షేత్రమునకు వెళ్ళినాడు. అక్కడవున్న భ్రమరాంబ మల్లికార్జునులను దివ్యంగా పూజించినాడు. అచ్చటనుండి వేంకటాద్రి (తిరుపతి) కి వెళ్ళి శ్రీనివాసుని అర్చించినాడు. అక్కడనుండి కాంచీక్షేత్రములో వెలసివున్న కామాక్షీ కామేశ్వరులను కొలిచినాడు. మహాలక్ష్మీతో కూడిన వరదరాజ స్వామిని పూజించినాడు. అచ్చటనుండి చిదంబరమునకు వెళ్ళినాడు. భక్తుల కష్టములను బాపునట్టి ఆకాశరూపుడైన స్వామి వారిని యధావిధిగా పూజించినాడు. అచ్చటినుండి అరుణాచలక్షేత్రమునకు వెళ్ళినాడు. సమస్త జనులకు మోక్షమును ఇచ్చునట్టి అక్కడ వున్న సాంబశివున్ని పూజించినాడు. అచ్చటనుండి వైద్యనాథ క్షేత్రమునకు వెళ్ళి మయూరక్షేత్రమునకు, కుంభకోణమునకు వెళ్ళి అక్కడ వున్న స్వాములను దర్శించి పూజించినాడు. సాటిలేని శ్రీరంగక్షేత్రమునకు వెళ్ళి రంగనాయకుని దర్శించినాడు. అచ్చటవున్న ఓంకార రూపమైన విమానమును వేదస్వరూపమైన శిఖరమును చూచి నమస్కరించి స్తోత్రము చేసినాడు. అచటవున్న శ్రీదేవి, భూదేవి, నీలాదేవి ఈ ముగ్గురితో కూడుకొని వున్న నిర్మల స్వరూపుడైన పర వాసుదేవమూర్తి దర్శనము చేసికొనినాడు. కావేరినదికి పూజ చేసినాడు. అచ్చట వున్న పాండ్యరాజు పట్టణము కోట తలుపులను చూడటానికి వెళ్ళినాడు. అక్కడ వున్న మధురా పట్టణము దివ్యములైన మంటపముల చేతను ఒప్పుచుండెడి ఆ పట్టణ ద్వారములు మిక్కిలి సొగసుగా నుండెను. దానికి ఏడు ప్రాకారములు కలవు. అచ్చటవున్న కదంబవనమునకు నాయకుడై

ఆవిర్భవించిన భక్తుల బాధలనెల్ల పోగొట్టెడి వాడైన మీనాక్షిపతి సుందరేశ్వర స్వామిని విద్యుక్త ప్రకారము పూజించినాడు. సమస్త వరములిచ్చేటి ఆ సుందరేశ్వర స్వామిని అనేక స్తోత్రములతో పూజించినాడు. అచ్చట నుండి రామేశ్వరమునకు వెళ్ళెను. అచ్చట వున్న ధనుష్కోటియందు స్నానము చేసి రామలింగేశ్వరుని పర్వతవర్ధినిని యథావిధిగా పూజించినాడు. అక్కడనుండి అనంతశయమునకు వెళ్ళి శ్రీదేవి భూదేవి నీలాదేవి మొదలగు వారితోడ సన్నిధానము చేసిన ఆదిశేషుని పరుపు మీద పరుండి వున్న నాలుగు భుజములు గల పద్మనాభస్వామిని శాస్త్రోక్తంగా పూజించి స్తోత్రము చేసినాడు. అచ్చటనుండి ఆమోదపట్టణమునకు తిరిగి వచ్చినాడు గంగాధరుడైన విద్యావిలాసుడు. అప్పుడు విద్యావాణి తన భర్తను ఆదరంతో సత్కరించి తీర్థయాత్ర విశేషములు తెలుసుకున్నది. ఈ విధముగా విద్యావిలాసుడు హిమాలయ పర్వతము నుండి కన్యాకుమారి వరకు వున్న ప్రసిద్ధ పుణ్యక్షేత్రములన్నియు దర్శించి అందరి దేవుళ్ళ ఆశీస్సులను పొందివున్నాడు పుత్రసంతానము కొరకు. అప్పుడు గంగాధరుని భార్య అయిన విద్యావాణి తన భర్తను పుత్ర సంతతిని ప్రసాదించే కపిలేశ్వరస్వామిని నిత్యము పూజ, జపము, స్తోత్రములు చేయుమని చెప్పినది. అతను ఆ విధముగానే చేయుచుండెను. అప్పుడు ఋతిమతియైన తన భార్య విద్యావాణితో కపిలేశ్వరుని స్మరించుచు ఆమెను కూడినాడు.

## విద్యావిలాసునికి పుత్ర సంతానము కలుగుట

అంతట కపిలేశ్వరుని అనుగ్రహము వలన విద్యావాణి గర్భము ధరించినది. భర్తకు ఆనందము కలిగించినది. శుక్లపక్ష చంద్రుని వలె గర్భస్థ శిశువు వృద్ధి చెందుచూ ప్రసవకాలం రాగానే ఆమె సూర్యునితో సమానమైన వర్ఛస్సు గల తన భర్త రూపురేఖలు గల కుమారుడిని కన్నది. అప్పుడు విద్యావిలాసుడు స్నానము చేసి జాతకర్మ జరిపించి బ్రాహ్మణులను,పురోహితులను సంతోషపెట్టినాడు. పదకొండవ రోజున తన కుమారునికి దేవశాలి అని నామకరణం చేయించినాడు. తన కుమారునకు ఎనిమిదవ ఏట ఉపనయన కర్మ చేయించినాడు. పుత్రుడుకు విద్యాలాభం కలుగవలెనని బ్రాహ్మణులకు, పండితులకు అనేక దానములు చేసినాడు. దేవశాలి గురుకులంలో విద్యను అభ్యసించినాడు. చతుర్వేదములు,



వేదాంగములను గురుముఖతః గ్రహించినాడు. ఈ ప్రకారము గురువు వద్ద నుండి అనేక విద్యలను పొంది విరక్తిని పొంది సంచరించుచుండెను. లోకక్షేమం కలుగుట కొరకు అనేకములైన శైవపురాణములను శైవాగమ గ్రంథములను రచించినాడు. కొండ గుహలలో వనములయందు సంచరించుచు కందమూలములను భక్షించుచు ఇంద్రియ నిగ్రహము కలిగి యమనియమాసనములైన అష్టాంగయోగమును అనుసరించుచుండెను. యోగమార్గమున శివుడిని పూజించుచుండెను. యోగ మార్గము తెలిసిన అనేకమంది ఋషులు దేవశాలిని పూజించినారు. ఈ ప్రకారముగ కామ, క్రోథ, లోభ, మద, మాత్సర్యాదులను జయించి తపస్సు చేత ప్రకాశించుచు లోకమందు మిక్కిలి కీర్తిని పొందినాడు దేవశాలి. ఒకానొకప్పుడు దేవశాలి కళ్యాణ పురమునకు శూరమాని అను రాజు కాలములో వెళ్ళినాడు. ఆ శూరమాని మహాపరాక్రమము కలవాడు. దేవశాలి కృష్ణాజినమును ధరించినాడు. సకల సంపదలు కలుగజేయునట్టి బంగారపు జందెమును ధరించినాడు. మంచి గోచీ ధరించినట్టి వస్త్రమును అలంకరించినాడు. రెండు కాళ్ళకు పావుకోళ్ళు ధరించినాడు. కమలముల వంటి కన్నులు కలవాడై హస్తాభరణమైన గ్రంథమును చేతబట్టినాడు. భస్మమును సర్వాంగములకు ధరించి వున్నాడు. రుద్రాక్షదండలు ధరించి వున్నాడు. చెవులకు కుండలములు ధరించినాడు. మహా తేజ సంపన్నుడుగా ప్రకాశించుచున్న ఆ మహాపండితుడిని చూడగానే స్థావరములు జంగములు ప్రక్కకు తప్పుకొనుచున్నవి.

## దేవశాలి జైన మతమును నశింపజేయుటకు కళ్యాణ పురమున ప్రవేశించుట

అటువంటి తేజశ్శాలి అయిన దేవశాలి జైనులతో నిండి వున్న కళ్యాణపురమునకు వెళ్ళినాడు. ఆ పట్టణ రాజు కూడా జైనమతమును అవలంబించుచున్నాడు. భూమి యందు పెరిగియున్న జైనమతమును ఎట్లు నశింపచేయవలయును అని ఆలోచించుచున్నాడు దేవశాలి. అసలు జైనమతమును నశింపచేయాలి అను ఆలోచన దేవశాలికి ఎందుకు కలిగినది. ఈ సృష్టిని ఏర్పరచినది, నడిపించు చున్నది, నశింపచేయునది పరమాత్ముడు. అయితే జైనులు ఈశ్వరునిని వ్యతిరేకించెదరు. నిరీశ్వరవాదమును

అనుసరించెదరు. అనగ ప్రత్యక్షముగా భగవంతుడు లేడు అని ప్రచారం చేయుచున్నట్లే గదా. అందువలన భగవంతుడు విషయంలో మౌనమును వహించినటువంటి ఈ జైన మతము ఉండరాదు. అది వుంటే అరాచకములు పెక్కు పెరుగును అని భావన చేసినాడు. అందువలన ఆ పట్టణములోని జనులకు సకల సౌఖ్యములు కలుగజేయునట్టిదిని అయిన శివతత్త్వమును కథలుగా చేసి చెప్పుచున్నాడు. జైనులకు కూడా ఉపదేశించినాడు. అప్పుడు జైనులందరూ ఆ దేవశాలిచేత బోధింపబడినవారై తమ జైనమతమును విడచి శైవదీక్ష స్వీకరించుటకు ఆసక్తి కలిగి దేవశాలినే శ్రేష్ఠగురువుగా పొంది అతని కటాక్షము చేత పరిశుద్ధులై అతని చేత పంచాక్షరీ మంత్ర రాజమును ఉపదేశం పొంది విధి ప్రకారం జపం చేయుచు శివపూజ యందు ఆసక్తులై వుండిరి. ఈ ప్రకారము దేవశాలి భూమియందున్న జైనులను శివభక్తులుగా చేయుచుండెను. ఆ పట్టణమున వున్న వారందరూ దేవశాలిని ఇతడు సాక్షాత్తు శంకరుని అవతారమని చెప్పుకొనుచుండిరి.

## వీరవల్లభ మహారాజు తన కుమారునికి శైవ మతమును విడువమని చెప్పుట

ఇట్లుండగా ఒకానొకప్పుడు ఆ రాజు కొడుకు ప్రతాపవంతుడైనట్టి జగద్దేవుడు అను పేరుగలవాడు ఉండెను. మిక్కిలి తపోనిష్ఠలచే పూజింపబడుచున్న దేవశాలిని సమీపించి పలుమార్లు భక్తితో మ్రొక్కి ప్రీతితో అడిగినాడు. నీవు సమస్త జనులకు ఈశ్వరుడవు. శ్రేష్ఠమైన గురువుగా అంగీకరింపబడినావు. మంత్రరాజమైన పంచాక్షరీ మంత్రమును నాకు కూడా ఉపదేశింపుము అని ఇట్లు బుద్ధిశాలియైన యువరాజు ప్రార్థింపగా మిక్కిలి జ్ఞానవంతుడైన ఆ దేవశాలి అతనికి శివదీక్ష ఇచ్చి కోరికలను ఎల్లవేళలా సిద్ధింపజేసెడి పంచాక్షరీ మంత్రమును అతనికి ఉపదేశించినాడు. దేవశాలిచే ఉపదేశింపబడిన పంచాక్షరీ మంత్రరాజమును జగద్దేవుడు నిరంతరమూ జపము చేయుచు శివధ్యానమందు ఆసక్తుడై ఇంద్రియనిగ్రహము కలిగివున్నాడు. జైనమతమును పొందినవారిని విడచి శివభక్తులతో కూడిన వాడై శివపూజలను వృద్ధిపొందించుచుండెను. అప్పుడు రాజమంత్రులు జగద్దేవుని ప్రవర్తనను గమనించి సమాచారమంతయూ రాజుకు నివేదించినారు. ఓహో రాజా! మీ



కుమారుడు జగద్దేవుడు మన మతమును విడిచి శైవ మతమును అనుసరించుచున్నాడు. అతడుదేవశాలి వద్ద పంచాక్షరీ మంత్రమును ఉపదేశంపొంది జపించుచున్నాడు. శివపూజలయందు ఆసక్తి కలిగి శివ ధ్యానము చేయుచున్నాడు. శివుని భక్తులతోకూడి శివుని కథలను అమృతమువలె గ్రహించుచున్నాడు అని మంత్రులు రాజునకు చెప్పినారు.

## దేవశాలిని రాజ్యంనుండి బహిష్కరించుట

వెంటనే రాజు దేవశాలిని తనపట్టణమునుండి బహిష్కరించినాడు. పిమ్మట ఆరాజు తన మంత్రిశ్రేష్ఠుల చేత తనకొడుకును సభకు రావించినాడు. దుఃఖముతో కూడుకొని ఆ రాజు తన కుమారుడితో ఇట్లు పలికినాడు. ఓహో కుమారుడా! మిక్కిలి తెలిసినవాడా! నా మాట వినుము. లోకమున జైన మతముకంటే మించిన మతము వేరొకటి లేదు. ఎవడు తన మతమును విడిచి ఇతరమతమును స్వీకరించడు. పిశాచములతో క్రీడించునట్టియు, శ్మశానమునందు నివసించునట్టియును, బ్రహ్మదేవుడి శిరస్సునే భిక్ష పాత్రగా వుంచుకొన్న రుద్రుడును ఎవరు పూజిస్తారు? కాబట్టి కుమారుడా! లోకములందు శ్రేష్ఠమైనటువంటి మన జైనమతమునందే వుండుము అని వీరవల్లభ మహారాజు తన కొడుకును ఆజ్ఞపించినాడు. జైన మత గురువుతోపాటు అతని ఇంటికి వెళ్ళమని తనకొడుకును ఆజ్ఞాపించినాడు. తరువాత మిక్కిలి తెలిసినటువంటివాడైన జైనగురువు బుద్ధిశాలియైన ఆ రాజు కొడుకునకు జైనశాస్త్రములన్నింటిని బోధించినాడు. బోధింపబడినను జైన శాస్త్రములను విన్నను జగద్దేవుడు ఉత్తమమైన శైవ మతమును శివ పూజను, శివ పంచాక్షరీని విడువుట లేదు.

## దేవశాలి తపస్సు చేయుట

రాజుచేత తరమగొట్టబడిన ఆ దేవశాలి అప్పుడు తటాకములతో నిండివున్న ఒక వనమున ప్రవేశించినాడు. అచ్చటవున్న తటాకమునందు స్నానము చేసి చర్మాంబరములు ధరించి పరిశుద్ధుడై దేహమంతయు విభూతిని పూసుకొని రుద్రాక్ష మాలికలను భూషణములుగా ధరించి క్రమ ప్రకారము సంధ్యోపాసన చేసి రాజయోగమును ఆశ్రయించినాడు. ధర్మము, అర్థము,

కామము, మోక్షములను ఇచ్చునట్టి పంచాక్షర మంత్రమును జపము చేయుచు జ్యోతి స్వరూపుడైనట్టియును కోరికలను తీర్చునట్టి సాంబమూర్తిని ఎల్లప్పుడు ధ్యానముచేయుచుండెను. ధైర్యవంతుడును, మిక్కిలి తేజస్సంపన్నుడు అగు ఆ దేవశాలి తరువాత నిరాటంకముగా మూలాధారమందువున్న కుండలినీ శక్తిని సహస్రారకములనందు నిలిపి చిద్రూపుడైన ఆ పరమేశ్వరున్ని సమస్త విద్యలకు ఈశానుడు అయిన జగత్తులకెల్ల ఈశ్వరుడైనట్టియును, వ్యాపకుడును పరము కంటే పరుడును అగు బ్రహ్మ, విష్ణు, ఇంద్రుడు మొదలగు దేవతలచే పూజింపబడునట్టియును, పుట్టుకయే లేనటువంటి ఆద్యుడును గొప్పవానికంటే గొప్పవాడైనటువంటి ఒక్కరూపములోనే వుండునట్టియును, ఇతడు ఇట్టి వాడు అని వర్ణించడానికి సాధ్యము కానివాడును, అంతములేని రూపముకలవాడును, సర్వమునకు ఆత్మ రూపుడును, సృష్టి, స్థితి, సంహారములకు కారణ మైనట్టియును, కంటికి కనపడని వాడును, మొదలు మధ్య చివరలు లేని వాడును, వేదములయందు చెప్పబడిన మహా వాక్యములచేతకూడా దర్శింప శక్యము కానివాడును అగు శంకర దేవుడిని ధ్యానము చేసినాడు. ఈ ప్రకారముగా శంకరుని ధ్యానము చేసి, తపస్సునందు నిమగ్నుడైనాడు.

దేవశాలి తపస్సు ప్రభావము చరాచర రూపమైన ప్రపంచమంతయు వ్యాపించినది ఇక్కడ ఇట్లుండగా రాజ భవనములో అక్కడ జగద్దేవుడు తన గురువైన దేవశాలినిచూడాలని మనస్సులో కోరుకొనుచుండినాడు. తమ కుమారుడు దేవశాలిని చూడగోరు చున్నాడని సమాచారమును ఆరాజుకు తెలియజేసినారు మంత్రులు. రాజు తనకొడుకు సమాచారమును విని ఆందోళన చెంది కుమారుడిని సభకున పిలిపించి కోపముతో ఇట్లు అనినాడు. ఓరీ! దురాత్ముడా! దుష్ట బుద్ధిగల కుమారుడా! శైవ మతమును విడువుము. అట్లు విడువని పక్షమున నిన్ను నీ గురువును చంపించెదను. ఈ విషయములో సందేహము లేదు అని గర్జించినాడు.

## జగద్దేవుడు తన తండ్రికి శివభక్తిని గురించి తెలుపుట

అప్పుడు బుద్ధిమంతుడైన జగద్దేవుడు తన తండ్రితో మధురముగా శివ భక్తినిగురించి ఒక మాట చెప్పినాడు. ఓ తండ్రీ! లోకములయందు పెక్కు శాస్త్రములచేత జైన మతము నిందింపబడినది. ఈ జైన మతము వేదములకు,



ధర్మశాస్త్రములకు విరుద్ధమైనది కాబట్టి ఆ మతము నికృష్టమైనది అని నాకు తోచుచున్నది. సమస్త ఆగమశాస్త్రములు, ధర్మశాస్త్రములు, పురాణములు, సత్పురుషులకును ఈ శైవ మతము సమ్మతమైనది ఓరాజా! ఓ రాజ శ్రేష్టుడా! మూడు లోకముల యందును శివునికంటే అన్యమైన పదార్ధము ఒక్కటియును లేదు అని తెలుసుకొనుము. నేను సత్యమును తెలుపుచున్నాను. శివుడే పరబ్రహ్మము. శివుడే గతి. శివుడే జ్యోతి స్వరూపములలో పరంజ్యోతి స్వరూపుడు. శివుడే సకల ప్రపంచము మోక్షమును ప్రసాదించునట్టిది, శు భకరమైనది శివ పంచాక్షరీ మంత్రము ఎల్లప్పుడు జపము చేయదగినది. బ్రహ్మ, విష్ణు, ఇంద్రుడు మొదలగు దేవతలచేత ఎల్లప్పుడు పూజింపబడువాడు శివుడు. మోక్షమునుకోరుకొను సనకాది మునిశ్రేష్టులచేత నమస్కరింపబడే వాడు శివుడు. కాబట్టి ఓరాజా! నీవు ఇప్పుడు శివ పూజయందు ఆసక్తి కలిగి పంచాక్షరీ మంత్రమును జపింపుమని కొడుకు చెప్పుచున్న మాటలు వినిన రాజు కోపముచేత కన్నులు ఎర్రజేసెను. దూతలతో ఈతడు నా కొడుకైనను బంధిఖానాలో వుంచండి అని దూతలను ఆజ్ఞాపించినాడు. ఆ దూతలు రాజు చెప్పినట్లుగా రాజు కొడుకు జగద్దేవుని బంధించి బందిఖానాలో వుంచినారు. ఈ విధముగా తాను బంధింపబడుట జగద్దేవునికి బాధ కలిగించింది. దుఃఖించినాడు. చివరకు తన గురుదేవులైన దేవశాలిని ధ్యానించినాడు. అప్పుడు మహా తపస్సంపన్నుడైన దేవశాలి అతనిచేత తలపబడిన వాడగుట వలన యోగ సిద్ధుడైన దేవశాలి జరిగిన విషమంతయు యోగదృష్టితో గ్రహించినాడు. మిక్కిలి కోపము గలవాడై వీరవల్లభరాజును చంపడానికి నిశ్చయించుకొని ఆ అడవిలోనున్న జంతువులనన్నింటిని తన తపో మహిమచేతను, శివమంత్ర మహిమ చేతను భయంకరమైన చతురంగ సేనగా సృజియించినాడు. సింహములను, పులులను మిక్కిలి బలముగల యోధులుగా ఏర్పడినవి. ఎలుగుబంట్లు ఏనుగులుగా మారినవి. లేళ్ళు గుర్రములుగా మారినవి. చక్రవాక పక్షులు వాయువేగ మనో వేగముగా వెళ్ళే రథములుగా అయినవి. ముండ్లు గల చెట్లన్నియు ఆయుధములు అయ్యెను. రావి చెట్లు బాణములయ్యెను. వెదుళ్ళు ధనస్సులుగాను, ధృడములగు జనుప చెట్లు అల్లె త్రాడులు అయ్యెను. అప్పుడు దేవశాలికి తాటి చెట్టు అంబుల పొదిగా మారినది. బ్రహ్మమేడి చెట్లు బ్రహ్మాస్త్రము మొదలగు అస్త్రము లయ్యెను. ఈ ప్రకారము ఆయుధములచేత

నిండినట్టియు, ధనస్సుల చేతను బాణముల చేతను, అస్త్రముల చేతను ప్రకాశించుచున్న ఆ చతురంగ సేనను చూచి ఆ దేవశాలి ఆనందించినాడు.

## దేవశాలి సేనకు వీరవల్లభరాజుకు యుద్ధం జరుగుట

అంత ఆ సేనాజనులు దేవశాలి దగ్గరకు వచ్చి చేతులు మోడ్చుకొని వినయముతో గూడిన వారై ఇట్లు పలికినారు. ఓ సర్వమూ తెలిసిన స్వామీ!మమ్ములను ఎందులకు సృష్టించితివి. మేము ఏ పని చేయవలయునోదానిని మాకుచెప్పుము. దాన్ని మేము చేసెదము అనిఇట్లా సైనికులు అడిగినారు. అప్పుడు మహా తేజస్సంపన్నుడైన ఆ దేవశాలి మేఘముల ఉరుములవలె గంభీరమైన వాక్కుతో ఆ సైనికులకు చెప్పుచున్నాడు. ఏమంటే ఓయీ! మిక్కిలి బలముగల సైనికులారా! మీరు కళ్యాణపట్టణమునకు పోయి వీరవల్లభ మహారాజును అతని సేనలను చంపి అతని కుమారుడైన జగద్దేవుని బంధిఖానాలోనుంచి విడిపించి సంతోషముగా మీరు ఇక్కడకు రావలయును అని ఇట్లా దేవశాలి ఆజ్ఞాపించినాడు. అయితే ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే మంత్ర శక్తిచేత జంతువులను మనుష్యులుగా రకరకమలైన అస్త్రశస్త్రములుగా మార్చటమే. అయితే మునీశ్వరులకు ఇది అంతయు సహజమే. అందువలననే రుక్మరథుడు తండ్రి సావిత్రి అష్టవసువులలో ఎనిమదవ వాడు. అతడు మన్మధబాధ పీడితుడై తన సమీపములో వున్న ఆడ నెమలిని యవ్వనవతియైన స్త్రీగా మార్చినాడు అని నాల్గవ అధ్యాయములో చదివినాము. కాబట్టి మహర్షులు తలుచుకుంటే వారికున్న మంత్ర శక్తితో ఏపనైననూ సాధించగలరు. కావున ఇది విడ్డూరము కాదు. వాల్మీకి వ్రాసిన రామాయణములోని అయోధ్యకాండము నందు కూడా భరద్వాజ మహర్షి ఇటువంటి కార్యమును చేసినాడు. దేవశాలి ఆజ్ఞాపించగా ఆ ఆజ్ఞను శిరసావహించి ఆ సైనికులు అస్త్రశస్త్రములను చేతులయందు తీసుకొని ఆ అడవినుండి కళ్యాణపురమునకు బయలుదేరినారు. మిక్కిలి బలవంతులైనటువంటి పెక్కు విధములుగా శిరస్త్రాణాలు, కవచాలు, భుజకీర్తులు ధరించినటువంటి అనేక విధములైన యుద్ధములయందు నేర్పరులైనటువంటి ఆ సైనికులుగా సింహనాదం చేయుచూ శత్రు సైనికుల సమూహములకు భయము కలుగజేయు రీతిగా విల్లులకు వున్న టంకారము చేయుచూ యమదూతలవలె భయమును కలుగజేయు వారై వచ్చి



కళ్యాణనగరమును చుట్టుముట్టినారు. ఆ నగరములోని కోట వాకిళ్ళ యందున్న దేవశాలి తపశ్శక్తి చేత సృష్టింపబడిన సైనికులు వచ్చి పట్టణమును అడ్డగించుట చూచిన రాజసైనికులు వేగముగా వెళ్ళి రాజునకు ఈ విషయము తెలిపిరి. శత్రుసేనలు సముద్రము వలె కడతెలియకున్నది. అనగా శత్రుసేనలు కంటి దృష్టికి అందని అంతటి దూరం వరకు వ్యాపించి వున్నారు. మన వీరులందరూ ఆ సేనను చూడగానే భయపడుచున్నారు. సమస్త ఆయుధములు చేతబట్టుకొని బాణములచేతను, విల్లులచేతను ప్రకాశించి యున్నది ఆ శత్రుసేన. ఏ ప్రక్కన చూచినను గుర్రములు, ఏనుగులయొక్క అరుపులు వినపడుచున్నవి. భటులు చేసే సింహనాదములతో అష్టదిక్కుల యందుండు వారికి చెవుడు వచ్చునట్లున్నది. శత్రువుల సేనలను ధ్వంసం చేయగల శక్తి వున్న రాజా! ఈ శత్రుసేనలు ఏ దిక్కునుండి వచ్చినవో తెలియటం లేదు. ఎవరు పంపినారో అర్థం కావటం లేదు అని ఇట్లు దూతలు చెప్పిన మాటలు విని రాజు కోపం చెంది పండ్లు కొరుకుచూ మంత్రులతో ఓ మంత్రి శ్రేష్ఠులారా! భయముతోనూ, తొట్రుపాటుతో కూడుకున్న దూతలు వచ్చి చెప్పిన మాట మీరందరూ విన్నారు కదా! ఓ శత్రుసైన్యములెల్ల నశింపచేయువారా ఎటువంటి కారణం లేకుండా వచ్చిన ఆ సైన్యమును చంపటానికి మన సేనలను తీసుకొని యుద్ధానికి నడవండి అని ఆ రాజు మంత్రులను ఆజ్ఞాపించెను. రాజుగారి ఆజ్ఞ విని ఆ మంత్రులు త్వరలో సైన్యమును సమకూర్చుకొని రథముల చేతను, గుర్రములచేతను, ఏనుగులచేతను, కాలబలములచేతను భయంకరమై శత్రువులను అడ్డగించుటకు సమస్త ఆయుధములతో ఎల్లప్పుడూ గెలిచేటటువంటి సేనను సమీకరించి తెచ్చిరి. రాజు కూడా యుద్ధానికి బయలుదేరి వచ్చినాడు. ఇట్లా రాజ్యసైన్యమునకు దేవశాలి సైన్యమునకు హెూరాహెూరీగా యుద్ధము జరుగుచున్నది. అప్పుడు జరిగిన యుద్ధము శరీరమునకు గగుర్పాటు కలిగించు రీతిలో వున్నది. దేవశాలి సేనకు నాయకుడుగా శంకరుడు అనువాడు వుండెను. యుద్ధములో శంకరుడు ఆగ్నేయ, నారాయణ, బ్రహ్మాస్త్రములను ప్రయోగించినాడు. రాజుయొక్క శిరస్సును తెగగొట్టినాడు దేవశాలి. సేనానాయకులు కళ్యాణనగరములోకి చొచ్చుకొని వెళ్ళి బందీగా వున్న జగద్దేవుడిని విడిపించినారు. జగద్దేవుడు తన గురువు దేవశాలికి మ్రొక్కినాడు.

## దేవశాలి జైనులందరిని భస్మం చేయబూనుట

అప్పుడు దేవశాలి ముల్లోకములయందు శివుని కన్నా ఎక్కువ దైవం లేదు ఈ జైనులను అందరినీ నా శాపాజ్ఞి తేజస్సు చేత చంపెదను అని కమండలములోనుంచి జలము తీసుకొనుచుండగా అప్పుడు నందీశ్వరుడు వడివడిగా వచ్చి దేవశాలి చెవిలో చెప్పినాడు. వద్దు జైనులను చంపవద్దు. ఇప్పుడు వీరందరూ శైవమతస్థులు అగుదురు అని చెప్పటానికి శివుడు పంపినాడు అని అనగానే దేవశాలి సంతోషించెను. జగద్దేవుడిని కళ్యాణపట్టణమునకు రాజుగా అభిషేకించినాడు దేవశాలి. అభిషేకించిన అనంతరము ఒక్క క్షణములోనే దేవశాలి దేవాంగునిగా మారిపోయినాడు. ఆకాశమునుంచి వచ్చిన విమానములో దేవాంగుడు కైలాసమునకు చేరి పార్వతీ పరమేశ్వరులకు నమస్కరించినాడు.

దేవలుడు శివుని ఫాలనేత్రమునుండి ఆవిర్భవించినాడు. శివమానసపుత్రుడిగా ప్రసిద్ధికెక్కినాడు. శివుని భక్తసమూహములో ప్రధముడైన భక్తుడు. శివుడు దేవతలకే దేవుడు. ఏకైక పెద్ద దేవుడు. శివుని ఆజ్ఞ చేత ఇతర దేవుళ్ళు నారాయణుడు, విష్ణుమూర్తి, శ్రీహరి, బ్రహ్మదేవుడు నడుచుకొందురు. బౌద్ధమతము దేవుడు విషయములో మౌనముగా వుంటుంది. ఈ సృష్టికంతటికీ పరమాత్మ వున్నాడా అను విషయంపై నిశ్శబ్దంగా వుంటుంది. అందువలన బౌద్ధంను నిరీశ్వరవాదం అందురు. ఈ ప్రపంచాన్ని నడిపించేది శివుడైనా, నారాయణుడైనా శక్తిదేవతనైనా ఏదో దేవుడిని అంగీకరించాలి. బౌద్ధ, జైనమతాలు వేదాన్ని అపౌరుషేయముగా భావించవు. వేదం యొక్క ప్రాముఖ్యతను గుర్తించవు. అందువలన నిరీశ్వర మతమైన జైన మతాన్ని తుద ముట్టించాలని దేవశాలి నిర్ణయించుకున్నాడు.

## దేవశాలి వీరశైవ మతవ్యాప్తికి సేనాధిపతి వ్యవస్థను ఏర్పాటుచేయుట

శివమానస పుత్రుడు కాబట్టి శైవమతమునే పాటించాలి. వ్యాప్తి చేయాలి. అది దేవశాలి యొక్క పరమ ధర్మము. కావున దేవశాలి శైవమత వ్యాప్తి కొరకై అవతరించినాడు. ఆనాడు ప్రపంచములో వున్న జైనమతము వ్యాప్తి కాకుండా



నిరోధించి జైనులందరినీ శైవులుగా మార్చినాడు. దేవాంగుడు శైవమతస్థుడు. కావున దేవాంగ వంశస్థులందరూ శైవమతమునే పాటించవలయును. కావున దేవాంగ వంశస్థులు శైవులు అయినారు. శైవులు అనగా ఈ చరాచర సృష్టిలో జగత్తును నియంత్రించేది శివుడు అని నమ్మి కొలిచే వారిని శైవులు అందురు. శివ ఫాలనేత్రము నుండి తన కుల ఆదిపురుషుడు దేవాంగుడు ఆవిర్భవించినందున ఆతని వంశస్థులందరూ శైవులే అవుతారు. లోకములో విద్యావ్యాప్తి గావించటంతో పాటు నిరీశ్వరవాదమును సమూలముగా లేకుండా చేయాలని శైవమతమే ఏకైక మతమని కావున దేవాంగ కులస్థులందరూ శైవులుగా వుండాలని నిర్ణయించుటలో అసంగతము లేదు. శైవమత వ్యాప్తి కొరకు అవసరమైతే యుద్ధం చేయటానికి సిద్ధంగా వుండాలని తెలియజేసినాడు. దేవశాలి ఏర్పాటు చేసిన సైన్యమును నియంత్రించటానికి సేనాపతులు వుంటిరి. సేనాపతులలో ప్రముఖుని పేరు శంకరుడు. కాబట్టి సేనాపతులుగ వుండి దేవాంగ కులస్థులు వీర శైవమత ఉద్యమానికి ప్రోత్సాహకులుగా చేసినారు కొందరు. వీరశైవమతమును అనుసరించుటయే దేవాంగుల కర్తవ్యము. దేవాంగుడు దేవశాలి అవతారములో విద్యావ్యాప్తితోపాటు వీరశైవ మతాభివృద్ధికి పాటుపడినాడు. ఈ విశ్వములోని దేవ, మానవ, రాక్షస, దానవాది జాతులకు, సర్పజాతికి సకల జాతులవారికి వారికున్న దిగంబరత్వాన్ని పారద్రోలుటకై వస్త్రములను ఇప్పించినాడు. వేదవిద్యలు కొనసాగుటుకు యజ్ఞోపవీతం ప్రసాదించినాడు. లోకములో వుండే జనులకు మంచి చెడ్డ అను విషయం తెలుసుకొనుటకు వివేచనాత్మక ఆలోచనలు కలగటానికి మానవుడు మహనీయుడుగా మారటానికి అవసరమైనది విద్య. కావున లోకములో విద్యావ్యాప్తి కొరకు శివుడు తన మానసపుత్రుడు దేవలుని ద్వారా విద్యావ్యాప్తి జరిపించుచున్నాడు. కావున తమకు ఇంత మేలు చేసిన భగవంతుడిని స్మరించకుండా వుండుట సమంజసమేనా? కావున ప్రధానంగా శివదేవుడిని కొలవాలి. ఆ తరువాత ఇతర దేవతలను కొలవాలి. శివుడిని కొలవకుండా ఇతర దేవతలను కొలుచుట మనలో కృతజ్ఞత లేకుండుటయే కారణముగ తోచుచున్నది. అందువలననే దేవశాలి అవతారములో దేవాంగుడు శైవమత వ్యాప్తికి పూనుకొనినాడు.

ఇట్లు శ్రీ బ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరితమున
ఇరవై ఏడవ అధ్యాయము పరిపూర్ణము



# దేవదాసుని అవతారము

## ఇరవై ఎనిమిదవ అధ్యాయము



తరువాత జరిగిన కథను సూతపౌరాణికుడు ఋషులకు చెప్పుచున్నాడు. ఋషిశ్రేష్ఠులలో వృద్ధుడైనటువంటి నారద మహర్షి త్రిలోక సంచారం చేసి కైలాసమునకు వెళ్ళి సాంబశివునికి నమస్కరించినాడు. సాంబశివుడు నారదునితో కుశల ప్రశ్నలు అడిగిన తరువాత నారదా భూలోక సంచారము చేసి వచ్చినావు గదా. భూలోకమందు ప్రజలు నా పూజలు చేయుటయందు ఆసక్తులై వున్నారా నా పూజా సంబంధిత శైవ వ్రతములను ఆచరిస్తూ వున్నారా అని శివుడు అడుగగా వెంటనే నారదుడు దేవా! భూలోకమందు ఎచ్చట చూచిననూ విష్ణుపూజలు, విష్ణువ్రతములు జరిపించుచున్నారు ప్రజలు. భూలోకమంతా వైష్ణవులచేతనే నిండివున్నది. శైవుడు అను వారు కనబడుట అరుదుగా వున్నది. శివసంబంధిత వ్రతములు ఆచరించే వారు లేరు అని నారదుడు బదులు చెప్పెను.

## శైవమతాన్ని భూలోకములో వ్యాప్తి చేయమని శివుడు దేవాంగుడిని ఆజ్ఞాపించుట

పరమేశ్వరుడు క్షణమాత్రము ఆలోచించి వెంటనే తన కొలువు కూటములో వున్న మానసపుత్రుడైన దేవాంగుని చూచి దేవలా ! నారదుడు చెప్పిన విషయము వింటివి కదా కావున భూలోకములో వున్న జనులయందు శైవమతమును ప్రచారం చేయుము. శివభక్తిని పెంపొందింపచేయుము. శైవవ్రతములు చేయునట్లుగా ప్రజలను ప్రేరేపితులను చేయుము. భూలోకమందు నాకు నిత్యము పూజలు జరుగులాగా చేయుము. శైవ సంబంధిత కథలను ప్రచారం చేయుము అని దేవాంగునికి చెప్పినాడు శివుడు. అప్పుడు దేవాంగుడు



కరుణాకరా దయాసింధూ మీరు ఆజ్ఞాపించినట్లుగానే భూలోకమందు మీ వ్రతములను ఆచరింపజేసే విధంగా ప్రజలను శైవులుగా తీర్చిదిద్దుతాను అని చెప్పి శెలవు తీసుకొనుచుండగా పార్వతీ దేవి దేవలా! రాక్షసుల బారినుండి నేను నీ ప్రాణములు కాపాడుటకొరకు చౌడేశ్వరీ శక్తిగా అవతరించినాను. కావున నీవు నీ వంశము వారందరి చేత చౌడేశ్వరీ దేవినైన నన్ను కొలుచునట్లుగాను, రామలింగేశ్వర రూపిత శివుని కొలిచే విధంగాను భూలోకమున వ్యాపింపచేయుము. నీ వంశీయులందరూ చౌడేశ్వరీ దేవిని రామలింగేశ్వరుడినీ ఎల్లవేళలా పూజలు జరుపుకొనినచో వారు ఎల్లవేళలయందు సుఖసంతోషములతో కూడి వుంటారు. ఇంతకు ముందు రావణాసురుని చంపిన శ్రీరాముడిచేత రామేశ్వర క్షేత్రమందు పూజింపబడిన రామలింగస్వామిని నీవు నీ వారందరూ కొలుచునట్లుగా చేయుము. వారి కోరికలు అన్నియు సందేహము లేకుండా తీరును అని పార్వతీ దేవి చెప్పి పంపినది. అప్పుడు దేవాంగుడు ఆమోదపట్టణమునకు రాజైన గంగాధరుని కుమారుడు అగు వీరరుద్రునకు పుత్రునిగా జన్మించినాడు. వీరరుద్ర మహారాజు తనకు కుమారుడు పుట్టిన పదకొండవ రోజున జాతకకర్మ చేయించినాడు.

## శివుడు దేవదాసుకు లింగ దీక్ష ఇచ్చుట

అప్పుడు పార్వతీ పతియైన పరమేశ్వరుడు కుమారస్వామితో కలసి బ్రాహ్మణవేషములో వచ్చి ఆగమశాస్త్రమందు చెప్పబడిన విధముగా శివలింగ దీక్షను వీరరుద్ర కుమారుడికి ఇచ్చినాడు. అతనికి దేవదాసుడు అని పేరు పెట్టినాడు. దేవతలు ఆ సమయములో పుష్పవర్షము కురిపించెను. నగారాలు మ్రోగించినారు. అప్పుడు వృద్ధబ్రాహ్మణ వేషములో వచ్చిన శివుడు కుమారస్వామి అందరూ చూచుచుండగానే అంతర్ధానమయిరి. ఈ ఆశ్చర్యకరమైన సంఘటన చూచి వీరరుద్ర మహారాజుతో పాటు అక్కడ వున్న కుటుంబ సభ్యులు మరియు పరివారం ఆశ్చర్యపోయిరి. ఈ బ్రాహ్మణుడు ఇప్పటిదాకా మన మధ్యలోనే ఉన్నాడే మనతో మాట్లాడినాడే. అందరూ చూస్తుండగానే అదృశ్యమవటం ఆశ్చర్యంగా వుందే. అతను ఎంత తపశ్శక్తి సంపన్నుడో అను కోలాహలముగా ఉన్నది. అప్పుడు ఆకాశములోనుంచి అశరీర వాణి బిగ్గరగా వినిపించింది. ఓయీ! వీరరుద్ర మహారాజా సమస్త శుభములను కలుగజేయునట్టి

రామలింగేశ్వరుడు తాను స్వయముగా నీ కుమారునకు లింగ దీక్షను నామకరణమును చేసి అంతర్థానమయ్యెను. కావున నీ కుమారుడు రామలింగ స్వామియందు భక్తి కలిగియుండును. శ్రీ చౌడేశ్వరీ దేవతను సదా పూజించుచుండును.

## వీర శైవ మతమనగా

ఈ లోకమునందు వీరశైవ మతమును అనగా ఈ సమస్త ప్రపంచమునకు అధిభూతనాధుడు శివుడు అని శివుని ఆజ్ఞ ప్రకారమే దేవతలందరూ ప్రవర్తించెదరు అని శివునికి వారందరూ జవాబుదారు అని ఆ శివుడిని ఆవేశముతో కూడిన భక్తితో పూజించాలని శివుని ఆజ్ఞ లేనిదే చీమైననూ కుట్టదు అని, శివుని అర్చించని చేతులు చేతులు కావని, శివుని నామమును పలకని నోరు నోరు కాదని, శివుని చూడని కన్నులు కన్నులు కావని కావున శివుని స్మరణ, స్పర్శణ, వీక్షణ లేని ఈ జీవితం వ్యర్థమని భావించెదరు. జీవితాన్ని జీవించటానికి బదులు ఈ ఆత్మను భగవంతునికి అర్పణ చేయుట శుభమని ఖడ్గముతో తన శిరస్సును తనే నరుక్కుంటూ దేవునికి అర్పణ చేస్తారు కొందరు భక్తులు. శిరస్సును త్రుంచుకొనేటప్పుడు శివనామస్మరణతో చేస్తారు. అవసరమని భావిస్తే శివ శివ పరమేశ్వరా మహేశ్వరా హరహర అని పలుకుతూ తమ కళ్ళను పీకి దేవుడికి అర్పిస్తారు. శివనామస్మరణ జరగని క్షణకాలము కూడా వారికి వ్యర్థమైనది. హృదయాంతరముల నిండా శివనామ స్మరణతోను నింపుకుంటారు. శివస్వరూపాన్ని తమ గుండెలలో నిలుపుకుంటారు. అన్యధా శరణం నాస్తి త్వమేవ శరణం మమ అనగా ఇతర దేవుళ్ళను శరణువేడను శంకరా నిన్నే శరణు వేడతాను అని ఉద్దేశించి పూజించుట వుండును. దేవునికి ప్రీతి కలగటానికని తన భక్తిని దేవునికి చూపించాలని రక్త తర్పణలు కూడా చేస్తారు. ముఖము మీద మూడు విభూతి రేఖలు ఎల్లవేళలా వుండు విధంగా వుంటారు. మెడలో రుద్రాక్షలు హస్తములయందు రుద్రాక్షలు ధరిస్తారు. శివుని యొుక్క కథలను వింటూ శివభక్తి అనితర సాధ్యమైన రీతిలో పెంపొందించుకుంటారు. కంఠమునందు రుద్రాక్షలు ధరించుటయే గాక శివలింగాన్ని కూడా ధరిస్తారు. అనగా తమ శరీరం మొత్తం శివమయం అనే భావనతో వుంటారు. అందువలన శివునికి ప్రతిరోజూ ఆరు



సమయములయందును తన మెడలో ధరించిన లింగమునకు పూజలు చేస్తారు. తను ధరించిన లింగమునకు ఆహారమును నివేదించనిదే వారు భోజనం చేయరు. శివుని యొక్క లీలలు ఏ విధంగా వుంటాయో తెలుసుకొని ఆ లీలలను పాటించటానికి తాపత్రయ పడతారు. ప్రతిరోజు ఒక శివభక్తుడికి అన్నదానం చేయాలని అతిథిగా భావించి సర్వోపచారాలు చేస్తారు. శివుడు వచ్చి అడిగితే తన ప్రాణాన్నే కాదు తన భార్యను, కుమారులను, ధనాన్ని చివరికి తమ సర్వస్వాన్ని ధారపోయటానికి సిద్ధపడతారు. శివలీలలను వినటంలో తన్మయత్వంలో వుంటారు. శివుడు భిక్షాటన చేసి స్మశానంలో నివసిస్తాడని భిక్షాటన, స్మశానం పవిత్రమైనదిగా భావించెదరు. ఇటువంటి శివభక్తిని వీరశైవ మతము అందురు. ఇటువంటి వీరశైవమతమును ఉద్ధరించడానికి నీ కుమారుడను నిర్దేశించినాడు సాంబశివుడు. ఈ భూలోకములో శివభక్తిని పెంపొందించుటకు, భూమియందు నిత్యము శివ అర్చనలు జరగటానికి, శివుని కథలు వ్యాపింపజేసి ప్రజలను శివభక్తి పరాయణులుగా చేయుటకు, లింగదీక్షను వ్యాప్తిచేయుటానికొరకై, ఇతరులకు లింగ దీక్ష ఇవ్వటానికి అర్హత సాధించుటకొరకు తానే స్వయముగా వచ్చి గురువుగా వుండి లింగదీక్ష ఇవ్వడం ద్వారా భూలోకమంతయూ లింగదీక్షలు జరగాలని భగవంతుని ఉద్దేశము. అందుకు భగవంతుడు స్వయముగా నీ కుమారుడిని శిష్యునిగా చేసికొనినాడు. వీరరుద్రమహారాజా నీ కొడుకు కారణజన్ముడు. అందువలన నీవు సంతోషముగా వుండుము అని పలికిన ఆకాశవాణి మాటలు విన్న వీరరుద్ర మహారాజు మనస్సు సంతుష్టిని పొందినది. సాంబశివుడు స్వయముగా మా ఇంటికి రావటం మా జన్మ తరించినది అని భావించినారు. ఈ వీర శైవ భక్తి పెంపొందించే కథలలోనే ఒక ప్రసిద్ధ కథ ఉన్నది. ఆ కథ ఏది అంటే భక్త సిరియాలుడు. భగవంతుడు స్వయముగా వచ్చి భక్తులయొక్క భక్తి ఏ పాటిది నాకోసం వారి ప్రాణాలనైనా తృణప్రాయంగా భావించి సంతోషముగా నాకు సమర్పించటానికి ఇష్టపడుతున్నారా లేదా అని పరీక్షించుతాడు. వీరరుద్రమహారాజు తన కుమారుడైన దేవదాసుకు ఉపనయనం జరిపించి వేదశాస్త్రఆగమములను గురుముఖంగా నేర్పించినాడు. ఆ తరువాత ఆకాశవాణి చెప్పిన రీతిలో బగళాధీశుని భార్యయందు దేవదత్త జన్మించినది. ఆమెకు దేవదత్త అని పేరు పెట్టవలెనని, వీరరుద్రమహారాజు కుమారుడు దేవదాసుకు ఇచ్చి

వివాహం జరిపించాలని పలికిన ఆకాశవాణి మాటలను గుర్తుంచుకొని బగళాదేశధీశుడు వీరరుద్రమహారాజునకు తన కుమార్తె దేవదత్తను మీ కుమారుడికిచ్చి వివాహం జరిపించుటకు ఇష్టపడుచున్నాను అని దూతల ద్వారా కబురు పెట్టినాడు. వెంటనే వీరరుద్రమహారాజు బంగళాదేశానికి చతురంగ బలంతో వచ్చినాడు. తన కుమారుడి వివాహమును దేవదత్తతో జరిపించినాడు. దేవదాసు దేవదత్తల వివాహ జీవితం ప్రారంభమైనది. దేవదాసు శివపూజలయందు ఉత్సాహం కలవాడు. శివపురాణ కథలు వినటానికి ఆసక్తి కనబరుచుచున్నాడు. శివుని ధ్యానము ఎల్లప్పుడూ చేయుచుండినాడు. శివభక్తులకు అన్నదానం చేయుచున్నాడు. శివభక్తులతో శైవగోష్ఠి జరుపుచుండెను. పండితుల మధ్య శివసంబంధిత చర్చలు జరుపుచుండెను. అనేకమందికి లింగదీక్షను ఇచ్చుచున్నాడు. సృష్టికి ఒక కర్త లేడు అని చెప్పు దానిని నిరీశ్వరవాదము అందురు. ఈ నిరీశ్వర మతములలో జైనము, బౌద్ధము ఉన్నవి. అందువలన ఈ రెండు మతముల పట్ల అసహనం కలిగివున్నాడు దేవదాసుడు.

## వీరమాహేశ్వర వ్రతమును ఆచరించమని బోధించుట

దేవదాసుడు శూద్రులు, వైశ్యులు, క్షత్రియులకు వీరమాహేశ్వర వ్రతమును బోధించి ప్రజలందరూ శివునికి ఇష్టము కలుగు రీతిలో ఈ **వీరమాహేశ్వర వ్రతము** బోధించి ఆచరింపజేస్తూ లోకములో శైవమత వ్యాప్తి గావించుచున్నాడు. ఇట్లుండగా దేవదాసు దేవదత్తలకు ఏకోరాముడు అను పుత్రుడు కలిగినాడు. ఈ ఏకోరామునికి విరూపాక్షుడు అను పేరు కూడా కలదు. ఈ విరూపాక్షునికి తగిన విద్యలు నేర్పించుచున్నాడు. ఈ విధముగా భూమి మీద శైవమత వ్యాప్తి గావించుట వలన బౌద్ధమతస్థులు రోషమును పొంది శైవమతమును నాశనం చేయాలి అనే లక్ష్యం కలిగి వున్నారు బౌద్ధులు అప్పుడు. అందువలన బౌద్ధ మతస్థులందరూ దేవదాసుని ఆట కట్టించుటకు అవకాశము కొరకు ఎదురు చూచుచున్నారు. ఒకానొకప్పుడు దేవదాసు రామలింగేశ్వరస్వామిని పూజించి వచ్చుచుండగా దారి మధ్యలో దేవదాసును ఆటకాయించినారు బౌద్ధులు.



## దేవదాసుడు బౌద్ధులను శివునితో మాట్లాడించుట

ఓయి దేవదాసుడా! నీవు లోక మందు శైవమతమే శ్రేష్టమైనదని చెప్పుచున్నావు. శివుని దీక్షను, పంచాక్షర మంత్ర దీక్షను ప్రజలకు ఇస్తున్నావు. శివుడు ఎక్కడ వున్నాడు. నీవు చూసినావా? అని బౌద్ధులు అడుగగా అప్పుడు దేవదాసుడు వారికి ఈ విధముగా సమాధానము చెప్పినాడు. ఆ శివుడు సర్వత్రా వ్యాపించి వున్నాడు. ఆతను నిత్యుడు, విభుడు, పరముకంటే పరుడు అని దేవదాసు చెప్పినాడు. అప్పుడు బౌద్ధులు సర్వవ్యాపకుడు అని అన్నావు కదా! ఈ చీమలో వుంటాడా నిరూపించండి. చీమలో వుంటే శివుడు మాట్లాడమనండి అని బౌద్ధులు అడిగి అక్కడవున్న చీమలలో ఒక చీమను తీసుకొని దేవదాసునకు ఇచ్చినారు. అప్పుడు దేవదాసు ఆచీమతో ఈ విధంగా మాట్లాడుతున్నాడు. భక్తులకు శుభములు చేయునట్టి సర్వశక్తి సంపన్నుడవైన శివుడిని ప్రార్థించినాడు. ఓ శివుడా! మంగళాస్పదుడా! దయాసముద్రుడా! నీవు సర్వజ్ఞుడవు కదా. ఇప్పుడు ఈ బౌద్ధులు అడిగినరీతిలో చీమలోపలనుండి మాట్లాడవలయును అని దేవదాసుచే ప్రార్థింపబడినపరమేశ్వరుడైన ఆ సాంబశివుడు ఆ చీమలో నుండే ఆశ్చర్యకరమైనఒకమాట చెప్పినాడు. ఓ జనులారా! మీరు భక్తితో నా మాట వినవలయును. నేనే ప్రత్యక్ష శివుడను. సర్వమును పొందియున్నాను. నా కంటేగొప్పవారు ఎవ్వరూ లేరు. నేనే అందరికీ గొప్పవాడిని. నేనేపరమాత్మను. లోకములను సృష్టించుట పాలించుట లయింపజేయుట అది నా కర్తవ్యము. ఈ ప్రపంచములో సర్వరూపములయందు గల వాడను నేనే. ఇందులకు మీరు సందేహము చెందవలసిన అవసరము లేదు అని చీమలో నున్న శివుడు ఈ విధముగా చెప్పగా అప్పుడు బౌద్ధులు ఒకరితో ఒకరు ఆలోచించుకొనినారు. వారు దేవదాసుతో ఓయీ! నీ మంత్ర ప్రభావమువలన చీమ ఈ విధముగా మాటలాడి వుండవచ్చు. కాని రామలింగేశ్వరస్వామి ఈ చీమ చెప్పినట్లు అదే విషయములను రామలింగేశ్వరస్వామి చెప్పినట్లయితే మేము నమ్ముతాము అని తెలిపిరి.

## దేవదాసు రామలింగేశ్వరుని ప్రార్థించుట

దేవదాసుడు రామలింగేశ్వరస్వాము వద్దకు బౌద్ధులను తీసుకొని వచ్చి

ఈ విధముగాప్రార్థించినాడు. ఓ రామలింగేశ్వరుడా! జ్ఞానస్వరూపుడా! వేదములచే వేదాంతములచే స్తోత్రము చేయబడినవాడా! ఇప్పుడు నీవు సర్వజ్ఞుడవని సర్వవ్యాపకుడవని బౌద్ధులకు ప్రకటించవలయును. ఓ ప్రపంచ స్వరూపుడా! చీమలో వుండి ఏ విధముగా మాటలాడినావో అదే విధముగా మాటలాడవలయును ఓసదాశివుడా! నీకు మ్రొక్కుచున్నాను అని దేవదాసు ప్రార్థించగా అప్పుడురామలింగేశ్వరుడు సింహమువలె గర్జించుచు సొగసైన అక్షరములుగల మాటను చెప్పినాడు. ఓ బౌద్ధులారా! మీరు నాయందు భక్తితో కూడినవారై నా మాటను వినవలయును. నేనే ఆ పరోక్ష శివుడను. సర్వమున వుండువాడను. పరముకంటే పరుడను. సర్వవ్యాపకుడను. మోక్షము నిచ్చువాడను. జ్ఞానము, విజ్ఞానము స్వరూపముగా గలవాడను. పరమాత్మను. జగత్తును చేయువాడను నేనే. సర్వ స్వరూపములయందుండు వాడను నేనే. సర్వ స్వరూపములు నా యందు నుంచి పుట్టినవే. మీరు ఈ విషయమై సందేహింప పనిలేదు అని ఇట్లు రామలింగేశ్వరస్వామి చెప్పిన మాటలు విన్న అచ్చటి బౌద్ధులు వెంటనే శివలింగ దీక్షను తీసుకొనినారు. దేవదాసునకు శిష్యులైనారు. ఆ తరువాత దేవదాసుడు ఆమోదపట్టణమునకు వెళ్ళెను.

ఒకానొక సమయమున అనేకమంది బ్రాహ్మణసమూహములు దేవదాసు వద్దకు వచ్చి నేతితోచేసిన పిండి వంటలతో కూడిన అన్నమును పెట్టమని యాచించినారు. అప్పుడు దేవదాసుడు ఆమోద పట్టణమందున్న వర్తకుడైన వైశ్యుడు గంగాధరశెట్టి వద్దకు వెళ్ళి బ్రాహ్మణులు అన్నము కొరకు వచ్చినారు. నాయింట ధనములేదు, ధాన్యము లేదు. కావున బ్రాహ్మణుల అన్నదానమునకు అవసరమైన బియ్యము, పప్పులు మొదలగునవి అప్పుగా ఇవ్వవలయునని అడుగగా అప్పుడు గంగాధరశెట్టి దేవదాసునితో కోపగించుకొని పోపోవయ్యా వచ్చావు గాని పంద్రెండు సంవత్సరాల నుంచి నా వద్ద సరుకులు అప్పుగా తీసుకోవడమేగాని వాటిని తిరిగి చెల్లించక వుంటివి. కావున నీవు వచ్చినదారిన తిరిగివెళ్ళుము. నాయింట నీవు అడిగిన బియ్యం పప్పులు లేనే లేవు అని కసురుకొని చెప్పినాడు. అప్పుడు దేవదాసుడు తనఇంటికి వచ్చి భార్య దేవదత్తతో జరిగిన విషయమంతయు చెప్పి విచారపడినాడు. బ్రాహ్మణులకు అన్నదానము చేయలేక పోవుచున్నానని. అప్పుడు దేవదత్త



దిగులుపడవద్దు దీనికి ఒక ఉపాయము వున్నది.

## ఏకోరామాచార్యులు నాగాభరణంను పుట్టలోనంచి తీయుట

మన కుమారుడు ఏకోరామాచార్యులుకు (ఇతనినే విరూపాక్షుడు అని కూడ పిలిచెదరు.) అతని చేతియందు శంఖము, చక్రము, పద్మము మొదలగు సాముద్రిక చిహ్నములున్నవి అందువలన మన కుమారుడు మనస్సులో పూని స్మరించుకుంటూ పాముల పుట్టదగ్గరకు వెళ్ళి పుట్టనందుండు కన్నములో చేయి పెట్టినచో అతనికి పరమేశ్వరుడు బంగారు కడియము ఇస్తాడండి నా మాటను విశ్వసించండి అని దేవదత్త చెప్పగా వెంటనే దేవదాసు తన కుమారుడు ఏకోరాముడిని పాముల పుట్టవద్దకు తీసుకు వెళ్ళి ఆ పుట్టలో వున్న కన్నము నందు చేయి పెట్టమనగా అప్పుడుఏకోరాముడు చేయి పెట్టగా అతని చేతికి పరమేశ్వరుడు బంగారు కడియాన్ని చేతికిచ్చినాడు. అప్పుడు ఏకోరాముడు పరమేశ్వరునికి కృతజ్ఞతలు తెలియజెప్పి ఆ కడియము తీసుకొనివచ్చి తన తల్లిదండ్రులకు ఇచ్చినాడు. అప్పుడు దేవదాసు గంగాధరశెట్టి వద్దకు వెళ్ళి బంగారు కడియమిచ్చి ఇది నీ దగ్గర తాకట్టుగా వుంచుము. నీకు నేను ఇవ్వవలసిన బాకి మొత్తము డబ్బులు తీసుకొనుము. బ్రాహ్మణ భోజనమునకు అవసరమైన బియ్యము, పప్పులు మొదలగునవి జాబితాలో చెప్పిన ప్రకారము ఇవ్వవలయును. దీనికి సంబంధించిన డబ్బులను కూడ తీసుకోండి. మిగిలిన డబ్బులు మీ వద్దనే వుంచండి. సరుకుల కొరకు వస్తాము కదా అని చెప్పినాడు. గంగాధరశెట్టి మిక్కిలి సంతోషించి తనకు రావలసిన డబ్బును జమ చేసికొనినాడు. బియ్యము, పప్పులు మొదలగువాటికి అయిన ఖర్చునుకూడ తీసుకొనినాడు. మిగతా పైకమును తన వద్దనే వుంచుకొనినాడు. సరుకులన్నింటిని శెట్టి దేవదాసు ఇంటికి చేర్చినాడు. అప్పుడు దేవదత్త వంటచేసిబ్రాహ్మణులందరికి వడ్డించినది. వారందరు తృప్తిగా భోజనము చేసి సంతుష్టులైనారు. చతురభద్రతరుడవగు మని బ్రాహ్మణులు ఆశీర్వదించినారు.

## బంగారు కంకణం కాజెయ్యాలని దుర్బుద్ధి పుట్టుట

దేవదాసు ఇచ్చిన బంగారు కంకణమును కాజెయ్యాలనే దుర్బుద్ధి శెట్టికి కలిగినది. వెంటనే అతనికి కంకణము పాముగా మారి బుసకొట్టు

చున్నదని గ్రహించి భయభ్రాంతుడైనాడు. వెంటనే బంగారు కంకణము తీసుకొని ఆమోద పట్టణమునకు వెళ్ళి దేవదాసును క్షమాపణ కోరినాడు. అయ్యా! ఈ బంగారు కంకణం పామువలె మారిబుస కొట్టుచున్నది. నాకు మిక్కిలి భయముగా వున్నది. దానిని నీకు ఇస్తున్నాను. దీనిని స్వీకరించి నన్ను కాపాడండి అని దేవదాసును ప్రార్థించినాడు శెట్టి. నీవు తీసుకున్న అప్పును నీకు సౌలభ్యం కలుగు విధంగా నా అప్పును నీవు తీర్చుము దేవదాసా స్వామీ. నీ వద్ద డబ్బులు వున్నప్పుడే ఇవ్వండి. ఈ కంకణమును మీ వద్దనే ఉంచండి అని భయపడుతూ చెప్పి వెళ్ళినాడు గంగాధరశెట్టి. అప్పుడు దేవదాసు వేగముగా శెట్టి ఇంటి వద్దకు వెళ్ళి కంకణమును తీసుకొని ఇంటికి తెచ్చినాడు. తరువాత దేవదాసు తనకున్న మిక్కిలి నైపుణ్యమును ఉపయోగించి ప్రసిద్ధమైన పనిని చేసినాడు.

## శివుని తలపాగా నేయుట

దేవదాసు మూడు వందల ఇరవై మూరలు పొడవు గలదిని పన్నెండు మూరల వెడల్పు గల ఒక దివ్యమైన నాజూకుగా వుండు వస్త్రమును నేసినాడు. దీని వెల నిర్ణయించుట కష్టతరమైనది. దానిని దేవదాసుడు ఆ దేశరాజు దేశింగరాజు వద్దకు తీసుకుపోయి చూపించినాడు. రాజు గారు ఆ వస్త్ర నిర్మాణ నాణ్యత, నాజూకుతనమునకు మిక్కిలి ఆశ్చర్యపడినాడు. దాని ధర నిర్ణయించటానికి వర్తకులను పిలిపించినాడు రాజుగారు. అప్పుడు వర్తకులు ఆ వస్త్రము వెల నిర్ణయించుటకు శక్తి చాలక పోయెను. వర్తకులలో ఒకరు ఈ వస్త్రం మూడు లోకముల విలువగా భావించి మూడువేళ్ళు ఎత్తిచూపగా వెంటనే మండుచున్న కాలాజ్ఞి వంటి విష్ణుచక్రము వచ్చి ఆ వర్తకుని మూడు వ్రేళ్ళను నరికివేసినది. అప్పుడు అక్కడ వున్న వారందరూ హాహాకారాలు చేసినారు. చివరకు ఈ వస్త్రం ధర నిర్ణయించలేనిది. దీనిని ధరించు అర్హత ఒక్క పరమేశ్వరుడికి తప్ప అన్యులకు సాధ్యపడదు అని తేల్చినారు. అప్పుడు దేవదాసుడు మిక్కిలి కోమలమైన ఆ వస్త్రమును తీసుకొని శ్రీశైలం వెళ్ళి మల్లికార్జున స్వామికి అలంకరించినాడు. ధ్వజపతాకముగా భక్తితో సమర్పించినాడు. అప్పుడు మల్లికార్జున స్వామి సంతోషం చెందినాడు. మల్లికార్జుస్వామి దేవదాసు యొక్క భక్తికి మెచ్చుకొని అతనికి అత్యంత విలువైన బంగారమును కానుకగా సమర్పించినాడు. దేవదాసా! నీవు శివభక్తులకు నిత్య



నిరతాన్నదానము చేయుము. నేనిచ్చుచున్న సొమ్మును దానికొరకై వినియోగించుము. లోకమున సకల మతములలో శైవమతము ప్రధాన మతమని ప్రజలలో వ్యాపింపచేయుము. ఆ తరువాత కైలాస లోకమునకు రమ్ము అని చెప్పి పార్వతీపతి అంతర్ధానమయినాడు. శివుడిచే ఇవ్వబడిన ధనమును తీసుకొని ఆమోదపట్టణమునకు వచ్చినాడు దేవదాసు. వెంటనే కోమటి శ్రేష్ఠి ఇంటికి వెళ్ళి అతనికి ఇవ్వవలసిన బాకీ మొత్తమును వెంటనే తీర్చివేసినాడు. ఆనాటి నుండి తన ఇంట శైవభక్తులను అతిథులుగా ఆహ్వానించి వారికి గౌరవ మర్యాదలు కల్పించి పూజించి అన్నదానం చేయుటను కొనసాగించినాడు.

## దేవదాసు మల్లికార్జునస్వామికి తలపాగా సమర్పించుట

దేవదాసు శ్రీశైలవాసునికి 320 మూరలు పొడవు, 12 అడుగుల వెడల్పు గల నాజూకు అయిన మిక్కిలి విలువ కలిగిన వస్త్రమును ధ్వజపతాకముగా సమర్పించుటతో శ్రీ శైల వాసుడు మిక్కిలి సంతోషించినాడు. అప్పటినుండి దేవాంగులు శ్రీశైలమునందు శివరాత్రి రోజు శివునికి తలపాగా సమర్పించుట ఆచారముగా వస్తున్నది. ఆ ఆచారము ఇప్పటికినీ కొనసాగుచున్నది. దేవదాసు వంశానికి చెందిన దేవాంగులు ఈ వస్త్రమును పవిత్ర భావం కలిగి నేసి శివుడికి సమర్పించుట జరుగుచున్నది. కావున ఈ శ్రీశైల తలపాగా ఆచారం దేవదాసు కాలం నుండి వచ్చుచున్నది అని తెలియుచున్నది. . దేవదాసుడు ఆమోదపట్టణము నందు శైవులకొరకు ఉత్తమమైన అన్నదానమును, యజ్ఞోపవీతదానమును చేసినాడు. లోకమున ఉత్తమమైన శైవమతమును, శైవపూజను, శైవమంత్రమును, శైవదీక్షను వ్యాపింపజేసినాడు. ఈ విధముగా లోకమంతటా శైవమత ప్రాబల్యము పెరిగే సరికి బౌద్ధులు తమ గురువును వెంటబెట్టుకొని తమ రాజ శ్రేష్ఠుడైన దేశింగు రాజు వద్దకు వచ్చిరి. ఈ దేశింగు రాజు బౌద్ధమతావలంబకుడు. బౌద్ధమత గురువు తన ఆస్థానానికి వచ్చు సరికి దేశింగ రాజు బౌద్ధగురువుకి అనేకసార్లు నమస్కరించి పూజా పురస్కారములు చేసి ఉన్నతాసనంపై కూర్చుండ చేసెను. అప్పుడు బౌద్ధమత గురువుతో రాజు గారు గురువుగారు క్షేమమేనా అను కుశల ప్రశ్నలు వేసినాడు. బౌద్ధగురువు చిరునగవుతో సంతోషించి కుశలమని బదులు ఇచ్చినాడు. బౌద్ధగురువు దేశింగ రాజును క్షేమ సమాచారములు

అడిగినాడు. స్వామీ! మీ దయవలన మేము సుఖమును పొంది యుంటిమి. కాని స్వామీ నాకు ఒక సమస్య వచ్చినది. నేను బౌద్ధమతమును అవలంబించుచున్నాను. కాని నా ప్రియురాలు ఇష్టసఖి అయిన రాణి సంగమ్మ శైవ మతావలంబికురాలు అయినది. ఆ చిన్నదానికి ఎన్నిసార్లు చెప్పిననూ శైవమతమును విడనాడుటలేదు. కావున మీరు రాణిగారికి బౌద్ధమతము అవలంబించమని ఉపదేశం చేయండి అని విన్నవించినాడు. దానికి బౌద్ధగురువు రాజుగారికి తన అంగీకారం తెలిపి అంతఃపురమునకు వెళ్ళి రాణిని కలిసినాడు. అప్పుడు రాణి బౌద్ధమత గురువుకు ప్రణామములు సమర్పించినది. బౌద్ధమత గురువు రాణితో బౌద్ధమత విశేషము గురించి బోధించినాడు. అప్పుడు రాణి సంగమ్మ బౌద్ధాచారమును విని తెల్లని చిరునగవు కలిగి పరిహాసముతో కూడి బౌద్ధగురువుతో ఈ విధంగా మాట్లాడినది. ఓహో ఇంతకు పూర్వము మా గురువుగారైన దేవదాసుడు రామలింగేశ్వరస్వామి సన్నిధియందు బౌద్ధులను జయించినాడు కదా అప్పుడు ప్రసిద్ధులైన బౌద్ధులు శైవమతమును స్వీకరించినారు కదా ఈ విషయము మీకు తెలియదా అప్పుడు బౌద్ధులందరి సమక్షములో రామలింగస్వామి ఈ విధముగ చెప్పినాడు. నేను పరమాత్ముడను, సర్వవ్యాపకుడను, శివుడిని, మోక్షము ఇచ్చువాడను నేను, నేను జ్ఞాన స్వరూపుడను అని అనేక విషయములను బౌద్ధులందరికీ వినిపించినాడు. ఈ ప్రకారము శివునిచే చెప్పబడిన పరమానందకరమైన మాటలు నీ చెవిన పడలేదా ఏమి బౌద్ధగురూ అని చెప్పగా బౌద్ధమత గురువు రాజును కలిసి జరిగిన సంవాదం అంతయునూ వివరించినాడు.

## బౌద్ధ గురువుకు దేవదాసునకు దివ్య పరీక్ష

అప్పుడు దేశింగు రాజు తన భార్యను పిలిపించినాడు. ఆమెతో మధురమైన ఒక మాటను చెప్పినాడు. ప్రియసఖీ సర్వజ్ఞుడు ఎవరో అని తెలుసుకొనుటకు పరీక్ష పెట్టదలచినాను. ఈ బౌద్ధగురువుకు దేవదాసునకు ఒక దివ్య పరీక్ష పెట్టి వారిలో సర్వజ్ఞుడును తెలుసుకొనుటకు ప్రయత్నించెదము. ఈ పరీక్షలో బౌద్ధగురువు జయించినచో మీ గురువు దేవదాసుడు బౌద్ధమత దీక్ష తీసుకోవలెను. దేవదాసు గురువు జయించినచో బౌద్ధగురువు శివదీక్ష స్వీకరిస్తాడు. కావున నీకు అభిమతమైతే మీ గురువుకు తెలియజేయవలెను.



మీ గురువు అంగీకరించినచో పరీక్షను ఏర్పాటు చేయదలచినాను అని చెప్పగా ఆమె తన అంగీకారాన్ని తెలిపినది. అప్పుడు దేశింగురాజు దేవదాసునకు కబురు పంపినాడు. దేవదాసు రాజుగారి వద్దకు వచ్చినాడు. అప్పుడు రాజు దేవదాసునితో బౌద్ధగురువు ఇచ్చటనే వుండి నందున నీ కొరకు కబురు పంపినాను అని తెలియజేసినాడు. బౌద్ధమత గురువు దేవదాసు సమక్షములో రాజు ఈ విధముగా పలికినాడు. గురువులారా!మీ ఇద్దరిలో సర్వజ్ఞుడు ఎవరో తెలుసుకోవాలని మాకు అనిపించినది. బౌద్ధగురువు జయం పొందినచో నీవు బౌద్ధమత స్వీకరణ చేయాలి. లేదా దేవదాసు జయమును పొందినచో బౌద్ధగురువు శివదీక్ష పొంది శైవమతమును అవలంబించెదరు. ఈ విషయము మీ ఇద్దరికీ సమ్మతమైనచో నేను దివ్యపరీక్షను పెట్టదలచినాను అని రాజు పలుకగా ఇరువురు గురువులు తమ సమ్మతమును రాజుగారికి తెలిపినారు. అప్పుడు రాజు ఒక కుండను తెప్పించి దానిలో ఒక పామును వుంచి దాని మూతిని గుడ్డతో కప్పివేసినాడు. రాజస్థానములోనికి దానిని తెప్పించినాడు. రాజుగారి ఆస్థానములోని సభ్యులు ప్రజలతో నిండి వున్నది. రాజుగారు, రాజు భార్య, బౌద్ధగురువు, దేవదాసులు కూడా సభకు వచ్చివున్నారు. అప్పుడు రాజు ఆ సభలో వున్న ప్రజలను వుద్దేశించి ఈ సభయొక్క విశేషమును తెలియపరచినాడు. ఈ ఇద్దరు గురువులలో ఏ గురువు జయం పొందితే ఆ గురువుకు సంబంధించిన మతమును రాజ్యములో అందరూ అవలంబించవలయును అని ప్రకటించినాడు. కుండను సభా మధ్యకు తెప్పించినాడు. ముందుగా బౌద్ధ మత గురువుకు నమస్కరించి మీరు సమాధానం చెప్పండి అని వారిని ప్రశ్నించినాడు. ఓ గురువులారా! ఈ కుండనందు ఉన్న వస్తువు ఏమిటో చెప్పండి అని మొదట బౌద్ధమత గురువును అడిగినాడు. దానికి బౌద్ధగురువు ఒక నిమిషము మౌనం వహించి ఆలోచించి ఆ కుండలో వున్నది ఒక పాము అని చెప్పినాడు. అప్పుడు రాజు దేవదాసుని అడిగినాడు మీరు చెప్పండి అని. అప్పుడు దేవదాసు ఏమని చెప్పినాడంటే ఆ కుండలో పాము కాదు ఉన్నది పాములను ఆభరణములుగా ధరించినవాడు సర్పభూషణుడు అయిన శివుడు అయిన రామలింగేశ్వరుడు ఆ కుండలో వున్నాడు అని చెప్పినాడు. అప్పుడు రాజు అందరి సమక్షములో కుండ మూత

విప్పించేసరికి అందులో పాము లేదు. నాగాభరణములు ధరించిన శివుడు ఉన్నాడు. అందరూ సంతోషమును వ్యక్తం చేస్తూ కరతాళధ్వనులు చేసినారు. అప్పుడు రాజు బౌద్ధమత గురువుతో ఈ పందెములో దేవదాసు జయము పొందివున్నాడు. కావున మీరు వేగముగా శైవమత లింగదీక్షను స్వీకరించండి అని బౌద్ధమత గురువునకు చెప్పినాడు రాజు.

## దేవదాసు రాజునకు లింగదీక్ష ఇచ్చుట

బౌద్ధగురువు దేవదాసునితో ఓ సర్వము తెలిసిన దేవదాసుడా సమస్త లోకములయందు పూజింపబడినవాడా ఇప్పుడు నాకునూ నా శిష్యులకును మహానుభావుడైన ఈ రాజునకును మోక్షమును ఇచ్చునట్టి శివదీక్షను ఇవ్వవలెను. ఈ దీక్ష వేదములయందును, ఆగమశాస్త్రములయందును చెప్పబడిన రీతిగా శివలింగ దీక్ష ఇవ్వవలెను అని బౌద్ధగురువు దేవదాసుని అడిగినాడు. అప్పుడు దేవదాసు వారందరికి శివలింగ దీక్షను చేసెను. శివ పంచాక్షరీ మంత్రమును ఉపదేశించినాడు. శివ పూజను తెలిపినాడు. ఆ విధముగా బౌద్ధులు శైవ మతమును స్వీకరించినారు. అప్పుడు ఆఘటములో అవతరించివున్న మహాదేవ స్వామిని ఆమోదపట్టణమునకు తీసుకువచ్చి యధా శాస్త్రరీత్యా ప్రతిష్ట చేసినాడుదేవదాసు. శిష్య బృందముల వారందరు ఆప్రతిష్టిత స్వామికి మొక్కులు మ్రొక్కుచుంటిరి. అప్పుడు దేవదాసుడు ఆ స్వామికి వేదోక్త మంత్రములచేత పూజను చేసినాడు. ఆతరువాత దేవదాసుడు కళ్యాణపురమునకు వచ్చినాడు. అక్కడ తపస్సు చేస్తున్న వారిలో శ్రేష్టుడైన జగద్దేవరాజును చూచినాడు. అప్పుడు బుద్ధిమంతుడైన ఆ జగద్దేవరాజుతన ఇంటికి వచ్చిన తన గురువును శాస్త్ర ప్రకారము పూజించినాడు. ఉన్నతాసనముపై కూర్చుండ జేసినాడు. అప్పుడు దేవదాసుడు జగద్దేవునకు అతని పట్టణమందలి ప్రజలందరికి విధి ప్రకారముగా శివలింగ దీక్షను చేయించినాడు. మరియు అతడు వారికి ధర్మ, అర్థ, కామ , మోక్షములు అనునట్టి చతుర్విధ పురుషార్థములను ఇచ్చెడు వంటి శివపంచాక్షరీ మంత్రమును, మోక్ష సామ్రాజ్యము ఇచ్చునట్టి శివపూజను వీరమాహేశ్వర వ్రతమును అందరికీ ఉపదేశించినాడు. అప్పుడు దేవదాసు ఆమోద పట్టణమునకు వచ్చినాడు. తన బంధువులతో కూడుకొని తన కుమారుడు ఏకోరామునకు (విరూపాక్షునికి) 9వ సంవత్సరమున ఉపనయనము చేయించినాడు. బ్రాహ్మణులకు అన్నదానము చేసినాడు. భూరి దక్షిణలు



ఇచ్చినాడు. మరియు పండితులుగానున్న శైవ బ్రాహ్మణుల కొరకును, శైవుల కొరకును మంచిశ్రేష్టములైన వస్త్రములను యజ్ఞోపవీతములను ఇచ్చినాడు. తరువాత దేవదాసుడు తన కుమారుడైన ఏకోరామునకు వివాహము చేయించినాడు. ఆ వివాహమునకు కైలాస లోకమందుండు సాంబశివుడు వచ్చినాడు. అప్పుడు దేవదాసు తనభార్యతోకూడి ఆ సాంబశివున్ని విధి ప్రకారము పూజించినాడు. ఆది, మధ్య, అంతములు లేని వాడా, భక్తుల యొక్క కష్టములను తీర్చువాడా ! యని దేవదాసుడు మ్రొక్కినాడు.

## ఏకోరాముడిని శైవ మత గురువుగా అభిషేకించుట

అప్పుడు పార్వతీపతి ఒక మధురమైన మాటను దేవదాసునకు చెప్పినాడు. ఓదేవదాసుడ! నీవు జగత్తు అంతయు శైవ మతమును వ్యాపింపజేసితివి. ఓయీ! కుమారుడా! ఇకమీద ఎవరు ఈ జగత్తునందు పుట్టెదరో వారికందరికి గురువుగా నుండునట్లు దయానిధి అయిన నీ కుమారుడు ఏకోరాముని (విరూపాక్షుడు) అభిషేకించుము. ఏకోరామునికి రుద్రుడు అను కొడుకు పుట్టును. రుద్రునకు కాలసేనుడు పుట్టును. రుద్రుడికిని, కాలసేనుడికిని బ్రహ్మచేత నిర్మింపబడిన కన్యలు భార్యలు అగుదురని చెప్పి శివుడు అంతర్ధానము పొందినాడు. అప్పుడు దేవదాసుడు సకల గుణములతో నిండియున్న తనకుమారుడు ఏకోరాముడిని శైవుడుగా అభిషేకించినాడు. ఈ ప్రకారముగా దేవదాసుడు శివుడు చెప్పిన విధముగా భూలోకమునందు అంతయును శైవ మతమును వ్యాపింప చేసినాడు. తన భార్యతో కూడుకొని నిరంతరము శివుని మనస్సున ధ్యానించుచుండెను. మనస్సునందే పూజించుచుండెను. మనస్సునందే సంకీర్తన చేయుచుండెను. ఈ విధముగా చేయుచు శివసాయుజ్యము పొందినాడు దేవాంగుడు తన సప్తావతారములను ఈ విధముగ చాలించినాడు.

## దేవాంగ సప్తావతార ప్రాశస్త్యము

శివునియొక్క ఫాలభాగము నందలి జ్ఞాన నేత్రమునుండి ఆవిర్భవించినాడు దేవాంగుడు. దేవాంగుడు వస్త్రములను యజ్ఞోపవీతములను సృష్టించి అర్హత కలిగిన వారందరికి ఇచ్చినాడు. దేవాంగుడు ఆవిర్భవానికి కారణమైన వస్త్ర నిర్మాణము చేసినాడు. అందరికి వస్త్ర ప్రదానము

చేసియున్నాడు. తరువాత బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు మాత్రము యజ్ఞోపవీతములతోపాటు వస్త్ర ప్రదానము చేసినాడు. కాని శూద్రులకు మాత్రం యజ్ఞోపవీతము ధరించుట నిషేధింపబడినది. శూద్రులకు కేవలము వస్త్రములు మాత్రమే ఇవ్వబడినవి. యజ్ఞోవీతము ధరించనందున వీరికి యజ్ఞ యాగాలయందు స్వయముగా పాల్గొనుట కుదరదు. దేవాంగుడు సృష్టిలోని నగ్నత్వమును (దిగంబరత్వము) తొలగించి వారికి రమణీయతను కల్పించడానికి వస్త్రములనిచ్చి వారినందరిని రమణీయులుగా తీర్చిద్దినాడు దేవాంగుడు. కాబట్టి యావత్ లోకముల వారికి వస్త్రములను ఇచ్చినాడు. అందువలన **విశ్వవస్త్ర ప్రదాత** అని దేవాంగునిని కీర్తించవచ్చును. దేవదాసు అవతారమునందు బౌద్ధమతమును ఖండించినాడు. జైనమతము, బౌద్ధమతము ఈశ్వరుడిని అంగీకరించని మతములు. అనగా ఈ యావత్తు సృష్టిని నడిపిచేవాడు ప్రత్యేకంగా వున్నాడు. అతను ఇష్టానుసారమే ప్రకృతి ఏర్పడుతుంది, వృద్ధిపొందుతుంది, రూపాంతరం చెందుతుంది అంతను అతని ఇచ్ఛానుసారమే జరుగుతుంది అని నమ్మిన వాటిని వేదచోదిత మత
ములు అందురు. సర్వేశ్వరుడు విషయమును నిరాకరించిన మతములు జైన బౌద్ధములను నిరీశ్వర మతములు అందురు. ఈశ్వరుడు అనగా లోకోత్తర పరమ పురుషుడని విశ్వసించి అతనిని కొలుచు మతములలో శైవ, వైష్ణవ, శాక్తేయ మతములు ముఖ్యమైనవి. పేరులువేరైనా, దైవంవేరైనా ఈశ్వరుడు అనువాడున్నాడు అని నమ్ముతాయి. కాని జైనం, బౌద్ధం ఈరెండు వ్యతిరేకంగా వుంటాయి. అందువలన ఈశ్వరుని పుత్రునిగా దేవాంగుడు తన సప్తావతారములో ఆరు ఏడు అవతారములైన దేవశాలి, దేవదాసావ తారములయందు ఈ నిరీశ్వర మతమును నిర్వీర్యం చేసి శైవమతాన్ని వ్యాపింపచేసినాడు. లోకంలో వున్న జనులకు వారి దిగంబరత్వాన్ని రూపు మాపుటకు వస్త్రములను నిర్మించి దేవ, దానవ, గంధర్వ, యక్ష, కిన్నర, కింపురుష, విద్యాధరా, నాగ, మానవాది జాతుల వారందరికి వస్త్రములను తన మానస పుత్రుడైన దేవాంగుని ద్వారా లోకజనులకు అందజేసినాడు శివుడు. త్రై వర్ణికులు అయిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య జాతులందరికి యజ్ఞోవీతము ప్రదానము చేస్తూ గాయత్రీ మంత్రమును తన మానస పుత్రుడు దేవలునిద్వారా ప్రసాదించినాడు. తద్వారా లోకములో వైదికవిద్యలు శాస్త్రాగమములు



నిరంతరము వృద్ధిచెందు విధముగా ఒక తరమునుండి మరొక తరానికివ్యాపింపజేసి తద్వారా యజ్ఞములు, యాగములు, దేవతార్చనలునిరంతరము భూమిమీద జరుగుటకు తోడ్పడుచుండినాడు మహాదేవుడు. తన మానస పుత్రుడైన దేవాంగునిద్వారా లోకానికి జ్ఞాననేత్రము అయిన విద్యను విశ్వవ్యాప్తము చేయడానికి సప్త అవతారములుగా ఏడు జన్మలు పొందింపజేసి ఒక నిర్దిష్ట ప్రణాళిక ప్రకారము విద్యలను ప్రజలకు అందుబాటులోనికి తెచ్చినాడు. దేవలోకమువారిభాషను మానవులు తెలుసుకొనితమకోర్కెలను దేవభాషలో దేవతలకు తెలియజేయుట కొరకు భాషా సంస్కారము చేసి మానవులలో దేవభాష చెక్కు చెదరకుండాయధావిధిగ వుండు విధముగ నవ వ్యాకరణములను భూలోకములో వ్యాపింపజేసినాడు దేవలుడు. తద్వారా మానవులు దేవతలకు అర్థమయ్యే విధముగా శబ్ద సౌష్టవము కలిగిన మంత్రాల ద్వారా దేవతలను సంప్రీతులుగా చేసుకొని వారినుండి తమ కోర్కెలను తీర్చుకొనుచున్నారు. అరవై నాలుగుకళలయదు అవసరమైన 78 శాస్త్ర గ్రంథములు దేవాంగునిచేత రచింపబడి వేదవాఙ్మయ శాస్త్రము నిర్దిష్ట రూపమున తీర్చిదిద్దబడినది. ఈ విధముగా లోకమునందులౌకిక విద్యలను, అలౌకిక విద్యలను ఏర్పరచి, వాటిని పెంపొందింపజేసి ప్రజలను జ్ఞానవంతులుగా వుండుట కొరకున్ను, వారిఆత్మ జ్ఞానమును పెంపొందింప జేయడానికి తన మానస పుత్రుడు దేవాంగుని ద్వారా శివుడు జరుగునట్లు చేసినాడు. తప్పుల తడకలతో వున్న శాస్త్ర ఆగమ గ్రంథములను, వ్యాకరణ, ఇతిహాస గ్రంథములను, వేదవేదాంగములయందును వున్న అపశబ్దములను సుశబ్దములుగా మార్చి శాస్త్రములను జీవింపజేసినాడు. బాహ్మణులకు స్వర సహితముగా వేదవేదాంత శాస్త్రములను బోధింపజేసివారిని పండితులుగా తీర్చిదిద్దినాడు శివుడు. తన మానస పుత్రుడు దేవాంగుని చేత లోకానికి ఇంత మేలు చేసినాను కావున భూలోకమున తనకు పూజలను సహజముగా చేయుచుంటారని భావించినాడు ఆదిదేవుడు. కాని నారదులవారు చెప్పినట్లుగా మచ్చుకు ఒక్క శైవుడైనా కనబడుటలేదు అని భూలోకములో శివుడిని పూజించేవారు కరువైనారని శైవమత ఆనవాళ్ళుకూడా వుండటం లేదని తెలుసుకొని తనకు భూలోకములో పూజలు జరిగే విధంగాను, శైవ మత వ్యాప్తి జరిగేటందుకుగాను, ప్రజలు శైవ వ్రతములు ఆచరింపజేయుటకుగాను, ప్రజలు యదార్ధ దేవుడు

గ్రహించులాగున చేయుటకుగాను మోక్షము సులువుగ సాధింపబడుటకు శైవపూజ అవసరము అని ప్రజలకు తెలియజేయటం కొరకును, ప్రజలయొక్క ఈతిబాధలు తొలగిపోవుటకును ధర్మార్థకామ మోక్షములను కలుగజేసేటటువంటి శివపంచాక్షరీ మంత్రమును, శివలింగ దీక్షను ప్రజలు స్వీకరించి సుఖశాంతులతో వర్ధిల్లాలని తన మానస పుత్రుడైన దేవాంగుని ద్వారా విద్యా వ్యాప్తిని శైవమత వ్యాప్తిని గావించినాడు శివుడు. నిరీశ్వరమతాలైన జైన, బౌద్ధ మతాల వ్యాప్తివలన ప్రజలకు పరంధాముడు ఎవరు, మోక్ష విద్య ఏది అని తెలుసుకొనేటట్లు చేయడానికై ఏడవ అవతారముద్వారా ప్రజలను గాడి తప్పనీయకుండా చేసినాడు. అశాశ్వతమైన సుఖాలను కలుగజేసే జైన బౌద్ధమతాలను ఖండించినాడు శివుడు. ఇకనుండి భూలోకములో పుట్టువారందరికి శివదీక్ష ఇచ్చుటకు, లింగదీక్ష ఇచ్చుటకు, పంచాక్షరీ మంత్రోపదేశము ఇచ్చుటకు, శైవమత వ్యాప్తికి, లోకములోని జనులందరికివిశ్వగురువుగా వుండడానికి దాసమయ్య కుమారుడైన ఏకోరాముడిని (విరూపాక్షుడిని)పట్టాభిషిక్తునిచేసి లోకప్రజలకు ప్రపంచ జనులందరికి వర్తింపజేయు విధముగా విశ్వగురువుగా ఏకోరాముడు వారి సంతతతికి వారసత్వంగా పొందేవిధంగా ఏర్పాటు చేసినాడు శివుడు.కావున శివుడు తనమానస పుత్రుడు దేవలుని ద్వారా లోకక్షేమంకోసం సమస్త జనుల సుఖముకొరకు మహత్తరమైన కార్యములు నెరవేర్పింప చేసినాడు. కాబట్టి శివుని ఆజ్ఞ ప్రకారము మానసపుత్రుడు దేవాంగుడు సర్వకార్య సమర్ధునిగా ప్రకాశించినాడు. బ్రహ్మచేసిన సృష్టిలోవున్న దిగంబరత్వాన్ని తొలగించి సృష్టికి రమణీయతను కలిగించినాడు. బ్రహ్మ లోకాలను సృజించి సృష్టికర్త అయితే దేవాంగుడు వస్త్రములను, యజ్ఞోపవీతములను, స్త్రీలు ధరించు మాంగల్యమునకు దారమును అందించి మనుబ్రహ్మగా పిలువబడినాడు. కైలాసలోకములో శివుని కచేరియందు దేవలుడు వస్త్రప్రదానము చేయు సందర్భములో శివుడే దేవాంగుని చేతిలోని వస్త్రములను తీసుకొని తనే అందరికి అనగా దేవజాతులందరికి స్వయముగా వస్త్రములను ఇచ్చినాడు. కాని ఆయన కొలువుకూటములో వుండిన రాక్షసులకు మాత్రము వస్త్రములను ఇవ్వలేదు. అందరికీ ఇచ్చి ఆ ఒక్క రాక్షసులకు ఇవ్వకుండా వున్నాడు శివుడు. అప్పుడైనను రాక్షసులు వెళ్ళి దేవా మాకుకూడా వస్త్రములు ఇవ్వండి అని అర్థించలేదు. వస్త్రముల కొరకు తపస్సుచేసిశివున్ని ప్రసన్నం చేసుకొని తమజాతి



వారికికూడా ఇవ్వమని అడగలేదు. దేవతలకు ఇచ్చినందుకు దేవతలు సంతోషించుచుండిరను ఆక్రోశం చెంది శివుడికొరకు తపస్సుచేసి లోకమునకు వెలుగు, కాంతి, శక్తిని, జీవమును ప్రసాదించే సూర్యుడు ఉదయించకుండా వుండాలని కోరినారేగాని, శివుడు తమ తపస్సుకు మెచ్చుకొని నప్పుడు సంతోషముతో తమరు మాకుకూడా వస్త్రములు ఇవ్వవలయును అని అడిగిన వారుకారు. కాని సమస్త విశ్వంలో సకల దేవజాతులు, మానవులు, నాగులకు ఇతర జాతుల వారందరికి వస్త్రములు ఇవ్వబడి ఆ ఒక్క రాక్షసజాతికి ఇవ్వకపోవటం వలన వస్త్ర నిర్మాణ ప్రదాన కార్యక్రమం సంపూర్ణంగా నెరవేరినట్లుగాక కొరతతో మిగిలివున్నది అనే సంకేతం వుండేది. ఎవరైనను వారివారి కర్మానుసారం ప్రవర్తిస్తారు కావున అందరిని సమదృష్టితో చూడాలి అను ప్రాథమిక న్యాయమును నెరవేర్చుటలో దేవలుడు ముందంజలో వుండినాడు. రాక్షసులకు నేతవిద్య స్వయంగానేర్పి వస్త్రములను వారే స్వయముగా నేసుకొనే విధంగా శిక్షణ ఇచ్చి వారిద్వారానే వస్త్రములను నిర్మంపజేసి వారికి వారే వస్త్రములను ఇచ్చు రీతిగా దేవలుడు వ్యవహరించినాడు. ఈ విధంగా పరమేశ్వరుని వస్త్రప్రదాన కార్యము సంపూర్ణముగా ముగియునట్లు దేవలుడు చేశాడు. చక్కని చుక్కైన అందమైన వనితకు చంద్రబింబంలాంటి మొఖము కలిగిన సౌందర్యరాశికి బుగ్గన ఒక తెల్ల మచ్చవుంటే ఆమెసౌందర్యం ఏవిధంగా వెలవెలపోతుందో అదేవిధంగా రాక్షసజాతికి వస్త్రములు ఇవ్వకపోతే వస్త్ర ప్రదాన కార్యముకూడా వెలవెల పోయేది. కాని దేవలుడు రాక్షసులకు వస్త్రములు ఇచ్చి ఇంకొక వస్త్రకర్త కావాలనే అంశంలేకుండా చేసినాడు. ఈ విధంగా తండ్రి పూర్తిచేయలేక పోయిన కార్యాన్ని మానసపుత్రుడు దేవాంగుడు పూర్తిచేసి **తండ్రిని మించిన తనయుడు** అని అనిపించు కొనినాడు. మన్మధుడు శివునిపై తన పంచ పుష్పబాణములను వదలి శివునికి కామ జ్వరం తెప్పించలేక పోయినాడు. వసంతుడు ఎంత ఆహ్లాద వాతావరణం కల్పించినను, పక్షుల కిలకిల రావాలు పలికించినను వాతావరణమును నయనానందకరంగా రూపొందించినను మోహమును పొందకుండా నిశ్చలంగా తన తపస్సును కొనసాగించినాడు శివుడు. అంతేనా తన తపస్సును భంగం కావించిన వారు ఎంతటివారైనా సరే సహించేది లేదని మన్మధున్ని భస్మంచేసినాడు. ఈ విధంగా కామమోహితుడు కాడు అని శివుడు నిరూపించు కొనినాడు శివుడు. నిశ్చలమైన మనస్సుకు, తపస్సుకు,

యోగమునకు శివుడు పెట్టింది పేరు. అదేవిధముగా త్రిలోక సుందరియైన రంభ అతిలోక సుందరుడైన దేవాంగుని చూడగానే కామజ్వరము కలిగి మన్మధ వికారము పొందినది. లోకములో అందరూ తనవెంట తిరుగుతారు. తన సుఖభోగాలే వారికి పరమార్ధములు అనిఅనుకున్నది రంభ. మరి అందరు ఆమెవెంట పడుతుంటే ఆమె దేవలుని వెంట పడినది. దేవలునితో తన కోరిక తీర్చుకోవాలని ఎంత ఉగ్రూతలూగిందో తెలుసు. లోకంలో సమఉజ్జీతోనే చెలిమి చేయాలని తాను త్రిలోక సుందరిని కాబట్టి అతిలోక సుందరుడైన దేవలునితో పొందు సమ ఉజ్జీతో పొందు లాంటిదని అది మహత్తరమైనదని రంభ భావించినది. ఎంత బ్రతిమిలాడినను, వేడుకొనినను, పొగిడినను, నిందించినను, ఈసడించినను ఆమెను మాత్రము తాకనేతాకలేదు దేవలుడు. రంభకూడా మాటల ద్వారానే అతని ఒప్పించి మెప్పించి తన కార్యము నెరవేర్చుకోవాలి అనుకున్నదే గాని అమాంతం దేవలుడిమీద పడలేదు. దేవలుడు రంభను తాకనైనా తాకలేదు. చివరకు రంభ తనయొక్క అహం (ఇగో) దెబ్బతినేసరికి ఆత్మరక్షణలో పడింది. వలచివచ్చిన ఆడదంటే ప్రతి పురుషునికి చులకన అని భ్రమలోపడినది. వ్రతం చెడినా ఫలితం దక్కాలని ఎంతగానో ఆరాటపడినది. అనగా ఎక్కువమంది ఋషులు, దేవతలు తనతో సంభోగంకోసం ఎదురుతెన్నులు చూస్తారు. అటువంటి తను వచ్చి అడిగితే ఎటువంటివారైనను లొంగిపోతారనే అహం కలిగివున్నది కాబట్టి అతిలోక సుందరుడైన దేవలుని వద్దకు వచ్చిన రంభకు శృంగభంగమైనది. ఎటూ వచ్చినాను కాబట్టి నయానో భయానో బుజ్జగించో తను అనుకున్న పనిని సాధించుకోవాలని అనుకున్నది రంభ. తనతోటివారివద్ద అపనిందలు పడేకన్నా అతడిని ఒత్తిడి చేసైనాసరే తనదారికి తెచ్చుకోవాలనుకున్నది. చివరకు చేతగాక తన అసహనమును దేవలుడిపై ప్రకటించివెళ్ళినది. ఈవిధముగా దేవలుడు కామానికి లొంగకుండా లోకానికి ఆదర్శముగానిలిచినాడు. **శివుడి చేతిలో మన్మధుడు భస్మమైపోతే దేవలుని చేతిలో రంభ భంగపడినది. ఈ విధముగా దేవలుడు తంత్రితగ్గతనయుడు అనిపించుకొనినాడు.**

దేవలుడు వస్త్రములను నిర్మించిన తరువాత ముందుగా తనను జన్మింపజేసినతల్లిదండ్రులకు వస్త్రములు ఇవ్వలేదు. సకల దేవజాతులవారికి



ముందుగా ఇచ్చినాడు. తంతువులు ఇచ్చినలక్ష్మీనారాయణులకు ఇచ్చినాడు. బ్రహ్మ, సరస్వతి దేవతలందరికి ఇచ్చినాడు. సప్తద్వీపములోనున్న వారందరికి వస్త్రములను ఇచ్చిన తరువాతనే కైలాస లోకమునకు వెళ్ళి తనను జన్మింపజేసిన తల్లిదండ్రులకు వస్త్ర ప్రదానముచేసినాడు. అనగా **అందరి ఆనందములో తన ఆనందముకూడ కలసివున్నదని ఋజువు పరచినాడు దేవలుడు.** దేవలుడు ముందుగా కైలాసములో ఇచ్చి తరువాత మిగతావారికి వస్త్ర ప్రదానము చేసినట్లయినచో సాధారణవ్యకిత్త్వము కలవాడుగానే అందరిలాంటి వాడుగానే మిగిలిపోయేవాడు. కాని దేవాంగుడు ఆ విధముగా చేయక లోకానికి ఉత్తమ సాంప్రదాయాన్ని అందించినాడు. తనకు పునర్జన్మకలిగించిన చౌడాంబికను స్మరించి ఆరూపములో వున్నపార్వతీదేవికి మరలా వస్త్రాలను ఇచ్చినాడు. అనగా శివునిభార్యగా ఒకసారి కచేరీలోనే వస్త్రాలను ఇచ్చినాడు. తనను కాపాడుటకు ఏ స్వరూప స్వభావాలతో ఆ దేవి వచ్చినదో ఆ రూపములో వున్న దేవికూడా వస్త్రాలు ఇవ్వాలని, తనను రక్షించడానికే చౌడేశ్వరీదేవి అవతారములో వచ్చినది. సాధారణ సమయములో పార్వతి ఆ చౌడేశ్వరీరూపముతో వుండదు కాబట్టి ఆ రూపానికికూడా గౌరవమును ఇచ్చి వస్త్రములు ఇవ్వాలనే ఆలోచన కలిగివున్నాడు దేవలుడు. ఇది దేవలుని విశాలతత్వానికి ప్రతీక. **మేలుచేసినవారిని ఎన్నటికి ఎప్పటికి మరచిపోరాదని దీనిద్వారా తెలియజేసినాడు.**

వజ్రముష్ట్యాది రాక్షసులు స్వర్గలోకమునకు వెళ్ళి దండెత్తినారు. దేవతలను భయుభ్రాంతులను చేసినారు. ఇంద్రుడు వారిని శిక్షింపలేకపోయినాడు. రాక్షసులచే మిక్కిలిబాధింపబడినారు. గత్యంతరములేక శివుడిని శరణు వేడినారు దేవతలు. అప్పుడు శివుని ఆజ్ఞమేరకు దేవాంగుడు ఇంద్రునివెంట స్వర్గలోకానికి వెళ్ళి దేవతల పక్షమున రాక్షసులతో హోరాహోరీగా పోరాడినాడు ఇంద్రునకు విజయముచేకూర్చినాడు. కాబట్టి ఇంద్రునికి సాధ్యము కానిపనిని దేవలుడు తన గొప్ప భుజబల పరాక్రమముతో అస్త్రశస్త్రాలతో రాక్షసులను తరిమితరిమికొట్టినాడు. **కావున దేవాంగుడు అపరిమిత పరాక్రమవంతుడు, ధైర్యశాలి అని దీనిద్వారా చెప్పకతప్పదు.**

సాధారణంగా చాలామంది మహర్షులు దేవతలు కొందరు తనను

శపించిన వారికి వెంటనే ప్రతిశాపము ఇచ్చెదరు. దేవలుడు ఆ విధముగా గాకుండా తనకు శక్తివున్నను నిష్కారణముగా తనను రంభ శపించినదని ఆగ్రహోదగ్రుడు కాలేదు. రంభకు ప్రతిశాపము ఇవ్వలేదు. తనను శపించిన రంభను నాకు శాప విమోచనము ఎప్పుడు కలుగుచుందని ప్రాధేయపడలేదు. స్త్రీ సహజమైన చపల చిత్తముతోకూడి రంభ ఈ విధముగా ప్రవర్తించినది అనుకున్నాడేగాని బాధపడలేదు కంగారుపడలేదు భయం చెందలేదు. ఇది అంతా శివుడి ఇచ్ఛానుసారమే జరిగి వుంటుంది అని అనుకున్నాడు. కావున **దేవలుడు సాత్త్విక బుద్ధి కలిగి స్త్రీని గౌరవించు స్వభావము కలిగివున్నాడు అని దీనివలన తెలియుచున్నది.**

దేవలుడు తన ప్రధాన అవతారముతోపాటు సప్తావతారములు ఎత్తినాడు. ఈ ఎనిమిది అవతారములయందు దేవలుడు చేసిన కార్యములన్నియు అన్నీ లోకములవారికి శాశ్వత ప్రయోజనము, సుఖము కలిగించునవిగానే వున్నవి. దేవలుడి కార్య ప్రతిఫలములను లోకములోని అన్నిజాతులు సమూహములు పొందినవి. అందరూ అనుభవించుచున్నారు కాబట్టి దేవలుడు అందరివాడు. అందరికి దేవుడు. దేవలుడు అన్ని దేవజాతులవారికి వస్త్రములు యజ్ఞోపవీతములు ఇచ్చినాడు. కావున దేవతలయొక్క శరీరాంగములను తన వస్త్రములచే అలంకరింపచేసినాడు కావున దేవాంగుడు అని శివమానస పుత్రుడు పిలువబడినాడు. సప్త ద్వీపములలోవున్న మానవ జాతి అందరికి వస్త్రములను ఇచ్చినాడు. ఆవిధముగా మానవుల అంగములను తన వస్త్రములచే అలంకరింపబడు విధంగా చేసినందునదేవాంగుడిని మానవాంగుడు అని కీర్తించవచ్చును . ఈ విశ్వంలో ఒక జాతికాదు ఒక దేవతకాదు అన్ని దేవజాతులకు అందరు దేవతలకు మానవులు, నాగులు, రాక్షసులు ఇలా ఒకరేంటి అన్ని జాతుల వారికి వున్న దిగంబరత్వాన్ని తొలగించి వారి శరీర అంగములను తన వస్త్రములచేత అలంకరింపబడుట చేసినందున శివమానస పుత్రుడిని **విశ్వాంగుడు లేదా విశ్వ జనాంగుడు, విశ్వ వస్త్ర ప్రదాత** అని కీర్తింపవచ్చును. శారీరకముగా రమణీయతను కల్పించటమేగాక మానవులకు బుద్ధిని వికసింపజేయడానికి అవసరమైనది ప్రధానమైనది విద్య. అటువంటి విద్యను విశ్వవ్యాప్తం చేయుటకు



ఏడు జన్మలు యెత్తి విశ్వంలోని నరులను విద్యావంతులుగా చేసినందున శివమానస పుత్రుడైన దేవాంగుడిని **విశ్వ విద్యాప్రదాత** అని కీర్తింపవచ్చును. ఇక నుండి ఈ భూమిపై జన్మించు వారందరికి గురువుగా అభిషేకింపబడినాడు ఏకోరాముడు (విరూపాక్షుడు). అతని వంశం వారు ఆ పీఠమును అలంకరించిన వారిని విశ్వ గురువులుగా కొనియాడబడతారు. ప్రస్తుతము ఆ పీఠమును అలంకరించిన దేవల వంశ సంజాతులు శ్రీశ్రీశ్రీ దయానందపురి స్వామీజి వారు. వీరు ఏకోరామాచార్యుని వంశము వారు కాబట్టి శ్రీ దయానంద స్వామీజివారు విశ్వగురువులుగా కీర్తింపబడవలయును. వీరు గాయత్రీ పీఠ అధిపతులుగాకూడా వున్నారు. దేవాంగ వంశస్తులకు కుల గురువులుగా ఉన్నారు. కావున శివుని ఫాల నేత్రమునుండి ఆవిర్భవించిన శివమానస పుత్రుడు దేవాంగుడు. తనసప్తావతార సమాప్తిలో దేవాంగ వంశంలో ఎవరైతే శైవ పీఠం అధిరోహించినారో (గాయత్రీ పీఠం) వారిని విశ్వ గురువులుగా పేర్కొనవలయునని చెప్పిన దేవదాసుడి వాక్యములను విశ్వసించెదము దానిని ఆచరించెదము. దేవదాసుడి కుమారుడు ఏకోరాముడు. ఏకోరాముడి కుమారుడిగ రుద్రుడు పుట్టినాడు. రుద్రునికి కాలసేనుడు పుట్టెను.దేవాంగ వంశములో విశ్వ గురు స్థానమును అలంకరించినది ఏకోరాముడు, రుద్రుడు, కాలసేనుడు అను వారు అధిష్టించి విశ్వగురువులు అయినారు. ప్రస్తుతం ఆ పీఠమును అధిష్ఠించిన వారు శ్రీశ్రీశ్రీ దయానందపురి స్వామి. వీరిని గాయత్రీ పీఠాధిపతులుగా కూడా కొలిచెదరు. వీరిని విశ్వగురువులుగా అనగా దేవాంగుని సప్తావతారములయందు విద్యను విశ్వవ్యాప్తి చేసిన అతని వంశం వారు కావున మరియు దేవాంగుడి సప్తావతారములలో ఆఖరి అవతారమైన దేవదాసుచే ప్రకటింపబడినది కావున విశ్వానికి గురువులుగా దేవాంగ వంశం వారు వంశపారంపర్యంగా వుండెదరు. ప్రస్తుతం ఆ పీఠమును అలంకరించిన శ్రీశ్రీశ్రీ దయానంపురి స్వామీజీ మహరాజ్ వారిని విశ్వగురువులుగాను, వస్త్ర యజ్ఞోపవీత ప్రదాత దేవాంగుని వారసునిగాను మనమందరము కొలిచెదము. తద్వారా శివునిమనోరథమును తీర్చిన వారము అవుతాము.

ఇట్లు శ్రీ బ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరితమున
ఇరవై ఎనిమిద అధ్యాయము పరిపూర్ణము



# దేవాంగ వంశ కథనము

## ఇరవై తొమ్మిదవ అధ్యాయము

తరువాత జరిగిన కథను సూతపౌరాణికుడు శౌనకాది మహర్షులకు చెప్పుచున్నాడు. ఆమోద పట్టణమునకు ప్రభువైన దేవదాసుని కుమారుడు ఏకోరాముడుకి (విరూపాక్షుడు) మిక్కిలి పరాక్రమ వంతుడైన రుద్రుడు అను కుమారుడు కలిగినాడు. మిక్కిలి భుజబలముగల ఏకోరాముడు (విరూపాక్షుడు) తన కుమారుడు రుద్రుడిని ప్రీతితో తన రాజ్యమందు గురువుగా పట్టాభిషేకము చేసి తాను స్వర్గమును పొందినాడు. రుద్రుడు తనదైన శిష్య సమూహమును పాలించుచు సుందరములైన వస్త్రములను నేయుచు భూమియందలి జనులందరికి ఇచ్చుచుండెను. ఆమోద పట్టణమునకు ప్రభువైన రుద్రుడు ఈశ్వరుని ఆజ్ఞ ప్రకారము బ్రహ్మచే నిర్మితమైన కన్యను తాను శాస్త్రోక్త పద్ధతిలో వివాహమాడెను. రుద్రుడు ఆమెయందు బ్రహ్మవర్చస్సు కలిగి సమస్త శుభ లక్షణములు గల కాలసేనుడు అను కుమారుడుని జన్మింపజేసినాడు. త్రిలింగ దేశమునకు ప్రభువైనట్టియు నిజము పలుకువాడును అగు సోమనాధుడు అను శైవుని కుమార్తె మంచి రూపముతో వున్నది. ఆ కన్యపేరు దుర్గళ. రుద్రుడు తన కుమారుడు కాలసేనుడికి దుర్గళతో వివాహము చేసినాడు. రుద్రుడు తన కుమారుడు కాళసేనుడికి ఆమోద పట్టణమును పాలించు బాధ్యత అప్పచెప్పినాడు. కాళసేనుడు ఆమోద పట్టణమును పాలించుచు వస్త్రములు నేయుచు వాటిని అందరికి ఇచ్చినాడు. వివాహము అయి చాలాకాలము జరిగినను కాలసేనుడికి సంతానము కలుగలేదు. సంతానము కలుగలేదనే చింతతో కాలసేనుడు వున్నాడు. సంతానము కోసం పట్టుదలతో వున్న కాళసేనుడు బ్రహ్మ నిర్మిత కుమార్తెలు నూరుమందిని వివాహమాడినాడు. అయినను అతనికి కుమారుడు జన్మించలేదు. నూరుమందిని వివాహము చేసుకొనినను ఒక్క పుత్రుడు కూడా జన్మించలేదు అని వ్యాకులత చెంది విసుగు చెంది చివరకు పుత్రసంతానము కొరకు పరమేశ్వరుని గూర్చి తపస్సుచేయుచుండెను. ఎల్లప్పుడు శివుని ధ్యానము చేయుటయందు ఆసక్తుడై శివునియందు ధృఢభక్తి కలవాడై వుండినాడు. శివునియందు నిశ్చలమైన



మనస్సుతో వుండి ఆహార విహారములయందు నియమనిష్టలు గూడినవాడై శివుడిని పూజించినాడు. అప్పుడు మహాదేవుడు అగు సాంబశివుడు కాలసేనుడి ధృఢభక్తికి సంతోషము చెంది అతనికి పదివేలమంది కుమారులు కలుగునట్లు వరము ఇచ్చినాడు. తరువాత ఆమోద పట్టణాధీశుడు కాలసేనుడికి సాంబశివుని అనుగ్రహము వలన పదివేల మంది పుత్రులు కలిగినారు. కాళసేనుడికి కలిగిన పదివేలమంది కుమారులలో కొంతమందిపేర్లు ఈవిధంగా వున్నాయి. జ్యేష్ఠకుమారుని పేరు రూపసేనుడు. అతని తరువాత భద్రసేనుడు, సత్యసేనుడు, చిత్రసేనుడు, సుషేనుడు,యజ్ఞసేనుడు, సేనాబింధువు, యజ్ఞబిందువు, తృణబిందువు ,జటాధరుడు, జయవంతుడు, జయశీలుడు, జయబిందువు, జితేంద్రియుడు, సత్యవ్రతుడు, సత్యవాది, సుందరాంగుడు, త్రిలోచనుడు, సాంబుడు, శారస్వతుడు, చైత్రుడు, సర్వజ్ఞుడు, సర్వభావకుడు, సంవిదానుడు, సంప్రహారుడు, సమగ్రుడు, సత్యభాషణుడు, సరసుడు, సాహసి, సహస్వంతుడు, సముఖుడు, సురానందుడు, సులభుడు, సుందరుడు, సుందరీప్రియుడు, శతానందుడు, శంభుదేవుడు, శంకరుడు, శివదర్శనుడు, మొదలగువారు పదివేలమంది కుమారులు జన్మించినారు. కొంతకాలము తరువాత కాలసేనుడు తమ కుమారులకు ఋషిశ్రేష్టులచేత ఉపనయనమును చేయించినాడు.

## దేవాంగ వంశం ఏర్పడుట

కాలసేనుడు తన కుమారులకు సకల విద్యలను నేర్పించినాడు. బ్రహ్మచే నిర్మింపబడిన కన్యలను తెచ్చి కాలసేనుడు తనకుమారులకిచ్చి వివాహము జరిపించినాడు. కాళసేనుడి కుమారులకు ఎవరిచేత ఉపనయనం జరిపించినాడో ఆ ఋషులు మనువు మొదలగు వారందరు అతని కొడుకులకు కూటస్థులైరి. ఆ కొడుకులకు మనువు మొదలగు ఋషుల గోత్ర బేధమువలన నొకరినొకరుకు కూతుళ్ళను ఇచ్చుటకును, పుచ్చుకొనుటకును యోగ్యతను పొందినారు. అప్పుడు కాలసేనమహారాజు తన పెద్దకుమారుడు రూపసేనుడుపై వున్న ప్రీతివలన వీర శైవులకు గురువై వుండమని పట్టాభిషేకము చేసినాడు. మిక్కిలి పరాక్రమముగల ఆరూపసేనుడు తన ఆమోదపట్టణమును పాలించుచుండెను. తన తమ్ముళ్ళతో కూడి వస్త్రములు నేయుచు జన ప్రపంచమునకు ఇచ్చుచుండెను. కాలసేనుడు బహుకాలము కొడుకులతో సుఖముగా ఆమోదపట్టణమును

పాలించుచు, వస్త్రములిప్పించుచు సుఖమును పొందినాడు. కాలసేనుడు ధర్మబుద్ధి కలవాడై తన తమ్ముళ్ళతో ఆమోదపట్టణమును పాలించినాడు. కాలసేనుని కుమారులందరు ఈ ప్రకారముగా దేవాంగ వంశమందు జన్మించినవారై సముద్రముయొక్క అలలవలె భూమియందు మిక్కిలి వృద్ధి పొందిరి. ఋషులచేత ఉపనయనము చేయబడిన కాలసేనుని కుమారుల గోత్రములు మొదట నూటరెండు వున్నవి. అవి క్రమమగా పదిహేనువందల గోత్రములు అయినవి. మూడు లక్షల ఏబదివేల ఇండ్లు గలవారుగా వృద్ధిచెందినారు. కాలసేనుడిచే జన్మించిన దేవాంగ వంశములో వారిలో కొందరు నారదుని ఉపదేశమువలన వైష్ణవులు అయినారు. తక్కినవారు పరిశుద్ధ శైవులుగా వుండినారు.

## దేవాంగ చరిత్ర మహిమ

శౌనకాది ముని పుంగవులారా! పవిత్రమైనదియును పాపానాశకర మైనదియును అగు దేవాంగ చరిత్రను మీకు చెప్పితిని. ఎవరు దీనిని చదివెదరో ఎవరు దీనిని విందురో, ఎవరు దీనిని వినిపించెదరో వారికి సర్వకార్యములు సిద్ధించును. దీర్ఘాయురారోగ్య పుత్రపౌత్ర ధనకనక వస్తువాహనములు సమృద్ధిగా కలిగివుండెదరు. ఈ దేవాంగ చరిత్రను పారాయణం చేయునప్పుడు ముందుగా పౌరాణికుడు (పురాణములు చెప్పువారు) ని పూజించవలెను. ఆతరువాత పురాణమును వినవలయును. ఆ విధముగా వినువారికి మహాదేవుడి అనుగ్రహమువలనను మరియు పార్వతీదేవి అనుగ్రహమువలనను కోరినకోర్కెలన్నియు నెరవేరును. ఈ విధముగా వ్యాస మహర్షి శిష్యుడగు సూతుడు చెప్పిన బ్రహ్మాండ పురాణ ఉత్తర ఖండములోని దేవలమౌని వృత్తాంతమును పుణ్యప్రదమైన దానిని విని శౌనకాది మునీంద్రులందరూ పరమానందము పొందినారు. వేదములు ఎంత పవిత్రమైనవో, ప్రామాణికమైనవో అపురుషేయములైనవో అదే విధముగా బ్రహ్మాండ పురాణము ప్రామాణికమైనది.

## ముగింపు

ఈ దేవాంగ చరిత్ర బ్రహ్మాండ పురాణములోనే వున్నందున దేవాంగ చరిత్ర ప్రామాణికమైనది. ప్రతి ఒక్కరిచే పూజనీయమైనది. దేవలుని చరిత్ర



ఒకజాతి వారికో, ఒక మతమువారికో, ఒక కులమువారికో, ఒక ప్రాంతము వారికో, ఒక భాషవారికో, ఒక సామాజి వర్గమువారికో ఒక రాష్ట్రానికో, ఒక దేశానికి సంబంధించినదిగా కాకుండా సర్వవ్యాప్తి ప్రపంచమందలి మానవ జాతి అందరికి చెందినది. దేవాంగుడుగా, మానవాంగుడుగా, విశ్వజనాంగుడుగా, విశ్వవస్త్ర ప్రదాతగా, విశ్వ విద్యావ్యాప్తి కారకుడుగా, విశ్వ జన గురువుగా దేవలుని లేదా దేవాంగ చరిత్రను అందరూ చదవాలి. ఆయనను ఆయన చరిత్రను గుర్తుంచుకొనుట ద్వారా ఆయనకు కృతజ్ఞతలు తెలుపుట జరుగినట్లుండును. ప్రపంచమందలి దిగంబరత్వాన్ని పారద్రోలుటకు మహా సాయుజ్య స్థితిలో వుండికూడ లోక క్షేమకరమైన పనికి దివ్య సాయుజ్య స్థితిని తాత్కాలికంగా ఉపసంహరించుకొని మానవాళి అభ్యున్నతికి కృషిచేసిన మాననీయుడు, మహనీయుడు, పూజనీయుడు, ప్రాతఃకాల స్మరణీయుడు, ప్రజల గుండెలలో చిరస్మరణీయుడు, స్త్రీల మానమును కాపాడిన మాననీయుడు, దేవతలందరిచేత లాలింపబడిన మహనీయుడు, మహాదేవుని భక్తులయందలి ప్రథమనీయుడు, సమదర్శనీయుడు, దేవదత్తయొక్క రమణీయుడు, ఈ బ్రహ్మాండ సృష్టికి రమణీయతను కల్పించినశివమానస పుత్రుడు అయిన దేవలుని (దేవాంగుని) చరిత్ర ప్రజలఅందరి గుండెలలో భద్రముగా ఉండుగాక! దేవలుని కథలు ప్రజల యొక్క నాలుకలపై నాట్యము చేయుగాక. ఈ యావత్తు సృష్టి ఉన్నంత వరకును, కల్పకల్పాంతరములయందును దేవలుని చరిత్ర అజరామరము. పవిత్రము. పుణ్యకరమువంటిది.ప్రపంచ మానవ అభివృద్ధి చరిత్రను దేవాంగునితోనే ప్రారంభించ వలసియున్నదను విషయమును అందరూ గుర్తుంచుకోవలసిన విషయము. **దేవాంగుడు ఆవిర్భవించినరోజు జ్యేష్ట మాస పూర్ణిమను ప్రపంచ మానవ సంతోష దినోత్సవముగా జరుపుకొనవలసినఅవసరం ఎంతైనా వున్నది.** దేవాంగుడు దేవదత్తల వివాహము వైశాఖశుద్ధపంచమి తిథినాడు ప్రపంచములోని అన్ని గ్రామములు, పట్టణములు, నగరములయందలి వాడవాడలా వారి కళ్యాణోత్సవమును జరిపించుట ద్వారా తమ ఋణమును తీర్చుకొనిన వారౌతారు. మరి దేవాంగుడిని రాక్షసుల బారినుండి కాపాడినది, దేవాంగునికి ప్రాణ భిక్షపెట్టి పునర్జీవింపజేసిన చౌడేశ్వరీదేవిని ఆమె ఆవిర్భవించిన ఆషాఢమాస అమావాస్య

రోజున రాత్రికాలములో ఆ దేవతను ఆరాధించి, ఆమె ద్వారా ఆయురారోగ్య ఐశ్వర్యములను నిరంతరము పొందుదుముగాక! శుభమస్తు!

ఇట్లు శ్రీ బ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరితమున
ఇరవై తొమ్మిదవ అధ్యాయము పరిపూర్ణము



# దేవాంగపురాణమునందు ప్రస్తావింపబడిన స్త్రీ, పురుష దేవతలు, ప్రాంతాలు మరియు ఇతర విషయాల వివరము



**అంధకాసురుడు :** హిరణ్యాక్షుని పెంపుడు కొడుకు. నిజ జనకుడు శివుడు. శివుని కుమార్తె ఆటగానెంచి శివుని కళ్ళు తన చేతులతో మూయగా అంధ కారము వ్యాపించెను. ఆ అంధకారమునుండి ఈ రాక్షసుడు జన్మించెను. శివున్ని ప్రార్థిం చుచున్న హిరణ్యాక్షునికి ఇతనిని ప్రసాదించెను. ఇతడు ప్రపంచానికి కోపం తెప్పించినా, తల్లిని పొందగోరినా, బ్రాహ్మణులను వధించినా నేనేభస్మం చేస్తాను అని శివుడు హిరణ్యాక్షునికి చెప్పినాడు. ఓ రోజు అంధకాసురుని చూపు పార్వతిపై పడినది. ప్రహ్లాదుడు ఆమె నీతల్లివంటిదని అది కూడదని సలహా ఇచ్చినా పెడచెవిన పెట్టి ఆమెను తీసుకురమ్మని తన అనుచరుడను పంపినాడు. శివుడు అంధకాసురునితో తనతో పాచికలాడి గెలిస్తే పార్వతిని పంపగలనని చెప్పినాడు. అంధకాసురుడు ఓడిపోయి శివుని క్షమాభిక్షకోరి అసురత్వాన్ని పోగొట్టమని అడుగుతాడు. శివుడు క్షమించి బృంగి వంశానికి అధిపతిని చేస్తాడు.

**అష్టదిక్పాలకులు :** బ్రహ్మలోకంలో మూడు విభాగాలున్నాయి. బ్రహ్మ లోకంలోని మధ్య విభాగములోని తన నగరమైన మనోవతిలో వుంటాడు. ఒక్కొక్క దిక్కున ఒక్కొక్క విభాగం వుంటుంది. ఒక్కొక్క విభాగం 2500 యోజనాలు వుంటుంది. ఒక్కొక్క విభాగానికి ఒక్కొక్క పాలకుడు వుంటాడు.

| దిక్కులు | పాలకుడు | వారుండు పట్టణం |
|---|---|---|
| తూర్పు – | ఇంద్రుడు | – అమరావతి |
| ఆగ్నేయం– | అగ్ని | – తేజోవతి |
| దక్షిణం – | యముడు | – సంయమని |
| పడమర – | వరుణుడు | – శ్రద్ధావతి |
| నైరుతి – | నిరృతి | – కృష్ణాంజనం |
| వాయువ్యం– | వాయువు | – గంధవతి |
| ఉత్తరం – | కుబేరుడు | – మహోదయం |
| ఈశాన్యం– | శివుడు | – యశోవతి |



**అష్టవసువులు :** గణదేవతలను అష్టవసువులు అంటారు. దక్షుని కూతురు వసువుకి, ధర్మదేవునికి జన్మించారు. కొన్ని పురాణాలలో కశ్యపుని కుమారులు అని పేర్కొనబడినది.

**అసురులు:** బ్రహ్మ జఘనము (మొల) నుండి పుట్టి వానితోడనే రతిక్రీడను కోరినారు. బ్రహ్మ నారాయణుని వద్దకు పరుగెత్తుకెళ్ళి రక్షించమని ప్రార్థించినాడు. బ్రహ్మను ఆదేహము విడువమని నారాయణుడు చెప్పెను. బ్రహ్మ దేహము విడువగా అందుండి సంధ్యారూపమున సుందరీ రత్నము పుట్టినది. ఆమెను మోహించి అసురులందరును ఆమెను పట్టుకొనిరి. కశ్యపునికి దనువు ద్వారా జన్మించినవారు దానవులు. కశ్యపునకు దితికి జన్మించినవారు దైత్యులు.

**అగస్త్యుడు:** ఒకమహర్షి. వరుణుడు ఊర్వశిని చూచి మోహించగా అతనికి వీర్యపతనం అయినది. ఊర్వశికి వరుణుడిపై మోహం చెందటం వల్ల ఆమె గర్భంలోని మిత్రస్కలనం కూడా భూమిపై పడినది. ఈ రెండింటిని ఒక కుండలో వుంచినారు. ఈ కుండలోనుంచి ఇద్దరు పిల్లలు వచ్చినారు. మొదట వచ్చినవాడు అగస్త్యుడు, రెండవవాడు వశిష్టుడు. శివ పార్వతుల వివాహ సందర్భముగా ప్రపంచములోని జనులందరు అది చూచుటకు హిమాలయమునకు తరలివచ్చిరి. అందువల్ల భూమి ఒకవైపుకు ఒరిగిపోయినది. అది గ్రహించిన శివుడు అగస్త్యుని దక్షిణమునకు పంపి అతని శక్తిచే సరిచేయమని కోరెను. అగస్త్యుడు దక్షిణమునకు చేరి అక్కడ కూర్చొనగానే అతని బరువుతో భూమివంపు సరిఅయ్యెను. అగస్త్యుడు సముద్రమును మ్రింగివేసెను.

**అమరావతి :** దేవధాని : దేవేంద్రుడుండే నగరం. అగ్ని, సూర్యచంద్రుల కాంతి లేకపోయినా సొంతకాంతితో ప్రకాశించే నగరం. బ్రహ్మ సృష్టించిన ప్రపంచం. ఇది 10 వేల యోజనాలు వుంటుంది. ఇది మహా మేరుపర్వతం మీద వుంటుంది. ఇందులో 8 నగరాలు వుంటాయి. ఒక్కొక్క నగరం 2500 చ. మైళ్ళు వుంటుంది. అందులో అమరావతి ఒకటి. ఇక్కడ ఇంద్రుడు నివసిస్తాడు. ఇతడు దేవతలకు రాజు.

**అత్రి :** సప్తఋషులలో ఒకరు. బ్రహ్మ మానసపుత్రులలో ఒకడు. ఈతడు తపస్సు చేసుకొనుటకు అడవులకు పోవాలని భార్య అనుమతి కోరినాడు. ఆమె ఆయనతో నీవు వైన్యరాజు వద్దకు పోయి ధనాన్నితెచ్చి కుమారులకు ఇవ్వు. అప్పుడు

నీవు తపస్సుకు పోవచ్చును అంటుంది. పదిమంది ప్రజాపతులు ఇతని సంతానంవారే. ఈ ప్రపంచానికి మూలమైన అష్ట ప్రకృతుల్లో అత్రి ఒకరు. మహా విష్ణువు అత్రి పుత్రుడు దత్తాత్రేయునిగా జన్మించినాడు.

**అప్సరసలు :** వీరు దేవతా స్త్రీలు. క్షీరసాగర మధనము జరిగినప్పుడు వీరు జన్మించారు. వీరు వేల సంఖ్యలో వున్నారు. వీరిలోముఖ్యులు రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమ, ఘృతాచి. బ్రహ్మ తన రెండు హస్తములను ముక్కువద్ద వుంచి వాసన చూచినప్పుడు అప్సరసలు జన్మించినారు. వీరు ఇంద్రుని కొలువులో నృత్యము గీతాలాపనలతో దేవతలను రంజింప జేయుదురు. వీరికి వివాహములు లేవు. మునులు చేయు తపమును విఘ్నములు గలుగజేయుటకు తరచుగ ఇంద్రుడు వీరిని పంపించును.

**ఋక్షవంతము :** భారత వర్షములోని ఏడు కుల పర్వతాలలో ఇది ఒకటి. ఈ పర్వతం పైన విదూరధుని కుమారుదుని పరశురాముడినుండి ఋక్షములు రక్షించినాయి. ఈ పర్వత చర్యలయందు నిర్విధ్యా నదీతీరములో అత్రి తపస్సుచేసినాడు.

**ఏకాదశ రుద్రులు :** 11మంది రుద్రులు. బ్రహ్మ తన మానసపుత్రులను సృష్టిచేయమని కోరగా వారు నిరాకరించినారు. బ్రహ్మకు కోపంరాగా అతని లలాటమునుండి ఏకాదశ రుద్రులు ఆవిర్భవించినారు. వారు మహత్తుడు, మహాత్మా, మతిమంతుడు, భీషణుడు, భయంకరుడు, రుతధ్వజుడు, ఊర్ధ్వకేశుడు, పింగళాక్షుడు, రుచి,శుచి, కాలాగ్ని రుద్రుడు. సురభియందు మార్తాండునికి జన్మించిన వారిని కూడా ఏకాదశ రుద్రులు అంటారు. వారిపేర్లు 1.అజపాదుడు 2. అహిర్బుధ్నుడు 3. త్ర్యంబకుడు 4.వృషాకపి 5. శంభుడు 6. కపాలి 7. రైవతుడు 8. బహురూపుడు 9. హరుడు 10. ఉగ్రుడు 11. విశ్వరూపుడు.

**కాళిక :** పార్వతి యొక్క అంశ. నల్లని దేహం కలది.

**క్రౌంచద్వీపం :** క్రౌంచము అనే పక్షులు కల ద్వీపం. సప్త ద్వీపాలలో ఇది ఒకటి. ప్రియ వత్రుని కుమారుడు ఘృతపృష్టుడు ఈ ద్వీపాన్ని ఏలినాడు. ఇదిఘృత సాగరానికి ఆవల వుండే ద్వీపం. ఈ ద్వీపం మధ్యలో క్రౌంచపర్వతం వుంటుంది.

**కుబేరుడు :** బ్రహ్మ కుమారుడైన పులస్త్యుని మనుమడు. విశ్రవసు ఇలిబిలకు ఇతడు జన్మించినాడు. రావణ, కుంభకర్ణ, విభీషణులు విశ్రవసుడికి మరొక భార్యవల్ల జన్మించినారు. ఒకసారి దేవతలు కుబేరుడి తరుపున వరుణుడు యాగంచేసి సముద్రుడికి నదులకు అధిపతిని చేయగా అవి ఇతనికి ఎంతో సంపదను ఇచ్చాయి. శివుడు కూడా కుబేరుడికి స్నేహితుడయినాడు. ఇతని వాహనం నరవాహనం.



ఈతని భార్య పేరు భద్ర. ఈతడు యక్షులకు రాజు. పులస్త్యుడి కుమారుడు రావణుడికి అన్న. ఈశ్వరునికి చెలికాడు. నలకూబరునికి తండ్రి. ఈతనిని వైశ్రవణుడు అని కూడా అంటారు. ఈతడు ఉత్తర దిక్పాలకుడు. ఈతడు తపస్సుచేసి బ్రహ్మను మెప్పించి లోకపాలకత్వాన్ని, ధనాదిపత్యాన్ని పొందినాడు.

**కిన్నెరలు :** దేవతల్లో ఒక విభాగము.వీరు వీణను ధరిస్తారు. వీరు నరశరీరం,అశ్వముఖము కలిగి వుంటారు.వీరు పులస్త్యుని కుమారులు. వీరు బ్రహ్మ మానస పుత్రుడైన పులహుడి పుత్రులు.

**కాలదండము :** యముని చేతిలో వుండే మృత్యు పాశమును కాలదండము అందురు.

**గజాసురుడు :** మహిషాసురుడి కుమారుడు. శివుని చేతిలో మరణంకోరి అనేక అకృత్యాలు చేసి తన కోరిక నెరవేర్చుకుంటాడు. ఇతడిచర్మాన్ని శివుడు ధరించి కృత్తివాసుడు అయినాడు శివుడు.

**గరుత్మంతుడు :** గరుత్మంతుడు. కశ్యప ప్రజాపతికి వినతయందు పుట్టిన రెండవ కుమారుడు. ఇతను ఒక పక్షిరాజు. అనూరుని సోదరుడు. ఇతడు అండమునుండి బయట పడగానే ఆకాశమున ఎగిరి తిరిగివచ్చి తల్లికి నమస్కరించెను. ఇతడు పుట్టినప్పటి నుండి కద్రువ ఆజ్ఞప్రకారం ఆమె కుమారులకు సేవచేయుచుండెను. గరుత్మంతుడు అమృతపానము చేయకుండినను అతనికి అమరత్వమును విష్ణువు ప్రసాదించినాడు. విష్ణువుకు వాహనమైనాడు. విష్ణుమూర్తి ధ్వజము అయినాడు. అమృత భాండమును తీసుకొనిపోయి ఇంద్రునకు ఇచ్చెను.

**గర్గుడు :** ఈతడు పృథు చక్రవర్తికి సాంవత్సరీకుడు. విష్ణు అంశతో జన్మించినాడు. భరద్వాజుని వంశంలో జన్మించినాడు. ఈతడు ఖగోళ శాస్త్రములో ప్రజ్ఞావంతుడు. గ్రహాల కదలిక నక్షత్రాల గమనం గురించి విపులీకరించాడు. మన్యువు యొక్క కుమారులలో ఒకడు. ఇతని పుత్రుడు శని.

**గంధర్వులు :** కశ్యప ప్రజాపతికి అరిష్ట వలన జన్మించిన సంతతిని గంధర్వులు అంటారు. వీరు దేవతల తెగకు చెందినవారు. వీరు హిమాలయాలలో హేమకూట పర్వతానికి ఉత్తరంలో వుంటారు. వీరిలో విశ్వావసువు ఒకరు. సంగీత విద్యలయందు అనగా గానవిద్యలో ఆరితేరినవారు. మధురమైన గాత్రం కలవారు. వీనులకు విందుగా వీరు పాడతారు.

**చండిక :** పార్వతి దేహంనుండి పుట్టిన దేవి. ఈమెచండుని చంపుటచే చండిక అని పేరు వచ్చినది. ఆ రాక్షసులను చూడగానే ఈమె ముఖము నల్లబడి అందుండి కాళి ఉద్భవించినది.

**చారణులు :** దేవతలలో ఒక తెగవారు. దేవలోకపుగాయకులు. ఇంద్రున్ని పొగడటమే వీరివృత్తి వింధ్య పర్వతము వద్ద నివశించెదరు.

**జయంతుడు :** ఇతడు ఇంద్రుని కుమారుడు. మిక్కిలి అందగాడు. ఇంద్రునికి శచీదేవికి జన్మించినాడు. సోమకాంతుడు అను దానవునితో యుద్ధముచేసి రమ్మని బ్రహ్మ వారిని కోరగా శచీదేవి ఇతనిని యుద్ధమునకు పంపలేదు. ఇతడు ఏ యుద్ధము చేయలేదు.

**జంభూద్వీపము :** మేరు పర్వతమునకు దక్షిణాన వున్న ద్వీపము. ఇక్కడ వున్న జంబూ (నిమ్మ) వృక్షం వల్లనే ఈ ద్వీపానికి ఆ పేరు వచ్చినది. దీనికి సుదర్శనము అనే పేరుకూడా వున్నది. దీనిలో ఏడు ఖండాలు వున్నాయి. అవి కురు, హిరణ్మయి,



రమణక, ఇలావృత, భద్రాశ్వ, కేతుమాల, హరివర్ష, భారతవర్ష, కింపురుషాలు. ఈ జంబూ ద్వీపం లవణ సముద్రము చేత చుట్టబడి వుంటుంది. ఈ ద్వీపములు హిమశైలం, ఆపైన హేమకూటం, ఇంకా ఆపైన నిషధం అనే పర్వతాలు వుంటాయి.

**ఢాకిని :** ఒక తెగ స్త్రీలు. వీరికి తంత్ర విద్యలలో ప్రవేశం వుంటుంది. మంత్రాలతో కొన్ని కార్యాలు నిర్వహిస్తారు.

**త్వష్ట :** కశ్యప ప్రజాపతికి అదితియందు కలిగిన ద్వాదశాదిత్యులలో పదకొండవ వాడు. ఈతడు దేవతల శిల్పి. ఈయన దధీచి వెన్నెముకతో వజ్రాయుధాన్ని తయారుచేసి ఇంద్రునికి ఇచ్చినాడు. త్రిపురాలకు, త్రిపురాసురులను నాశనం చేయడానికి ఈశ్వరునికి ఒక రథం నిర్మించి ఇచ్చినాడు.

**త్రిపురులు :** దేవదానవుల యుద్ధంలో బలిచక్రవర్తికి తోడ్పడిన వారిలో కొందరు. తారకుడి కుమారులు ముగ్గురు. వారు విద్యున్మాలి, తారకాక్షుడు, కమలాక్షుడు అనువారు. మయుడు నిర్మించిన అద్భుత భవనం త్రిపురం.

**దుర్వాసుడు :** ఈశ్వరుడు త్రిపురాలను ఒకే బాణంతో భస్మంచేసి తిరిగి ఆ బాణాన్ని తొడపై వుంచుకోగా, ఆ బాణం బాలుడు అయింది. ఆ బాలకుడికి ఈశ్వరుడు దుర్వాసుడు అని నామకరణం చేసినాడు. ఈతడు మిక్కిలి కోపిష్టి అయిన ముని. శ్వేతకి అనే రాజర్షి శత వార్షిక యాగానికి ఈతడు ఈశ్వరుని ఆజ్ఞతో యాజకత్వం వహించి నిర్వహించినాడు. ఇతడు ముక్కోపి. చిన్నవిషయానికి కూడా అతిగా స్పందించే స్వభావి. శివుని అంశ వల్ల జన్మించినాడు. అత్రిమహర్షి కుమారుడు.

**ద్వాదశ ఆదిత్యులు :** కశ్యప ప్రజాపతికి అదితి యందు కలిగిన 12 మంది పుత్రులు. ఆదిత్యులనగా అదితి పుత్రులు. 1. ధాతృడు 2. మిత్రుడు 3. ఆర్యముడు 4. శక్రుడు 5. వరుణుడు 6. అంశుడు 7. భగుడు 8. వివస్వతుడు 9. పూషుడు 10. సవిత్రుడు 11. త్వష్టుడు 12. విష్ణువు అనువారు.

**దేవయాని :** ఈమె శుక్రాచార్యులు కుమార్తె. యయాతి మహారాజు భార్య. వృషపర్వుడి కుమార్తె శర్మిష్ఠ ఈమెకు దాసి. స్వాయంభువు మనువుకు ఇద్దరు కుమారులు. వారు ప్రియవ్రతుడు, ఉత్థానపాదుడు. ప్రియవ్రతుడు విశ్వకర్మ ప్రజాపతి కుమార్తెలయిన సరూప, బర్హిష్మతిలను వివాహమాడినాడు. సరూప వల్ల ప్రసిద్ధులైన 10 మంది కుమారులు, 1 కూతురు పుట్టిరి. ఆ కూతురి పేరు ఊర్జస్వతి. ఆమె అసుర గురువైన శుక్రాచార్యుని వివాహమాడగా ఆమెకు దేవయాని జన్మించినది. దేవయాని బృహస్పతి కుమారుడైన కచుడు తనను ప్రేమించినట్లు నటించి మృత

సంజీవని విద్య తస్కరించి దేవలోకానికి వెళ్ళుతుంటే అప్పుడు కచుని దేవయాని శపించినది.

**దైత్యులు :** కశ్యప ప్రజాపతికి, దక్షప్రజాపతికి యాభై మంది పుత్రికలలో 39వ కుమార్తె దితి. ఈదితియందు కలిగిన సంతానమును దైత్యులు అందురు. హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు వారిలోనివారే. కొందరు దక్ష ప్రజాపతి కుమార్తె అయిన దితియొక్క సంతతిని దైత్యులు అందురు. ఈమె సంధ్యా సమయమున కశ్యపుడు అనాసక్తుడుగా వున్నప్పుడు అతనితో రమించినది.

**దానవులు :** కశ్యప ప్రజాపతికి దనువు అనే భార్యయందు జన్మించినవారు దానవులు. వీరు విప్రచిత్తి, శంబరుడు, నముచి, పులోమాసి, లోమకేశి, దుర్జయుడు, మయుడు మొదలైన నూరుమంది వున్నారు. వీరినుండి 10 రాక్షస వంశాలు పుట్టినవి. దానవుల్లో ప్రముఖులు ప్రహ్లాదుడు, సంహ్లాద, అనుహ్లాద, శిభి, విరోచన, మహాబల, గర్గ మొదలగువారు.

**నంది ధ్వజము :** (వృషభ ధ్వజము) దీనినే వృషభ ధ్వజము అనికూడా పిలుస్తారు. ఎద్దు ధ్వజం. ఇది ఈశ్వరుని ధ్వజం. ధ్వజం అనగా జెండాగుడ్డ. పతాక దండము, చిహ్నం. అంతేగాకుండా ఒక మహత్తరశక్తి ఆయుధంగా కూడా వున్నది.

**నందనవనము :** ఇంద్రుని ఉద్యానవనము. స్వర్గంలో మేరుపర్వత శిఖరం పైన ఉండే ఉద్యానవనమునకు నందనవనమని పేరు. అక్కడ వుండే వారికి ఆకలి, దప్పిక, శీతోష్ణబాధ, ముసలితనం, రోగం మొదలైన వికారాలు వుండవు.

**నారదుడు :** ఈతడు సారస్వతుడు అను పేరుగల బ్రాహ్మణుడు. కుటుంబ పోషణ భారమును తన కుమారునిపై వుంచి తను అడవికి వెళ్ళి విష్ణుమూర్తి కొరకై తపస్సు చేసెను. విష్ణుమూర్తి ప్రసన్నుడై వరము కోరుకొమ్మని సారస్వతుడికి చెప్పెను. ఈ సారస్వతుడు విష్ణుమూర్తియందు సాయుజ్యమును కలుగజేయుమని వరము కోరుకొనెను. అందులకు విష్ణుమూర్తి నా తరువాత నుండు వాడు బ్రహ్మ నీవు బ్రహ్మకు జన్మించిన తరువాత నా సాయుజ్యమును పొందగలవాడవు. నీవు జనులందరికి నారములు అనగా నీరును నిత్యము ఇచ్చుచుండ వలయును. ఈ విధముగా ఎల్లప్పుడు నారములు (జలము) ఇచ్చుట వలన ఈతనికి నారదుడు అను పేరు ఏర్పడినది. ఈఋషి తాను వినిన వాక్యములను ఇతరులకు చెప్పకుండా తనలో దాచుకొనలేదు. దక్ష ప్రజాపతిచే త్రిలోక సంచారిగా నుండుము అని శపింపబడినాడు అందువలన నారదుడు ఒకచోట స్థిర నివాసం వుండలేదు. ఎల్లవేళలా హరినామ సంకీర్తన చేయును. ఈతని వీణ పేరు మహతి. దేవలోక కార్యమును చక్కపెట్టును.



**నలకూబరుడు :** కుబేరుని పుత్రుడు. ఈతడు మిక్కిలి సౌందర్య వంతుడు. అప్సరస స్త్రీలతో విహరించుచుండును. ఈతనిపై రంభకు ఎక్కువ ప్రేమ వున్నది. రావణాసురుడిని ఏ స్త్రీని కూడా ఆమె అంగీకారము లేకుండా బలాత్కరించినచో నీతల ఏడు వక్కలు అవుతుంది అని శపించినాడు. నారదుడుచే నలకూబరుడు మరుత్తు వృక్షాలుగా అవ్వండి అని శపింపబడినాడు. శ్రీకృష్ణుడు శాప విమోచనం చేస్తాడుఅని చెప్పినాడు. ఈతని భార్యలు రంభ, సోమప్రభ.

**ప్రేతములు :** శంకరానుజుడైన భూతుడికి సురూపయందు జన్మించిన రుద్ర పారిషదులలో కొందరు. ప్రేత నాయకుడు యముడు.

**ప్రజాపతి:** బ్రహ్మదేవుని పుత్రులు. ఉదాహరణ దక్షప్రజాపతి.

**పుష్కల ద్వీపం :** మెట్టతామరల ద్వీపం ఇది. సప్త ద్వీపాలలో ఒకటి. ఈ ద్వీపంలో బ్రహ్మదేవుని ఆసనమైన పద్మము వుంటుంది. ఈ ద్వీపంలో వర్ణభేదము లేదు.

**ప్లక్ష ద్వీపం :** జువ్వి లేదా రావి చెట్ల ద్వీపం. ఇది సప్త ద్వీపాలలో ఒకటి. ప్రియవ్రతుని పదిమంది కుమారులలో రెండవ వాడైన ఇధ్మజిహ్వుడు ఈ ద్వీపాన్ని ఏలినాడు. ఈ ద్వీపంలో అరుణ, స్వమణ, అంగిరసి, సావిత్రి, సుప్రభాత,ఋతంబర, సత్యంబర అనే ఏడు నదులు వుంటాయి. ఈ ద్వీపంలోని నదులలో స్నానాలుచేసి పవిత్రులయ్యే నాలుగు వర్ణాలవారు హంస, పతంగ, గోర్ధ్వాయన, సత్యాంగులు అని పిలువబడతారు.

**పారిజాత పర్వతం :** భారత వర్షంలోని ఏడు కుల పర్వతాలలో ఇది ఒకటి. పురాణ ప్రసిద్ధి చెందిన పర్వతం ఇది. ఈ పర్వత గణాధిపతి కుబేరుని కొలువులో ఓ సభ్యుడు. గౌతమ మహర్షి ఈ పర్వతంపై గల ఆశ్రమములో నివశించాడు. ఇది మహా మేరువునకు పశ్చిమమున వున్నది. బాలముకుందిని గర్భంలో మార్కండేయుడు ఈ పర్వతాన్ని చూచినాడు.

**ప్రజాపతి:** బ్రహ్మదేవుడు. ఈయనయే దేవతలలో ప్రధానుడు. దేవుడను మనువు కుమారుడు. అతనికి ధ్రూమ, బ్రహ్మవిద్య, మనస్విని, రతి, శ్వస, శాండిలి, ప్రభాత యందు ........

**ప్రమథులు :** శివుని అనుచర యోధులు. శివుని సేవకులు. వీరు ధర్మా ధర్మ విచక్షణ బాగా తెలిసిన వారు.

**పారిజాత పుష్పము :** దీనిని కల్పవృక్షము అందురు. దీనిని పారిజాత వృక్షము అనికూడా అంటారు. ఇది కోరిన కోర్కెలను తీర్చగల వృక్షం. దీనిని ఇంద్రుని నందన వనమునుండి శ్రీకృష్ణుడు సత్యభామ కోరికపై భూమిపైకితెచ్చినాడు.

ఇదిదేవలోకంలో వుండే వృక్షంపేరు. ఏది కోరితే దానిని ఇచ్చే శక్తి దీనికి వున్నది. 5 రకాల కల్పవృక్షాలు అక్కడ వున్నాయి. అవి మందార, పారిజాత, సంతాన, కల్పవృక్ష, హరిచందనాలు. కల్పవృక్షం క్షీర సాగర మధనంలో ఉద్భవించింది.

**బేతాళుడు :** పిశాచాలకు అధిపతి. స్మశానంలో వుంటాడు. ఇతడు పూర్వ జన్మలో పుష్పదంతుడు.

**భద్రకాళి :** పార్వతీదేవి యొక్క మనో రూపము. దక్షయజ్ఞ సమయంలో జన్మించినది. పార్వతీ యొక్క అంశ.

**భైరవుడు :** శివుని పార్షదుడు. బృంగి శివుని ద్వార పాలకుడు. పార్వతి శాప వశమున భైరవునిగా జన్మించినాడు. శివుని వీర్యమును అగ్ని ధరించినపుడు రెండు బిందువులు గిరి ప్రస్తమున పడగా అందుండి భృంగి, మహాకాళి జన్మించిరి. భృంగి శివుని ద్వార పాలకుడు అయ్యెను. పార్వతి వివస్త్రగా వున్నప్పుడు భృంగి చూచెను. ఆమె కోపించి మనుష్యజాతియందు జన్మించుమని శపించెను. అతడు పార్వతీ పరమేశ్వరులను ప్రార్ధించగా మేమే మీకు జన్మ నిచ్చెదము అనిచెప్పిరి. దక్షయజ్ఞ సమయమున శివుడు తన జుట్టుముడిని కోపంతో నేలకు కొట్టగా భృంగి భైరవుడిగా మహాకాళి బేతాళుడిగా జన్మించిరి.

**బ్రహ్మాండ పురాణం :** అష్టాదశ పురాణాల్లో ఒకటి. బ్రహ్మ బ్రహ్మాండముయొక్క ఘనతను గురించిన ఉపన్యాసమిస్తాడు. దీనిలో 12 వేల శ్లోకాలున్నవి.

**భూతములు :** బ్రహ్మ దేవుడు కునుకు పాటు, ఉన్మాదం, ఆవులింత, నిద్రా రూపమైన శరీరాన్ని ధరించి పుట్టించిన వారిలో ఒక జాతి. రుద్రుడు సృష్టించిన జీవులు. వీరి సంతతికి ఆధ్యుడు, పులహుడు. బ్రహ్మ రుద్రుణ్ణి సృష్టి చేయమని కోరగా ఇతడు తన భార్య సతివల్ల వేల భూతాలకు జన్మనిచ్చినాడు. వారంతా రుద్రుని పోలికలే. సన్నని కాళ్ళు చేతులు, పొడవైన చెవులు, బండగా వుండి వ్రేలాడే పెదవులు, ఎర్రని కళ్ళు పెద్ద కనుబొమ్మలు, కరకుగా పొడవైన పళ్ళు, పొడవైన గోళ్ళు, మరికి పట్టిన జుట్టు, వీరంతా నగ్నంగా చేతిలో పుర్రెతో శివుని కొలువులో వుంటారు. వీరి ఆయుధములు త్రిశూలం, విల్లు, ఖడ్గం. రుద్రుడే వీరికి నాయకుడు. అందుకే శివున్ని భూత నాయకుడని, గణనాయకుడని అంటారు.

**భార్గవుడు :** భృగు వంశంలో పుట్టిన వాడు. పరశురాముడు. ఈపరశు రాముడికి భార్గవుడు అని మరో పేరువుంది.

**మేరుపర్వతం :** ఇది బంగారు పర్వతం. భూమిచుట్టూ వడ్డాణం లాగావుంటుంది. దీనిచుట్టూ సూర్యచంద్రులు పరిభ్రమిస్తుంటారు. దీని శిఖరాలపై దేవతలు నివసిస్తారు. దీనికి అయితి, నియతి అనే కూతుళ్ళు వున్నారు. వీరిని ధాత,



విధి, విదితల కిచ్చి వివాహం చేస్తుంది . ఇది లక్ష యోజనాల వైశాల్యంతో కుప్ప పోసిన కాంతివలె ప్రకాశించే పర్వతము. దీనికి దక్షిణములో సుదర్శమనే జంబూ తరువు వున్నది.

**మనువు :** సకల తపఃఫలాలను నిర్వహించటానికి పురంధరుడు ఈతడిని కొడుకుగా పొందినాడు. ఈతడు ప్రాజా ప్రత్యుడనే పేరుతో బ్రాహ్మణులలో అర్చించబడినాడు. ఈతడు సప్త ఋషులతో పాటు కల్పాదిలో తపస్సు చేసినాడు. కృతయుగంలో జనులు బ్రహ్మను తమకు రక్షకుడిగా ఒకరిని కోరగా ఆయన మనువును చూపించినాడు. అతడు బ్రహ్మ సభలో వుంటాడు.

**మన్మధుడు :** ఇతడు మహావిష్ణువుకు పుత్రుడు. సౌందర్య రాశీసుడు. మహా అందగాడు. శృంగార రసాధిదేవత. ఈతని భార్యపేరు రతీదేవి. ఇతడు యమసభలో వుంటాడు. విష్ణుమూర్తి సంతానమునకై శివుని ప్రార్ధించగా జన్మించినాడు. కాని విష్ణువు పార్వతిని ప్రార్ధించక పోవుటచే ఆమెకు కోపమువచ్చి విష్ణుమూర్తికి జన్మించు కుమారుడు శివుని నేత్రాగ్నికి భస్మము అగును అని శపించినది. అప్పుడు విష్ణువు ప్రార్థించగా పుట్టిన కుమారుడు మరల బ్రతుకును అనిచెప్పినది. ఇలా జన్మించిన వాడే మన్మధుడు. పుష్పములే ఇతని ఆయుధములు. ఈతడు తన పుష్ప బాణములచే బ్రహ్మను కూడా క్షోభపెట్టెను. అప్పుడు బ్రహ్మ తన కూతురు సావిత్రితోనే సంగమించినాడు. విషయము తెలుసుకున్న బ్రహ్మ మన్మధున్ని భస్మం కమ్మని శపించినాడు. తారకాసుర సంహారము కొరకు శివుడు పార్వతిని వివాహమాడి తారకాసుర సంహారము చేయగలపుత్రుడిని జన్మింప జేయుటకు తపస్సులో వున్న శివున్ని తన పుష్పబాణములచే క్షోభపెట్టి నందున శివుడు మూడవకన్ను తెరచి ఆతనిని భస్మం చేసినాడు.

**మయుడు :** ఈతడు నముచి అనే రాక్షసుని తమ్ముడు. ఈతడు ఖాండవ వనంలో నివసిస్తూ వుండగా అగ్నివల్ల మరణించకుండా , కృష్ణుని వల్ల చావకుండా అర్జునుడు రక్షించాడు. ఈతడు దానవ శిల్పి. అనేక విధాలైన శిల్పకళా కుశలుడు. త్రిపురాసురులకు మూడు నగరాలను నిర్మించి ఇచ్చినది ఈతడే. దేవదత్తమనే శంఖాన్ని అర్జునుడికి భౌమాదిత్యుడు అనే రాజుభీముడికి గద ఇచ్చినాడు. ఈతడు దానవరాజు. ఈతడు దేవతలకు రాక్షసులకు వాస్తు శిల్పిగా భవన నిర్మాణ కర్తగా వ్యవహరించినాడు. మరీచి పుత్రుడైన కశ్యప ప్రజాపతి దక్షుని కూతుళ్ళలో 13మందిని వివాహమాడినాడు. అందులో ఒకరు దనువు. వారికి జన్మించిన వారే దానవులు. అందులో ముఖ్యుడు మయుడు. మయుడు హేమ అను భార్యతో హిమాలయాలకు దక్షిణ ప్రాంతమున చక్కని భవనము నిర్మించుకొని కాపుర మందుండగా వారికి మాయావి,దుంధుభి

అను కుమారులు జన్మించిరి. మండోదరి ఈతని పెంపుడు కుమార్తె. ఈమెను రావణాసురుడు వివాహమాడినాడు.

**యక్షులు :** వీరు ఉపదేవతలు. ఈ దేవతలు మూడు రకములు. దేవతలు, గణ దేవతలు, ఉపదేవతలు. గణదేవతలు. 12మంది ఆదిత్యులు. 10మంది, విశ్వదేవతలు, 8మంది వసువులు, 36మంది తుష్టితులు, 64మంది అభాస్వరసులు 49మంది అనిలసులు, 220మంది మహారాజకసులు, 12మంది సాధ్యులు, 11మంది రుద్రులు. ఉపదేవతలు 10రకాలు. వారు విద్యాధరులు, అప్సరసలు, యక్షులు, రాక్షసులు, గంధర్వులు, కిన్నెరలు, పిశాచులు, గుహ్యారులు, సిద్ధులు, భూతాలు. యక్షస్త్రీలు విగ్రహాలను దేవాలయాలలో పొడవైన కళ్ళతో ప్రతిష్ఠిస్తారు. యక్షిణి దేవి స్వరూపం. ఈదేవి ప్రసాదం తినడంవల్ల బ్రాహ్మణ హత్యాపాతకం నశిస్తుంది. కృతయుగంలో బ్రహ్మ మంత్రోచ్చారణ చేయుచుండగా అతడికి ఆకలి దహించినది. అప్పుడతడి ఆకలినుండి యక్షులు జన్మించినారు.

**యాతుధానుడు :** కాశ్యప సురసకు జన్మించినవాడు. ఈ సంతతి రాక్షసుల్ని యాతుధానవులు అంటారు.

**రాక్షసులు :** అసురులలో ఒకతెగ. సాయం సంధ్యవేళ వీరిని చంపరాదు. కృతయుగంలో బ్రహ్మ మంత్రోచ్చారణ చేయుచుండగా అతనికి ఆకలి దహించినది. అప్పుడు అతడి మొఖమునుండి కొన్ని రూపాలు జనించినాయి. అతని కోపంనుండి రాక్షసులు జన్మించినారు. రాక్షసులు దుష్టబుద్ధులై గోవుల్ని, బ్రాహ్మణులను భక్షించేవారు. ప్రహేతి, హేతి మొదటజన్మించిన రాక్షసులు.

**రంభ :** ఈమె ఒక అప్సరస. దేవకన్యలలోని అందరికన్నా మహా అందగత్తె. మునీశ్వరులు గాని ఇంకెవరైనా గాని తపస్సు చేయుచున్నప్పుడు వారి తపోనిష్ఠ ఏపాటిది అని తెలిసికొనుటకు ముఖ్యంగా కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యము లైన అంతర్గత శత్రువు లన్నింటిని జయించినాడా లేదా అని పరిశీలించుటకు దేవుడు (ఇంద్రుడు) మహా అందగత్తె లావణ్యమూర్తి అయిన రంభను మునులవద్దకు పంపుతాడు. అరిషడ్వర్గములలో మహా బలవత్తరమైన కామాన్ని జయించినాడా లేదా దానికి వసుడైనాడా అని పరీక్షించటానికి భగవంతుడు తన కొలువులో వున్న రంభను తరచు పంపిస్తుంటాడు. రంభచేసే నాట్యానికి,వంపులకు వయ్యారానికి దాదాపు నూటికి 95మంది కామానికి లొంగి తమ తపస్సును మధ్యలో విడచిపెడతారు. అందువలన రంభ భగవంతుని కార్యమును నెరవేర్చు పరిచారిక.

**లవణ సముద్రం :** దీనిని ఉప్పు సముద్రం అంటారు. ఈ సముద్రం మధ్యలో త్రికూట పర్వతం పైన లంకానగరం వుంటుంది. ఈ లవణ సముద్రం



జంబూద్వీపం చుట్టూవుంటుంది.

**వామదేవుడు :** ఇతడొక మహాముని. ప్రాచీనరుషి. ఈయనవద్ద వేగంగా పరిగెత్త గలిగిన గుర్రాలుండేవి. వాటిని ఈ ముని పేరున వామ్యాలని, వామ్యాశాలనీ పిలిచేవారు. ఇతడు వశిష్టునికి స్నేహితుడు. దశరథునికి పురోహితుడు. ఋగ్వేదంలోని నాల్గవ మండలాన్ని రచించినాడు. ఇతడు ఇంద్రుని కొలువులో సభ్యుడు. వసుమనుడను రాజునకుధర్మమును బోధించినాడు. అర్థసిద్ధి కంటే ధర్మసిద్ధి మేలని తలచినాడు.

**విశ్వకర్మ :** ప్రభాసుడు అనే వసువునకు బృహస్పతి చెల్లెలు. యాగసిద్ధియందు జన్మించిన వాడు. దేవ విమానాలను, దేవసభలు, ఈశ్వర రథము మొదలైనవన్నీ ఈతడే నిర్మించినాడు. వివిధ విధాలైన శిల్పాలను చేయగలవాడు. ఈతడే ఇంద్రుని కోరికపై ఇంద్రప్రస్థపురాన్ని పాండవులకు రాజధానిగా నిర్మించి ఇచ్చినాడు. ఈతనికే త్వష్ట అని ఇంకొకపేరు కలదు. ఈతడు ఇంద్రునికి చెరుపు చేయదలచి మూడుతలల విశ్వరూపుణ్ణి సృష్టించినాడు. అతడు బ్రహ్మ సభలో వుండును. అతడు దేవశిల్పి. విశ్వకర్మ దేవతలకు కావలసిన హర్మ్యములు, నగరములు, రథములు, ఆయుధములు మొదలగునవి చేసి ఇచ్చుచుండును.

**విద్యాధరులు :** దేవతలలో వీరు ఉపదేవతలు. అప్సరసలు, యక్షులు, విద్యాధరులు, గంధర్వులు, రాక్షసులు, కిన్నెరలు, కింపురుషులును ఉపదేవతలు అంటారు. విద్యాధరులు ఉపదేవతలలో ఒక గుంపు. వీరు పూలదండలను హారాలుగా ధరిస్తారు. ఆకాశంలో నివసించెదరు. వీరందరు మేరుపర్వతము మీద వుండును.

**వసంతుడు :** సంవత్సరమునకు ఆరు ఋతువులు వుండును. మొదటి ఋతువు వసంత ఋతువు. వసంతుడి పేరుమీద వసంత ఋతువు అని వచ్చినది. ఈతడు చెట్లను చిగురింపచేస్తాడు. చెట్లను పచ్చదనం వచ్చే విధంగా చేస్తాడు. పువ్వులు కాయు విధముగా చేయును. ఆహ్లాద కరమైన వాతావరణమును సమకూర్చుతాడు. ప్రణయ కలహంలో వున్న స్త్రీ పురుషులకు ఇతడు మిత్రుడు లాంటివాడు. మన్మథుడు శివుని తపస్సు భంగం చేయటానికి ముందుగా వసంతుడిని ప్రేరేపించి చెట్లకు పుష్పములు చిగురాకులు చిగురించునట్లుగా చేయమని కోరినాడు. ప్రేమికులకు ఇష్టమైనవాడు. ఈతడు మహా సౌందర్యవంతుడు.

**వసువులు :** దేవజాతులలో వీరు ఒక జాతివారు. వీరు బ్రహ్మ సభలో వుంటారు. వీరు మొత్తం ఎనిమిదిమంది వున్నారు. అందువలన వీరిని అష్టవసువులు అంటారు. పూర్వ కల్పములో అష్టవసువులలో ఎనిమిదవ వసువు పేరు సావిత్రుడు.

ఇతడు మయూరముతో రమించినందువలన కలిగిన బిడ్డకు రుక్మరధుడు అని పేరు. వీరిని గణదేవతలు అని కూడా పిలిచెదరు.

**వీరమాహేంద్ర పురం :** నాగావను అసురుడు నివసించే ప్రాంతం.

**వజ్రాయుధము :** ఇంద్రుని ఆయుధము. వృత్తాసురునకు భయపడి ఇంద్రుడు, సకల దేవతలు మహా విష్ణువును సంప్రదించగా "ధదీచి ఎముకలతో తయారుచేసిన ఆయుధముతో వానిని సంహరించవచ్చున"ని చెప్పగా, ఇంద్రుడు ధదీచి మహర్షిని ఆశ్రయించగా అతడు యోగాగ్నిలో భస్మమై ఇంద్రునికి తన ఎముకలను సమర్పించాడు. ఆ ఎముకలనుండి తయారు చేసినదే ఇంద్రుని వజ్రాయుధము. ఈ ఆయుధాన్ని విశ్వకర్మ సిద్ధం చేసినాడు.

**విశ్వావసువు :** గంధర్వ తీర్థంలో తపస్సు చేసి సిద్ధి పొందిన ఒకానొక గంధర్వుడు. ఇంద్రుడు నముచిని చంపగా సంతోషించి పాడిన గంధ్వర్వులలో ఒకడు. ఈతడు గంధర్వ రాజు. ప్రజాపతి కశ్యపుడు ఈతని తండ్రి, తల్లి ప్రధ. ఇంద్రుని సభకు వన్నె తెచ్చినాడు. జమదగ్ని చేసిన యాగంలో ఇతడు పద్యం చదివినాడు. దిలీప చక్రవర్తి చేసిన యాగంలో వీణ మీటినాడు.

**వజ్రదంష్ట్రుడు :** త్రిపురాసురుల సైన్యానికి నాయకుడు. కొన్ని గ్రామాలు పాతాళాన్ని ఆధీనంలోకి తెచ్చినందున ఈతనికి దుస్తులు బహుమతిగా యివ్వబడినాయి. ఇంద్రుడు "సముద్ర మధనానికి అంగీకరించుము" అని ప్రార్థించిన రాక్షసులలో ఒకడు.

**శాకినీ :** హిరణ్యాక్షుడు యజ్ఞ వరాహరూపుడైన విష్ణువుపై పోరాడుతూ పుట్టించగా ఆకాశంలో కనిపించిన ఒకానొక సురారి జాతి వారు. విష్ణువు చక్రాన్ని ప్రయోగించగా వీరు అణగిపోయారు.

**శారజ్గము :** విష్ణువు విల్లు, శ్రీ కృష్ణుడి విల్లు. ఇంద్రుడి ఛాపమైన విజయతో సమానమైనది. దీన్ని బ్రహ్మ నిర్మించి శ్రీకృష్ణుడికి యిచ్చినాడు.

**శాకద్వీపం :** ప్రియవ్రతుని కుమారుడు మేధాతిథి ఈ ద్వీపాన్ని పాలించినాడు. టేకు చెట్లు ద్వీపం అని పిలిచెదరు. సప్త ద్వీపాలలో ఇది ఒకటి.

**శాల్మలీ ద్వీపం :** యజ్ఞబాహువు ఈ ద్వీపాన్ని పాలించినాడు. గరుత్మంతుడు స్థిరంగా నివసించే శాల్మలీ వృక్షం కల ద్వీపం. బూరుగు చెట్ల ద్వీపం అని అంటారు. సప్త ద్వీపాలలో ఇది ఒకటి. ప్లక్ష ద్వీపానికి రెట్టింపు విస్తీర్ణం ఉంటుంది. ఈ ద్వీపాన్ని ఇక్షు (చెరకు) రసం చుట్టి వుంటుంది. వీటిలో వజ్రాలు ఉంటాయి. ఇచ్చట వాయు రూపంలో విష్ణువును పూజిస్తారు.

**శ్వేతద్వీపం :** మంచి మనస్సుతో దీనిని తలచుకున్న వారికి



మరణానంతరము విష్ణువు మంచి గతిని ఇస్తాడు. ఇది ఒక ద్వీపం. ఇచ్చట మహా విష్ణువు బ్రహ్మ విద్యను తెలుసుకోవడానికి తపస్సు చేసినాడు. క్షీర సముద్రానికి ఉత్తరాన మేరు పర్వతానికి 32 వేలు మైళ్ళ ఎత్తున ఉంటుంది. ఇచ్చటి నివాసులకు స్పర్శ జ్ఞానం
ఉండదు. ఆహారమును తీసుకొనరు. వీరు జ్ఞానవంతులు. వీరి శరీరమునుండి సువాసనలు విరజిమ్ముతాయి. వీరి శరీరం ఎముకలు వజ్రాయుధమంత గట్టిగా ఉంటాయి. వీరు శివున్ని పూజిస్తారు.

**శౌనకుడు :** నైమిశారణ్యంలో బ్రహ్మర్షి గణంతో సేవించబడుతుండెడు వాడు. 12 సంవత్సరములపాటు నిరంతరం యజ్ఞం చేసినాడు. దాన్ని సత్ర యాగం అందురు. ఈతని అసలు పేరు గృత్సమదుడు. శునకుని కుమారుడు అయినందున శౌనకుడు అని పిలువబడినాడు. ఈతనిని ధర్మవృద్ధ, శునహోత్ర, ధృత్సమద, శునక, శౌనక అనికూడ పిలుచుచున్నారు.

**సుదర్శన చక్రం :** ఇది విష్ణువు (కృష్ణుడు) చక్రాయుధం. కృష్ణుడు రుక్మిణితో కూడి బ్రహ్మ చర్యం పాటిస్తూ హిమాలయ సానువులలో 12 సంవత్సరాలు తపస్సు చేసి ఈ చక్రాన్ని పొందినాడు. విశ్వకర్మ దీనిని తయారు చేసినాడు. ఇది అత్యంత శక్తివంతమైన చక్రము. శత్రువుల కూటములోనికి వెళ్ళి విధ్వంసం సృష్టిస్తుంది. మహా విష్ణువు తలచగానే ఈ చక్రం సూర్యగోళంలో సూర్యునివలె ప్రకాశిస్తూ అగ్నిని, వేడిని సృష్టించి శత్రువులను నాశనం చేసి తిరిగి విష్ణువు చేతిలోనికి వస్తుంది.

**సూతుడు :** సూతుడు అనగా పృథ చక్రవర్తి తన పితామహ తన తండ్రి తండ్రి సంబంధమైన యజ్ఞములు చేయించుచుండగా హరియు వచ్చి అచటవున్న వారందరికి పురాణములను గురించి చెప్పినందున ఆ హరిని సూతుడు అని పిలిచినారు. అప్పటినుండి ఈతని సంతతివారిని సూతులు అని పిలిచెదరు. సూతులు అనగా అది ఒక వంశ నామముగా ఖ్యాతి పొందినది. ఈ వంశంలో జన్మించిన రోమహర్షుణిని కుమారుడు ఉగ్రశ్రవసుడు అను పేరు గలిగిన ఈతడు శౌనకాది మహామునులకు సకల పురాణకథలను తెలియజేసినాడు. కావున ఉగ్రుశ్రవసుడిని సూతుడు అని పిలిచినారు.

**సిద్ధులు :** కశ్యప ప్రజాపతికి 'ప్రాథ' అనే భార్యయందు కలిగిన సంతానము. వీరు బ్రహ్మ సభలో ఉండెదరు. శివుడిని సిద్ధుడు అని కూడ పిలిచెదరు.

**సాధ్యులు :** దేశ ప్రజల సాధన కోరేవారికి పూజించదగిన దేవతలు. బ్రహ్మ అదృశ్యరూపుడై పితృ దేవతలతోపాటుగా వీరిని పుట్టించినాడు. వీరు దేవ

భావాన్ని పొందినారు. అందుచేత శ్రాద్ధ సమయాలలో వీరిని ఉద్దేశించి హవ్య కవ్యాలను సమర్పిస్తారు. వీరు దేవజాతులలో ఒక జాతి వారు. వీరు బ్రహ్మ సభలో ఉంటారు. వీరు ఒక గణ దేవతలు. దక్ష ప్రజాపతి మనుమలు.

**సనకుడు :** బ్రహ్మమానస పుత్రులలో ఒకడు.

**సనత్సుమారుడు :** ఈతడు బ్రహ్మమనస పుత్రులలో ఒకడు. ఈతడు దేవర్షి. పురూరవుడు బ్రహ్మణుల ధనాలను అపహరిస్తూ వుండగా ఈయన బ్రహ్మచేత నియుక్తుడై పురూరవునివద్దకు వచ్చి అతని దర్శనం లభించకపోగా, ఆయన పురూరవుని ఉన్మత్తుడవి కమ్ము అని శపించినాడు. ఈయన ఆత్మ విజ్ఞానమునందు శ్రేష్టుడు.

**సనత్సు జాతుడు :** ఈతడు బ్రహ్మ మనస పుత్రులలో ఒకడు. ఈయన పురాణుడు. అనగా సృష్ట్యారంభమునందు జన్మించినను కుమారుడుగానే ఉండే బ్రహ్మజ్ఞాని. ఈయన విదురుడి ప్రార్థనను మన్నించి వచ్చి ధృతరాష్ట్రునికి జ్ఞానబోధ గావించినాడు.

ఈ ముగ్గురు మహర్షులు. ధర్మ ప్రజాపతి పుత్రులు. వీని తల్లి హింస. బ్రహ్మ సృష్టి చేయుటకు తపస్సు చేసి సన అని పలుకుటచే వీరు పుట్టిరి. వీరు సర్వదా కౌమారంలో ఉంటారు.

**హిమవత్పర్వతము :** భరత వర్షానికి ఉత్తరాన గల మహా పర్వతము.



## ఆమోదపట్టణము – విశ్లేషణ

వాల్మీకి రచియించిన శ్రీ రామాయణమునందు రామరావణ యుద్ధము ప్రారంభమైన రోజును తెలుసుకొన వచ్చును. యుద్ధకాండలోని 4వ సర్గలోని 6,7శ్లోకములు కొంత సమాచారమును తెలుపుచున్నవి. శ్రీరాముడు సుగ్రీవునితో ఈ విధముగా చెప్పినాడు. నేడు ఉత్తరఫల్గుణీ నక్షత్రము. రేపు హస్తా నక్షత్రము వున్నరోజు. ఇవి ప్రయాణానికి తగిన నక్షత్రములు అని శ్రీరాముడు సుగ్రీవునితో రావణునితో యుద్ధము చేయటానికి ప్రయాణము చేయుదుము అని పలికినాడు. ఫాల్గుణ మాసమునందు ఉత్తర నక్షత్రము వున్న తిథి సాధారణముగ పౌర్ణమి అవుతుంది. కావున ఫాల్గుణ మాస పూర్ణిమ రోజున ఉత్తర నక్షత్రము వున్న రోజున లంకా పట్టణానికి ఆవల ఉన్న సముద్ర తీరము వద్దకు సుగ్రీవుడు తన సైన్యముతోను హనుమంతుడు మొదలుగా గల మహానాయకులందరిని వెంటబెట్టుకొని రామ లక్ష్మణులను అనుసరించినాడు. సముద్రతీరం వద్దకు వచ్చి సముద్రము దాటటానికి సముద్ర దేవుని అనుగ్రహం కోసం ప్రార్థన చేసినాడు శ్రీరాముడు. సముద్రుడు అనుగ్రహ బుద్ధితో వానర సేనానాయకులలో ఒకరైన నలుడు అనువాడు కలడు. అతడు విశ్వకర్మయొక్క కుమారుడు. కావున ఈ సముద్రము మీద సేతువును నిర్మించు శక్తి అతనికి కలదు కావున అతనిని ఉపయోగించుకొని సేతు నిర్మాణమును ప్రారంభించండి నేను సంపూర్ణ సహకారం అందించుతాను అని సముద్రుడు శ్రీరామునికి వినయ విధేయతలతో కూడిచెప్పినాడు. వెంటనే శ్రీరాముడు ఈ సేతు నిర్మాణమును ప్రారంభించమని నలుడుని ఆదేశించినాడు. ఈ సేతు నిర్మాణము మొత్తం ఐదురోజులలో ముగించినాడు. యుద్ధకాండలోని 9వ సర్గ 65వశ్లోకం ప్రకారము రావణాసురుని మంత్రి సుపార్శ్వుడు రావణాసురునితో రాజా! నేడు కృష్ణపక్ష చతుర్ధశి కనుక ఈ రోజు యుద్ధ సన్నాహములు చేసికొనుము. రేపు అమావాస్యనాడు సమస్త బలములతో కూడి యుద్ధమున విజయమునకై బయలుదేరు అని రావణుని మంత్రి సుపార్శ్వుడు సలహా చెప్పినాడు. కావున రావణాసురుడు ఫాల్గుణ అమావాస్య నాడు సూర్యాస్తమయ సమయమునందే వీర మరణం పొందినాడు. తదనంతరం సీతను అగ్ని ప్రవేశం, విభీషణ పట్టాభిషేకం తదితర కార్యక్రమాలు ముగించుకొని పుష్పక విమానంలో అయోధ్యా నగరికి సీతారామలక్ష్మణ సుగ్రీవ హనుమాదులు బయలుదేరిరి. భరద్వాజ మహర్షి ఆశ్రమ మార్గముద్వారా అయోధ్యకు బయలుదేరిరి. అయోధ్యలో భరతుడు తన అన్న శ్రీరాముని రాకకొరకు నిరీక్షించుచున్నాడు. పద్నాలుగు సంవత్సరాలుదాటి ఒక క్షణము

అధికమైనయెడల నేను ప్రాయోపవేశము చేయుదునని గతంలో వనవాస ప్రారంభకాలములో భరతుడు శ్రీరామునికి చెప్పియున్నాడు. ఈ విషయం శ్రీరాముడు గుర్తు తెచ్చుకొని తన కోసం నిరంతరం ఎదురుచూచుచున్న భరతునకు అయోధ్యా నగరానికి తను వచ్చుచున్నట్లుగా తెలియజేయాలని భావించినాడు. ఎందువలననంటే ఏదైనా కారణములవలన తన రాక ఆలస్యమైతే భరతుడు నిరాశ నిస్పృహచెంది ప్రాయోవేశం చేస్తాడేమోనని వ్యధ చెంది హనుమంతుడిని ముందుగా వెళ్ళి భరతుడికి తమరాక సమాచారం తెలుపుమని పంపించుతాడు. అప్పుడు హనుమంతుడు భరతునివద్దకు వెళ్ళి పుష్యమీ నక్షత్రముతో కూడివున్న రేపటిరోజున శ్రీరామచంద్రుడు సీతా లక్ష్మణులతోసహా నీవు దర్శింపగలవు అని చెబుతాడు అను విషయం 129వ సర్గలోని 59వ శ్లోకం తెలుపుచున్నది.

శ్రీరాముడి యువరాజ పట్టాభిషేక మహోత్సవ సుముహూర్తము చైత్ర మాసములోని పుష్యమీ నక్షత్రము నందుంచినారు. పద్నాలుగు సంవత్సరాల వనవాసానంతరం అయోధ్యానగరికి వస్తానని శ్రీరాముడు చెప్పినాడు. పుష్యమీ నక్షత్రము వున్నరోజుకు 14 సంవత్సరాలు పూర్తిఅవుతాయి. 127 వ సర్గ 1వ శ్లోకం ప్రకారం చైత్ర శుద్ధ పంచమి నాటికి పద్నాలుగు సంవత్సరాల దీక్ష ముగియబోవుచుండగా ఆనాడు శ్రీరాముడు భరద్వాజాశ్రమమునకు చేరి వినయముతో ఆ మహామునికి నమస్కరించినాడు. కాబట్టి రావణ వధానంతరం అయోధ్యానగరానికి పుష్పకవిమానములో బయలుదేరి మార్గమధ్యంలో శ్రీరాముడు సీతాదేవికి ముఖ్య ప్రదేశాలు పుష్పక విమానమునుండి చూపించుచున్నాడు. అట్లు సేతువుమీద సేన విడిదిచేసిన భాగము మొదలగు విషయాలు తెలియజేయుచున్నాడు. అదే విధముగా పూర్వము ఈ పవిత్ర ప్రదేశమునందే పరమశివుడు నన్ను అనుగ్రహించినాడు. (శ్లో) అత్రపూర్వం మహాదేవః ప్రసాదమ్ అకరోత్ ప్రభుః అని సీతాదేవికి శ్రీరాముడు పరమశివుడు అనుగ్రహించిన ప్రదేశమును చూపించినాడు.

కాబట్టి శ్రీరాముడు లంకానగరమందలి రావణుని వధించినాడు. అనగా పాల్గుణ అమావాస్యరోజు రావణుడు హతమార్చబడినాడు. ఫాల్గుణము తరువాత చైత్రమాసం ప్రారంభమవుతుంది. అందువలన శ్రీరాముడు చైత్రమాసము ప్రారంభ దినములలోనే అయోధ్యా నగరానికి బయలుదేరినాడు. మార్గమధ్యంలో శ్రీరాముడు సీతాదేవికి జరిగిన విషయాలు తెలుపుచున్నాడు.

అనగా పుష్పక విమానంలో వుండి ప్రమాణిస్తూ దారిలోని విశేషములను వివరించుచున్నాడు. మైథిలీ! ఇదిగిదిగో! హిరణ్యానాభము అనుపేరుగల ఈ



మైనాక పర్వతమును జూడుము. ఇది బంగారు కాంతులీనుచున్నది. హనుమంతుడు నిన్ను అన్వేషించుటకై సముద్రమును లంఘించునప్పుడు ఆ మారుతికి విశ్రాంతి గూర్చుటకై ఈ శైలము సముద్ర గర్భమును చీల్చుకొని బయటకు వచ్చినది. ఇది సముద్ర మధ్య భాగమున సేతువుమీద సేన విడిదిచేసిన భాగము. ఈ ప్రదేమ మహిమాన్వితమైన సాగరముయొక్క ఉత్తర తీరము. దీనిని సేతుబంధనము అని పిలిచెదరు. సేతు నిర్మాణము ఇచ్చటనుండియే ప్రారంభమైనది. ఇదియొక పుణ్యక్షేత్రము. దీనిని దర్శించిన వారికి సమస్త పాపములు నశించును. పూర్వము ఈ పవిత్ర ప్రదేశమునందే పరమశివుడు నన్ను అనుగ్రహించినాడు. రాక్షసరాజైన విభీషణుడు నన్ను శరణుజొచ్చినది ఇక్కడనే (14-18) అని వివిధ ప్రదేశములను చూపించినాడు. ఈ పై వాక్యములలో శ్రీరాముడు శివలింగ ప్రతిష్ఠ చేసినట్లులేదు. శ్రీరాముడుచే శివలింగ ప్రతిష్ఠ చేయబడినది. కాబట్టి ఆ శివలింగమునకు రామలింగేశ్వరుడు అను పేరు వచ్చినట్లు స్థలపురాణాలలో పేర్కొనబడినది. ఇది చాలా సత్యదూరమైన విషయముఅని తేటపడుచున్నది. రావణాసురుడు బ్రాహ్మణ వంశస్థుడు కాబట్టి రావణాసురుని చంపుటద్వారా బ్రాహ్మణహత్యా దోషం తనకు సంప్రాప్తమౌతుంది అని శ్రీరాముడు భావించి ఈ సేతు బంధమువద్ద సీతాసమేతుడై సైకతలింగమును ప్రతిష్ఠించినాడు అని కూర్మపురాణము, స్కాందపురాణములు పేర్కొనుచున్నవి. వాల్మీకి మహర్షి శ్రీమద్రామాయణమును 24వేల శ్లోకములతో వ్రాసినాడు. ప్రతి సంఘటనను అత్యంత విపులముగా వివరించినాడు. శ్రీరాముడు శివలింగ ప్రతిష్ఠ రావణాసురుని వధానంతరం చైత్రమానములో అయోధ్యానగరానికి వచ్చే మార్గమధ్యంలో చేసివుంటే ఆ విషయమును వ్రాయకుండా వదిలివేయునా? ఇది ఆలోచించదగిన విషయము. ప్రతి సంఘటనను కంటికి కట్టినట్లుగా వివరణతో వ్రాసిన వాల్మీకి మహర్షి శివలింగ ప్రతిష్ఠ అను కీలక సంఘటనను వ్రాయకుండా విడిచిపెట్టడు. కావున సేతుబంధము వద్ద శ్రీరాముడు చైత్రమాసములో శివలింగ ప్రతిష్ఠ చేయలేదని తెలియుచున్నది. అయితే సీతాదేవికి తెలియపరచుచున్నాడు. ఏమిటంటే ఇది ఒక పుణ్యక్షేత్రము. ఈ పరమ పవిత్ర పుణ్యక్షేత్రమునందు ఇంతకుముందు పరమశివుడు నన్ను అనుగ్రహించినాడు అని చెప్పినాడు. కావున సీతాన్వేషణ రోజులలో ఈ ప్రదేశమునందు జ్యోతిర్లింగమై వెలసివున్న రామలింగేశ్వరుడు అయిన పరమశివుడు ఇచ్చట లింగరూపములో వెలసివున్నాడనియు, ఆ పరమశివుడైన రామలింగేశ్వర రూపిత శివలింగమును శ్రీరాముడు అర్చించి యుండుటచేత పరమేశ్వరుడు శ్రీరాముడికి ప్రత్యక్షమై అనుగ్రహించినట్లుగా

తెలియుచున్నది. బ్రహ్మాండ పురాణాంతర్గతమైన శ్రీదేవాంగచరితము 29 అధ్యాయములతో కూడియున్నది. ఆ 29 అధ్యాయాలలో 18వ అధ్యాయము శ్రీ దేవాంగఅవతార సమాప్తి అనునది ఈ అధ్యాయములో పరమశివునిచే శపింపబడిన దేవలుడు తన నివాసస్థానమైన ఆమోద పట్టణమునకు వచ్చి తన కుటుంబసభ్యులకు తనకు శాపం కలిగిన విషయాన్ని అనగా ఓయీ నీవు నీమహిమను పోగొట్టుకొని విద్యాధరుడవు అవుదువు పొమ్ము అని సకలలోక శుభకరుడగు ఈశ్వరునిచేత ఆ దేవలుడు శపింపబడిన వాడై అంత ఆమోదపట్టణమునకు వచ్చి తన సమాచారమును చెప్పెను. అప్పుడు దేవాంగరాజుదేహము అక్కడ లింగమాయెను. ఇప్పుడు ఆ ఆమోదపట్టణమునందు రామలింగేశ్వరుడు అని ప్రసిద్ధికెక్కిన ఒక దేవుడున్నాడు. ఆ దేవాంగుని కొడుకు మితిలేని ప్రతాపము కలవాడును సకలసంపదలు గలవాడునగు దివ్యాంగుడా రామలింగేశ్వరుని పూజించుచు భూమిని పాలించెను.

కావున పరమేశ్వరుని ఫాలభాగము నందుండి ఆవిర్భవించి శివమానస పుత్రుడుగా ప్రసిద్ధి బడసిన శ్రీదేవాంగుడు తన తండ్రి శివుని ఆజ్ఞప్రకారము అవతారము చాలించినాడు. అందువలన ఆ దేవాంగుని శరీరము లింగముగా మారినది. అది ఆమోదపట్టణములో వున్నది. అది రామలింగేశ్వరుడుగా ప్రసిద్ధికెక్కినది, దానిని అతని తనయుడు పూజించినాడు. అని స్పష్టముగా తెలియుచున్నది.

మరి రామేశ్వర స్థలపురాణములో శ్రీరాముడిచే శివలింగము ప్రతిష్ఠింపబడినది అని దానిని సీతారాములు ఇరువురు ఇసుకచేత నిర్మింపబడిన లింగమును ప్రతిష్ఠించినారుఅని స్కాంధపురాణాంతర్గత బ్రహ్మఖండమునందు 52అధ్యాయాలలో 4027 శ్లోకములతోను శివపురాణము నందలి జ్ఞానకాండలో జ్యోతిర్లింగ మహత్యముగాను గరుడ పురాణములో 81వ అధ్యాయమునందు సేతుతీర్థ ఉత్తమత్వ ప్రశంసాభాగము, బ్రహ్మ వైవర్త పురాణమందలి శ్రీకృష్ణజన్మ ఖండమున 76వ అధ్యాయమున్ను, మత్స్యపురాణమున 22వ అధ్యాయమును మొదలగు అనేక గ్రంథములు ఈ క్షేత్రమహిమను వర్ణించినవి. రామేశ్వరములోని శివలింగము జ్యోతిర్లింగము. అంతేకాని ఒకరిచేత ప్రతిష్ఠింప బడిన శివలింగము కాదు. భారతఖండమునందు జ్యోతిర్లింగములు మొత్తము 12 వున్నవి. వాటిలో రామేశ్వరము ఒకటి. కాబట్టి శివఫాలనేత్ర సంభూతుడై శివమానస పుత్రుడై ప్రసిద్ధి బడసి ఆతని ఆజ్ఞ ప్రకారము అవతారము చాలించగా ఆతని దేహము లింగముగా మారినది. అది రామలింగేశ్వరుడిగా ప్రసిద్ధి గాంచినది



అనుదానికి సరిపోవుచున్నది. అంతేకాదు స్కాందపురాణమునందలి రజతాచల ఖండమునందలి గురుజ్ఞాన సుధార్ణవమునందు శ్రీదేవాంగ అష్టోత్తర శతనామావళి తెలుపబడినది. దానిలో రామలింగేశ్వరాకారాయ నమః అనియు రామచంద్రప్రపూజితాయనమః అనియు రెండునామములు కలవు. రామలింగేశ్వరాకారాయ అనగా రామలింగేశ్వరుని ఆకారములో వున్న దేవల మనుబ్రహ్మ నీకు నమస్కారము అనిభావము. మరియొక నామము రామచంద్ర ప్రపూజితాయ నమః అనివున్నది అనగా శ్రీరామచంద్ర ప్రభువుచే పూజింపబడిన దేవలుడా నీకు నమస్కారము అని అర్థము. కావున దేవలుడు రామలింగేశ్వరాకారమును పొందినట్లుగాను ఆ లింగమును రామచంద్రప్రభువు పూజించినట్లుగాను తెలియుచున్నది. శ్రీరాముడు సీతాదేవికి ఇదిగిదిగో ఈ పరమ పవిత్ర ప్రదేశమునందే మహాదేవుడు నన్ను అనుగ్రహించినాడు అని తెలిపినాడు. అంతేకాదు ఈ సేతు బందనము పరమ పావనమైనది అని తెలిపినాడు. కావున ఈ సేతు బంధనము వద్ద వున్న రామలింగేశ్వరుడు స్వామి దేవలుని శరీరము లింగముగా మారినదని తెలియుచున్నది. అంతేకాదు ఇది జ్యోతిర్లింగము. కావున ఇది దేవలుని శరీరము లింగముగా మారినలింగమే అని స్పష్టము అగుచున్నది. జ్యోతిర్లింగము అనగా శివుని తేజస్సు లింగరూపంలో ఆవిర్భవించినది అని తెలియుచున్నది. శివుని ఫాలనేత్రమునుండి ఉద్భవించిన శరీరము లింగముగా మారినదికాబట్టి దీనిని జ్యోతిర్లింగముగా అభివర్ణించవచ్చును. కావున నేటి రామేశ్వర క్షేత్రములో జ్యోతిర్లింగముగా పూజలు అందుకొనుచున్నది దేవల శరీరము లింగముగా మారి రామలింగేశ్వరుడుగా ప్రసిద్ధి గాంచినది అని విశదముగా తెలియుచున్నది. అంతేకాకుండా బ్రహ్మాండ పురాణములోని దేవాంగచరిత నందలి28వ అధ్యాయమునందలి 12వ శ్లోకములో మునుపు రావణుని చంపిన శ్రీరామునిచేత రామేశ్వర క్షేత్రమునందు పూజింపబడిన రామలింగ స్వామిని నీవు (దేవలుని 7వ అవతారముగాఎత్తిన దేవదాసా) పూజచేయవలయును. ధర్మార్థ కామ మోక్షములనిచ్చు నట్టియు బ్రహ్మ మొదలగు వారిచేత పూజింపబడిన ఆశివుడు నీవంశము వారిచేత ప్రీతితో పూజింపదగినవాడు. నీవంశమువారు రామలింగేశ్వర స్వామిని చౌడేశ్వరిని పూజించుటవలన ఎల్లకోరికలను పొందుదురు సందేహములేదు అనిచెప్పి ఆ పార్వతీదేవి సాంబమూర్తి నొసటి కంటినుంచి పుట్టిన కొడుకైన దేవాంగునికి చెప్పి పంపెను. కావున రావణుని చంపిన శ్రీరామునిచేత పూజింపబడిన రామేశ్వరము నందలి రామలింగేశ్వరుడు దేవాంగుల కులారాధ్యుడు అయిన దేవల మనుబ్రహ్మ. రామాయణంలో చెప్పబడలేదు కాని కూర్మపురాణంలో స్కాందపురాణం,

బ్రహ్మావైవర్త పురాణం, స్థలపురాణములలో సీతచేత తయారు చేయబడిన సైకత (ఇసుక) లింగమును శ్రీరాముడిచేత ప్రతిష్ఠింపబడినదని,ఆంజనేయస్వామి కైలాసంనుంచి ఆలస్యముగా తెచ్చిన లింగంకూడా ప్రతిష్ఠింపబడినదని పైపురాణములయందు తెలుపబడినది. అవిఎప్పుడు ప్రతిష్ఠింపబడినవంటే జ్యేష్ఠమాస శుద్ద దశమీతిథి బుధవారం రోజున హస్తా నక్షత్రము గరజీకరణము వ్యతీపాత యోగమునందును, కన్యారాశిలో చంద్రుడును, వృషభరాశిలో రవిగ్రహం వున్న పంచాంగశుద్ధి వున్నరోజున ప్రతిష్ఠించినట్లు తెలుపుచున్నవి. అంతేగాని చైత్రమాసము కాదు. అయితే నేడు శ్రీశైల మహాక్షేత్రమునందు ప్రధాన మల్లికార్జున శివలింగము ప్రక్కన అనేకమంది ప్రతిష్ఠించినట్లు చెప్పబడే సీతా ప్రతిష్ఠిత లింగము అని, పంచపాండవులైన ధర్మరాజుచే ప్రతిష్ఠించిన లింగం, భీమునిచే ప్రతిష్ఠించిన లింగము అని ఈ విధముగా అచ్చట అనేక లింగములు ప్రతిష్ఠింపబడినట్లే శ్రీరామచంద్రమూర్తి అయోధ్యా పట్టణమునందు రాజుగా అభిషేకింపబడి పాలన చేయుచు తదనంతర సంవత్సరాలలో పై తెలిపిన జ్యేష్ఠమాస కాలమందు రామేశ్వర క్షేత్రమునందు సీతాదేవిచేత చేయబడిన సైకత లింగంను బ్రహ్మహత్యా దోషము తొలగిపోవుటకు ప్రతిష్ఠించి ఉ ండవచ్చును. కాని నేడు పూజింపబడుచున్న రామలింగేశ్వర లింగం జ్యోతిర్లింగం. అంతేగాని ఒకరిచే ప్రతిష్ఠించిన లింగం కాదు. అందువలన అది శివఫాలనేత్రమునుండి ఉద్భవించిన దేవల అవతార సమాప్తియందు దేహము లింగంగా మారిన లింగము. ఈ లింగమే రామలింగేశ్వరుడుగా ప్రసిద్ధిగాంచెను అని చెప్పబడిన విషయం బ్రహ్మాండ పురాణం, స్కాంద పురాణం, రామాయణానికి సరిపోలుచున్నది. ఈ జ్యోతర్లింగ మహాత్మ్యమును గురించి ప్రసిద్ధ పురాణములు పేర్కొనబడినవి. అంతేగాని శ్రీరామునిచే ప్రతిష్ఠించిన శివలింగం గురించికాదు. అలనాటి ఆమోదపట్టణమే నేటి రామేశ్వర క్షేత్రం అను విషయము తేటతెల్లముగా తెలియుచున్నది.



## వేదోక్త మూల స్తంభనము

**గాయత్రీ ధ్యానమ్ :**

ముక్తా విద్రుమ హేమనీల ధవళ చ్ఛాయై ర్ముఖై స్త్రీక్షణై
ర్యుక్తా మిందు నిబద్ధ రత్న మకుటాం తత్త్వార్ధవర్ణాత్మికాం
గాయత్రీం వరదా-భయాంకుశ కశాంశుభ్రం కపాలంగదం



శంఖం చక్రమ దారవింద యుగళం హస్తైర్వహంతిం భజే.

----(0)----

**శ్రీమద్దేవాంగ పరబ్రహ్మ స్తోత్రమ్.**

ఓం, అస్య శ్రీ గురు దేవాంగ పరబ్రహ్మస్తోత్ర మహా మంత్రస్య, ఏకో రామార్య ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీ దేవాంగ పరబ్రహ్మ దేవతా, ఓం బీజమ్, నమః శక్తిః, శివాయ ఇతి కీలకమ్, మమ శ్రీ గురు దేవాంగ పరబ్రహ్మ ప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః-

ఓం దేవలాయ అంగుష్ఠాభ్యాం నమః
ఓం నం సూత్రాత్మ కాయ తర్జనీభాయం స్వాహా
ఓం మం బ్రహ్మోపదేశ కారణాయ మధ్యమాభ్యాంవషట్
ఓం శిం గాయత్రీ నిర్మితాయ అనామికాభ్యాం హుమ్
ఓంవాం పరశివ ఫాలచక్షురుద్భవాయ కనిష్ఠకాభ్యాం వౌషట్
ఓం యం సత్యస్వరూపాయ కరతల కరపృష్ఠాభ్యాం ఫట్.

**అథ హృదయాది న్యాసః ---**

ఓం దేవలాయ హృదయాయ నమః
ఓం నం సూత్రాత్మకాయ శిరసే స్వాహా
ఓం మం ప్రహ్మోపదేశ కారణాయ శిఖాయై వషట్
ఓం శిం గాయత్రీ నిర్మితాయ కవచాయహుమ్
ఓంవాం పరశివ ఫాలచక్షుద్భవాయనేత్రత్రయామ వౌషట్
ఓం యం సత్యరూపాయ అస్త్రాయ ఫట్.
ఓం భూర్భుసువరో మితి దిగ్బంధః.

**ధ్యానమ్.**

వందే నిత్యం భవ భయహరం సర్వలోకాధివాసం
నిత్యాకారం సకల జగతాం సూత్రధత్తార మాద్యం
భావాతీతం త్రిగుణ రహితం తత్త్వనస్యాది గమ్యం
దేవాంగాఖ్యం పరమ పురుషం సచ్చిదానంద రూపమ్.

**అథ మానసిక పంచపూజా.**

లం- పృధివాత్మనే శ్రీమద్దేవాంగాయ గంధం సమర్పయామి.
హం- ఆకాశాత్మనే శ్రీమద్దేవాంగాయ పుష్పం సమర్పయామి.
యం- వాయ్వాత్మనే శ్రీమద్దేవాంగాయ ధూపమాఘ్రాపయామి.

రం- తేజసాత్మనే శ్రీమద్దేంగాయ దీపం దర్శయామి.

వం- అమృతాత్మనే శ్రీమద్దేవాంగాయ అమృతోపహారం సమర్పయామి.

సం- సర్వాత్మనే శ్రీమద్దేవాంగాయ సర్వోపచార పూజాం సమర్పయామి.

**అథ మానసిక పంచపూజా.**

స్వాచార్య సకాశాత్ లబ్ధోపదేశః శ్రీ దేవాంగ ద్వాదశాక్షరీ మహామంత్రం యథాశక్తిం జపిత్వా, పునః ధ్యానం మానసిక పూజాం హృదయాది న్యాసంచ కుర్యాత్. భూర్భువస్సురో మిత్యుత్తర దిగ్విమోకః.

ఓం దేవలాయ సదాశివాయ నమః

**ధ్యానమ్**

వందే నిత్యం భవభయహరం సర్వ లోకాధివాసం।
నిత్యాకారం సకల జగతాం సూత్రధర్తార మాద్యం॥
భావాతీతం త్రిగుణరహితం తత్త్వ మస్యాది గమ్యం।
దేవాంగాఖ్యం పరమ పురుషం సచ్చిదానందరూపమ్॥

తా॥ జనన మరణ భయంబును పోగొట్టువాడును, సమస్త లోకంబుల యందును దోషరహితుడై సర్వభూతాంతరాత్మజుడై నాశరహితమైన అఖండాత్మకమైన పరబ్రహ్మముగా నుండువాడును జ్ఞానమే స్వరూపముగా గలవాడును సకల జగంబులకు అంతరాత్మగా విలసిల్లెడువాడును మనస్సుచేత ఇట్టి గుణములు కలవాడు అని నిర్దేశింప సాధ్యముగానివాడును రజస్సత్త్వ తమోగుణములు లేనివాడును తత్త్వమస్యాది మహావాక్యములచే తెలియబడువాడును శక్తి జ్ఞానానందములే స్వరూపముగా గలవాడును అగు పరమ పురుషుడు దేవాంగునకు నిరంతరము నమస్కరించుచున్నాను.

1. ఓం శ్రీ దేవాంగాయనః
2. ఓం మహాదేవాయనమః
3. ఓం దేవలాయనమః
4. ఓం దేవ పాలకాయనమః
5. ఓం మహా దేవస్థిత జ్యోతిషేనమః
6. ఓం సృష్టి స్థిత్యంత కారకాయనమః
7. ఓం చూడాంబికాఖ్య సన్ముక్తా శుక్తి చిచ్ఛక్తి ధారకాయనమః
8. ఓం బ్రహ్మ విష్ణీశ సంపూజ్య పాదపంకజ భాసితాయనమః



9. ఓం పరమాత్మాయనమః
10. ఓం పరంజ్యోతిషేనమః
11. ఓం పరబ్రహ్మణేనమః
12. ఓం పరాత్పరాయనమః
13. ఓం పరేశ్వర సహస్రార పద్మాంతరప్రభాసకాయనమః
14. ఓం యజ్ఞకర్త్రేనమః
15. ఓం యజ్ఞ భోక్త్రేనమః
16. ఓం యజ్ఞ సూత్ర స్వరూపకాయనమః
17. ఓం విశ్వకర్త్రేనమః
18. ఓం విశ్వభర్త్రేనమః
19. ఓం విశ్వరాజేనమః
20. ఓం విశ్వ కారణాయనమః
21. ఓం నిరాలంబాయనమః
22. ఓం నిరాకారాయనమః
23. ఓం నిరాభాసాయనమః
24. ఓం నిరాకులాయనమః
25. ఓం నిర్వికల్పాయనమః
26. ఓం నిరాంతకాయనమః
27. ఓం నిష్కళంకాయనమః
28. ఓం నిరంజనాయనమః
29. ఓం సర్వకర్త్రేనమః
30. ఓం సర్వ సాక్షయేనమః
31. ఓం సర్వ కారణ కారకాయనమః
32. ఓం సూత్ర కర్త్రేనమః
33. ఓం సూత్ర ధారిణేనమః
34. ఓం సూత్రాత్మనేనమః
35. ఓం సూత్రదాయ కాయనమః
36. ఓం వేద వేదాంగ సంవేద్యాయనమః
37. ఓం సచ్చిదానంద విగ్రహాయనమః
38. ఓం మహాదేవాయనమః
39. ఓం మహద్రూపాయనమః
40. ఓం మహా వాక్యార్థ గోచరాయనమః

41. ఓం నిత్య శుద్ధాయనమః
42. ఓం నిత్య తృప్తాయనమః
43. ఓం నిర్గుణాయనమః
44. ఓం నిరుపద్రవాయనమః
45. ఓం సత్త్వాది గుణ సంయుక్తాయనమః
46. ఓం సాకారాయనమః
47. ఓం సకలాన్వితాయనమః
48. ఓం సర్వలోక ప్రతీకాశాయనమః
49. ఓం సర్వలోక ప్రియంకరాయనమః
50. ఓం సర్వభూత స్వరూపాయనమః
51. ఓం సర్వ భూతాదినాయకాయనమః
52. ఓం భూర్భువాదిక లోకేశాయనమః
53. ఓం అతలాద్యధి నాయకాయనమః
54. ఓం సద్యోజాతముఖోత్పన్నాయనమః
55. ఓం బ్రహ్మణే వేదదాయకాయనమః
56. ఓం సూర్య చంద్రాగ్ని నిలయాయనమః
57. ఓం సౌమ్యాయనమః
58. ఓం ప్రణవ మందిరాయనమః
59. ఓం శైవ ఫాలాక్ష సంభూతాయనమః
60. ఓం శివాయనమః
61. ఓం శైవాగమార్చితాయనమః
62. ఓం శైవాముద్రాంకిత ధరాయనమః
63. ఓం శైవాజ్ఞా పరిపాలకాయనమః
64. ఓం చూడాంబికా తనూజాతాయనమః
65. ఓం పంచాచార్య ప్రతిష్ఠకాయనమః
66. ఓం గాయత్రీ జననాధారాయనమః
67. ఓం గాయత్రీ పీఠ నిర్ణయాయనమః
68. ఓం క్షీరాబ్ధిసంగతాయనమః
69. ఓం స్వర్ణతంతు సంపాదనోత్సుకాయనమః
70. ఓం శ్రీమన్నారాయణ ధ్యానచింతనోల్లాస మానసాయనమః
71. ఓం దేవ గంధర్వ సంసేవితాయనమః
72. ఓం దేవదత్తా మనోహరాయనమః



73. ఓం నందికేతన సంయుక్తాయనమః
74. ఓం నక్రకుండల ధారకాయనమః
75. ఓం మాయాతీతాయనమః
76. ఓం మనుబ్రహ్మణేనమః
77. ఓం మాయాంగాయనమః
78. ఓం మహిమాఢ్యకాయనమః
79. ఓం జ్యోతిర్మయాయనమః
80. ఓం చిన్మయాత్మనేనమః
81. ఓం శుచిర్భూతాయనమః
82. ఓం సుఖ ప్రదాయనమః
83. ఓం ఆమోదపత్తనాధీశాయనమః
84. ఓం అగ్నిదత్తామనః ప్రియాయనమః
85. ఓం బ్రాహ్మణ్యక ప్రతిష్ఠాత్రేనమః
86. ఓం బ్రహ్మవిద్యాప్రదాయకాయనమః
87. ఓం రామలింగేశ్వరాకారాయనమః
88. ఓం రామచంద్ర ప్రపూజితాయనమః
89. ఓం విద్యాధరాయనమః
90. ఓం పుష్పదంతాయనమః
91. ఓం భేతాళాయనమః
92. ఓం భూతశిక్షకాయనమః
93. ఓం వరవిద్యా వ్యాపకాయనమః
94. ఓం వరరుచ్యవతారకాయనమః
95. ఓం చింతితాచ్యుతపాదాబ్జాయనమః
96. ఓం చిత్రయోగి స్వరూపకాయనమః
97 ఓం దేవశాలి సమాఖ్యాతాయనమః
98. ఓం దేవదాసాయనమః
99. ఓంమహామతయేనమః
100. ఓం దేవాంగవంశాద్యాయనమః
101. ఓం దేవయజ్ఞఫలప్రదాయనమః
102. ఓం అష్టాంగయోగనిరతాయనమః
103. ఓం అప్రాకృత ద్విజావనాయనమః

104. ఓం చతుష్షష్టి కళాధీశాయనమః
105. ఓం చాతుర్వర్ణ్యోపదేశకాయనమః
106. ఓం జగదంతర్బహిర్వ్యాప్తాయనమః
107. ఓం జగత్సేవ్యాయనమః
108. ఓం జగద్గురవేనమః

శ్రీరస్తు!

ఓం శ్రీ దేవాంగ పరబ్రహ్మణే నమః

శ్రీ మద్దేవాంగ మనుబ్రహ్మ ప్రతిపాదక

# వేదోక్త మూల స్తంభనము

## పీఠిక

వేదోక్త మూలస్తంభనమునందు పేర్కొనబడిన దేవలునికి దేవాంగ పురాణమునందు చెప్పబడిన దేవలునికి చాలా వ్యత్యాసమువుండినది. వేదోక్త మూల స్తంభనమునందు తెలుపబడిన దేవలుడు ఎవరంటే ఈ చతుర్దశ భువన బ్రహ్మాండములు సృష్టింపకపూర్వము ఒకానొక పరంజ్యోతి మాత్రమే ప్రకాశించుచున్నది. అది కోటి సూర్యుల వెలుగుల కాంతి ఒకచోట రాశిగా పోసిన యెడల ఎంతటి ప్రకాశవంతమైన కాంతివుండునో అంతటి ప్రకాశ శక్తితో పరంజ్యోతి నిశ్చలంగా, నిర్మలంగా తన కాంతిశక్తిని వెదజల్లుచున్నది. ఈ పరంజ్యోతినే **దేవల** అని దేవతలు కీర్తించినారు. అనగా ఎటువంటి జీవరాసులు సృష్టింపబడకయున్న అఖండ పరిపూర్ణ దివ్యానందశక్తి. ఈ పరంజ్యోతి నందున్న పరమాత్మ స్వరూపము అనేక రూపములుగాను నామములుగాను భాసిల్లవలెనని తనకుతానుగా సంకల్పించుకొనినది. ఆ పరంజ్యోతినుండి దివ్య పురుషరూపము వెలువడినది. ఆ విధముగా ఏర్పడిన తొట్టతొలి పురుష రూపమును సదాశివుడు అందురు. ఆ సదాశివుడు తనయొక్క మాయాశక్తి వలన ఒక దివ్య స్త్రీ రూపము వెలువడినది. ఆ దివ్య స్త్రీ రూపమునే ప్రకృతిశక్తి అని మాయ అని అంటారు. ఈ మాయ శక్తినే చౌడేశ్వరీదేవి యని అగస్త్య మహర్షి కొలిచినాడు. ఈ ప్రకృతి మాయాశక్తినుండి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదులు జన్మించినారు. ఆతరువాత ఇతర దేవగణమును సృష్టింపబడినారు. సదాశివుడు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, దేవతలు మొదలైన వారందరిచేత ప్రార్థింపబడిన, పూజింపబడిన ఆ అఖండ పరిపూర్ణపరంజ్యోతి స్వరూపమును **దేవల** అని అందురు. అనగా నిరామయ, నిర్మల, నిశ్చల పరంజ్యోతి రూపుడై సదాశివుని సృష్టించి అనంతరము ఆసదాశివుని సహస్రార కమలమునందు



ప్రవేశించి ప్రకాశించు ఏకైక మొట్టమొదటి దేవుడు దేవలుడు. ఆ దేవలున్ని గురించి తెలియజేసేది ఈ వేదోక్త మూల స్తంభనం అను గ్రంథము. మోక్ష సామ్రాజ్యాన్ని ప్రసాదించేది ఇతనే. ఈ దేవలున్ని సదాశివుడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఇతర దేవతా గణము తమకు వస్త్రములు ఇవ్వమని ప్రార్థించగా అప్పుడు మహాదేవుడు అయిన స్వయంభువు దేవలుడు సదాశివుడి సహస్రార కమలమునుండి వెలుపలికి దివ్య కాంతి స్వరూపముతో వచ్చి తన శక్తినుండి వేరొక కాంతి శక్తి విడివడి ఒక పురుషరూపము ధరించినది. మహాదేవుడైన దేవలున్ని శరీరమునుండి ఉద్భవించినాడు. కావున దేవాంగుడనియు, వస్త్రములు దేవతలకు ఇచ్చి ఆ దేవతలు తమశరీర అంగములను ఈ దివ్య వస్త్రములచే అలంకరించుకొనుట వలన దేవాంగ అమగా దేవతల అంగములను అలంకరించిన వాడా అని పేర్కొన్నారు. కాహట్టి దేవాంగ పురాణంలో దేవల, దేవాంగ అనునది సదాశివుని తరువాత బ్రహ్మ, విష్ణు, మహేశ్వర సృష్టింపబడిన ఆ తరువాత సృష్టింబడిన వాడనియు, ఈ దేవాంగుడు సదాశివుని ఆజ్ఞానుసారముగా నడచుకొనవలెనని ఆజ్ఞాపింపబడినవాడుగా గ్రహించవలెను. వేదోక్త మూల స్తంభనమునందు తెలుపబడిన దేవల అనునది నిరాకార పరంజ్యోతి యని నిర్మలుడు అని స్వయంభువు అని తెలుసుకొనవలయును. కాని దేవాంగ పురాణంలో తెలుపబడిన దేవలుడు / దేవాంగుడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల లాంటి దేవత అని తెలుసుకొనవలయును.

## గ్రంథ ప్రారంభము

శ్లో॥ **పూర్వం మునికుల శ్రేష్ట స్సర్వశాస్త్ర విశారదః**
**సనత్కుమారః పప్రచ్ఛ నందీశం ప్రమథేశ్వరమ్॥**

తా॥ పూర్వకాలమునందు మునులయందు శ్రేష్టుడును, సమస్త శాస్త్రములయందు సంపూర్ణ జ్ఞానముగలవాడును అగు సనత్కుమారుడు ప్రమథ గణాధిపతియైన నందీశ్వరుడిని సమీపించి ఈ విధముగా అడిగినాడు.

శ్లో॥ **నందీశ్వర మహాప్రాజ్ఞ కలికల్మషనాశక।**
**త్వత్తశ్శ్రు తాని శాస్త్రాణి సర్వాణి వివిధానిచ**
**ఇదానీం శ్రోతు మిచ్ఛామి వేదవేదాంత సమ్మతం**
**దేవాంగ మునిమాహాత్మ్యం తథా తత్కుల విస్తరం।**
**బ్రూహిమే శ్రుతి సమ్మత్యా నందీశ కరుణానిధే॥**

తా॥ కలికాలమునందు ఉండు దోషములను నిర్మూలించు శక్తి కలిగినటువంటి వాడవై ప్రభావ సంపత్తితోడ విజ్ఞాన సంపన్నులయందు శ్రేష్టుడవైన

నందీశ్వరా! మీమూలముగా సమస్త వేదములు, శాస్త్రములు విని యున్నాను. మరి వేదములు, వేదాంగములు వేదాంతమైన ఉపనిషత్తులచే అంగీకరింపబడిన దేవాంగముని మాహాత్మ్యమును, దేవాంగ కులము యొక్క విస్తారమును గురించి మీనుండి వినవలయునని నాకు కోరిక కలిగినది. కావున తమరు నాకు ఈ విషయములను వివరముగా తెలుపవలయునని సనత్కుమారుడు నందీశ్వరుని ప్రార్థించినాడు.

## సనత్కుమారునికి వేదోక్తమూలస్తంభనను గురించి నందీశ్వరుడు చెప్పుట

**శ్లో॥ సనత్కుమారవచనంశ్రుత్వా నందీశ్వరో బ్రవీత్।**
**బ్రహ్మాదీనామమేయం య న్మాహాత్మ్యం దేవలస్య తత్।**
**పృష్టం త్వయాద్య యోగీంద్ర సర్వలోక హితాయచ।**
**వేదవాక్యాని సంగృహ్యా తత్ర తత్రతు శంభునా।**
**షణ్ముఖా యోదితం పూర్వం సర్వపాపనిబర్హణం।**
**దేవాంగ చరితం దివ్యం సర్వారిష్ట నివారకం।**
**నిగమాగమ సమ్మత్యా వక్ష్యామి శ్రుణుసాదరమ్.**

తా॥ ఈవిధముగా సనత్కుమారినిచే ప్రార్థింపబడిన నందీశ్వరుడు అప్పుడు సనత్కుమారునితో ఓమునీంద్రా! ఇప్పుడు నీవు అడిగిన ప్రశ్న దేవలబ్రహ్మ మహాత్మ్యమును గూర్చి నిర్దేశించి చెప్పుట బ్రహ్మాది దేవతలందరికి సాధ్యముకాదు. ఇటువంటి దేవాంగ ప్రభావమును తెలుసుకొనవలయునని ఒకానొకసారి సుబ్రహ్మణ్యస్వామి శంభుమూర్తిని ప్రార్థించినాడు. అప్పుడు సర్వలోక శరణ్యుడైన శంకరుడు ఈదేవల మహాత్మ్యమును వేదములు, ఆగమములు మొదలగు వాటిచే నిరూపితమై వున్నటువంటి ప్రమాణములను సంగ్రహముగా సమస్త లోకములకు మేలు కలుగుటకొరకై కుమారస్వామికి బోధించినాడు. ఈ దేవల ప్రభావము సర్వదోష నివారకంబగుచు పరమపవిత్రమైనదియును, సకల అరిష్టములను నివారించునదియును అయివున్నది. ఇటువంటి ప్రభావ సంపన్నమైనటువంటి దేవాంగ చరిత్రను వేదవేదాంతానికి ప్రమాణానుసారము చెప్పుచున్నాను. సావధానుడవై వినుము అని నందీశ్వరుడు సనత్కుమారునితో అనినాడు.

**శో॥ సర్వత్ర వ్యవహారార్థం కృతాదిషు యుగేషుచ।**
**వేదాగమోక్తం పరమం మూల స్తంభననామకం।**
**గ్రంథమేవ ప్రవక్ష్యామి శ్రుణు విప్రకులోత్తమ।**
**తస్య శ్రవణమాత్రేణ నరో యాతి పరాం గతిమ్॥**



తా॥ విప్రకులమునందు ఉత్తముడయిన ఓ సనత్కుమార మునీంద్రుడా! దేవల బ్రహ్మను గురించి తెలియపరిచే పవిత్ర చరిత్ర కృతయుగము త్రేతాయుగము, ద్వాపర యుగము, కలియుగములయందు సమస్త లోకముల యందు తెలుసుకొనదగినటువంటి వేదవేదాంతములచే తెలుపబడిన మూలస్తంభనము అను పేరుతో ప్రసిద్ధిచెందినది. దీనిని భక్తిశ్రద్ధలతో వినినంత మాత్రముననే సర్వోత్తమమైన పదవులు కలుగుచుండును. అటువంటి పవిత్రమైనది మహామహిమాన్వితమైనటువంటి మూలస్తంభన గ్రంథము గురించి మీకు చెబుతాను. మీరు సావధానులైయుండి వినవలయును అని శౌనకాది మునులకు సనత్కుమారుడు చెప్పినాడు.

**మూలస్తంభన. పురా స్వయంభువి పరశివాత్మక జ్యోతిర జాయత।**
**తజ్జోతిషి త్రిగుణాత్మికాశక్తిః తచ్ఛక్తా**
**బ్రహ్మవిష్ణుమహేశ్వరాః తేభ్యః ఉత్పత్తిస్థితిలయాః॥**

తా॥ సమస్త చరాచరాత్మకములైన బ్రహ్మాండములు సృష్టింపబడక ముందు అఖండ సచ్చిదానంద అద్వితీయ పరిపూర్ణ పరబ్రహ్మమునుండి పరశివ స్వరూపము కలిగినట్టి స్వయం ప్రకాశ మూలజ్యోతి పుట్టినది. ఆ జ్యోతినుండి రజోస్సత్వతమోగుణ త్రయమైన మూల పకృతి ఉద్భవించినది. ఆ మూల ప్రకృతి శక్తినుండి బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఉద్భవించినారు. ఈ త్రిమూర్తులవలన సమస్తలోకములకు సృష్టి స్థితి లయములు జరుగు చుండినవి.

## బ్రాహ్మణ్య సంపాదనకొరకు వస్త్ర యజ్ఞోపవీతముల ఆవశ్యకత

**మూల॥ తదా బ్రహ్మాదయో వస్త్ర సూత్ర హీనా స్సంతః**
**లజ్జయా పరశివం ప్రోచుః సకల జగన్నిర్మాణ శక్తోపి।**
**బ్రహ్మా బ్రహ్మణ్యసంపాదకః సూత్రవస్త్ర నిర్మాణేఅశ।**
**క్తోపి నిఖిల లోకోత్పత్తి కాలే సూత్రవస్త్రయో ర**
**నావశ్యకత్వాత్ తదా తత్సామగ్ర్యా అభావాచ్చ।**
**ప్రకృత సృష్టికాలే సూత్రవస్త్రయో రావశ్యకత్వాత్।**
**త్వమేవ సూత్ర కర్తారం నిర్మాయాఽస్మాకం దే హీతి॥**

తా॥ అట్లు సకల లోకముల ఉత్పత్తి కాలమునందు త్రిమూర్తులు అగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు యజ్ఞోపవీత వస్త్రములు లేనివారైరి. అందువలన వారు మిక్కిలి సిగ్గు కలిగి కుమిలిపోయినారు. అప్పుడు తమకు అధిష్టానభూతుడైన పరశివుడిని చేరి ప్రార్థించినారు. ప్రభూ! బ్రహ్మ దేవుడు సమస్త లోకములు నిర్మించు శక్తి కలవాడు కాని బ్రాహ్మణ్యము కలిగించుటకు ఆధారభూతములైన వస్త్ర

యజ్ఞోపవీతములు నిర్మించుటయందు శక్తిలేనివాడు అయినాడు. సకల లోకముల ఉత్పత్తి ప్రారంభ కాలమున సూత్ర వస్త్రములఆవశ్యకత తెలియకపోవుటవలన వాని నిర్మాణమునకు అవసరమైన వస్తు పరికరములను సేకరించుటకూడ చేయలేదు. ప్రస్తుతము సృష్టి కార్యము పూర్తి అయినది. బ్రాహ్మణ్య సంపాదనార్థము యజ్ఞోపవీతము వస్త్రములు ముఖ్యముగా కావలయును. అవి లేనిదే బ్రాహ్మణ్యము సంప్రాప్తింపబడదు. కాబట్టి మాకు అధిష్టాన దేవతవైన మీరే మాకు సూత్ర వస్త్రనిర్మాణ కర్త ఒకరిని నిర్మించి మాకు ఇవ్వవలయును అని బ్రహ్మాదులు దేవల పరబ్రహ్మను ప్రార్థించినారు అని మూలస్తంభన గ్రంథము తెలుపుచున్నది.

## వస్త్ర నిర్మాణ కర్తను సృష్టించమని బ్రహ్మాదులు అడుగుట

ఈ విషయమున నారద సంహితయందలి ప్రమాణము

**శ్లో॥ సృష్టేః పూర్వమిదం సర్వమఖండానందరూపకం**
**నిరాకార పరంజ్యోతి రాసీ ద్దేవల సంజ్ఞికం**
**తస్మా జ్జాతం హి చిజ్జ్యోతి స్తదాప శివరూపతాం**
**తస్మా జ్జాతా మహాశక్తి స్సా సతీ త్రిగుణాత్మికా**
**తద్గుణా బ్రహ్మవిష్ణీశ రూపతా మాప్యతే శివం**
**ఊచు ర్వయం వస్త్రహీనా స్తస్మా న్నో బాధతే త్రపా**
**ఇదానీం సూత్రకర్తారం నిర్మా యా స్మాక మీశ్వర**
**తేన దాపయ సూత్రాదీ౯ దేవదేవ పరాత్పర॥**

తా॥ ప్రపంచ సృష్టికి పూర్వము ఈ జగమంతయును అఖండ ఆనంద రూపకమైన నిరాకార జ్యోతిగా దేవలబ్రహ్మ విలసిల్లుచున్నాడు. అప్పుడు దేవల నామకమైన ఆ నిరాకార పరంజ్యోతి వలన జ్ఞానైక రూపమగు జ్యోతి పుట్టెను. ఆ చిజ్జోతి పరశివ రూపమును పొందినది. అట్టి శివరూపమువలన పరాశక్తి పుట్టినది. ఆ మహాశక్తి రజోసత్వతమో అను మూడు గుణములతో బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగా అవతరించినది. ఆ బ్రహ్మాదులు చిజ్జ్యోతి ర్మయుడగు పరశివుని (దేవాంగ బ్రహ్మ) గురించి ఓదేవ దేవేశ్వరా! మేము సూత్రములు వస్త్రములు లేకుండా వుండినాము. మిక్కిలి సిగ్గును పొందియున్నాము. ఓ సర్వేశ్వరా! మా కొరకు ఒక సూత్ర నిర్మాణకర్తను నిర్మింపుము. ఓ పరాత్పరా! అట్టి సూత్రకర్త మూలముగా మాకు బ్రాహ్మణ్య సంపాదకమగు వస్త్ర యజ్ఞోపవీతములును కలుగునట్లు అనుగ్రహింపుము మాకు అని ప్రార్థించినారు త్రిమూర్తులు అని నారద సంహిత తెలియచేయుచున్నది.



## త్రిమూర్తులకు యజ్ఞోపవీత వస్త్రములు ఇచ్చుట

**మూల. తత శ్శివోంతర్జ్యోతి ర్బహిః కృతవా౯ తచ్చసా।**
**కృతంసత్ స్వయ మేవ సూత్రవస్త్రౌ నిర్మాయ సమం।**
**త్రకం త్రిమూర్తీనాం దత్వా తత్రై వాంతర ధాత్॥**

తా॥ అట్లు బ్రహ్మ విష్ణు మహేశ్వరులగు త్రిమూర్తులు ప్రార్థించినప్పుడు పరశివుడు (సదాశివుడు) తన సహస్రారకములమునందు దేవల నామముతో విలసిల్లుచుండిన అంతర్జ్యోతిని వెలుపలికి వచ్చినట్లు చేసెను. అట్లు వెలువడిన ఆ అంతర్జ్యోతి పరశివుని అభిప్రాయానుసారముగ సర్వాంగ సౌష్టవములతో కూడిన పురుషాకారము కలిగియుండి, తన సంకల్పమాత్రముచే వస్త్ర యజ్ఞోపవీతములను నిర్మించి త్రిమూర్తులకు సమంత్రకముగ అనగా మంత్రములను వల్లించుచు ఇచ్చెను. అప్పుడే పరశివుని (సదాశివుని) సహస్రారమందు వెంటనే ప్రవేశించెను.
ఈ విషయమున అధర్వణ వేదమందలి ప్రమాణము

**జట. శైవం జ్యోతి స్సాకారం బ్రహ్మణో విష్ణు రుద్రస్య**
**సూత్రాది మాదిశత్॥**

తా। పరశివ సహస్రార పద్మమునందు అంతర్గతమై యుండిన అంతర్జ్యోతియే ఆకార సహితముగ ప్రసన్నమై బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు యజ్ఞోపవీతములను, వస్త్రములను ఇచ్చినాడు.

## దేవతలు వస్త్ర యజ్ఞోపవీతములు ఇవ్వమని ప్రార్థించుట

**మూల. అనంతరం బ్రహ్మా చతుర్దశలోకా౯ తదంతర్గత**
**దివిజ జరాయు జాండజ స్వేదజాది ప్రాణిజాతమసృజత్॥**
**తతో బ్రహ్మాదీనాం వివాహ సమయే సర్వే దేవా**
**స్సూత్ర వస్త్రహీనా స్సమాగతాః. బ్రహ్మాచ వస్త్ర**
**రహితా౯ సలజ్జా౯ దీనా౯ తా౯ దృష్ట్వా సూత్ర**
**వస్త్రార్థం కైలాసం గత్వా శివం ప్రార్థయామాస.**

తా॥ ఈ విధముగ త్రిమూర్తులు సమంత్రకముగా సూత్ర వస్త్రములను దేవలపరబ్రహ్మవద్ద నుండి పొందిరి. తరువాత బ్రహ్మదేవుడు ఊర్ధ్వ లోకములు, పాతాళ లోకములు మొత్తం పద్నాలుగు లోకములను మరియు ఆయా లోకములయందు నివసింప తగినటువంటి దేవమానవ మృగఖగ క్రిమికీటకాదులన్నింటిని సృజియించినాడు. పిమ్మట బ్రహ్మ విష్ణు మహేశ్వరుల వివాహ కాలము ఆసన్నమైనది. అప్పుడు వారి వివాహములకు దేవతలందరు వస్త్రములు

యజ్ఞోపవీతములు లేకుండా వచ్చినారు. వస్త్రసూత్రములు లేకుండా మహా సిగ్గు చెందుచు మనోవ్యధ అనుభవించుచు దీనవదనులై వున్న దేవతలనుగాంచి చింతా మనస్కుడై వారికి సూత్ర వస్త్రములు లభింపజేయుటకు బ్రహ్మదేవుడు కైలాసమునకు వచ్చి పరమేశ్వరుని గురించి భక్తిపూర్వకముగా ప్రార్థించినాడు.

ఈ విషయమున తత్త్వనిధి తృతీయాధ్యాయమందలి ప్రమాణము.

**శ్లో. తేషా ముద్వాహకాలేతు దేవగంధర్వ కిన్న రాః**
**ఆచ్ఛాద్య స్వ తనూః ప ర్ణై ర్వస్త్రాభావా త్తథాజినైః**
**లజ్జావనమ్రవదనా ఆగతాబ్రహ్మణో న్తికమ్**
**తతస్తాన్వస్త్రహీనాంగా దృష్ట్వాదేవా పితామహః**
**తతస్తై స్సాక మాసాద్యకైలాసం గణసేవితం**
**దృష్ట్వాతత్ర మహాదేవం నమస్కృత్యా బ్రవీద్వచః**
**మయా సృష్టా ఇమే దేవా స్స్వామి వస్త్రవివర్జితాః**
**అచ్ఛాద్య స్వతనుః పర్ణై ర్లజ్జయా విచరంతిహి**
**ఇదానీం సూత్రకర్తారం నిర్మాయ జగదీశ్వర**
**సూత్రవస్త్రావిభోஉ స్మాకందాపయ ప్రమథాధిప.**

తా॥ బ్రహ్మ విష్ణు రుద్రుల వివాహకాలమున దేవతలు, సిద్ధులు, సాధ్యులు, కిన్నెరలు, గంధర్వులు మొదలగు దేవజాతులంతా తమకు వస్త్రములు లేకపోవుటచే ఆకులను చర్మములను కట్టుకొని మిక్కిలి సిగ్గుచెందుచు బ్రహ్మదేవుని సాన్నిధ్యమున వచ్చిచేరిరి. వారినందరిని పితామహుడు చూచి వారి దీనావస్థను గాంచి మిక్కిలి పరితాపం చెందినాడు. సూత్రవస్త్రముల నిర్మాణము కొరకు తన వద్దకు వచ్చిన దేవతలందరిని వెంటబెట్టుకొని ప్రమథ గణములచేత సేవింపబడుచు కైలాసపర్వతము వద్దనున్న సాంబశివుని వద్దకు బ్రహ్మదేవుడు వచ్చినాడు. అచ్చటవున్న పరమేశ్వరున్ని ధ్యానపూర్వకముగ సేవించి నమస్కరించి ఓ దేవేశ్వరా! దేవతలందరు వస్త్రములు లేకుండుటచే పరితాపము చెందుచున్నారు. వారి తాపమును పోగొట్టుము కరుణాకరా! ప్రమథగణములకు అధినాయకుడా! సూత్రవస్త్రములు నిర్మాణార్థమై సూత్రకర్మను ఒకరిని నిర్మించి మాకుఇమ్ము. ఓ దయామయుడైన ప్రభువా! మాకు అవశ్యకముగా సూత్రవస్త్రములను ప్రసాదించి కటాక్షింపుము అని ప్రార్థించినారు. అని తత్త్వనిధి అను గ్రంథమునందు తెలుపబడినది.

ఈ విషయమునకే సామవేదము ౨౪వ శాఖయందలి ప్రమాణము.

**శ్రుతి-సూత్ర దాతా సౌ దేవలో దేవతానామ్.**

తా॥ సదాశివుని సహస్రార కమలమునందు నిర్గుణ నిరామయము నిరంజన



రూపంలో విలసిల్లుచున్న ఆపరంజ్యోతి వలన జన్మించినవాడు వస్త్రసూత్ర నిర్మాణశక్తి కల దేవాంగుడు. బ్రహ్మ, విష్ణు, రుద్రుల వివాహ సమయములయందు సకల దేవతలందరు ఆ వివాహ మహోత్సవమునకు హాజరయినారు. అయితే వారందరు వస్త్రములు సూత్రములు లేకుండా వుండి తమ శరీరావయవములను ఆకులు అలములతో కప్పుకొని వచ్చినారు. బ్రహ్మదేవుడు దేవలబ్రహ్మను తమ వివాహమునకు వచ్చిన దేవతలకు సూత్ర వస్త్రములు ఇవ్వవలసినదిగా ప్రార్థించినాడు. అప్పుడు దేవాంగుడు దేవతల దయనీయ పరిస్థితిని గమనించి ఆ వివాహమునకు హాజరయిన వారందరికి దివ్య వస్త్రములతోపాటు బ్రహ్మసూత్రము అయిన యజ్ఞోపవీతములు కూడా వారికి ఇచ్చి వారిని సంతోషపరచినాడు. అని సామవేదములోని 24వ శాఖయందలి ప్రమాణమునకు విద్యారణ్య మహర్షి ఈ విధముగా భాష్యము వ్రాసినాడు.

**మూల. తతః ఈశ్వరస్సహస్రారాం తస్థితం జ్యోతింయోగ**
**మాయయా బహిః ప్రకాశం కృత్వా తజ్జ్యోతిం దృష్ట్వా**
**త్వయా శీఘ్రం వివాహసమయి ఏవ సూత్ర వస్త్రా నిర్మా**
**య దేవానాం దాతవ్య మి త్యాజ్ఞాపయామాస.**

తా॥ సదాశివుని యందుండిన నిర్గుణ పరబ్రహ్మ దేవల పరంజ్యోతి, సృష్టి స్థితి లయ కర్తలైన బ్రహ్మ విష్ణు రుద్రుల వివాహములకు వచ్చిన ఆకులు అలములు ఆచ్ఛాదించుకొని వచ్చిన దేవతలందరికి తక్షణమే సూత్ర వస్త్రములు ఇచ్చుటకు సదాశివుని సహస్రార కమలమునుండి పరంజ్యోతి స్వరూపుడు ఒక దివ్యపురుషుడుగా ఉదయించి అక్కడవున్న దేవతలందరికి యజ్ఞోపవీతములను, వస్త్రములను మంత్రపూర్వకముగా ఇచ్చి ఆ సదాశివుని దేహాంతరాళమందు పయనించెను అని మూలస్తంభన గ్రంథము చెప్పుచున్నది.

ఈ విషయమున నారద సంహితయందలి ప్రమాణము.

**శ్లో. శివదేహ స్థిత జ్యోతిః సృష్టిస్థిత్యంత హేతుకం**
**ప్రాప్యదేవల రూపత్వం కర్తాభూత్ సూత్ర వస్త్రయోః**

తా॥ సమస్త లోకముల యొక్క ఉత్పత్తి, స్థితి లయములకు ప్రధాన కారకుడు అగు సదాశివుని దేహాంతరాళమునందు తేజోరూపముతో ప్రకాశించుచున్న చిజ్జ్యోతియే సదాశివుని అభిప్రాయానుసారముగ సాకారరూపమైన దేవల పరబ్రహ్మ ఆవిర్భవించి సూత్ర వస్త్రములకు నిర్మాణ కర్త అయ్యెను. ఈ విషయము నారద సంహితయందు తెలుపబడినది.

## దేవల పరబ్రహ్మ సదాశివుని సహస్రార కమలమునందు ప్రవేశించుట

**మూల. తత స్త్యోత్యంత కుతూహలస్సన్ సృష్టి స్థితిసంహారాయ**
**కర్తృణాం బ్రహ్మవిష్ణుమహేశ్వరాణాం వివాహసమయే**
**తత్తన్మంత్రపూర్వకం సూత్రవస్త్రౌ దత్వా తత్రైవ**
**సాయుజ్య మగమత్.**

తా॥ ఇదే విషయము మూలస్తంభన గ్రంథమునందుకూడ తెలుపబడియున్నది. జ్యోతిర్మయుడైన దేవాంగుడు నిర్గుణ నిరంజన నిరామయుడైన దేవల పరంజ్యోతి సాకారం చెంది పురుష రూపము ధరించినాడు. తన దేహమునుండి ఉద్భవించిన దేవాంగుడును బ్రహ్మవిష్ణు రుద్రుల వివాహసమయములో వచ్చిన దేవతలందరికి సూత్ర వస్త్రములను మంత్రపూర్వకముగ ఇవ్వవలయునని ఆజ్ఞాపించి సదాశివుని సహస్రార కమలమునందు జ్యోతి రూపమున తిరిగి ప్రవేశించినాడు.

## బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల వివాహమునకు వచ్చిన దేవతలకు వస్త్రప్రదానము చేయుట

ఈ విషయమున అధ్వరణ వేదమందలి ప్రమాణము.

**శ్రుతి. తే దేవా ఆగమన్ వానస్సూత్రం దేవలా దిత్యాహ ప్రజాపతిః**

తా॥ బ్రహ్మ విష్ణు మహేశ్వరుల వివాహ మహోత్సవవమునకు వచ్చిన దేవతలందరికి నిర్గుణ నిరామయ నిరంజన స్వరూపుడు అయిన దేవల పరబ్రహ్మ ఆజ్ఞ ప్రకారము అతని దేహంనుండి జన్మించిన దేవాంగుడు ఆ వివాహమునకు వచ్చిన దేవతలందరికి సూత్రవస్త్రములు ఇచ్చినాడు అని ప్రజాపతి అయిన బ్రహ్మదేవుడు వాలఖిల్యాది మహర్షులకు చెప్పినాడని అథర్వణ వేదము తెలుపుచున్నది.

**మూల. సకల జగత్కారణ స్వయంభు దేవాంగ బ్రహ్మ కల్పిత**
**దేవమనుమానవ యక్షరక్షో పిశాచభూతబేతాళాది గ్ర**
**హాణాం స్వయం సూత్రకర్తేతి ఉపనిషద్వాక్యమ**
**హిమ్నా ఉదాహరణమాహ.**

తా॥ సమస్త జగంబులయొక్క సృష్టి, స్థితి, లయములకు కారణుడును అయి తనకుతానే పుట్టినవాడును అగు దేవల బ్రహ్మముచేత, సృజింపబడిన దేవతలు, మనువులు, మానవులు, యక్షులు, రాక్షసులు, పిశాచులు, భూతములు, బేతాళులు మొదలగు గ్రహములందరు సృజియింపబడినారు. తనచే సృష్టించబడిన వారందరికి



తానే వారందరికి సూత్ర వస్త్రనిర్మాణ కర్తయై వారందరికి యజ్ఞోపవీతములు, దివ్య వస్త్రములను కల్పించినాడు అని ఉపనిషత్తులయందు తెలుపబడిన పవిత్రమైన ప్రమాణ వాక్యములను ఉదాహరణలతో సహా శివుడు కుమారస్వామికి తెలిపినాడు అని మూలస్తంభన గ్రంథము తెలిపినది.

## దేవలపరబ్రహ్మమే సృష్టిలోవున్న ఆదిపురుషుడు

ఉపనిషన్నిరూపణమునందు మహోపనిషత్తునందలి ప్రమాణము

**జట. అథ భరద్వాజః పప్రచ్ఛ యాజ్ఞవల్క్యం – కో**
**విశ్వరాట్ కో విశ్వకర్తా కోవాబ్రహ్మేతన్మే బ్రూ హీతి.**
**సహోవాచ యాజ్ఞవల్క్యం, యే నేదం జగత్సృష్టం**
**యేనేదం వ్యాప్తం యస్మిన్ సర్వం ప్రతిష్ఠితం, యస్స్వ**
**మాయయావృతస్సన్ నామరూపతాం భజతి య**
**స్సకల సురేభ్యో సూత్ర వస్త్రదాతా స దేవాంగో**
**విశ్వరాట్ స విశ్వకర్తా స బ్రహ్మ సవిరాట్ సర్వం దేవాంగ ఏవేతి.**

తా॥ పూర్వము ఒకానొకప్పుడు భరద్వాజ మునీశ్వరుడు యాజ్ఞవల్క్య మునీంద్రుడును సమీపించి మహాత్మా! నాకు ఒక సందేహము వున్నది. ఆ సందేహమును తీర్చవలయును అని భరద్వాజుడు ఈ విధముగా అడిగినాడు. అప్పుడు సకల లోకములకు సర్వాధినాథుడు ఎవరు? ఈ సకల జగత్తంతయు వ్యాపించి యున్నవారు ఎవరు? ఎవరిచే ఈ జగత్తు నిలకడ పొందినది. ఎవ్వరు తన మాయచేత ఆవరింపబడివున్నారు. నామ రూపములతో ఎవరు సేవింపబడుచున్నారు? ఎవరు సకల దేవతలకు అధినాథుడు. సృష్టియందలి సమస్తమువారికి బ్రహ్మసూత్రములను, వస్త్రములను ఇచ్చిన వాడు ఎవడు? అని భరద్వాజుడు అడుగగా యాజ్ఞవల్క్య మహర్షి భరద్వాజునితో నీవు అడిగిన సందేహములకు తగిన సమాధానము దేవల బ్రహ్మమే. అతడే విశ్వకర్తా, విశ్వరాట్టు. అతడే పరాత్పరుడు, అతడే విరాట్పురుషుడు. సమస్తము దేవాంగ బ్రహ్మమయమే అయి వుండెను అని యాజ్ఞవల్క్యుడు చెప్పినట్లుగా మహోపనిషత్తు తెలుపుచున్నది.

నిరాలంబోపనిషత్తు నందలి ప్రమాణము.

**శో. విశ్వకర్తా విశ్వభోక్తా విశ్వహర్తా స దేవలః**
**స ఏవ దేవతాధీశో మాయాతీతో నిరాకులః**
**సర్వవ్యాపీ స దేవాంగః కృతవాన్ సకలం జగత్.**

తా॥ ఈ సమస్త జగంబులను సృజియించినవాడు, ఈ జగంబులను పాలించువాడు,వీటిని లయము చేయువాడు సకల దేవతలకు అధినాథుడు ఎవరంటే

దేవల పరబ్రహ్మమే. ఆతడే తనమాయను అతిక్రమించగలడు అనగా తను మాయను తన అదుపు ఆజ్ఞలలో వుంచుకొనినవాడు. అందువలన తన యందు వుండిన మాయను జయించినాడు. ఈ చరాచర జగత్తు అంతయు వ్యాపించి వున్నవాడు అతడే. ఈ జగంబులకు అంతర వ్యాప్తియు బహిర్వ్యాప్తియు దేవలుడే ప్రకాశించుచుండెను. సకల దేవతలను నియమించునది కూడా దేవల బ్రహ్మయే. ఈతనికి అతీతమైనది ఏదియును ఇసుమంతయు లేనేలేదు అని నిరాలంబోపనిషత్తు తెలుపుచున్నది.

## మహా వాక్యార్థములద్వారా తెలియబడేవాడు దేవల పరమాత్మ

ఈ విషయమున జాబాలోపనిషత్తునందలి ప్రమాణము.

**మూల. యేన సర్వం సృష్టం యస్య భాసా సర్వం విభాతి**
**యోవా సర్వ భూతాంతరాత్మా స దేవాంగోమనుః**
**స సూత్రధారీ స శుద్ధబ్రహ్మ ప్రకృత్యధిష్ఠాతా సర్వ కారణభూతః.**

తా॥ ఎవ్వనిచేత సకల చరాచర ప్రపంచము సృష్టింపబడినది. ఎవ్వని తేజస్సుచే ఈ జగములన్నియు నిండియున్నవి. సకల భూతములయందు సర్వాంతర్యామిగా ప్రకాశించువాడు ఎవ్వడు. సూత్రధారి ఎవ్వడు. సత్వ రజో తమో గుణాధిష్ఠతమైన ఈ ప్రకృతికి అధినాధుడు ఎవ్వడు. ఈసమస్తమునకు మూలకారణమైనవాడు ఎవ్వడు అను దానికి సమాధానము దేవలబ్రహ్మ నామక మనువు అని జాబాలోపనిషత్తు తెలుపుచున్నది.

ఈ విషయమున నిరాలంబోపనిషత్తునందలి ప్రమాణము.

**మూల. విశ్వం యత్ తత్సర్వవ్యాపీ దేవాంగో కృతవా ౯.**

తా॥ సమస్త భూతములయొక్క అంతరాత్మయై వ్యాపించి వుండినవాడు దేవలబ్రహ్మయే. ఈవిశ్వంలోని లోకములన్నింటికి నిర్మాణకారకుడు దేవలబ్రహ్మయే అని నిరాలంబోపనిషత్ తెలుపుచున్నది.

**మూల. తత్త్వమస్యాది మహావాక్య విషయత్వాత్ సఏవ**
**జగత్కర్తా,న దేవాంతరః, సో సృష్ట్వా సఏవాఽను ప్రావిశతి.**

తా॥ నిశ్చయతత్త్వా ర్ధ నిరూపణముచేయు ఆ బ్రహ్మమే నీవు అగుచున్నావు, నేను అగుచున్నాను, ఈ ఆత్మయేబ్రహ్మము, విశేషమగు జ్ఞానమే బ్రహ్మము అనెడి నాలుగు మహావాక్యములున్నవి. ఆ నాలుగు మహా వాక్యముల ద్వారా తెలుసుకో బడెడి వారు దేవలబ్రహ్మయే. అతనుగాక ఇక ఎవ్వరును ఈవాక్యముల ద్వారా తెలుపబడరు. సర్వలోక నిర్మాతయగు వాడు మాత్రమే తెలియబడును. ఆతనే



దేవలబ్రహ్మ. ఈజగంబులకు అంతరాత్మయై ఆతడు ప్రకాశించుచున్నాడు. అంతేగాని ఇతర దేవతలు కారు.

ఈ విషయమున రుద్రయామిళ యందలి ప్రమాణము.

**శ్లో॥ విశ్వకర్తాస దేవాంగ స్స బ్రహ్మ సచ విశ్వరాట్**
**స ఏవ విష్ణుస్సో రుద్ర స్సకాలో ఽగ్ని స్సచంద్రమాః.**

తా॥ ఆ దేవాంగుడే సర్వలోక నిర్మాత. అతడే పరబ్రహ్మము. అతడే సర్వలోకమునకు అధికారి. అతడే సర్వలోకములయందు వ్యాపించి విష్ణు రూపములోవున్నది. అతడే లయకారకుడు అగురుద్రుడు. భూత భవిష్య వర్తమాన కాలస్వరూపుడు ఆతడే. ఆతడే అగ్నిహోత్రుడు. అతడేమనస్సుబుద్ధి మొదలగు ఇంద్రియములకు అధినాధుడు. అఖండసచ్చిదానంద పరిపూర్ణ అద్వితీయ పరబ్రహ్మము దేవాంగుడే అగును అని రుద్రయామిళ తంత్ర గ్రంథము తెలుపుచున్నది.

ఈ విషయముననే కాత్యాయవ స్మృతి ప్రమాణము.

**శ్లో॥ విశ్వకర్తా విశ్వభోక్తా విశ్వవ్యాపీ సనాతనః**
**దేవాంగో పరమాత్మాసౌ సచ్చిదానంద లక్షణః**

తా॥ దేవలబ్రహ్మయే సమస్తలోక నిర్మాత. అతడే సర్వలోకాధికారి. సర్వలోక రక్షకుడు అగుచు సమస్తమునందు వ్యాపించి వున్నవాడు. పురాణ పురుషుడు పరబ్రహ్మము ఆతడే. తేజస్సుశక్తి జ్ఞానానందములే స్వరూపముగా గలవాడై యుండినవాడు దేవలబ్రహ్మయే.

ఈ విషయమున నే నారద సంహితయందలి ప్రమాణము.

**శ్లో॥ శుద్ధబ్రహ్మస్వరూపం తం దేవేశం సూత్రధారిణం**
**తత్త్వమస్యాది వాక్యార్థ గోచరం దేవలం సదా**
**నమస్కురు మహాబాహో భుక్తిముక్తి ప్రదాయకమ్.**

తా॥ మహాభుజబల సంపన్నుడవైన ఓ అంబరీష చక్రవర్తీ వినుము. అఖండసచ్చిదానంద పరిపూర్ణబ్రహ్మ స్వరూపుడును సమస్త దేవాధినాధుడును, లోకనటన నామక రంగస్థలమునకు సూత్రధారియును, తత్తమస్యాది నాలుగు మహా వాక్యములయొక్క అర్థస్వరూపము గలవాడును, ఇహలోకములోను పరలోకములోను సుఖములను కలుగచేయువాడు ఆదేవలపరబ్రహ్మము మాత్రమే. కావున మనము నిరంతరము భక్తిపూర్వకముగా ధ్యానించు చుండవలయునుఅనినారదమునీంద్రులు తెలిపినారు. అని నారద సంహితయందు తెలుపబడినది. సమస్త లోకములయందున్న దేవ మానవాది జాతులందరికి బ్రాహ్మణ్యం కలుగుచేసే ప్రామాణికుడు దేవల

బ్రహ్మయే.

ఈ విషయమున ముండకోపనిషద్వాక్య ప్రమాణము.

**శ్లో॥ దేవదేవ మహాప్రాజ్ఞ లోకానుగ్రహ కారక**
**అవ్యాజ కరుణామూర్తే రక్ష నో జగదీశ్వర**
**వస్త్రహీనా వయం సర్వే తస్మాత్త్వం కరుణార్ణవ**
**సూత్ర వస్త్రాదికం దత్వా భృశ మస్మాన్ సముద్ధర.**
**ఏవం సురగణై స్తుత్వో మహాదేవో కృపానిధిః**
**దేహాంత స్థిత చిచ్ఛక్తిం బహిః కృత్వేద మబ్రవీత్**
**దేవి త్వం శీఘ్ర మద్యైవ మత్పదధ్యాన తత్పరాః**
**వస్త్రోపవీతౌ నిర్మాయ దేవేభ్యో దాతు మర్హసి**
**శివాజ్ఞాం శిరసా ధృత్వా సా శక్తి శ్చిత్స్వరూపిణీ**
**భూత్వా సదేహా సా దేవీ రేజేదేవల సంజ్ఞయా**
**నిర్మాయా సూత్రవస్త్రౌ స దేవాంగో దేవపూజితః**
**దేవానాంచ మునీనాంచ బ్రాహ్మణానాం తథైవచ**
**క్షత్రియాణాంచ వైశ్యానాం ప్రదదౌ మంత్రపూర్వక**
**వస్త్రమాత్రంతు శూద్రాణాం దత్వా సోంతర ధాత్తత**
**తస్మా త్సఏవ దేవాంగో బ్రాహ్మణాధిప ఉచ్యతే**
**స బ్రహ్మాచ స వై విష్ణు స్సశివ స్సచ విశ్వరాట్.**

తా॥ పూర్వము దేవతలు పరమేశ్వరుని సన్నిధానమునకు చేరి మహా ప్రాజ్ఞుడవయిన ఓదేవేశ్వరా! కారణము లేకుండానే కరుణించు స్వభావము కలవాడవు నీవు. ఓలోకేశ్వరా! మమ్ములను కాపాడుము. మేమందరం వస్త్రములు లేకుండా వున్నాము. ఓ కరుణాసాగరా! నీవు సూత్ర వస్త్రములను ఇచ్చి శీఘ్రముగ మమ్ములను ఉద్ధరింపుము అని దేవతలందరు స్తోత్రము చేసినారు. కృపానిధియైన ఆ మహాదేవుడు తన దేహాంతర్భాగమున జ్యోతిరూపమున వెలుగుచుండిన చిచ్ఛక్తిని తన సాన్నిధ్యంబున వెలువడజేసి "ఓ జ్ఞానస్వరూపిణీ"! నీవు నాపాదారవిందముల యందు ధ్యానాసక్తవగుచు శీఘ్రముగా వస్త్ర యజ్ఞోపవీతములను కావించి దేవతలు మొదలగువారందరికి ఇవ్వుముఅని చెప్పెను. చిత్స్వరూపిణియైన ఆ పరాశక్తియు పరమేశ్వరుని ఆజ్ఞను శిరసావహించి పురుషరూపము ధరించి దేవల నామముతోడ విలసిల్లుచుండెను. తదుపరి ఆ దేవలబ్రహ్మ సమస్త దేవపూజితుడు అగుచు సూత్రవస్త్రములను నిర్మించి దేవతలకును మనీంద్రులకును ఆవిధముగానే బ్రాహ్మణ, క్షత్రియ,వైశ్యులకును మంత్రపూర్వకముగా ఇచ్చినాడు. తరువాత శూద్రులకు వస్త్రములు మాత్రమే ఇచ్చి అచ్చటనుండి అంతర్ధానమైనాడు.అట్లుమంత్ర పూర్వకముగా దేవతలు మొదలగు వారలకు బ్రహ్మసూత్రములనుఇచ్చుటచేత ఆదేవలబ్రహ్మయేబ్రాహ్మణ్యము కలిగింపజాలిన అధికార సంపత్తి వహించినాడు. ఉత్పత్తి, స్థితి లయ కారకులగు బ్రహ్మ విష్ణు మాహేశ్వరులు ఆతడే. విశ్వప్రభువు అగు విరాట్పురుషుడును అతడే అని మండకోపనిషత్తు చెప్పుచున్నది.



## సచ్చిదానంద స్వరూపుడు దేవల మనుబ్రహ్మ

తత్త్వప్రకాశికయందలి ప్రమాణము.

**శ్లో. వందేనిత్యం భవభయహరం సర్వలోకాధి వాసం**
**నిత్యాకారం సకలజగతాం సూత్రధర్తార మాద్యం**
**భావాతీతం త్రిగుణ రహితం తత్త్వమస్యాది గమ్యం**
**దేవాంగాఖ్యం పరమపురుషం సచ్చిదానందరూపమ్.**

తా॥ జనన మరణ భయమును పోగొట్టువాడును,సమస్త లోకములయందు అంతరాత్మగా విలసిల్లెడు వాడును,జ్ఞానమే స్వరూపముగా కలవాడును, సకల లోకముల వారికి యజ్ఞోపవీతమును, వస్త్రములను ప్రసాదించినవాడును, సకల లోకములకు ప్రధానమైనటువంటి వాడును,మనస్సుచేత తెలుసుకోవటానికి వీలులేని వాడును, రజో సత్వ తమో అను త్రిగుణములు లేనివాడును, తత్త్వమస్యాది మహావాక్యములచే తెలుసుకోబడు వాడును,శక్తి జ్ఞానానందములే స్వరూపముగా గలవాడును అగు దేవాంగ నామక పరమపురుషుడికి నిరంతరము నమస్కరించుచున్నాను అని తత్త్వప్రకాశిక గ్రంథమునకు వ్రాసిన ప్రవేశికలో జైమినీ మునీంద్రుడు తెలిపినాడు.

## దేవల మనుబ్రహ్మ కుమార్తెగా చౌడేశ్వరీదేవి

మండకోపనిషద్వాక్య ప్రమాణము.

**శ్రుతి. దేవల ఏవస్వమాయయాఽవచ్ఛిన్నస్సన్ బ్రహ్మాద్య**
**నేక రూపతయా భాసతే.తద్బ్రహ్మాణి మాయావశాత్**
**చౌడేశ్వరీనామ చిచ్ఛక్తి ర్జాతా. సాతు తత్కులాధి**
**దేవతాభూత్. తస్యపుత్రి కేతిచ వ్యవహ్రియతే. తేచ పాసకా బభూవుః.**

తా॥ దేవలబ్రహ్మ తలయొక్క మాయాప్రభావముచే అనేక రూపములతో,

నామములతో భాసిల్లుచుండినాడు. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు మొదలగు వారందరి రూపనామములతో ప్రకాశించుచుండినాడు. ఆ దేవలబ్రహ్మయొక్క మాయా ప్రభావమున చౌడేశ్వరీ నామక పరాశక్తి ఆవిర్భవించెను. మహాశక్తి స్వరూపిణియైన ఆ చౌడేశ్వరీదేవి దేవాంగ కులమువారికి అధిష్టాన దేవతయగుచున్నది. దేవల పరబ్రహ్మ మాయాశక్తి ప్రభావమువలన జన్మించిన చౌడేశ్వరీదేవి ఆ దేవలబ్రహ్మ కుమార్తెగా వ్యవహరింపబడుచున్నది. దేవాంగ కులము వారందరికి తమకు నిత్యము నిరంతరము ఉపాసింపవలసిన దేవతగా చౌడేశ్వరీదేవిని ఆరాధించుచుందురు అని ముండకోపనిషత్తు తెలుపుచున్నది.

ఈ విషయమున నిగమ రహస్య ప్రమాణము.

**శ్లో. శ్రుణు నారద వక్ష్యామి జగదేత చ్చరాచరం**
**ఆసీత్సృష్టేః పురాసర్వం నిశ్చలం దేవలాత్మకం**
**స్వయమేవ బహుస్యామి త్యాలోచ్య స్వస్యమాయయా.**
**వ్యాప్య బ్రహ్మాది రూపేణ జగద్రూపేణ వై తథా**
**ఏక ధా బహుధా చైవ దృశ్యతే జలచంద్రవత్.**

తా॥ ఓ నారదమహర్షీ! వినుము. అని బ్రహ్మదేవుడు చెప్పినాడు. స్థావర జంగమాత్మకమైన ఈ ప్రపంచము సృష్టించుటకు ముందర ఈవిశ్వము అంతయు చలన రహితమై దేవల స్వరూపముగానే వున్నది. నిత్యుడును, అఖండస్వరూపుడైన ఆ దేవలబ్రహ్మ ఒక్కరే దేదీప్యమాన కాంతి స్వరూపముతో విలసిల్లుచుండెను. ఆతనికి తానే అనేక రూపములతోను అనేక నామములతోను భాసిల్లవలెనని సంకల్పము కలిగినది. అప్పుడు తనయొక్క యోగమాయా ప్రభావముచేత సృష్టిస్థితి లయాది కారకులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరాది రూప నామములతోను,ప్రపంచ స్వరూపము తోడను,సర్వ విధములుగా వ్యాపించి వున్నాడు. అది ఏవిధంగా అంటేఆకాశంలో వున్న చంద్రుడు వేయికుండల యందలి నీళ్ళలో కనబడినట్లు దేవలుడు సర్వ ప్రపంచరూపముగా కనబడుచున్నాడు. కుండ నీళ్ళలోకనబడు చంద్రుడు ఏవిధంగా నిత్యంగాదో ఈసకల చరాచర ప్రపంచమందలి వున్నచైతన్యము శాశ్వతము కాదు. దేవల బ్రహ్మయొక్క శక్తియే ఈ ప్రపంచమంతా భాసిల్లుచున్నది. కావున దేవల పరబ్రహ్మయే నిత్యుడు అనగా శాశ్వతుడు అయివున్నాడు అని నిగమ రహస్యము నందు తెలుపబడినది.

## దేవాంగుల కుల దేవతగా చౌడేశ్వరీదేవి

ఈ ఇందునకు వివేక సింధువునందలి ప్రమాణము.



**శ్లో. దేవలబ్రహ్మ చిచ్ఛక్తి ర్జాతా చూడాంబి కాభిదా**
**సా దేవాంగ బ్రాహ్మణానాం బభూవ కులదేవతా.**

తా॥ దేవలబ్రహ్మ యొక్క విజ్ఞాన శక్తియే చూడాంబికా అను మహాశక్తిగా అవతరించినది. ఆ దేవియే దేవాంగ బ్రాహ్మణులకు కులదేవతగా విలసిల్లుచున్నది అని వివేక సింధువు అను గ్రంథం తెలుపుచున్నది.

ఈ విషయముననే అగస్త్య సంహితయందలి ప్రమాణము

**శ్లో. చూడాంబికే భగవతి ప్రణతార్తి హంత్రి**
**దేవాంగ బ్రహ్మకులదేవి సుపర్వపూజ్యే**
**వందామహే జనని దేవల పుత్రికే త్వాం**
**మాం పాహి పాహి జగదీశ్వరి మృత్యువక్త్రాత్**

తా॥ షడ్గుణైశ్వర్య సంపన్నవును అయిన నీవు నిన్ను ప్రార్థన చేసిన వారియొక్క దుఃఖములు పోగొట్టెదవు. దేవాంగ బ్రాహ్మణ వంశం వారికి కులదేవతగా వుండి వారిచేత పూజింపబడుచున్నావు. సర్వలోకములకు మాతవు. దేవల బ్రహ్మకు పుత్రికవు అయిన ఓ చౌడేశ్వరీ దేవీ నీకు నమస్కరించుచున్నాను. ఓ జగదీశ్వరీ నన్ను మృత్యువునోట పడనీయక ఎల్లవేళలా కాపాడు తల్లీ అని అగస్త్య మహర్షి మహాదేవిని స్తోత్రము చేసినట్లు అగస్త్య సంహిత తెలుపుచున్నది.

## యజ్ఞోపవీతానికి అధిష్టాన దేవతగా గాయత్రీదేవతను సృష్టించిన దేవలుడు

దీనికి కఠోపనిషద్వాక్య ప్రమాణము.

**శ్రుతి. సర్వే దేవా ఈశ్వర మనమ ఽ అవస్త్రా స్సలజ్జాః**
**దీనా ఽ తతస్తా ఽ దృష్ట్వా మహాదేవస్తదాగమన కారణం**
**జ్ఞాత్వా స్వస్మి ఽ వర్తమానాం చిచ్ఛక్తిం బహిర్ముఖీ**
**కృత్య త్వం శీఘ్రం యజ్ఞోపవీతాదికం నిర్మాయ బ్రహ్మ**
**దీనాం ప్రయచ్ఛే త్యాజ్ఞాపయామాస. సాతు స దేహా**
**సతీ బ్రహ్మదీనాం యజ్ఞోపవీత వస్త్రాదికం దదౌ, తత్ర**
**తేషాం బ్రాహ్మణక్షత్రియవైశ్యానాం చ యజ్ఞోపవీతం**
**పరమం పవిత్ర మితి వేదమంత్రేణ ప్రాయచ్ఛత్. ఇతర**
**జాతీనాం వస్త్రమాత మదదాతి. యజ్ఞాది కర్మ సంపాద**
**నాయ యజ్ఞోపవీత ధారణ మావశ్యకత్వాత్ బ్రహ్మ**
**స్వరూపం త్రిగుణాత్మకం యజ్ఞోపవీతందదౌ బ్రాహ్మ**

**ణానాం క్షత్రియాణాం వైశ్యానాం చ. శూద్రాణాంతు**
**వస్త్రమాత్రమేవ వేదోక్తకర్మా౽నర్హత్వాత్. తస్మాత్**
**బ్రాహ్మణ్యాధిప స్సదేవల ఇతి మంతవ్యం. గాయత్రీచ**
**త్రిగుణాత్మికా సాక్షిస్వరూపిణీతి వ్యవ హ్రీయతే.**

తా॥ పూర్వము దేవతలందరూ వస్త్రములు లేని వారై మిక్కిలి సిగ్గు చెందియుండి పరమేశ్వరున్ని తమకు వస్త్రములు యజ్ఞోపవీతములు ప్రసాదించమని ప్రార్థించినారు. మిక్కిలి ధైన్యము చెంది విచారగ్రస్తులుగావున్న దేవతలను గమనించిన పరమాత్మ తన యందు జ్యోతిర్మయముగా వెలుగొందుచున్న చిచ్ఛక్తిని బహిర్ముఖంబగునట్లు చేసి ఓ మహాశక్తి నీవు శీఘ్రముగా యజ్ఞోపవీత వస్త్రములను నిర్మించి బ్రహ్మాది దేవతలందరికీ ఇవ్వుము అని ఆజ్ఞాపించగా పరాశక్తి వెంటనే దేవల నామము తోడ పురుష రూపము దాల్చినది. బ్రహ్మాది దేవతలకును, బ్రాహ్మణ, క్షత్రియ వైశ్యులు అను మూడు వర్ణముల వారికి యజ్ఞోపవీతం పరమం పవిత్రం..... అను మంత్రము వారికి చెప్పుచూ యజ్ఞోపవీతములను వస్త్రములను ప్రసాదించెను. శూద్రులకు మాత్రము వస్త్రములనే ఇచ్చినాడు. శూద్రులకు తప్ప దేవతలు మిగతా మనుషులందరికీ వస్త్రములు యజ్ఞోపవీతములు రెండింటినీ ఇచ్చినాడు మంత్రము పఠించుచూ. యజ్ఞములు,యాగములు మొదలైన వైదిక కర్మలను ఆచరించుటకు యజ్ఞోపవీతము అత్యావశ్యకము. దీనిని ధరించకుండా వైదిక కర్మలు చేయరాదు. అందువలన యజ్ఞయాగాలు వైదిక కర్మలు ఆచరించుటకు అర్హతను కలుగజేయునది యజ్ఞోపవీతధారణ. అందువలన బ్రహ్మస్వరూపమును త్రిగుణాత్మకమగు అనగా రజోస్సత్త్వ తమోగుణ సహితమైనది అగు బ్రహ్మసూత్రమును మానవ లోకమున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులకు మాత్రమే యజ్ఞోపవీతమును, వస్త్రములను ఇచ్చినాడు. వేద ప్రతిపాదకమైన బ్రాహ్మణ్యకర్మను శూద్రులు చేయుటకు అర్హత లేనందున వారికి యజ్ఞోపవీతము ఇవ్వకుండా కేవలము వస్త్రములను మాత్రమే ఇచ్చినాడు. దేవతలకును మానవులలోని మూడు వర్ణముల వారికి యజ్ఞోపవీతమును ధరించు మంత్రము చెప్పుచూ ఇచ్చినాడు. కావున బ్రాహ్మణ్యం సంపాదకమగు బ్రహ్మసూత్రములను ఇచ్చు అధికారము దేవలమను బ్రహ్మకే కలదు. యజ్ఞోపవీత అధిష్ఠానదేవత గాయత్రీదేవియే. యజ్ఞోపవీతము త్రిగుణాత్మకమైవుండి సర్వసాక్షీభూతముగా గాయత్రీదేవి విలసిల్లుచుండెను.

యజ్ఞోపవీత ధారణమంత్రమ్.

**యజ్ఞోపవీతం పరమంపవిత్రం, ప్రజాపతే ర్య త్సహజం పురస్తాత్,**
**ఆయుష్య మగ్ర్యా౽ప్రతిమంచ శుభ్రం, యజ్ఞోపవీతం బలమస్తు తేజః.**



తా॥యజ్ఞోపవీతము ప్రధమమున సాక్షాత్ పరమాత్మతో ఆవిర్భవించినది. సాక్షాత్ పరమాత్మ యజ్ఞోపవీతము ధరించియే ఆవిర్భవించెను. ఇది మిక్కిలి శ్రేష్ఠమై పరిశుద్ధమై వున్నది. సర్వకార్య నిర్వహణకు ప్రాధాన్యం కలిగి నిరుపమాన మహిమాన్వితము వహించి వున్నది. దీనిని ధరించుట ద్వారా దీర్ఘాయుష్షు కలుగజేయుట యందు ప్రధానమై వున్నది. సాటిలేనిది. శుభ్రముగా వుండునది అయి బలమును శక్తిని తేజస్సును ప్రసాదించును గాక.

ఈ విషయంబున సిద్ధాంతచంద్రికయందలి ప్రమాణము.

శ్లో. **ఈశ్వరీ యాతు యా శక్తి ర్జగన్నిర్మాణకారిణీ**
**సా వై దేవాంగరూపేణ సూత్ర వస్త్రాదికం ముదా**
**సుర కిన్నర గంధర్వ యక్షేభ్యః ప్రదదౌ తదా.**

తా॥ పరాత్పరునియందు సర్వలోక నిర్మాణకారణంబు అగు చిచ్ఛక్తి జ్యోతి రూపమున ప్రకాశించుచుండెను. ఆ చిజ్జ్యోతి దేవలబ్రహ్మరూపమును దాల్చి ఆ పరమేశ్వరుని అభిప్రాయమునకు అనుగుణముగా సురలు, సిద్ధులు, సాధ్యులు, గరుడులు, దేవతలు, కిన్నరులు, యక్షులు మొదలగు జాతుల వారికి ప్రేమతో వస్త్రసూత్రములు ఇచ్చినాడు అని సిద్ధాంత చంద్రిక తెలుపుచున్నది.

ధర్మనిధి యనుడు ధర్మశాస్త్రమందలి ప్రమాణము.

శ్లో. **దేవాంగే నోపదిష్టేన హ్యనేన ద్విజపుంగవ**
**యజ్ఞోపవీతం పరమం ఇతి మంత్రేణ సర్వదా**
**ఉపవీతం ద్విజై ర్ధార్య మన్యధా పతితో భవేత్.**

తా॥ దేవల బ్రహ్మచే ఉపదేశించబడిన యజ్ఞోపవీతం పరమం పవిత్రం అనెడు మంత్రము చేతనే నిరంతరము ద్విజులు యజ్ఞోపవీతమును ధరించవలయును. అట్లు మంత్రపూర్వకముగా గాయత్రిని ధరించనివారు మహాపాపాత్ములు అగుదురు అని ధర్మనిధి అను ధర్మశాస్త్ర గ్రంథము తెలుపుచున్నది.

## గుణ త్రయాత్మకమైన యజ్ఞోపవీతం

ఈ విషయమున ఋగ్వేదభాష్యమందలి ప్రమాణము.

శ్లో. **గుణత్రయాత్మకం యజ్ఞసూత్రం బ్రాహ్మణ్య హేతు**
**దేవలేన పురాదత్తం దేవతాభ్య శ్శివాజ్ఞయా.**

తా॥ రజో స్సత్త్వ తమోగుణ త్రయమైనదియు, బ్రాహ్మణ్యమునకు మూలకారణభూతమైనదియు అగు యజ్ఞోపవీతమును దేవతలందరికీ ఇవ్వవలసినదిగా దేవలున్ని పూర్వము పరమేశ్వరుడు ఆజ్ఞాపించెను అని ఋగ్వేద

భాష్యము తెలుపుచున్నది.

## విశ్వకర్మకు యజ్ఞోపవీతం ఇచ్చుట

**మూల. ఈశ్వర స్స్వస్య పంచముఖే ఉత్పన్నస్య విశ్వ**
**కర్మణః జగన్మానజ్ఞానార్థం సూత్రాభావాత్ సమం**
**త్రకం సూత్రాదికం దేవాంగేన దాపితవాన్ సతు**
**తేన జగత్పరిమాణ మమన్యత.**

పూర్వము పరమేశ్వరుని పంచ అనగా ఐదవ ముఖమునుండి విశ్వకర్మ అవతరించినాడు. విశ్వకర్మ తనకు బ్రాహ్మణ్యము లేకుండుటచేత ప్రపంచముయొక్క పరిమాణము తెలుసుకొనలేకపోయినాడు. అప్పుడు శంకరున్ని ప్రార్థించినాడు. అప్పుడు పరశివుడు దేవలబ్రహ్మచేత ఆ విశ్వకర్మకు యజ్ఞోపవీతమును సమంత్రకముగ ఇప్పించినాడు. యజ్ఞోపవీత ధారణ ప్రభావమువలన విశ్వకర్మ బ్రాహ్మణ్యయుక్తుడయి ప్రపంచ పరిమాణమును తెలుసుకొనగల శక్తివంతుడయ్యెను.

ఈ విషయము శ్రీశైలమాహాత్మ్యమున ఉత్పత్తికాండ ప్రమాణము.

**శ్లో. దేవదేవ భవద్వక్రాత్ సంభూతో ప్యహ మీశ్వర**
**సూత్రాభావా జ్జగన్మాతు మశక్తోఽహం కథంచన**
**తస్మాత్సూత్రం త్వయా దేవ దాతవ్యం మానహేతు**
**ఇతి సంప్రార్థితో పశ్చాత్ దేవాంగేన మహాత్మనా**
**సూత్రం దాపితవాన్ తస్మై మహేశో విశ్వకర్మణే.**

తా॥ ఓ దేవదేవేశ్వరా! ఓ ప్రభూ! నేను మీ ముఖమునుండి పుట్టినవాడు అయినను బ్రాహ్మణ్య సంపాదకమగు యజ్ఞసూత్రము లేకపోవుటవలన లోక పరిమాణము తెలుసుకొను శక్తి లేకుండా వున్నదినాకు. కాబట్టి ఓ పరమేశ్వరా! అట్టి సామర్థ్యము కలిగించు శక్తిని ఇచ్చేటటువంటి యజ్ఞోపవీతమును నాకు అనుగ్రహింపుము అని విశ్వకర్మ ప్రార్థించగా, పరశివుడు మహాత్ముడగు దేవబ్రహ్మచేత యజ్ఞోపవీతము ఇప్పించినాడు అను విషయము శ్రీశైలమాహాత్మ్యమునందలి ఉత్పత్తికాండము తెలుపుచున్నది.

ఈ విషయంబుననే అధర్వణ వేదమందలి ప్రమాణము.

**జట. దదౌ దేవాంగ స్సూత్రం వై విశ్వకర్మణ ఇత్యాహ ప్రజాపతిః.**

తా॥ దేవలబ్రహ్మయే విశ్వకర్మకు బ్రహ్మసూత్రము ఇచ్చినాడు అను విషయమును బ్రహ్మదేవుడు చెప్పినట్లుగా అధర్వణ వేదము తెలుపుచున్నది.



**మూల. తతో వైశ్యకర్మణోపి దేవాంగ ప్రసాదలబ్ధ యజ్ఞ**
**సూత్రా ణ్యమంత్రకేణ ధారయామాసుః, తేన**
**సూత్రాణి దగ్ధాని, తే ప్యతిభయేన శివం సంప్రార్థ్య**
**సూత్రాణి యాచయామాసుః, తతశ్శివాజ్ఞయా ప్రసన్నో**
**దేవాంగో దగ్ధ యజ్ఞోపవీతాన్ మన్వాదీన్‌దృష్ట్వాఽతి**
**కరుణయా గాయత్రీ మంత్రోపదేశపూర్వకం యజ్ఞోప**
**వీతం దత్తవాన్ అత ఏవ యజ్ఞసూత్ర మమంత్ర కేణ**
**నధార్య మితి మంతవ్యమ్.**

తా॥ విశ్వకర్మ, యజ్ఞోపవీత ప్రభావముచేత సర్వలోక ప్రమాణములు తెలుసుకొన శక్తి కలిగి వుండినాడు. కాని అతని కుమారులు మాత్రము దేవల మనుబ్రహ్మయొక్క అనుగ్రహముతో ఇవ్వబడిన యజ్ఞోపవీతములను మంత్రమును పఠించకుండా ధరించినారు. వెంటనే ఆ యజ్ఞోపవీతములు దగ్ధములయినాయి. ఆ విధముగ దగ్ధమయ్యేసరికి విశ్వకర్మ కుమారులు భయభ్రాంతులైనారు. అప్పుడు పరమభక్తితోకూడి పరమేశ్వరుని ధ్యానించినారు. అప్పుడు మహాకారుణ్యమూర్తియైన మహాదేవుని అభిప్రాయానుసారముగ దేవలబ్రహ్మప్రసన్నుడై దగ్ధ యజ్ఞోపవీతులయిన విశ్వకర్మ కుమారులకు గాయత్రీ మంత్రోపదేశపూర్వకముగా మరల యజ్ఞోవీతములు ఇచ్చినాడు. కావున యజ్ఞోపవీతము ధరించుటకు మంత్రమును పఠించుచు ధరించవలయునని దీనివలన తెలియుచున్నది. మంత్ర పఠనములేకుండా ధరించిన అది నిష్ఫలమగును అని దీనిద్వారా లోకాలకు తెలియచేయబడినది.

ఈ విషయంబున స్కాందమునందలి ప్రమాణము.

**శ్లో. ఉపవీతం యదా దత్సే మంత్ర ముచ్చార్య ధారయ**
**అన్యదా తేపి రాజేంద్ర గతి స్యా ద్వైశ్వకర్మణామ్.**

తా॥ గర్గ మునీంద్రుడు సింధు దేశపు రాజునకు ఈ విధముగ చెప్పినాడు. ఓ రాజేంద్రా! నీవు యజ్ఞోపవీతమును ధరించునప్పుడు మంత్రోచ్చారణ పూర్వకముగా ధరించుచుండుము. అట్లు గాకుండా అనగా మంత్రోచ్చారణ లేకుండా యజ్ఞోపవీతమును ధరించిన యెడల నీకును విశ్వకర్మ కుమారులకు కలిగిన విధముగా మీకు కలుగును. కావున జాగ్రత్త అని చెప్పినాడు. అను విషయము స్కాందపురాణము నందు తెలుపబడినది.

## మాయాతీతుడు దేవలుడు

**మూల:-సదేవల బ్రహ్మచారీ నిర్గుణః నిష్కళంకః నిత్యః**
**నిర్వికల్పః సచ్చిదానందస్వరూపః మాయా శూన్యః**

**అకర్తా అభోక్తాసచమాయయాఽ వచ్ఛిన్న త్వాత్సగుణః.**
**సవికల్పః సూత్రాత్మా త్రిమూర్తిస్వరూపః దేహీచా**
**సీత్. ఓ మిత్యే కాక్షరం బ్రహ్మ, ప్రజ్ఞానం బ్రహ్మ అహం**
**బ్రహ్మాస్మి ,తత్త్వమసీ,అయమాత్మాబ్రహ్మేత్యాదిమహా**
**వాక్యలక్ష్యార్థ గోచరో దేవల ఏవ.**

తా॥ దేవల బ్రహ్మయే ఊర్ధ్వరేతస్కుడు అగుచు బ్రహ్మచర్యము చేత విలసిల్లుచున్నాడు. నిర్గుణుడును, నిష్కలంకుడును, శాశ్వతుడును, నిర్వికల్పుడును, మాయారహితుడును అగుసచ్చిదానంద మయుడై ప్రకృతిని అంటకుండా వుండి మాయాతీతుడుగా వెలుగొందుచున్నాడు. అట్టి తేజోమయుడును తన నిజమాయచేత నామరూపాదిక వికల్పంబు వహించి గుణసహితుడగుచు ప్రపంచ నాటక సూత్రధారియై బ్రహ్మ విష్ణు మహేశ్వర రూపములతో ఉత్పత్తి స్థితి లయములను గాంచుచు ఆత్మరూపమున సర్వాంతర్వర్తి అగుచుండెను. ఓం అనెడి ఒక్క అక్షరమే పరబ్రహ్మము,మిక్కిలి ఉత్తమమైన జ్ఞానమే బ్రహ్మము,నేనే బ్రహ్మము అగుచున్నాను.ఆబ్రహ్మమే నీవు అగుచున్నావు. ఈ ఆత్మయే బ్రహ్మము. ఇటువంటి మహావాక్య లక్ష్యార్థములకు విషయభూతుడు అగువాడు దేవల బ్రహ్మయే అని తెలుసుకొనవలయును.

## సకల దేవతా స్వరూపుడు దేవల బ్రహ్మ

ఈ విషయంబున ఋగ్వేదమందలి ప్రమాణము.

**జట: ఓం తధాత్మా ఓం తజ్జగత్ ఓంమితిసర్వం తదోంకార**
**రూపదేవల త్వంయజ్ఞః తం వషట్కారఃత్వం ఇంద్రః**
**త్వం బ్రహ్మత్వం విష్ణుః త్వం రుద్రః త్వం వాయుః త్వమ**
**గ్నిః త్వంచంద్రమాః ఇతి ఋగ్వేద ప్రదర్శనాత్.**

పరమాత్ముడు ఓంకారరూపుడు.జగంబులు అన్నియు ఓంకారస్వరూపమే. అటువంటి ఓంకార మయుడవైన ఓదేవల బ్రహ్మమా! నీవే యజ్ఞస్వరూపుడవు, నీవే ఆహుతి స్వరూపుడవు, నీవే ఇంద్రుడవు, నీవే బ్రహ్మదేవుడవు, నీవే విష్ణువువు, నీవే రుద్రుడవు, నీవే వాయుదేవుడవు, అగ్నిదేవుడవు. నీవే సూర్యచంద్రులును. నీవే సర్వమును సర్వ స్వరూపమును అయి వున్నావు అని ఋగ్వేదము తెలుపుచున్నది.

సిద్ధాంత తత్త్వ ప్రకాశికయందలి ప్రమాణము.

**శ్లో॥ దేవలోయం పరబ్రహ్మ నిత్యశుద్ధోతి నిర్మలః**
**సచ్చిదానంద రూపశ్చ నిర్వికల్పో నిరామయః**



**కర్తృత్వాదివినిర్ముక్త స్సర్వసాక్షీ నిరాకులః**
**స ఏవ మాయయా యుక్త స్సగుణ స్సవికల్పకః**
**సత్త్వాది గుణసంయుక్తో బ్రహ్మాద్యాకార మాయయా**
**అయం హి తత్త్వ మస్యాది వాక్యలక్ష్యార్థగోచరః**
**తద్రూపం హి జగత్సర్వం తదన్యం నాస్తి కించన.**

తా॥ ఈ దేవలబ్రహ్మయే,పరమాత్ముడు.నిత్యుడునుశుద్ధుడును, నిర్మలుడును,నిరామయుడును అగు సచ్చిదానందరూపమున నిర్వికల్పుడై ప్రభాసించుచుండినాడు. అతడు కార్యాచరణములును విడువబడినవాడై సర్వలోకములకు సాక్షీభూతమై అఖండమై యుండువాడుగావుండెను.అతనే మాయతో కూడినవాడై త్రిగుణ రజో స్సత్వ తమోగుణ సహితుడై వికల్పమును పొంది బ్రహ్మ విష్ణు మహేశ్వరుల రూపములను పొంది సృష్టి స్థితి సంహార కార్యములు నిర్వర్తించుచుండెను. ఈతడేతత్త్వమస్యాది మహావాక్యముల లక్ష్యార్థములకు విషయ భూతుడైనాడు.సమస్త జగంబులు అన్నియు దేవలమయమే అగుచుండెను. దేవలునకు వ్యతిరేకమైనది ఏదియును ఇసుమంతయు కూడా లేకుండా వున్నది.అందువలన సర్వం దేవలబ్రహ్మ మయమే అయివున్నది.అని సిద్ధాంత తత్త్వ ప్రకాశిక తెలుపుచున్నది.

ఇందునకు అధర్వణ వేదమందలి ప్రమాణము.

**శ్రుతి:- సర్వం దేవల మామనంతి బ్రహ్మావాదినః**

తా॥ సమస్త ప్రపంచములు మొత్తము దేవలమయమని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు అని అధర్వణవేదం తెలుపుచున్నది.

## భూలోకమున మనుష్యుడుగా జన్మించమని కాండమహర్షి శాపము

**మూల: పునః కల్పాదౌ వస్త్ర సూత్రా భావాత్ సర్వే**
**దేవా శ్శివంనత్వా ప్రార్థయామాసుః శివో దైవతైః**
**ప్రార్థితః స్వయంభువం దధ్యౌ. సోపి శివసహ స్రారకమ**
**లాన్నిర్గత్య స శరీరస్స న్ దేవలనామ్నా బ్రహ్మవిష్ణు**
**రుద్రాది దేవానాంసూత్ర వస్త్రాదికం దత్తవా న్ తతః**
**కాండర్షి రాగత్య దేవాంగమనుం దృష్ట్వా మమ వస్త్ర**
**సూత్రాదికం దాతవ్య మిత్యపృచ్ఛత్ దేవాంగ బ్రహ్మ**
**ణా నేదానీం వర్తతేశ్వః దీయతే ఇత్యుక్తం. తతః**
**కాండర్షిః కుపితస్స న్ సర్వేషాం దత్వా మమ నాస్తీ త్యు**
**క్తం అతస్త్వం నరో భవేతి శాపం దత్తవా న్. తతో**

**మనుబ్రహ్మత్వ చ్ఛాపం జగదుపకారాయ భవతి. లోకే**
**కార్య కారణయో రభేదస్య విద్యమానత్వాత్, నరా**
**ణాం జగదంతః పాతిత్వేన సర్వస్యాపి జగతః బ్రహ్మస్వ**
**రూపత్వేనచ. నరస్య మమచ భేదో నాస్తి. అతః త్వ**
**ద్దత్తశాపేన కిం ప్రయోజన మిత్యుక్త్వా శివసహస్రార కమలం**
**ప్రావిశత్.**

తా॥ మరియొక బ్రహ్మకల్ప ప్రారంభంనందు దేవతలందరు తమకు సూత్ర వస్త్రములు లేకుండుటచేత పరమేశ్వరున్ని స్తోత్రపూర్వకముగా ప్రార్థించినారు. దేవతలు ప్రార్థించినప్పుడు పరమశివుడు తనయందు జ్యోతిరూపముగా వెలుగుచుండెడి స్వయంభువును ధ్యానించెను. అంతట ఆస్వయంభువు పరమశివ సహస్రార పద్మాంతరాళమునుండి వెలువడి దేవల నామముతోడ పురుషరూపము దాల్చి బ్రహ్మ విష్ణు మహేశ్వరాది దేవతలకు యజ్ఞోపవీతములను, వస్త్రములను ఇచ్చినాడు. ఆ తరువాత కాండమహర్షి దేవలబ్రహ్మనుగాంచి ఓ మహాత్మా! నాకు వస్త్రములు, యజ్ఞోపవీతము ఇవ్వుముఅని అడిగినాడు. అప్పుడు ఆదేవలబ్రహ్మ ఇప్పుడు నీకు ఇవ్వలేను రేపటిదినమున మీకు సూత్ర వస్త్రములు ఇవ్వగలవాడను అని చెప్పగా, వెంటనే కాండమహర్షి కోపోద్రిక్తుడై అందరికిని సూత్ర వస్త్రములు ఇచ్చి నాకు మాత్రము గడువుచెప్పుచున్నావు గదా! కాబట్టి నీవు భూలోకమున మనుష్యుడవై జన్మించెదవు గాక అని శాపము ఇచ్చినాడు. అంతట దేవల బ్రహ్మ ఆ మునీంద్రునితో "నీవు ఇచ్చిన శాపము లోకోపకారముగా నాకు పరిణమించును. లోకమున కార్యమగు ప్రపంచమునకును కారణమగు పరబ్రహ్మమునకు భేదములేకుండా వుండును. మానవులు ప్రపంచము లోపరివారగుటచేత ప్రపంచమంతయు పరబ్రహ్మ స్వరూపమే అగుటచేతను మనుష్యునకును నాకును భేదము ఎంతమాత్రము కలుగదు. కాబట్టి నీవు ఇచ్చిన శాపము వలన భూలోకములకు మేలు కలుగునే కాని ఎంతమాత్రము హాని కలుగదు. అని చెప్పి పరమశివ సహస్రార పద్మాంతరాళమున ప్రవేశించెను.

ఈ విషయంబున తత్త్వసారోపనిషత్తు నందలి ప్రమాణము.

శ్లో॥ **కల్పాదౌ వస్త్రసూత్రాణా మభావా న్నిర్జరాః పునః**
**శివం సంప్రార్థయామాసుః లజ్జాఽ వన తమస్తకాః**
**తత స్స్వయం భువం దధ్యౌ వస్త్రసూత్రార్థ మీశ్వరః**
**త్యక్త్వా సోపి సహస్రారం బహి రాగత్య సాదరం**
**సదేహీ దేవలాభిఖ్యాం ధృత్వా సౌ విబుధై స్తుతః**



**నిర్మాయ సూత్రవస్త్రాదీన్ దేవతానాం దదౌ ముదా**
**కాండర్షి స్తత ఆగత్య నత్వా దేవాంగ మీశ్వరం**
**యయాచ సూత్రవస్త్రాదీన్ మమ దేహీతి భక్తితః**
**ఇతీరితం వచ శ్ర్శుత్వా దేవాంగో మునినా తదా**
**నేదానీం వర్తతే బ్రహ్మన్ సూత్రవస్త్రాదికం త్వహం**
**శ్వస్తే దాస్యామి గచ్ఛేతి ప్రోక్తవాన్ దేవతాధిపః**
**తతస్త ద్వచనం శ్రుత్వా కుపితో మునిపుంగవః**
**సూత్రవస్త్రౌ ప్రదత్వాద్య సర్వేషా మమృతాంధసాం**
**అబ్రవీ ర్మమ నాస్తీతి యస్మా న్నిష్కృపయాఽధునా**
**నరో భవేతి దేవాంగం శశాప సురపూజితం**
**తతో మునివరం దృష్ట్వా దేవాంగః ప్రహసన్ ముదా**
**ఉవాచ ముని శార్దూల త్వచ్ఛాపం జగతాం భృశం.**

శ్లో॥ **ఉప కారాయ భవతి నాత్ర కార్య విచారణా**
**భేదో నదృశ్యతే విద్వన్ యత్కించి జ్జగదావయోః**
**మత్స్వరూపం జగత్సర్వం జగన్మద్రూప మేవ హి**
**నరాణాం చాపి మే విద్వన్ యోగ్యవేవ న సంశయః**
**ఇత్యుక్త్వాంతరధా ద్దేవో దేవాంగో జగదీశ్వరః**

తా॥ మరియొక కల్పారంభమునందు దేవతలు వస్త్ర సూత్రములు లేకుండా వుండుట వలన సిగ్గుచేత తలలు వంచుకొని భక్తితో పరమశివుడిని ప్రార్థించినారు. అప్పుడు పరమేశ్వరుడు వస్త్ర సూత్రముల కొరకై స్వయంభువు అగు పరమాత్మను ధ్యానించెను. ఆ స్వయంభువు శివ సహస్రారమునుండి వెలువడి ఆదరంబున శరీరవంతుడై దేవలుడు అను నామము వహించినాడు. తనను దేవతలందరు స్తోత్రము చేయుచుండగా సూత్ర వస్త్రములను నిర్మించి సంతోషపూర్వకముగా ఆ దేవతలందరికిని ఇచ్చినాడు. అప్పుడు కాండమహర్షి వచ్చి సర్వేశ్వరుడైన ఆదేవాంగుని స్తోత్రముచేసి మహాత్మా! నాకు సూత్ర వస్త్రాదులను ఇవ్వుము అని భక్తితో యాచించినాడు. అప్పుడు దేవేశ్వరుడైన దేవలబ్రహ్మ ఆతనిని గాంచి ఓ మునీంద్రా! ఈ దినము నీకు సూత్రవస్త్రాదులను ఇవ్వలేను. రేపటిరోజున ఇచ్చెదనుగాక అని చ్పెగా ఆ మాటలకు మునీంద్రుడు కోపాక్రాంత చిత్తుడు అగుచు "ఓహో! దేవతలందరికిని సూత్ర వస్త్రములు ఈరోజున ఇచ్చినావు. కాని నాకు మాత్రము నిష్కారణముగా రేపటిదినమున ఇచ్చెదను అని చెప్పుచున్నావు. కాబట్టి నీవు భూలోకమున మనుష్యుడవై జన్మింపుము అని దేవపూజితుడైన దేవాంగుని శపించెను. అప్పుడు దేవలబ్రహ్మ సంతోషపూర్వకముగా నవవ్వుచు మహర్షిని గాంచి ఓ ముని

శార్దూలా! నీవు ఇచ్చిన శాపము లోకమునకు మిక్కిలి ఉపకారముగానే పరిణమించును. ఈ విషయములో నేను ఎంతమాత్రము పరితాపము చెందుటలేదు. ఓ మహాత్మా! లోకములకును నాకును కొంచెమైనను భేదము కలుగదు. ఈ జగమంతయు నాస్వరూపమే. నేను ఈ జగత్స్వరూపుడనే. కాబట్టి ఓ మునీంద్రా! నీవు ఇచ్చిన శాపము యోగ్యమైనదియే. అందుకు ఎటువంటి సందేహములేదు అని చెప్పి జగదీశ్వరుడైన దేవలబ్రహ్మ అచ్చటనే అంతర్ధానమయ్యెను. అని తత్వసారోపనిషత్తు వలన తెలియుచున్నది.

**శ్లో॥ వేదాః ప్రమాణం ప్రథమం స్వతఏవ నసంశయః**
**స్మృతయ శ్చేతి హాసాని పురాణానిచ షణ్ముఖ**
**వేదాఽ విరోధాదేతాని ప్రమాణాని నసంశయః**
**బ్రాహ్మం పాద్మం వైష్ణవంచ శైవం భాగవతాభిదం**
**మార్కండేయం నారదీయ మాగ్నేయ మితికీర్తితం**
**భవిష్యద్బ్రహ్మ కైవర్తం లైంగ్యం వారాహ మేవచ**
**స్కాందం వామనకూర్మాఖ్యం మాత్స్యంగా గారుడసంజ్ఞి**
**బ్రహ్మాండాఖ్య పురాణంచ వ్యాసో క్తం శ్రుతి సమ్మతం**
**శైవంస్కాందం తథాలైంగ్యం కూర్మం వామన సంజ్ఞిః**
**భవిష్యం మత్స్య వారాహం మార్కండేయం తథైవ (**
**బహ్మాండంచ దశైతాని శైవాని సురసత్తమ**
**నారదీయం భాగవతం గారుడం వైష్ణవా భిదం**
**ఏత చ్చతుష్టయం విష్ణు పురాణాని మహామతే**
**బ్రాహ్మం పాద్మం ద్వయం బ్రహ్మ పురాణ మితి కథ్యతే**
**బ్రహ్మ కైవర్త మేకంతు పురాణం సూర్యబోధకం**
**ఆజ్ఞేయాఖ్యం మహాప్రాజ్ఞ పురాణంత్వగ్ని బోధకం**
**రామాయణం భారతంచ వాల్మీకే కర్వ్యాసనిర్మితం**
**ఇతిహాసా విమౌ పూర్వ రాజవృత్తాంత బోధకౌ**
**పురాణే ష్వితిహాసేషు తత్ర తత్రచ షణ్ముఖ**
**దేవాంగ మునిమాహత్మ్యం విద్యతే శ్రుతి సమ్మతమ్.**

తా॥ ఓ షణుఖా! తత్త్వార్థములను నిర్ధారణ చేయుటయందు మొట్టమొదటగ స్వతసిద్ధముగ వేదములే ప్రమాణములు అగుచుండును. శాస్త్రములు పురాణములు వేదవిరుద్ధము కాక వున్నటువంటివి కూడా ప్రమాణాలే. అనగా వేదములకు అనుగుణముగా వున్నవి మాత్రమే ప్రమాణములు అనుటలో ఎంతమాత్రము సందేహము చెందనవసరములేదు. బ్రాహ్మపురాణము, పద్మము,వైష్ణవము, శైవము



భాగవతము, మార్కండేయము, నారదీయము,ఆగ్నేయము, భవిష్యత్తు, బ్రహ్మకైవర్తము, లింగపురాణము, గరుడపురాణము, బ్రహ్మాండపురాణము అనెడు 18 పురాణములు వేదసమ్మతమ్ముగ వ్యాసమహర్షిచే చెప్పబడినవి. ఓ దేవరేడ్యుడా! ఈపదునెనిమిది పురాణముల యందును శైవము స్కాందము, లైంగ్యము, కూర్మము, వామనము, భవిష్యత్తు మత్స్యము,వారాహము, మార్కండేయము, బ్రహ్మాండము అను పది పురాణములు శైవమునకు సంబంధిచినవి. నారదీయము, భాగవతము,గారుడము, వైష్ణవము అనెడు నాలుగుపురాణములు వైష్ణవమునకు చెందినవి.బ్రాహ్మము, పాద్మము అను రెండు పురాణములు సూర్యబోధకమైన పురాణము.అగ్నిపురాణము అనునది అగ్నికి సంబంధించిన పురాణము. ఓ మహాప్రాజ్ఞా! వాల్మీకి మునీంద్రుడు రచించిన శ్రీమద్రామాయణమును, వ్యాసమహర్షి రచించిన మహా భారతము అనురెండును ఇతిహాసములు అని పిలువబడును.ఇవి పూర్వరాజుల చరిత్రలను తెలుపునవి. ఓ షణ్ముఖుడా! వేదశాస్త్రముల యందేగాక పురాణ ఇతిహాసముల యందు కూడా అచ్చటచ్చట వేద సమ్మతమైన దేవల మునీంద్రుని ప్రభావము తెలియుచుండును.అని కుమారస్వామికి శంకరుడు చెప్పెను.

## దేవాంగ తత్త్వము తెలుపమని కుమారస్వామి శంకరుడిని అడుగుట

**షణ్ముఖః దేవాంగసంభవే మానం వద మే కరుణాకర**
**శ్రుతిస్మృ త్యవిరోధేన బ్రహ్మవిష్ణ్వాదిపూజిత**
**కుమారవచనం శ్రుత్వా మహేశో హృష్టమాన**
**తా న్యేవ శ్రుతి వాక్యాని దైవలా నిత్థముక్తవా ౯**

తా॥ బ్రహ్మ విష్ణువు మొదలగువారిచేత పూజింపబడువాడా! కరుణాకరుడా! అని కుమారస్వామి శంకరునకు నమస్కరించి స్వామీ! దేవాంగ తత్త్వార్థ బోధకములగు విషములను వేదశాస్త్ర సమ్మతములగు ప్రమాణముతోడ నాకు తెలియజేయుము అని ప్రార్థించినాడు. అప్పుడు మహేశ్వరుడు సంతోషముచెందిన వాడై దేవలబ్రహ్మ విషయమును వేదవాక్య ప్రమాణములచే ఈ విధముగా అతనికి చెప్పుట ప్రారంభించినాడు.

**జట: దేవలా దిమాని భూతాని జాయంతే. దేవలేన జాతా**
**ని జీవంతి.దేవలం ప్రత్యభి సంవిశంతి. తస్మా ద్దేవలో భూ**
**తానా మగ్ర అసీ దితి సామవేద ప్రదర్శనాత్.**

తా॥ పృధివి, వాయువు, అగ్ని జలము ఆకాశములతోకూడిన సమస్త జంగమ స్థావరములతో కూడిన ప్రపంచములన్నియు దేవల బ్రహ్మము వలననే ఉ

త్పన్నములైనవి. ఆ విధముగా ఉత్పన్నములైన ప్రపంచములన్నియు దేవలుని చేతనే వర్తింప బడుచున్నవి. అట్టిసమస్త ములైనవన్నియు చివరకు దేవలునియందు లయమగుచున్నవి. కాబట్టి దేవలబ్రహ్మయే సమస్త భూతములకు ప్రధాన పురుషుడు అని సామవేదము నిరూపించుచున్నది.

**జట: హిరణ్యగర్భా దగ్రే సమవర్తత సర్వస్య భూతస్య పతి రేక ఏవం దేవలః. య తేంద్రో బృహస్పతి ర్దేవా సూర్యా చంద్రమసౌ దేవల మయజంత తస్మా ద్దేవలో దేవతాద్య శ్శాస్తాచ దేవతానాం బ్రహ్మణ శ్చేతి యజుర్వేద ప్రదర్శనాత్.**

తా॥ హిరణ్య గర్భుడైన చతుర్ముఖ బ్రహ్మకు పూర్వము సమస్త భూతములకు అధినాయకుడు అయిన దేవలుడు ఒక్కడే సనాతనుడై వుండెను. దేవేంద్రుడును,దేవతాచార్యుడు,బృహస్పతి దేవతలు,సూర్యచంద్రులు మొదలగువారు దేవలున్ని పూజించినారు.ఆకారణము చేత దేవలుడు దేవతలకును, బ్రహ్మకును, శిక్షకుడును,దేవతలందరికి ఆదిపురుషుడును అయి వున్నాడు. అనియజుర్వేదము నిరూపణముచేయుచున్నది.

ఈవిషయంబున సామవేద ప్రమాణము.

**జట: మనసా వాచా వదంతి సత్యం దేవాంగం దేవతా**
**యజ్ఞభుజం యజ్ఞకర్తారం యజ్ఞరూపం విశ్వస్యభర్తారం**
**గోప్తారం హర్తారం తస్యరూపమే వై తత్సర్వం సూత్ర**
**కర్తార మాహుః-ప్రజాపతి స్తపసాతప్త్వా దేవాంగ**
**మబ్రువత్ ఇమాన్లోకాన్ కథం నైసృజామీతి-**
**ఇతి సామవేద ప్రదర్శనాత్.**

తా॥ దేవతలందరును దేవాంగబ్రహ్మ విషయమై ఆతడే యజ్ఞ భోక్తయు, యజ్ఞ కర్తయు, యజ్ఞ స్వరూపుడును,ఆతడే ప్రపంచముల యొక్క ఉత్పత్తి, స్థితి, లయములకు కారకుడును ఈ సమస్తము ఆతనిస్వరూపమే.బ్రాహ్మణ్య సంపాదకమగు యజ్ఞోపవీతమునకు కర్తయును అతడే అని మనసా వాచా కర్మణా అని త్రికరణ శుద్ధిగా ఈ సత్యార్థము ను గ్రహించుచున్నాను.పూర్వము చతుర్ముఖ బ్రహ్మ ఈ ప్రపంచ సృష్టిచేయగోరి తపస్సుచేసెను. తనకు ప్రసన్నుడైన దేవాంగబ్రహ్మను గాంచి ఓ ప్రభూ! ఈ లోకములను ఎట్లు సృష్టించెదను నేను అని అడిగినాడు. అని సామవేదము తెలుపుచున్నది.

ఈ విషయమున యజుర్వేదము వలన ప్రమాణము.

**జట: అగ్ని రగ్రే ప్రథమో దేవతానాం,అగ్నే ర్దేవానాం**



**ప్రథమస్సూర్యఃఅగ్ని ర్దేవతా సూర్యాంతరాత్మా జగ**
**తస్తస్థుషశ్చ దేవాంగో బ్రాహ్మణా స్తం సమంతి బ్రహ్మవా**
**దినః ఇతి యజుర్వేదో ప్రదర్శనాత్.**

తా॥ దేవతలయందు ప్రధానమైనవాడు అగ్నిదేవుడు. ఆ అగ్నిహోత్రునకును, దేవతలకును ప్రధానుడు సూర్యుడు.అట్టి సూర్యాగ్నిహోత్రులకును, దేవతలకును, స్థావర జంగమాదులు గల సమస్త ప్రపంచములకును అంతరాత్మయై వెలుగుచుండెడి పరమాత్మయే దేవలబ్రహ్మ. కాబట్టి బ్రహ్మజ్ఞాన సంపన్నులగు బ్రాహ్మణోత్తములు నిరంతరమును ఆ దేవల బ్రహ్మను ధ్యానించుచుందురు అని యజుర్వేదము వలన తెలియుచున్నది.

ఇందునకు ఋగ్వేదము వలన ప్రమాణము.

**శ్రుతి: ఏక ఏవహి దేవాంగః స బ్రహ్మ, తత్సత్యం, పృథ్వీ**
**మిథ్యా, సూత్రాత్మనో దేవల బ్రాహ్మణ స్స కాశాదవ్యక్తం,**
**అవ్యక్తాన్మహత్, మహతోఅహంకారః, అహంకారా**
**దాకాశః ఆకాశాద్వాయుః,వాయో రగ్నిః, అగ్నే**
**రాపః, అద్భ్యః పృథివీ,పృదివ్యా ఔషధయః,ఓషధీభ్యో**
**ఉన్నం, తస్మా త్సర్వ కారణో దేవాంగః:- ఇతి ఋగ్వేద ప్రదర్శనాత్**

తా॥ ప్రపంచ సృష్టికి పూర్వము దేవాంగ బ్రహ్మ ఒక్కడే వుండినాడు.అతడు అఖండ అద్వితీయ పరిపూర్ణబ్రహ్మమై వెలుగుచుండెను. ఆతడే పరాత్పరుడు అనగా దేవదేవేశ్వరుడు అను విషయము సత్యమైనది. ఈప్రపంచము మాయ.సూత్రాత్ముకుడగు దేవల బ్రహ్మ మూలముగ అవ్యక్తం(పరమాత్మ) జనియించినది. ఆఅవ్యక్తం వలన మహతత్త్వము కలిగినది. ఈ మహతత్త్వము నుండి అహంకారము జన్మించినది. ఈ అహంకారము నుండి ఆకాశము జన్మించినది. ఆకాశము నుండి వాయువు కలిగినది. వాయువు నుండి అగ్ని పుట్టినది. అగ్నివలన జలము (నీరు) పుట్టినది. జలముచే భూమిపుట్టినది. భూమినుండి సస్యాదులు అయిన పంటలు ఓషధులు కలిగినవి.పంటలునుండి అన్నము కలిగినది. దీనికంతటికి ఏకైకకారణము దేవల బ్రహ్మయే అని ఋగ్వేదము తెలుపుచున్నది.

ఇందునకు తత్త్వ రహస్యోపనిషత్ ప్రమాణము.

**శ్రుతి: ఓంకార రూపిణో దేవలస్య ప్రకృ తేః రజస్సత్త్వ**
**తమోగుణాః బ్రహ్మవిష్ణురుద్రా బభూవుః. బ్రహ్మ కామ**
**యత ప్రజాస్సృజేయేతి. స బ్రహ్మ తపస్తప్త్వా యో వై**

**బ్రహ్మణే ప్రదదౌచ వేదాన్ తం దేవలం శరణ మహం**
**ప్రపద్యే. ఇతి తత్త్వ రహస్యోపనిషత్ప్ర దర్శనాత్.**

తా॥ ఓంకార స్వరూపుడు దేవలుడు. ఈతని మాయ వలన రజోగుణము సత్త్వగుణము తమోగుణములు గలవారైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు జన్మించినారు. రజోగుణమే ప్రదానముగా గల బ్రహ్మదేవుడిని సృష్టికార్యము నెరవేర్చుమని దేవలబ్రహ్మము కోరెను. బ్రహ్మదేవుడు ప్రపంచమును ఉత్పత్తి చేయనెంచి అందుకు అవసరమైన సామాగ్రి కొరకై దేవలబ్రహ్మను గురించి తపస్సు చేసినాడు. అప్పుడు దేవలుడు ప్రత్యక్షమై ఆచతుర్ముఖ బ్రహ్మకు ప్రపంచ ఉత్పత్తి సాధనములైన వేదములను కారుణ్య బుద్ధితో ఇచ్చినాడు. అట్టి పరాత్పరుడు అగు దేవల బ్రహ్మయే నాకు రక్షకుడు అగుగాక అని తత్త్వ రహస్యోపనిషత్తు తెలుపుచున్నది.

## చిజ్జ్యోతి స్వరూపుడు దేవాంగ పరబ్రహ్మ

సామవేదోపనిషత్ ప్రమాణము.

**శ్రుతి: దివ్యోగ్ని రేకోదేవలః.సబ్రహ్మ. సఏ వాగ్ర**
**ఆసీత్. సవైతంతు కర్తా భవత్ .విశ్వ కర్మణే ప్రాయచ్ఛ**
**త్తంతూన్ స దేవాంగో దేవానా మయచ్ఛ త్సూత్రాణి.**
**తం సర్వే దేవానామంతి సోగ్ని మసృజత్ ఇమా న్లోకాన**
**సృజత్. ఇంద్రమ సృజత్. వాయుమ సృజత్.అన్నంవై.**

తా॥ దేవలుడు ఒక్కడే చిజ్జ్యోతి స్వరూపుడు. అందువలన ఆతనే పరబ్రహ్మము. ఈ సృష్టికి పూర్వము ఈతడు ఒక్కడే వున్నాడు. అందువలన అతడే లోక పరిమాణములను తెలుసుకో దగినటువంటి సూత్రములు (తంతువులను) నిర్మించినాడు. ఆ దేవాంగుడే విశ్వకర్మకు లోక పరిమాణమును నిర్ధారించుటకు అవసరమైన సూత్రములను ఇచ్చినాడు. దేవతలకు యజ్ఞోపవీతములను, వస్త్రములను ఇచ్చినాడు. అందువలన దేవతలందరు దేవలునికి నమస్కరించుచున్నారు. ఈ దేవలబ్రహ్మయే అగ్నిని సృష్టించెను. ఈలోకములనుసృష్టించెను, ఇంద్రుడుని సృష్టించినాడు. వాయువును జనింపజేసినాడు. అన్నమును సృష్టించినది దేవలుడే. అన్నము దేవల స్వరూపమై యున్నది. అన్నమును భుజించువాడు దేవలుడే. అతడే చంద్రుడు, నక్షత్రములై పగలు రాత్రులు అయివున్నాడు. స్వర్గలోకము, ఆకాశము పదిదిక్కులను అతడే అయివున్నాడు. సర్వ దిక్కులను రక్షించువాడు అతడే. మనలందరిని కాపాడువాడు దేవలుడు. అతడు సచ్చిదానందమయుడై వున్నాడు. అని సామవేదముతెలుపుచున్నది.



## సరస్వతీదేవి వీణకు నూరు తంతువులను ఇచ్చిన దేవలుడు

తత్త్వ సారోపనిషత్ ప్రమాణము.

**శ్రుతి: సదేవలో బ్రాహ్మవీణాయై శతతంతు దాతా సశుచి**
**ర్భవతు సూత్రదాతా స బ్రహ్మ భవతి సవిచార్యః**
**తస్య సూత్రాదన్న ప్రాణో మన శ్చక్షు శ్రోత్ర మజీజ**
**నత్. తత్స్వరూపం జగత్, స ఆత్మా తత్సత్యం, తంతో**
**ర్వాలఖిల్వా అజాయంత, తై బ్రాహ్మణ్యం, స వైవిశ్వరూ**
**పో, నదివా నరాత్రి ర్నద్యోః ననక్షత్రాణి ననభోన దిశః**
**కేవలం సూత్రాత్మా సర్వం దేవలో, దేవతాస్సర్వే దేవ**
**లం ప్రవిశంతి, స రుద్రాంతర్యా మ్యోంకార రూపః,**
**సర్వభూతాంతరాత్మా అపహత పాప్మా. యదక్షర మిదం**
**బ్రహ్మ తత్సూత్రం జ్ఞానదాయకం, సూచనాత్సూత్రమి**
**త్యాహు స్సూత్ర వై పరమంపదం, తత్సూత్రం విదితం**
**యేన సయోగీ నాత్ర సంశయః ఏకో దేవస్సర్వభూతే**
**షుగూఢః, సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా, కర్మాధ్య**
**క్ష స్సర్వ భూతాధివాసః సాక్షీ చేతో దేవలో సూత్ర**
**రూపః ఇతి తత్త్వసారోపనిష ద్దర్శనాత్.**

తా॥ ఆ దేవలుడు సరస్వతీ దేవి యొక్క వీణకు నూరు(100) తంతువులను ఇచ్చినాడు. శుచిర్భూతుడును సూత్రములను ఇచ్చిన వాడును అయిన ఆదేవలుడే బ్రహ్మస్వరూపుడు. ఈతడిని తత్త్వార్ధముల పరిశీలన వలన తెలుసుకొనగలము. అతని సూత్రముల వలననే అన్న ప్రాణములును, మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అగు అంతఃకరణములును నేత్రములు, చెవులు మొదలగు ఇంద్రియములు ఏర్పడినవి. సర్వలోకములు దేవల స్వరూపమే. ఆతడే ఆత్మమయుడు. ఇదిసత్యము. ఆతనిసూత్రముల వలననే వాలఖిల్యాది మహర్షులు జన్మించినారు. ఆ సూత్రముల చేతనే బ్రాహ్మణ్యము కలుగును. కాబట్టి దేవలబ్రహ్మయే విశ్వమయుడు. పగలు రాత్రులు, స్వర్గ ఆకాశములు, సర్వదిక్కులు నక్షత్రములే గాక సర్వము తానే అగుచు సూత్రాత్ముడై వెలుగొందుచున్నాడు దేవలబ్రహ్మము. దేవతలందరు దేవలబ్రహ్మము నందు లీనమౌదురు. దేవలుడే రుద్రునియందు అంతర్యామియై తేజోరూపముతో ప్రకాశించుచున్నాడు. అతడే ఓంకార స్వరూపుడు. దోషరహితుడు. సర్వభూతములయందు అంతరాత్మకుడై ప్రకాశించుచుండును. ఏది నాశరహితమై అఖండాత్మకమైన పరబ్రహ్మమో అదియే సూత్రాత్మక మైనదియును, జ్ఞానరూపముగను,

అయివున్నది. అది అఖండ ఆనంద పరిపూర్ణ బ్రహ్మముగా భాసించుట వలననే బ్రహ్మజ్ఞానులు దానిని సూత్రము అని చెప్పుచున్నారు. ఆసూత్రమే పరమపదము. దానిని తెలుసుకొనిన వాడు యోగీంద్రుడు అగును. ఇందుకు సందేహము లేదు. సూత్ర స్వరూపుడైన దేవలుడు ఒక్కడే పరమాత్మ అగును. సమస్త భూతముల యందు అంతరాత్మగను, సమస్త కార్యములకు నియామకుడుగాను అగుచున్నాడు. ఈవిధముగా దేవలబ్రహ్మ సర్వమును తానేఅయి దేనినీ అంటక సర్వాతీతుడు అగుచు సర్వసాక్షియై విలసిల్లుచున్నాడు. అని తత్త్వసారోపనిషత్తు తెలుపుచున్నది.

## వేద వాఙ్మయము

వేదోక్త మూలస్తంభనము ప్రమాణము.

**మూల : అథఖలు ఋగ్వేదాది విభాగేన వేదా శ్చత్వారః**
**తత్రైక వింశతి శాఖాఋచః. సవాధికశత శాఖాయజుషః.**
**సహస్ర శాఖా స్సామ్నః. పంచాశచ్ఛాఖా అధర్వ**
**ణస్య. ఏకైకశాఖయా ఏకైకోపనిషత్. ఆహత్యాశీతి**
**సహిత శతాధిక సహస్ర సంఖ్యాకా ఉపనిషదః. తాసు**
**శ్రీరామచంద్రేణ సారతరోపనిషదః. అష్టోత్తరశత**
**సంఖ్యాకా వాయు సూనవే ఉపదిష్టాః.**

తా॥ ఋగ్వేద యజుర్వేద సామవేద అధర్వణ వేదములు అని వేదములు నాలుగు విభాగములుగా ఏర్పడినవి. ఋగ్వేదమునందు 21 శాఖలున్నవి. యజుర్వేదమునందు 109 శాఖలున్నవి. సామవేదమునకు 1000 శాఖలున్నవి.అధర్వణ వేదమునకు 50 శాఖలున్నవి. ఒక్కొక్క శాఖకు ఒక్కొక్క ఉపనిషత్తు వున్నది. మొత్తం 1180 ఉపనిషత్తులు ఏర్పడినవి. వానియందు మిక్కిలి సారమైనటువంటివి 108
ఉప నిషత్తులుగా పేర్కొనబడినవి. ఈ 108 ఉపనిషత్తులను శ్రీరాములవారు ఆంజనేయస్వామికి ఉపదేశించినాడు. శ్రీరామచంద్రుడు ఆంజనేయస్వామికి ఉపదేశించిన 108 ఉపనిషత్తులకు ఒకొక్క ఉపనిషత్తుకు మరల ఒకొక్క ఉపనిషత్తులున్నవి. ఈ వేదోక్త మూలస్తంభనము నందు దేవలబ్రహ్మ ప్రతిపాదక మగునవి మహోపనిషత్తు, నిరాలంబోపనిషత్తు, జాబాలోపనిషత్తు, ముండకోపనిషత్తు, కఠోపనిషత్తు లనుండి ప్రమాణములు చూపబడి యున్నవి. ఈ మహోపనిషత్తు మొదలగు ఉపనిషత్తులు శ్రీరామచంద్రునిచే వాయు పుత్రునకు బోధించిన ఉపనిషత్తులు కావు.ఇవి ఆ ఉపనిషత్తులకు చెందిన ఉప ఉపనిషత్తులని తెలియవలయును. ఏ విధముగా అనగా ఉప మహోపనిషత్తును ఉప



నిరాలంబోపనిషత్తుగను, ఉప జాబాలోపనిషత్తుగను ఉప ముండకోపనిషత్తుగను, ఉప కఠోపనిషత్తుగను తెలియవలయును.

ఈవిషయమున విద్యారణ్య విరచిత సర్వోపనిష త్సార సంగ్రహ ప్రమాణము.

**శ్లో॥ ఋగ్వేదాది విభాగేన వేదాశ్చత్వార ఈరితాః**
**ఏక వింశతి సంఖ్యాక శాఖా స్తత్ర ఋచస్మృతాః**
**నవాధిక శతం శాఖా యజుషః పరికీర్తితాః**
**సామ్నస్సహస్ర సంఖ్యాక శాఖా స్సంతి విభాగతః**
**అధర్వణస్య పంచాశ చ్ఛాఖా స్సంతి ప్రమాణతః**
**ఏకైకస్యాశ్చ శాఖాయా ఏకైకోపనిషత్ స్మృతా**
**అశీత్యు త్తరశ తేనయుక్తా సాహస్ర సంఖ్యయా**
**విద్యంతే త్రోపనిషద శ్శుద్ధతత్త్వార్థ బోధకాః**
**తత్రా చాష్టోత్తరశత సంఖ్యాకా వాయుసూనవే**
**ప్రోక్తం శ్రీరామచంద్రేణ సాక్షా త్స ద్వస్తు సిద్ధయే**
**ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్య తి త్తిరిః**
**ఐతిరీయంచ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ**
**జాబాలం సర్వసారంచ నిరాలంబం మహ శ్శుకం**
**అద్వ యావ్యక్త శారీర భావ నాధ్యాత్మకం దశ**
**ఆసు ముండక జాబాల నిరాలంబ కఠో మహః**
**ఏతా వదంతి చిన్మాత్ర పరబ్రహ్మ స్వరూపకం**
**ఆసా ముపోపనిషదః దేవలబ్రహ్మ బోధకాః**
**దేవల బ్రహ్మ మాహాత్మ్యం యన్నిర్గుణ నిరామయం**
**తద్దేవలో పనిషది నామ శాఖీయ కే స్ఫుటం**
**దేవాంగస్యతు సూత్రాది నిర్మాణం తాత్త్వి కే స్ఫుటం**
**సూత్ర వస్త్ర ప్రదానాది చరితందేశికే స్ఫుటం**
**సప్తావతారచరితం విద్యతే వేదసారకే.**

తా॥ వేదములు ఋగ్వేదము, యజుర్వేదము,సామవేదము,అధర్వణవేదము, అనెడు భాగములచేత నాలుగుగా ఏర్పడినవి. వానియందు ఋగ్వేదము నందు 21శాఖలును, యజుర్వేదమునందు 109శాఖలును, సామవేదమునందు 1000 శాఖలును, అధర్వణ వేదమునందు 50 శాఖలు గలవు. ఇవి మొత్తం 1180 శాఖలుగా వున్నవి. ఈ ఉపనిషత్తు అన్నియు శుద్ధతత్త్వార్థములను బోధించుచున్నవి. వీనియంఘు 108 ఉపనిషత్తులును, ఈశావాస్య, కేన, కఠ, ప్రశ్న, ముండక,

మాండూక్య, తైత్తిరీ, మైతిరీయ ఛాందోగ్య బృహదారణ్యకము అను పది ఉపనిషత్తులను పూర్వ దశోపనిషత్తులు అని అందురు. జాబాల, సర్వసార, నిరాలంబ, మహత్, శుకరహస్య, అద్వయ, అవ్యక్త శారీరీక భావన ఆధ్యాత్మకము లనెడు పది ఉత్తర ఉపనిషత్తులు అని అందురు. ఈ విధముగ పూర్వ ఉత్తరములయిన ఇరువది ఉపనిషత్తులలో చేరిన ముండక, జాబాల నిరాలంబ కఠ మహోపనిషత్తులు ఐదును చిన్మాత్ర పరబ్రహ్మ బోధకములు అగును. ఈ ఐదు ఉపనిషత్తులకు ఉపోపనిషత్తులయిన ఉపముండక, ఉపజాబాల, ఉపనిరాలంబ, ఉపకఠ ఉపహోపనిషత్తులు దేవల బ్రహ్మను గురించి బోధించుచుండును. అంతేగాకుండా నిర్గుణ నిరామయ బ్రహ్మము అగు దేవలబ్రహ్మముయొక్క మాహాత్మ్యము సామవేద శాఖలతో చేరిన దేవలోపనిషత్తునందు చెప్పబడినది. దేవాంగునియొక్క సూత్రవస్త్రాదిక నిర్మాణ చారిత్రమును తాత్వికోపనిషత్తు విపులముగా తెలియజేయుచున్నది. దేవాంగుని సప్తావతార చరిత్రమును వేదసారోపనిషత్తు తెలియజేయుచున్నది. ఈ విధముగ విద్యారణ్య స్వాములవారు తాను రచించిన సర్వోపనిషత్సార సంగ్రహమునందు వ్రాసినారు.

## దేవాంగ స్వరూపము

ఆగ్నేయపురాణాంతర్గత దేవాంగ ప్రభావము

**ఋషయః:- సూతసూత మహాప్రాజ్ఞ కోయం దేవాంగ సంజ్ఞికః**
**అస్మాకం వద శీఘ్రం త దిత్యూచు సేమహాయశాః.**

తా॥ శౌనకాది మహర్షులు సుప్రసిద్ధుడైన సూత మహర్షిని గాంచి ఓ మహా ప్రాజ్ఞుడా! దేవాంగుడు అను పేరుగల వాడు ఎవ్వడు? ఆతనికి సంబంధించిన విషయమంతయు తెలుసుకొన వలయునని మిక్కిలి ఆసక్తితో వున్నాము. కావున దయతో ఆదేవాంగుని గురించి సవివరముగా తెలియ పరచవలెను అని ప్రార్థించినారు.

**సూతః- పురాతు పార్వతీనాథం నమస్కృత్య చ షణ్ముఖః**
**దేవాంగస్య స్వరూపం మే వక్తవ్య మితి చాబ్రవీత్.**

తా॥ పూర్వకాలము ఒకానొకప్పుడు కుమారస్వామి దేవాంగ స్వరూపమును గూర్చి తెలుసుకొనుట కొరకై పార్వతీ నాధుడైన పరమేశ్వరుని సమీపించి నమస్కరించి నాకు దేవాంగుని స్వరూపమును తెలియ చేయవలయునని అడిగినాడు. అప్పుడు పార్వతీ నాధుడు షణ్ముఖునకు లెలిపిన విధానమంతయు మీకు తెలిపెదను వినుము అనిశౌనకాది మహర్షులతో సూత పౌరాణికుడు ఇట్లు అనెను.



**శ్లో॥ శ్రుణు షణ్ముఖ సర్వజ్ఞ దేవాంగస్య స్వరూపకః**
**స సర్వ కార్యకర్తాచ సచ సూత్రాత్మక ప్రభుః**

**శ్లో॥ న పంచపంచత త్త్వస్థః న దివారాత్రి తారకః**
**న బ్రహ్మ విష్ణు రుద్రాశ్చ న నవగ్రహ సంకులమ్.**

**శ్లో॥ కింతు బ్రహ్మస్వరూపశ్చ దేవాంగోజ్యోతి రుచ్యతే**
**త జ్జ్యోతి స్తు స్వయం భాతి స్వేతరై ర్న ప్రకాశతే.**

తా॥ సర్వము తెలిసిన వాడవైన ఓ షణ్ముఖుడా! దేవాంగ మహాత్మ్యము నీకు తెలియ జేయుచున్నాను వినుము. ఈ చతుర్దశ భువనముల యందు సకలకార్యములకు అధినాధుడును, లోకేశ్వరుడును, సూత్ర స్వరూపకుడు దేవలబ్రహ్మ అని తెలుసుకొనుము. ఆదేవలబ్రహ్మ 25 తత్త్వములతో కూడియుండిన వాడు కాదు. పగలు రాత్రులు, నక్షత్రములును కాదు. బ్రహ్మ విష్ణుమహేశ్వరుడుకాదు. నవగ్రహముల సముదాయముకాదు. మరి ఆదేవలుడు పరబ్రహ్మ స్వరూపుడు చిజ్జ్యోతి అనగా పరంజ్యోతి స్వరూపుడు అని తెలుపబడు చున్నాడు. ఈ చిజ్జ్యోతి తనఅంతట తానే ప్రకాశించు చున్నది. ఇతరుల చేతగాని, ఇతరములైన దానిచేతగాని ప్రకాశింప బడుటలేదు. స్వయంభువై వెలుగొందు చున్నాడు దేవలుడు.

**శ్లో॥ స్వయంభు ర్దేవదేవేశః పరంజ్యోతి స్సదా శుచిః**
**నిరాకార స్వరూపశ్చ సర్వసాక్షి నిరామయః.**

తా॥ తనంతట తానే పుట్టినవాడు, దేవతలకు దేవుడు, పరంజ్యోతి స్వరూపుడు, నిత్యము నిర్మలముగా నుండువాడు, సర్వ వ్యాపియు అయి దేనిని అంటకుండా వుండువాడు, సర్వసాక్షిగ విలసిల్లువాడు, అఖండపరిపూర్ణ చిజ్జ్యోతిగ వెలుగొందువాడు దేవల పరబ్రహ్మము మాత్రమే.

**శ్లో॥ ఓ మిత్యే కాక్షరం బ్రహ్మ దేవాంగోభాసతే సదా**
**స సూత్రాత్మా పరబ్రహ్మ ప్రపంచం స్రష్టు మైచ్ఛత.**

తా॥ దేవాంగుడే ఓంకారమనే ఏకాక్షరమునకు స్వరూపము గల పరబ్రహ్మయై అఖండ పరిపూర్ణానందముతో నిరంతరము చిజ్జ్యోతి రూపముతో వెలుగుచున్నాడు. ఈతడే సూత్ర స్వరూపుడై పరబ్రహ్మ స్వరూపముతో ప్రపంచోత్పత్తి గావింప సంకల్పించినాడు.

**శ్లో॥ తే నాహం జనితః ప్రాజ్ఞ మాయయా సహిత స్సదా**
**జగద్రూపిణి దేవాంగే తస్మిన్ సర్వం ప్రతిష్ఠితమ్.**

తా॥ విజ్ఞాన సంపన్నుడవైన ఓ షణ్ముఖ కుమారా! ఆ దేవల బ్రహ్మయొక్క సంకల్ప రూపమైన మాయవలన నేను పుట్టితిని. ప్రపంచ స్వరూపుడు అయిన ఆ దేవల బ్రహ్మ యందే స్థావర జంగమ రూపము అయిన ఈ చరాచర ప్రపంచము నందలి సకల జీవకోటి జడపదార్ధములతో కూడి ఎల్లప్పుడు నిలచియుండును. ఈ చతుర్దశ భువనముల యందంతటను వ్యాపించి వున్నది దేవాంగ స్వరూపమే అని లెలుసుకొన వలయును అని ఈశ్వరుడు చెప్పినాడు.

**శ్లో॥ ఆవయో రంతరం నా స్తి భ్రాంత్యా భేదః ప్రకల్పితః**
**చిన్మయే కల్పితో భేదః రజ్జౌ సర్ప మతిర్యథా.**

**శ్లో॥ అపాద మస్తకం ప్రాపుః భువనాని చతుర్దశ**
**పాదౌ తస్యతు పాతాళం పాదోర్ధ్వంతు మహాతలం**
**రసాలంచ జంఘేతు జానుమశ్చాపి తలాతలం**
**ఊరుద్వయంతు సుతలం వితలం గుహ్యా భాగకం**
**అతలం కటిబంధేతు లోకా స్సప్త యథాక్రమం**
**అథోభాగేతు వర్తంతే ఊర్ధ్వ లో కాధ కీర్తితాః.**

తా॥ విజ్ఞాన సంపన్నుడ వైన కుమారా! ఓ కుమారస్వామీ వినుము. నాకును, దేవాంగునకును ఎటువంటి భేదములేదు. భ్రమ వలననే భేదము కలుగును. మేమిద్దరము నిరంజన పరంజ్యోతి స్వరూపమైన దేవల పరబ్రహ్మముచే జన్మించిన వారము. అందువలన మాఇద్దరి స్వరూపము దేవల పరబ్రహ్మ స్వరూపముతో నిండి వుండును. కాని భ్రాంతి చెందినవారు త్రాడును సర్పమని ఎట్లు భావించెదరో అదే విధముగా మాఇద్దరిమధ్య భేదమును చూచెదరు. కాని నిజానికి నాకు, దేవాంగునికి ఎటువంటి భేదము లేదు.

ఆ పరబ్రహ్మ యొక్క పాదములు మొదలు శిరస్సు పర్యంతం పదునాలుగు లోకములు వ్యాపించి వున్నవి. పాదములు పాతాళ లోకమును, పాదముల యొక్క మీది భాగము మహాతల లోకమును, పిక్కలు రసాతల లోకమును, మోకాళ్ళు తలాతల లోకమును, రెండు తొడలు సుతల లోకమును, గ్రుహ్య ప్రదేశము వితల లోకమును, మొల యందు అతల లోకమును, అను ఏడు లోకములయందు యధా క్రమముగా వ్యాపించి వున్నాడు. దేవాంగుని శరీరము నందలి అధో భాగము చతుర్దశ భువనాల యందు అదో లోకాలను సూచించుచున్నది. దేవాంగుని ఊర్ధ్వ శరీర భాగములు ఊర్ధ్వ లోకములను ఈ విధముగా సూచించును. దేవాంగుని యొక్క ఉదరమధ్య భాగము భూలోకముగాను, నాభి (బొడ్డు) నందు భువర్లోకమును, హృదయమునందు సువర్లోకమును, గళము (గొంతు) మహర్లోకముగను, నోరు



జనలోకముగను ముఖ భాగము తపోలోకముగను, శిరస్సు సత్యలోకముగను, ప్రవర్తించుచున్నవి. కావున దేవలుని శరీరము యావత్తు చతుర్దశ భువనాలుగా విస్తరింప బడినది. దేవలుని శరీరమే చతుర్దశ భువనాలు. ఈ చతుర్దశ భువనాలయందు దేవలునిది కానిది ఏదియును లేదు. సర్వం దేవాంగ మయమే.

**శ్లో॥ భూలో కోదర మధ్యేతు భువర్లోకస్తు నాభిషు**
**సువర్లోకస్తు హృదయం మహర్లోకో గళ స్తథా**
**జనర్లోక స్తథో వాచి తపోలోకే లలాటకే**
**సత్య లోకస్తు మూర్ధ్వాస్య భువనాని చతుర్దశ**
**ఏవం తద్దేహ మధ్యేతు వ ర్తంతే తా న్యథాక్రమమ్.**

తా॥ ఆ దేవలబ్రహ్మ యొక్క ఉదర మధ్యలో భూలోకము, నాభి ప్రదేశము భువర్లోకము, హృదయమునందు సువర్లోకము, కంఠమునందు మహర్లోకము, వాక్ స్థానమైన నోరునందు జనలోకము, లలాటము నందు తపోలోకము, శిరస్సు నందు సత్యలోకము ఈ విధముగా పదునాలుగు లోకములు అశరీరము నందు వరుస క్రమముగ వ్యాపించి యున్నవి.

## చాతుర్వర్ణ వ్యవస్థ ఏర్పరుచుట

**శ్లో॥ చంద్రోస్య మనసోజాతః చక్షో స్సూర్యో హ్యజాయత**
**ముఖా దగ్ని ర్మను శ్చాపి ప్రాణా ద్వాయు రజాయత.**

**శ్లో ॥ పద్భ్యాం భూమి ర్దిశశ్శ్రోత్రా త్తథా లోకానుకల్పితం**
**నాభ్యాతు హ్యంతరిక్షంచ శిర్ష్ణో ర్ద్యౌ స్సమవర్తత**
**ఈశకోటి స్తదోత్పన్నా జీవకోటి స్తథైవచ**
**సర్వేషాంమూల భూతోయం దేవాంగో దేవపూజితః**

తా॥ ఆ దేవాంగ బ్రహ్మ మనస్సు వలన చంద్రుడు పుట్టినాడు. నేత్రముల వలన సూర్యుడు పుట్టినాడు. ముఖమునుండి అగ్నిహోత్రుడును, మను బ్రహ్మయు జన్మించిరి. దేవాంగ బ్రహ్మ యొక్క ప్రాణమునుండి వాయువు పుట్టినది. ఆతని పాదముల వలన భూమి పుట్టినది. చెవుల వలన దిక్కులు, లోకములు పుట్టినవి. బొడ్డునుండి ఆకాశము పుట్టినది. శిరస్సు నుండి స్వర్గ లోకము పుట్టినది. ఆ విధముగానే ఆయా లోకములయందు నివసింప దగిన ప్రాణ సమూహములు, అట్టి ప్రాణ సమూహమునకు రక్షణ కొరకు ప్రభువుల సముదాయము పుట్టినవి. కావున సమస్తమునకును మూలకారణ భూతుడు దేవల బ్రహ్మయే. సర్వ దేవతల

చేత సేవింప బడుచున్నాడు దేవలబ్రహ్మ.

## శ్రీ గురువు దేవాంగ బ్రహ్మయే

**శ్లో ॥ బ్రాహ్మణో మునిజాతౌతు దేవజాతౌతు క్షత్రియాః**
**వైశ్యోహ్య ప్సరజాతౌతు శూద్రో వై యక్షజాతిజః**
**చాతుర్వ ర్ణోపదేశేతు కారణం త్వగ్ని మా మనుః**
**సర్వేషాంతుగురుస్సాక్షాత్ దేవాంగో బ్రహ్మసూత్రకః.**

తా॥ దేవల సృష్టియైన ఈ జగంబునందు మునికులము వలన బ్రాహ్మణులును, దేవతల కులము వలన క్షత్రియులును, అప్సరస కులము వలన వైశ్యులును , యక్షుల జాతి వలన శూద్రులును కలిగిరి. యజ్ఞోపవీతమునకు అధికారమును, మరియు యజ్ఞములకు ఆధార భూతుడైన అగ్ని మా మనువు అయిన దేవలబ్రహ్మ మే చాతుర్వర్ణముల వారికి తత్త్వోప దేశకర్త అగుటచేత ఆతడే లోకము లకు సాక్షాత్ మహదాచార్యుడు అగుచున్నాడు. అనగా ఈ జగత్తులన్నింట వుండు వారందరికి తొట్ట తొలి గురువు దేవల బ్రహ్మయే అగుచున్నాడు. ఈతడే ప్రప్రథమ మరియు ప్రధాన గురువు అయివున్నాడు. అందువలన శ్రీ గురువు దేవలుడే.

**శ్లో॥ గురుబ్రహ్మ గురుర్విష్ణుః గురుదేవో మహేశ్వరః**
**గురు సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః**

తా॥ బ్రహ్మ దేవుడును గురువే, విష్ణుమూర్తియు గురువే, మహేశ్వరుడును గురువే ఈ ముగ్గురికి గురువైనటువంటి వాడిని పరబ్రహ్మ అని పిలుస్తారు. ఈ పరబ్రహ్మను శ్రీ గురువు అని పిలుస్తారు.కావున దేవల పరబ్రహ్మమే శ్రీగురువు అయినాడు. అందువలన శ్రీ గురువైన దేవల మనుబ్రహ్మమే యజ్ఞోపవీతమును ప్రసాదించుటకు అధికారియై యున్నాడు.

**శ్లో॥ ఏవం మూ ర్తిధరః కల్పే లోకానాం హితకామ్యయా**
**గురు ర్గురూ త్తమ శ్చైవ దేవాంగ సూత్ర ధారకః.**

తా॥ సమస్త లోకములకు సూత్ర ధారియును, మహదా చార్యుడును అయిన దేవలబ్రహ్మ సర్వ లోకములకు మేలు కలుగచేయు ఆలోచన కలిగివుండి ప్రతికల్పము నందు అనగా 432 కోట్ల సౌర సంవత్సరాల కాలము మానవులకు ఒక కల్పము అగును. దేవతలకు 155520,00,00,000 మానవ సౌరసంవత్సర కాలము దేవతలకు ఒక కల్పకాలమగును. మానవునికి ఒక సంవత్సర కాలము దేవతలకు ఒక రోజుతో సమానము. ఆ విధముగా మానవ కల్పకాలము నందును



దేవతల కల్పకాలము నందును దేవలబ్రహ్మమూర్తి రూపము అనగా పురుషరూపమును పొంది త్రిమూర్తులకు తగిన సూచనలు ఇచ్చుచుండును.

## జగద్గురువుగా దేవల పరబ్రహ్మ

**శ్లో॥ జటా మేఖల కౌపీనో భస్మాంగో బ్రహ్మ సూత్రకః**
**పవిత్ర మక్షమాలాంచ క మండలు ధర శ్శుచిః**
**శివముద్రాంకిత ధర శ్శోభమాన స్సురార్చితః**
**సర్వోపదేశ కర్తాచ సర్వ భూత హితే రతః**
**సర్వకార్య ప్రకర్తాచ తథా సూత్రాత్మక ప్రభుః**
**అంతరంగే తు హ్యా త్మాసౌ బహిరంగే జగద్గురుః**
**సాయుజ్యే తారక బ్రహ్మ దేవాంగో జ్యోతి రుచ్యతే.**

తా॥ ఆ దేవాంగుడు జడలను, మొలనూలును, కౌపీనమును (గోచి) ధరించి విభూతిని శరీరమునకు పూసుకొని యజ్ఞోప వీతముతోను, ధర్మ ముద్రికను వ్రేళ్ళకు ధరించి , జపమాలను, కమండలము (జలకుండి) ను ధరించిన మహా శుచిమంతుడై పవిత్రుడై వుండి శివుడు ధరించు నటువంటి త్రిపుండ ధారణ, త్రిశూల ధారణ రుద్రాక్ష ధారణ చేసి ప్రకాశ మానముగా వుండి దేవతలచే పూజింపబడువాడై సకల జనులు జాతులకు తత్త్వార్ధములను బోధించువాడై, సర్వ భూతములకు (ప్రాణులకు) హితము కలిగించుటయందు ఆసక్తి కలిగిన వాడై సమస్త కార్యములకు ఆధారభూతుడై సూత్ర స్వరూపుడై సకల లోకములకు అధినాయకుడై సకల సృష్టి అంతరంగమందు జీవాత్మగను, బహిరంగమందు జగద్గురువు గను సాయుజ్యమందు తారక బ్రహ్మ గను పరమాత్మయై అఖంద పరిపూర్ణ పరంజ్యోతిగా దేవలుడు అని చెప్పబడుచున్నాడు.

**శ్లో॥ మూ ర్తి త్రయ స్వరూపోయం దేవాంగ స్సూత్ర ధారకః**
**ఓమి త్యేకాక్షరం బ్రహ్మం వాచ్యకో భాస తేస్వయం**
**ప్రణవో బీజరూపస్తు పరమాత్మా సదాశివః.**

తా॥ బ్రహ్మ విష్ణు మహేశ్వరులగు త్రిమూర్తుల స్వరూపము గలవాడును, యజ్ఞోపవీతమును ధరించి ఆవిర్భవించిన వాడును, ఓంకారమే నాశరహితమైన పరబ్రహ్మము అనెడు అర్ధములు ఇచ్చునటు వంటి మహా వాక్యములచేత తెలుసుకో దగినవాడును, ఓంకార స్వరూపుడై వుండి సమస్త లోకముల ఉత్పత్తికి ఆధారభూతమైన బీజరూపమున వుండువాడును, అగు పరబ్రహ్మమును , సదాశివుడును అయిన ఈ దేవాంగుడు తనకు తాను గానే ప్రకాశించు చున్నాడు.

**శ్లో॥ ఆత్మ త్రయ స్వరూపేణ ఆదిశక్తి సమన్వితః**

స్వయంభు ర్దేవ దేవేశః దేవాంగో దివ్య మూ ర్తిభాక్.

తా॥ తనంతట తానుగా పుట్టి చిచ్ఛక్తితో కూడియుండి దేవతలకు దేవదేవుడు అగు దేవలబ్రహ్మ జీవాత్మ, పరమాత్మ, అంతరాత్మల తోడ దివ్య స్వరూపముతో తేజో మూర్తియై సమస్త జీవరాశులయందు, లోకముల యందు ప్రకాశించు చున్నాడు.

శ్లో॥ గుణత్రయాత్మ కో జ్ఞాన స్వరూపో భాసతే గురుః
చంద్రకోటి ప్రతీకాశః సూర్యకోటి సమప్రభః
శుద్ధో మాయాసమాయు క్తస్సూ త్రా దీన్ నిర్మ మేపురా
తాని సూత్రాణి దేవేభ్యః ప్రదదౌ కరుణానిధిః

తా॥ రజ స్తత్వ తమోగుణ స్వరూపుడును జ్ఞానకారుడును జగదాచార్యుడును అగు దేవాంగ మనువు కోటి చంద్రుల వలె ప్రకాశించు చుండెను. కోటిసూర్యులతో సమమైన కాంతిగలవాడుగా ప్రకాశించు చుండెను. యోగమాయతో కూడి పరిశు ద్ధుడై వుండిన కరణానిది యైన దేవల మనువు సూత్ర వస్త్రములను పూర్వమే నిర్మించి బ్రహ్మాది దేవతల కొరకు ఇచ్చినాడు.

శో॥ తథా సత్వగుణే నాసౌ దేవాంగో దేవవందితః
సహస్రారం ప్రవిశ్యా స్య శివస్య పరమాత్మనః
శుకాది మునిబృందస్య బ్రహ్మావిద్యా ప్రదాయకః
దక్షిణామూర్తి రూపేణ పరాపర మహౌజసా
జ్ఞానముద్రాం చాక్షమాలాం దదానో జగదీశ్వరః
శుద్ధ జ్ఞాన ప్రదాతాభూత్ తథా తామస సంయుతః
బ్రహ్మణా సృష్టమఖిలం కురుతే హి జగల్లయః.

తా॥ దేవదేవతలచే పూజింపబడువాడును సర్వలోకేశ్వరుడును అయిన ఆ దేవాంగబ్రహ్మ శుకాది మహర్షులకు బ్రహ్మ విద్యను బోధించాలని సంకల్పించుకొనినాడు. సత్వగుణ విశిష్టుడై పరమాత్ముడగు సదాశివుని సహస్రార పద్మంబున ప్రవేశించి అందుండి దివ్యతేజోసంపన్నమైన దక్షిణామూర్తి రూపముతోడ జ్ఞానముద్రతోకూడి జపమాలికను ధరించి శుకాది మహర్షులకు శుద్ధ జ్ఞానోపదేశము చేసినాడు. ఈ విధంగా ఆత్మజ్ఞాన సంబంధమైన బ్రహ్మ విద్యను తొలిసారిగా దేవాంగబ్రహ్మ శుకాది మహర్షులకు బోధించి లోకాలకు విద్యను వెల్లడి చేసినాడు. తామసగుణ విశిష్టుడైన శంకరునియందు వెలుగుచు బ్రహ్మ నిర్మితమైన సమస్త లోకములను లయము చేయుచుండును.



## గాయత్రీదేవి మూడుపాదములతో ఉండుట

షణ్ముఖః. దేవదేవ మహాప్రాజ్ఞవద మే కరుణాకర
యజ్ఞోపవీత మాహాత్మ్యం దేవాంగబ్రహ్మణో ముదా.
శివః. తంతు త్రయేణ సంయుక్త ముపవీతం ప్రకల్పితం
గాయత్రీ త్రిపదా సాతు దేవాంగే నైవ నిర్మితా
వదామి తస్య మానంతు శ్రుణు షణ్ముఖ సాదరమ్.

తా॥ అనంతరము కుమారస్వామి శంకరునిగాంచి ఓ దేవదేవేశ్వరా! మహావిజ్ఞాన సంపన్నుడయినవాడా! కారుణ్యనిధీ, దేవాంగ బ్రహ్మచే నిర్మితమైన యజ్ఞోపవీతముయొక్క మాహాత్మ్యమును సంతోషముతో నాకు తెలియపరచవలయును అని ప్రార్థించగా అప్పుడు శంకరుడు కుమారస్వామిని గాంచి ఓ షణ్ముఖుడా, యజ్ఞోపవీతము మూడు తంతువులతో కూడినట్లు కల్పించబడినది. దీనికి అధిష్టానదేవత గాయత్రీదేవి. ఈ దేవతకూడా మూడు పాదములతో కూడివుండు విధముగా దేవాంగబ్రహ్మచేతనే సృష్టించబడినది. అటువంటి దివ్యశక్తినిచ్చు పరమపావనకరమైన యజ్ఞోపవీతముయొక్క ప్రమాణమును తెలియపరచెదను. శ్రద్ధతో వినుము అని శంకరుడు చెప్పుట ప్రారంభించినాడు.

శో॥ దేవదేవో మహాప్రాజ్ఞో దేవాంగో దేవపూజితః
గాయత్రీం మందగమనాం దృష్ట్వా కరుణయా తదా
చకార త్రిపదాందేవీం దేవేశో జగదీశ్వరమ్.

తా॥ దేవతలకు దేవుడును, మహద్విజ్ఞాన సంపన్నుడును, దేవతలచేత పూజింపబడువాడును, సమస్త దేవతలకు అధినాధుడును అగుదేవాంగబ్రహ్మ, మందగమనము నడకగలదియును, తేజోరూపిణియును, లోకనాయకీ అయిన గాయత్రీదేవిని కారుణ్యముతోగాంచి ఆ గాయత్రీదేవిని మూడు పాదములుగా వుండు విధముగా చేసి సూత్రములుగా నుండు యజ్ఞోపవీతమునకు అధిష్టాన దేవతగా చేసినాడు దేవాంగ బ్రహ్మ.

## బ్రాహ్మణుల యజ్ఞోపవీతమునందు అధించి ఉండుమని గాయత్రీదేవిని ఆదేశించిన దేవాంగ బ్రహ్మ

శ్లో॥ తత స్తాం త్రి పదాం దేవీం దృష్ట్వా ప్రోవాచ దేవలః
దేవి త్వం భువనం గత్వా యేతు బ్రహ్మకులోద్భవాః
తేషాం బ్రాహ్మణ్య సిద్ధ్యర్థం సూత్ర రూపేణ త త్తనుం
ప్రాప్య సర్వజగత్పూజ్యాన్ తాన్కు రుష్వ మదాజ్ఞయా

**తతో దేవాంగవచనం శ్రుత్వా సా పరమేశ్వరీ**
**తదాజ్ఞాం శిరసా ధృత్వా దేవాంగం ప్రత్యువాచ హ.**

తా॥ తరువాత దేవలబ్రహ్మ మూడు పాదములు గలది యైన గాయత్రీదేవిని గాంచి ఓ గాయత్రీదేవీ నా అజ్ఞ వలన నీవు భూలోకమునకు వెళ్ళుము. అచ్చట బ్రాహ్మణ కులమునందు పుట్టిన వారికి వారి బ్రాహ్మణ్యము సిద్ధించుటకు అనగా కలుగుటకు నీవు వారి శరీరముపై యజ్ఞోపవీత రూపంలో వుండి వారలను సర్వలోక పూజ్యులుగా చేయుము అని దేవలబ్రహ్మ గాయత్రీదేవికి చెప్పినాడు. వెంటనే ఆ గాయత్రీ దేవి దేవాంగ ఆజ్ఞను విని దానిని పాటించుటకు సిద్ధపడి దేవాంగ బ్రహ్మతో వినయముతో ఈ విధముగా మాట్లాడినది.

ఈ విషయమున యజుర్వేదో త్తరభాగ ప్రమాణము.

జట: **యోసౌ దేవాంగో దేవరాట్ గాయత్రీం యజ్ఞోప**
**వీతగ్ం త్రి పదాం త్రిసూత్ర మాచకార. తతోబ్రాహ్మ**
**ణానాం బ్రాహ్మణ్యార్థం యజ్ఞోపవీతం పరమం వదంతి.**

తా॥ దేవతలకు నాయకుడుగా ప్రసిద్ధి చెందిన ఆ దేవాంగుడు గాయత్రీదేవిని మూడు పాదములు గలదానినిగా చేసినాడు. తరువాత బ్రాహ్మణ్యము కొరకు బ్రాహ్మణులకు యజ్ఞోపవీతము ప్రధానమైనది అని దేవల బ్రహ్మ చెప్పినాడు.

శ్లో॥ **దేవాంగ దేవతారాధ్య సృష్టి స్థిత్యంత కారణ**
**భూలోకే విద్య తే సర్వే మనుష్యా స్స్వే నకర్మణా**
**తేషుకే బ్రాహ్మణా స్తేషాం దేహం ప్రాప్య వసా మ్యహం**
**ఇతి మే సంశయో జాతఃతన్ని వృత్తిం కురు ప్రభో.**

తా॥ దేవతల చేత పూజింపబడు వాడును, సృష్టి స్థితి లయములకు ఆధారభూతుడు అగు దేవాంగ ప్రభూ భూలోకమునందు మనుష్యులందరు తమ తమ కార్యములయందు నిమగ్నమై యుండెదరు. మరివారిలో బ్రాహ్మణులు ఎవరు? నేను ఎవరి శరీరమును ఆశ్రయించి వుండాలి అను సందేహము నాకు కలిగినది అని గాయత్రీదేవి దేవాంగ ప్రభువునకు విన్నవించినది. నాకున్న సందేహమును నివృత్తి చేయవలయును అని కోరినది.

శ్లో ॥ **స తస్యా వచనం శ్రుత్వా గాయత్ర్యా శ్రృతిసమ్మతం**
**సంతోషేణ పునః ప్రాహ దేవాంగో సౌ జగత్ప్రభుః.**

తా॥ ఆ విధముగా గాయత్రీదేవి చేత చెప్పబడిన మాటలను వినిన లోకనాయకుడు అగు దేవలబ్రహ్మ సంతోష పూర్వకముగ ఆ మహాదేవితో ఇట్లు చెప్పినాడు.



## అప్రాకృత బ్రహ్మణులు, పాకృత బ్రాహ్మణులను గురించి గాయత్రీదేవికి దేవలుడు తెలుపుట

శ్లో॥ **దేవిదేవి మహాప్రాజ్ఞి సచ్చిదానంద రూపిణి**
**ప్రీతోస్మి తవ వాక్యేన సాధుపృష్టం త్వ యాధునా**
**భూమౌ ప్రాకృతవి ప్రాణాంక్షత్రి యాణాంవిశాంత థా**
**తేషాంతత్కర్మ సిద్ధ్యర్థం సూత్రం కర్తుం మహేశ్వరి.**
**సర్వేషాం మానరక్షార్థం వస్త్రం కర్తుం తథా పురా**
**నిర్గుణో నిరహంకారో నిర్వికల్పో ప్యహం శివే**
**గుణత్ర యేణ సంయుక్తో హ్యభవం దేహసంయుతః**
**తతో దేవాంగ నామ్నాహం ప్రసిద్ధి మభజం పురా**
**సత్ర్వాం శేన మయా సృష్టా మద్వంశీయా మహాయశాః**
**తదా ప్రభుతి దేవాంగ బ్రాహ్మణా ఇతి భూతలే**
**ప్రతీతిం ప్రాప్య వర్తంతే వస్త్రసూత్ర ప్ర హేతవః**
**అప్రాకృత ద్విజా ఏతే సర్వలోక ప్రపూజితాః**

మహా ప్రజ్ఞాన సంపన్నవును, శక్తి జ్ఞానానంద స్వరూపవు అయిన ఓమహాదేవి! యుక్తి యుక్తముగ నీవు అడిగిన మాటలకు నేను పరమ సంతోషమును పొందినాను అని దేవల పరబ్రహ్మ గాయత్రీ దేవితో అన్నాడు. ఈ ప్రపంచము సృష్టికి పూర్వము నేను నిర్గుణుడను, అహంకార రహితుడను, నిర్వికల్పుడను, అనగా ఎటువంటి వికారములు లేక స్వచ్ఛముగ పవిత్రముగా వుండినాను. ఈలోకము సృష్టి జరిగిన పిమ్మట భూమియందలి ప్రాకృత బ్రాహ్మణులకు (అనగా బ్రాహ్మణత్వము వృద్ధి క్షయములు కలిగి వున్నవారు ) ప్రతిరోజు మూడుపూటలయందు సంధ్యావందనము చేయుటకును, గాయత్రీ మంత్ర జపమును చేసుకొనుటకు ఆవశ్యమైన ఉపనయన కర్మ జరుగవలెను. ఉపనయన కర్మ జరిగిన తరువాత బ్రాహ్మణునకును ద్విజత్వము కలుగును. ఉప నయనమునకు ముందు జన్మతః బ్రాహ్మణ కులమునందు జన్మించినను శూద్ర సమాను డుగనే వ్యవహరింపబడును. ఉపనమనము అయిన తరువాతనే సంధ్యా వందనము, నిత్యపూజ, గాయత్రీ మంత్రజపము మొదలగునవి ఆచరించుట వలన వారిలో బ్రాహ్మణత్వము ఏర్పడును. అనగా జ్ఞాన సంపన్నత ఏర్పడును. ఇటువంటి వారిని ద్విజులు అనెదరు. ద్విజులు అనగా రెండవసారి జన్మించిన వారు అని అర్థం. ఉపనయన కర్మ బ్రాహ్మణులకు పునర్జన్మ వంటిది. అనగా ఆధ్యాత్మిక జ్ఞాన సముపార్జనకు సింహద్వారమువంటిది ఉపనయనకర్మ. దీనిద్వార సంధ్యా వందనము,

నిత్యపూజ, గాయత్రీ జపము నిరంతరము చేయుచుండిన యెడల ఇహలోక జీవనముపై విరహము కలిగి పరలోక జ్ఞానముపై ఉత్సాహం కలిగివుందురు. అందువలన ఈ సంధ్యావందనాదుల అభ్యాసము ప్రతిరోజు త్రికరణ శుద్ధిగా చేయుచుండిన వారిలో ద్విజత్వమ వృద్ధి క్రమముగా పెంపొందును. అప్పుడు వారిలో బ్రాహ్మణత్వం అనగా ఆత్మ వివేకము ఏర్పడును. దీనినే బ్రహ్మజ్ఞానం అందురు. వేదాధ్యయనము చేయనివారిలో క్రమముగా వారిలోవున్న బ్రాహ్మణశక్తి క్షీణించుచుండును. కొన్ని దినములకు వారిలో బ్రాహ్మణత్వం పూర్తిగా నశించి శూద్రసమానులవుతారు. ఇటువంటివారు వైదిక కర్మాచరణ చేయుటకు అనర్హులగుతారు. ఈ విధముగ బ్రాహ్మణత్వము పెరుగుట, తరుగుట కలిగివున్న బ్రాహ్మణులను (ప్రాకృత బ్రాహ్మణులు అందురు.) క్షత్రియులకును, వైశ్యులకును నియమితమైన వైదిక కర్మలు చేయుటకు అధికారసిద్ధి కలిగింపగలిగిన యజ్ఞోపవీతమును నిర్మించుటకొరకును, అందరియొక్క మానములను కాపాడజాలిన వస్త్రములను నిర్మించుటకొరకు నేను (దేవలబ్రహ్మ) రజోగుణము, సత్త్వగుణము, తమోగుణములు అను మూడు గుణములు కలిగియుండి శరీరమును ధరించితిని. అట్టి దేహముతో కూడియుండినప్పుడు దేవాంగుడు అను నామముచే ప్రసిద్ధిని పొందితిని. మంగళస్వరూపిణి అయిన ఓ దేవీ సత్త్వ గుణాంశముచేత పుట్టిన వారును, మహాయశస్సు పొందిన వారు నా వంశస్థులు. అందువలన భూలోకమున నా వంశీయులు దేవాంగ బ్రాహ్మణులు అని ప్రసిద్ధిపొంది యజ్ఞోపవీతములు వస్త్రములకు కారణ భూతులు అయినారు. ఈ నా వంశీయులను అప్రాకృత బ్రాహ్మణులు అని అంటారు. అనగా పుట్టుకతోనే సహజ సిద్ధంగా వృద్ధి క్షయములు లేని బ్రాహ్మణ్వత్వం వీరికి వుంటుంది. వీరిలో బ్రాహ్మణత్వం ఎప్పటికి నశింపదు. అందువలన వీరిని అప్రాకృత బ్రాహ్మణులుగా పిలిచెదరు. అనగా స్వభావ సిద్ధంగానే బ్రాహ్మణత్వం కలిగిన వారుగా వుండెదరు. అందువలన ఈ అప్రాకృత బ్రాహ్మణులైన దేవాంగ బ్రాహ్మణులు సమస్త లోకముల వారందరి చేత పూజింపబడుచున్నారు.

ఇందునకు యజుర్వేదము వలన ప్రమాణము

**శ్లో॥ అప్రాకృత నేతా న్వై వస్త్ర సూత్ర కర్మాన్**
**బ్రాహ్మణాన్ నమస్కుర్వంతి యే తే సర్వపాప్మాన మవ**
**ధూన్వం తీతి యజుర్వేద ప్రదర్శనాత్॥**

**తా॥** వస్త్రములు యజ్ఞోపవీతములు నిర్మించు వారుగా ప్రసిద్ధి గాంచిన అప్రాకృత బ్రాహ్మణులైన దేవాంగ బ్రాహ్మణులకు ఎవరైతే నమస్కరించెదరో ఆ నమస్కరించిన వారికి వున్నటువంటి సమస్త పాతకములు (మహాపాపములు, పాపములను)నశించిపోయి వారు పరిశుద్ధులగుదురు అని యజుర్వేదము స్పష్టముగా



తెలుపుచున్నది.

**శ్లో॥ శేషాః ప్రాకృతవిప్రాస్యు స్స ర్వే మునికులోద్భవాః**
**అప్రాకృ తద్విజాతీనాం దేవాంగకుల సంభవాం**
**బ్రాహ్మణ్యం తు స్వతస్సిద్ధ మేత చ్ఛ్రుతి మతం శ్రుణు**
**తథా ప్రాకృతవిప్రాణాం సంధ్యా యాగాదికర్మభిః**
**బ్రాహ్మణ్యం వర్తతే తస్మా దన్యధా పతితో భవత్.**

తా॥ అప్రాకృత బ్రాహ్మణులైన దేవాంగ బ్రాహ్మణులు కాక తక్కిన ముని కులమున పుట్టిన వారినందరిని ప్రాకృత బ్రాహ్మణులందురు. అప్రాకృత బ్రహ్మణులైన దేవాంగ బ్రాహ్మణులకు స్వాభావికముగనే బ్రాహ్మణ్యము కలిగిన వారైయున్నారు అని వేదములే తెలుపుచున్నవి. ముని కులమునందు జన్మించిన ప్రాకృత బ్రాహ్మణులకు సంధ్యావందనం, వైశ్య దేవాదికములు అయిన వైదిక కర్మలు చేయుటద్వార వీరికి బ్రాహ్మణ్యం కలుగును. ఈ ప్రాకృత బ్రాహ్మణులలో ఎవరైనా వేదకర్మలు ఆచరించనిచో అట్టివాడు క్రమముగా బ్రాహ్మణ పదవినుండి చెడినవాడు అగును.

**శ్లో॥ ఇతి జ్ఞాత్వా భువం గత్వా దేవి త్వం తత్ర వాసినాం**
**అప్రాకృత ద్విజనాంచ తథా ప్రాకృత సంజ్ఞికాం**
**ద్విజానాం కంఠదేశేతు వనసూత్రాత్మనా శివే**
**ఇతీరితం వచ శ్రృత్వా దేవాంగేన మహాత్మ నా**
**తతోహృష్ట మనాదేవీం తం ప్రణమ్య ముహుర్ముహుః**
**దేవేశ జగదాధార బ్రహ్మేం ద్రోపేంద్ర వందిత**
**సు రాసురేంద్ర సంపూజ్య చరణారుణవారిజ**
**ధన్యాహంకృతకృత్యా హంత్వత్పా దాంబుజ దర్శనాత్**
**బ్రాహ్మణ్యస్యస్వరూపంతు శ్రుతం త్వత్తోమయాధునా**
**బ్రాహ్మణ్యవిషయే పూర్వం మచ్చిత్తో ద్భూతసంశయః**
**ననాశ భగవన్న ద్య త్వ ద్వాక్య శ్రవణా ద్గురో**
**భవదాజ్ఞా ప్రకారేణ గచ్ఛామి భువనం ప్రతి**
**ఇత్యుక్త్వా సా మహాదేవీ జగామ స్వేచ్ఛయా తతః**

తా॥ మంగళస్వరూపిణి వైన ఓ గాయత్రీదేవీ! ఈ విధముగా చెప్పబడిన లక్షణములను క్షుణ్ణంగా తెలుసుకొని వుండినావు నీవు. కావున నీవు భూలోకమునకు వెళ్ళి అచ్చట వున్న అప్రాకృత బ్రాహ్మణులైన దేవాంగ బ్రాహ్మణులను మునికులమునందు పుట్టిన వారి కంఠ ప్రదేశమును యజ్ఞోపవీత రూపిణివై వారియందు ప్రకాశించుచుండుము. అని మహానుభావుడైన దేవాంగుడుచెప్పగా

గాయత్రీదేవి చాల సంతోషించినది.పలుమార్లు దేవలపరబ్రహ్మకు నమస్కరించుచు ఓ జగదాధారా! బ్రహ్మ ఇంద్ర అమరులచే పూజింపబడుచున్నవాడా! నీ పాదార విందములను దర్శించుటచే నేను ధన్యురాలనైతిని. కృతార్ధనైతిని, బ్రాహ్మణ్య స్వరూప లక్షణములు అన్నియు ఎటువంటి సందేహమునకు తావులేకుండా తెలుసుకొని వుంటిని. ఓ దేవలబ్రహ్మమా! భగవంతుడా! బ్రాహ్మణ్య విషయమున ఇదివరలో నాకున్న సందేహములన్నియు ఇప్పుడు మీరు చెప్పిన వాక్యములు వినుట ద్వారా అన్నియు నశించినవి. ఓ జగద్గురూ! మీ ఆజ్ఞానుసారముగ భూలోకమునకు ఇప్పుడు పోవుచున్నాను. అని చెప్పి గాయత్రీదేవి తన ఇచ్ఛాను సారముగ బయటకు వెడలి పోయినది.

## చతుర్ధశ భువనాత్మకుడు దేవాంగ బ్రహ్మ

**ఈశ్వరః॥ యస్మాత్ షణ్ముఖ గాయత్రీ త్రిపదాభూ త్తత శ్శృణు**
**యజ్ఞోపవీతమపిచ త్రిసూ త్రేణయుతం హ్యభూత్**
**ఇత్థం బ్రహ్మస్వరూపో ఽ యం దేవాంగో జగదీశ్వరః**
**చకార త్రిపదాం దేవీం ఉపవీతం త్రిసూత్రకం**
**అయ మేవ పరబ్రహ్మ అయమేవ జగద్గురుః**
**దేవాంగేన వినా లోకేన కించి దపి విద్యతే**
**ఇ తీరితం వచ శ్శృత్వా దేవ దేవస్య ధీమతః**
**షణ్ముఖోహృష్ట చిత్తస్సన్ న నామ పరమేశ్వరమ్.**

తా॥ ఈశ్వరుడు షణ్ముఖుడుతో ఈ విధంగా చెప్పినాడు. గాయత్రీదేవి, యజ్ఞోపవీతము పరస్వరము ఒకదానిపై మరొకటి ఆధారపడి వున్నవి. ఇవి రెండూ పరస్వరము భేదము లేని రీతిలో ఒకేవిధముగా వున్నవి. గాయత్రీదేవి మూడుపాదములు కలిగియున్నది. చిజ్జ్యోతి స్వరూపుడు అయిన దేవలబ్రహ్మ ఈ విధముగా గాయత్రీదేవిని మూడుపాదములు కలదానినిగాను, యజ్ఞోపవీతము మూడు సూత్రములతో వుండు విధముగను నిర్మించినాడు. ఈ దేవల పరబ్రహ్మమే పరమాత్ముడు, సర్వలోకాచార్యుడు అయి వుండినాడు. ఈ చతుర్దశ భువనములన్నియు దేవాంగ మయమే. ఈ లోకములో దేవాంగుడు తప్ప అన్యధా ఏమియును ఇసుమంత కూడా లేదు. కావున దేవలుడు సర్వవ్యాపి, సర్వాంతరాత్మగా వెలుగొందుచున్నాడు. అని పరమేశ్వరుడు చెప్పగా అది వినిన షణ్ముఖుడు సంతోషంచెంది ఇంతటి రహస్యమైన విషయమును చెప్పినందుకు పరమేశ్వరునికి నమస్కరించినాడు.

## సృష్టికి ఆదిన వున్న ఏకైక శక్తి దేవల పరబ్రహ్మమే



దేవలోపనిషత్తు ప్రథమ ఖండః ఇదిసామవేదమున 317వ శాఖకు చెందినది

**జటః అ ధాస్యాదౌ నిర్గుణో నిరామయో నిరంజనో ని**
**ష్క్రియో నిర్ద్వంద్వో నిర్మమో నిత్య శుద్ధ శ్శాశ్వత**
**స్సత్తామాత్రో అఖండ్డై కరసో నిరాలంబో నిఖిల**
**జగదుపాదానభూతో నిరాకుల సచ్చిదానంద నిత్యపరి**
**పూర్ణాఽఖండ పర బ్రహ్మస్వరూపో దేవల ఏ వాసీత్**
**నాన్య త్కించ న మిషత్.**

తా॥ ఈ అనంత విశ్వంలోని సమస్త లోకములు ఏర్పడక వుండనప్పుడు ఒకానొక దివ్యజ్యోతి మాత్రమే ప్రభవించుచుండెను. ఆ జ్యోతి స్వరూపము నిర్గుణము అనగా రజో సత్త్వ తమో గుణత్రయము రహితముగాను, నిరామయుడు అనగా మాయ అనేది తనలో లేని వాడుగను, కార్యములకును, కారణములకును అనగా కారణము లేనిదే కార్యములేదు. కార్యము లేనిదే కారణము లేదు ఇవి రెండు అన్యోన్యాశ్రితములుగా వుండు ఈ రెండునుకూడా లేకుండా వుండు నిష్క్రియ స్థితిని పొందిన వాడును, రాగములు, అనురాగములు ప్రేమలు, మమతలు, ద్వేషములు, విరాగములు, ఉష్ణము, శీతలము మొలగు ద్వంద్వాత్మిక మైనటువంటివి లేనివాడుగను, ఈ విశ్వంలోని దేనియందును మమకారము అనగా ప్రీతికలిగి వుండుట లేకుండా వుండిన స్థితియును, చలనము అంటే కదలికలు లేకుండా ఒకే ఒకచోట స్థిరముగా పవిత్రముగా శాశ్వతముగా సకల శక్తి సంపన్నుడు అయివుండియు సర్వశక్తులు , సర్వరసములు సకల ఆనందములను తనలోనేవుంచుకొని తన్మయత్వంలో ఒకే ఒకడుగా పరంజ్యోతి రూపములో వుండువాడుగను ఎటువంటి ఆకారము పొందకుండా, దేహధారియు గాకుండా, రూపము లేకుండా వుండు సచ్చిదానంద అనగా నిరంతరము మహా ఆనంద స్థితిలో మహా దేదీప్యమానముగా వెలుగొందుచున్న దివ్యజ్యోతి ఒకేఒకటి వున్నది. ఆ దివ్యజ్యోతి కాంతి శక్తిని వీక్షించుట వీలులేనిదై కోటిసూర్యులు కలసి ఒకేచోట రాసిగాకూడగా వచ్చినటువంటి వెలుతురును మించివుండు విధముగా ఆ దివ్యజ్యోతి పరంజ్యోతి నిశ్చలముగా వెలుగుచూ వుండెను. అటుఇవంటిపరంజ్యోతిని సచ్చిదానంద నిత్య పరిపూర్ణమై అఖండానంద పరబ్రహ్మ జ్ఞానానందముల చేత శాశ్వత పరిపూర్ణముగా వుండుచు అఖండ తేజస్సుచే వెలుగొందుచున్న పరబ్రహ్మ స్వరూపముగా దేవల పరబ్రహ్మ ఒక్కరుయే వుండెను. ఈ దేవల పరబ్రహ్మం కానిది ఏదియునూ దేవలపరబ్రహ్మయే పరంజ్యోతిగా ప్రకాశిస్తూ వున్నాడు.

## దేవల పరబ్రహ్మమునుండి సకల లోకాలు దేవతలు ఉద్భవించుట

**జట: సోఽకామయతబహుస్యామితి, దేవలాత్సదాశివోఽ**
**జాయత, దేవలా ద్రుద్రోఽజాయత, దేవలాన్నారా**
**యణోఽజాయత, దేవలాద్బ్రహ్మా...జాయత, దేవలా**
**త్ప్రాణా అజాయంత, కంవాయు ర్జ్యోతి రాపః పృధ్వీ**
**విశ్వా అజాయంత, మనస్స ర్వేంద్రియాణిచ, దేవలా**
**ద్ద్వాదశాదిత్యా రుద్రా వసవస్సర్వాణి ఛందాసి, దేవ**
**లా దేవ సర్వాణి జగంతి సముత్పద్యంతే,**
**దేవలా దేవ ప్రవర్తంతే, దేవలే ప్రలీయంతే, ఏవం సర్వాణి ఛం**
**దాంసి వదంతి.**

తా॥ ఆవిధముగా పరిపూర్ణ అఖండానంద పరబ్రహ్మ స్వరూపుడు అయిన దేవల పరమాత్మ తనకు తానే అనేక రూపముల తోడను,నామముల తోడను, గుణములతోను, అనేకమైన ఖండాత్మకముగా విలసిల్ల వలయునని సంకల్పించుకొనెను. సంకల్పము పొందిన దివ్య పరంజ్యోతి దేవలుడినుండి సదాశివుడు ఉద్భవించినాడు. దేవలుని వలన బ్రహ్మ, విష్ణు,మహేశ్వరులు అగు త్రిమూర్తులు ఉద్భవించినారు. ప్రాణ, అపాన,వ్యాన, ఉదాన సమాన అను ఐదు విధములైన ప్రాణములను, పంచమహా భూతములైన ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమియును, సమస్త లోకములు దేవలునివలన జనియించెను. మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, అనెడు అంతఃకరణ చతుష్టయము దేవలుని వలన ఏర్పడినవి. తరువాత పంచ జ్ఞానేంద్రియములు అయిన స్పర్శ, దృష్టి, శబ్దము, జిహ్వ, ఘ్రాణములు దేవలుని వలన ఏర్పడినవి. తరువాత దేవలునినుండి వాక్పాణి పాదమయూపస్థ అనెడు కర్మేంద్రియములును ఏర్పడినవి. దేవలుని వలన ద్వాదశ ఆదిత్యులు, ఏకాదశరుద్రులు, అష్టవసువులు, ఏర్పడినవి. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదములు, వేదాంగములు, షట్శాస్త్రములు, దేవలుని వలననే ఉద్భవించినాయి. సమస్త జగంబులు దేవలుని వలన ఉత్పన్నమయి ఆతని ఆజ్ఞానుసారము ప్రవర్తించుచున్నవి. ఆతనియందే లయము అగును అని సర్వ వేదములు తెలుపుచున్నవి.

## సకల జగత్తులు దేవతా సమూహము అంతయూ దేవలమయమే

**జట. అథ నిత్యో దేవలః శివో దేవలః రుద్రశ్చ దేవలః**
**విష్ణుశ్చ దేవలః శక్రశ్చ దేవలః, కాలశ్చ దేవలః. దిశశ్చ**
**దేవలః విదిశశ్చ దేవలః, ఊర్ధంచ దేవలః. అధశ్చ**
**దేవలః అంతర్బహిశ్చ దేవలః. దేవల ఏవేదగ్ం సర్వం.**



**య ఏవం వేద సరుద్రోభవతి. స విష్ణుర్భవతి, స బ్రహ్మో**
**భవతి, స పూజ్యోభవతి, స సచ్చిదానందాద్వితీయ**
**బ్రహ్మో భవతి. స సర్వంభవతీతి ప్రథమః ఖండః.**

తా॥ ఈ సమస్త ప్రపంచములయందు నిత్యుడు అనగా శాశ్వతముగా సర్వకాల సర్వావస్థలయందు అనంత కాలమునుండి స్థిరముగా వున్నది. దేవలుడు. ఈ దేవలుడు అనంతమైన మహా కల్పములవరకు స్థిరమై శాశ్వతుడుగా వుంటాడు. అందువలన దేవలున్ని నిత్యుడు అని వ్యవహరించెదరు. ఈ దేవల పరబ్రహ్మ నుండి సదాశివుడు జన్మించినాడు కాబట్టి సదాశివుడినికూడ దేవలుడు అని సాధారణముగా పిలిచెదరు. ఇదే విధముగా సమస్త దేవతలు దేవలుడినుండే పుట్టినందున వారందరును దేవలబ్రహ్మ మయమే. బ్రహ్మ విష్ణు మహేశ్వరులును దేవలుడే. అష్టదిక్పాలకులును దేవలుడే, అష్టదిక్కులును దేవల స్వరూపమే. కాలము అనేది ఉద్భవించినది దేవలుడి నుండియే. ఆకాలము నడచునది దేవలుని ఆజ్ఞ ప్రకారమే. కాలమే దేవలుని స్వరూపము. ఊర్ధ్వ దిక్కులు భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకములు అన్నియు దేవలుడినుండి పుట్టి దేవలుని స్వరూపముతో నిండివున్నవి. అధోలోకములు అయిన అతల, వితల, సుతల, తలాతల, రసాతల, పాతాళ లోకములు అన్నియు దేవలుడినుండి పుట్టినవి. మరియు అవి అన్నియు దేవలుని స్వరూపముతో నిండివుండినవి. ఈ విశ్వమునకు అనగా పద్నాలుగు లోకముల బయటను, లోపలను ఆవరించియున్నది దేవల స్వరూపమే. ఆ పదానలుగు లోకములయందు అనగా ఈ జగత్తు అంతయు వ్యాపించియున్నది దేవలుడే. ఈ లోకములన్నియు దేవలుని స్వరూపమే. దేవలుని చైతన్యముతోనే లోకములన్నియు నిండియున్నవి అని ఎవరు ఈ విషయము తెలుసుకొనగలుగుచున్నారో వాడే రుద్రుడు అగుచున్నాడు, వాడే విష్ణువు అగుచున్నాడు, వాడే బ్రహ్మ అగుచున్నాడు. అంతేకాకుండా పూజనీయుడు అగుచున్నాడు. అంతేకాకుండా సచ్చిదానంద అద్వితీయ పరబ్రహ్మము అగుచున్నాడు. ఎందువలననగా ఈ యావత్తు సృష్టి అంతయు దేవల స్వరూపమై యున్నది. అందులో వున్న దేవతలు, ఇతర జాతులన్నియు దేవల స్వరూపమై వున్నారు. యావత్తు చరాచర జగత్తుఅంతా దేవల బ్రహ్మమే అని తెలుసుకొనినవాడు తానుకూడ ఆ జగత్తులోని ఒక భాగము అని తెలుసుకొనును. జగత్తంతయు దేవల స్వరూపమైనప్పుడు తాను అంతర్గతముగా ఆ జగత్తులోనే ఉండినందున తానుకూడ దేవల స్వరూపుడే అని తెలుసుకొనును. ఆ దేవలునినుండియే సదాశివుడు, బ్రహ్మ విష్ణు, రుద్రుడు జన్మించినారు కావున తానుకూడ ఆ దేవలునినుండి పుట్టినాడు

కావున అనగా ఆ దేవల స్వరూపమునుండి ఏర్పడినాడు. ఈ తత్త్వము ఎవరైతే తెలుసుకొనివుంటారో వారు దేవల స్వరూపులుగా అయ్యేదరు. సదాశివ, బ్రహ్మ విష్ణు మహేశ్వరులలాగే తానుకూడ వారితోపాటే అను తత్త్వము బోధపడును. అనగా తనకు ప్రపంచానికి ఎటువంటి భేదబుద్ధిలేదు అని తెలుసుకొని వుండుటవలన అతడు సచ్చిదానంద అద్వితీయ బ్రహ్మ అయిన దేవల పరబ్రహ్మగా తానూ అవుతున్నాడు. అతడే సర్వము అగుచున్నాడు. తనకు ప్రపంచానికి ఎటువంటి తేడాలేదని ప్రపంచమే తను అని తనే ప్రపంచమని తెలుసుకోగలుగుచున్నాడు. జడపదార్థమైనను, చైతన్య పదార్థమైనను అంతయు దేవలుడే. తాను ఆ దేవలుడై వున్నాడు అని గ్రహించగలుగుతాడు. ఇది దేవలోపనిషత్తులోని ప్రథమ భాగము.

## దేవల పరబ్రహ్మ స్థావరము

**ద్వితీయఖండః. స ఖలు జగత్స్రష్టు కామస్స్వమాయయా**
**రజస్సత్త్వతమోగుణైః క్రమా ద్బ్రహ్మ విష్ణు రుద్రా ్ అసృ**
**జత్. అనంతరం త్రిమూర్త్యధిష్ఠాన భూతం సకల జగత్కా**
**రణం సదాశివ మసృజత్. స్వస్య సర్వం తేజ శ్శివే ప్రతిష్ఠాప్య**
**సోఽ ద్వితీయానంద స్వరూపో దేవల శ్శివ సహస్రారకమలం ప్రా**
**విశత్. అథ సూత్రవస్త్రహీనై ర్బ్రహ్మాది స్సంప్రార్థిత శ్శివః**
**స్వసహస్రారమధ్యగతం జ్యోతిస్స్వరూపం దేవలం ప్రార్థయా**
**మాస. తథా దేవలోఽ విద్యాధిష్ఠిత స్స్వ మూర్తి మాశ్రిత్య**
**బ్రహ్మాదీనాం సూత్రవస్త్రౌ దత్వా శివసహస్రారం ప్రావిశత్.**

తా॥ అట్టి సచ్చిదానంద అద్వితీయ జ్యోతిస్వరూపుడయిన దేవలుడు తన నిజమాయచేత అనగా జ్యోతిస్వరూపములోనే మాయకూడ మిళితమై వున్నది. ఆ జ్యోతిస్వరూపము దేవలుడై వుండినప్పుడు ఆ దేవలునిలో మాయకూడ ఐక్యమై తన వ్యక్తిత్వమును కోల్పోయి నిద్రాణముగా వున్నది. ఎప్పుడైతే జ్యోతి స్వరూపములో వున్న దేవలుడు తనకు తానుగానే అనేకానేకములుగా వ్యాప్తిచెందవలయునని తనలో సంకల్పించుకొనినాడో వెంటనే ఆ జ్యోతి స్వరూపములో వుండే మాయ తన నిద్రాణ స్థితినుండి బయటపడినది. అప్పుడు దేవలుడు తన శక్తిలోని ఒక భాగమైన ఈ మాయాశక్తినుండి రజో గుణముచేత చతుర్ముఖ బ్రహ్మను సృష్ఠించినాడు. సత్త్వగుణ ప్రధానముగాగల విష్ణుమూర్తిని సృష్టించినాడు. తమో గుణము ప్రధానముగాగల రుద్రుడిని దేవలుడు సృష్టించినాడు. తననుండి సృష్టింపబడిన బ్రహ్మ విష్ణు రుద్రులను ఆధీనంలో వుంచుకొనుటకు, సమస్త లోకములకు కారణభూతుడుగా వుండి ఈ



దేవతలను, లోకములను పాలించుటకు సదాశివుడిని సృష్టించినాడు. ఈ సదా శివుడినే శివుడు అనికూడ పిలుచుచుందురు. నిరామయుడు అయిన దేవలుడు తన తేజస్సు అంతయు సదాశివుని సహస్రార కమలమునందు ప్రతిష్టించి ఆ సదాశివుని సహస్రార పద్మాంతరాళమునందే అద్వితీయమైన ఆనంద స్వరూపముతోడ ప్రవేశించి అచటనే వుండినాడు. అనగా నిరామయ, నిర్వికల్ప, నిరంజన, నిర్గుణ పరబ్రహ్మ స్వరూప మహా చైతన్య శక్తియైన ఆ దివ్య తేజస్సు అంతయు సదాశివుని సహస్రారమందే జ్యోతిరూపములో వున్నది. సదాశివుడు అనగా తన సహస్రార కమలమునందు నిరంతరము దేవలుని తేజస్సుతో పరిపూర్ణముగా నిండివుండువాడు అని అందురు. ఈతనినే సర్వసాధారణముగా శివుడు అని పిలుచుచుందురు. ఈ శివుడుయందు సదా అనగా ఎల్లవేళలయందు అతని సహస్రార కమలమునందు దేవలబ్రహ్మ స్థిరతిష్టుడై వున్నందున అతనిని సదా శివుడు అందురు. నిర్గుణ పరబ్రహ్మముగా అనంత శక్తిని కొలవాలంటే ఆ అనంత శక్తి సదాశివుని సహస్రార కమలమునందున్న శక్తిని కొలవాలి. సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపమును సాకారంగాకూడా కొలవవచ్చును. అప్పుడు దేహమును పొంది మనకు ప్రత్యక్షమౌను. శివుడిని దేవలుడు తన మాయతోకూడి సృష్టించినాడు. ఇప్పుడు తనయొక్క మాయ ప్రధానముగా సదాశివుని యందున్నది. దేవలుడు మాయారహితముగ సదాశివుని సహస్రార కమలమునందు వున్నాడు. దేవలుడు సంకల్పించినప్పుడే మాయను కలిగి వుంటాడు. నిర్గుణముగా వున్నప్పుడు మాయలేని వాడుగా భావించి పూజించాలి. అయితే దేవలుడు సదాశివుని సహస్రార కమలమునందు ప్రవేశించిన తరువాత సదాశివుడు, బ్రహ్మ, విష్ణు, రుద్రులు వస్త్రములు యజ్ఞోపవీతములు లేకుండా వున్నారు. అప్పుడు సదాశివుడు తన సహస్రార కమలమునందు ప్రతిష్టయై యున్న జ్యోతిస్వరూపుడు అగు దేవలున్ని ధ్యానించినాడు. అప్పుడు వరకు నిర్గుణ రూపములో వున్న దేవలుడు ఆ సమయములో తన నిజమాయచే ఒకానొక పురుషరూపము ధరించి సదాశివుని, బ్రహ్మ, విష్ణు, రుద్రులముందు ప్రత్యక్షమైనాడు. అప్పుడు వారు ఆ దేవలునికి నమస్కరించి మాకు వస్త్రములు, యజ్ఞోపవీతములు ఇవ్వవలసినదిగా ప్రార్ధించినారు. అప్పుడు దేవల పరబ్రహ్మ సదాశివునికి, బ్రహ్మ, విష్ణు, రుద్రులకు వస్త్రములను, యజ్ఞోపవీతములను వారికి ఇచ్చి అనంతరము యధావిధిగా సదాశివుని సహస్రార కమలమునందు నిర్గుణ పరబ్రహ్మగ ప్రవేశించినాడు. కావున సృష్ట్యాది యందు అనగా ప్రథమ మహాకల్పము నందుండిన సదాశివునికి బ్రహ్మ విష్ణు రుద్రులకు తొట్ట తొలిగా వస్త్రములు, యజ్ఞోపవీతములు నిర్గుణ పరబ్రహ్మ అయిన దేవలుడు సాకార రూపములో అనగా సాకార పరబ్రహ్మగా అవతరించి

చేసినమొట్టమొదటి పని వస్త్ర సూత్రములు నిర్మాణం గావించి ప్రదానము చేయుట. కావున దేవలుడు నిర్గుణ పరబ్రహ్మముగానే కొలవవలెను. నిష్కామ పూజలను చేయవలయును.కాని అవసర మైనప్పుడు సకామ పూజ చేయవచ్చును.అప్పుడు నిర్గుణ పరబ్రహ్మ సాకారమై అనగా దేహధారియై ప్రత్యక్షమై మన కోరికను నెరవేరుస్తాడు. దేవలుని సాకార రూపముగా సదాశివుడు అని భ్రమపడరాదు .

## నిర్గుణ నిరంజన సచ్చిదానందరూపుడు దేవల పరంజ్యోతి

**జట: అథ కదాచి త్సూత్రవస్త్రాభావా లజ్జాహతమానసై ర్దేవై స్సంప్రార్థిత స్సదాశివస్స్వ సహస్రారమధ్యంగతం జ్యోతిస్వరూపం దేవలం దధ్యౌ. సోఽ పి సదేహో బహిరాగత్య కిమర్థం మత్ప్రార్థనాపరోభవే రితివదంతం జగదధిష్టానభూతం దేవలం ప్రతి పరమేశ్వ రోత్యంత భక్తిపూర్వకం ప్రాహ. దేవత్వం సకల జగత్కారణభూతః త్వచ్ఛక్త్యా బ్రహ్మాదయో వయముత్పన్నాః పురైవ భవ తాస్మాకం సూత్ర వస్త్రాధికం దత్తం. ఇదానీం బ్రహ్మణా త్వ దాజ్ఞా ప్రకారేణ సృష్ట జగదంతర్గత దేవమను యక్ష గంధర్వ కిన్నర కింపురుష గుహ్యక సిద్ధ సాధ్య విద్యాధరాది స్వర్గలోక వాసినః భూలోక వాసినో మను ష్యాశ్చ సూత్రాభావాత్ కర్మ ణ్యనధి కారిణో వస్త్రా భావా లజ్జా సహితాశ్చ భవంతి.సూత్రవస్త్రా నిర్మాణే బ్రహ్మాప్యశక్తోహి. తస్మాత్సూత్ర వస్త్ర కర్త్యాన్నిర్మాయ. సర్వదా ఏకం స్వర్గాదిలో కేషు అన్యాన్ భూలోకే సం స్థాపయేతి- ద్వితీయ ఖండః.**

ఆ తరువాత దేవతలు, ఉపదేవతలు అందరు తమకు వస్త్రములు, యజ్ఞోపవీతములు తేకుండా వుండినారు. వారందరు దిగంబరులుగా వుండినారు. మిక్కిలి సిగ్గును పొంది యుండినారు. తమ శరీర అవయవములను కప్పుకొనుటకు ఎటువంటి ఆచ్ఛాదన లేకుండా వుండుట వలనను, స్త్రీ దేవతలను, పురుషదేవతలును తమ మానమును కాపాడుకొనుటకు ఎటువంటి శక్తి లేనివారై సదాశివుని వద్దకు వెళ్లి తమబాధను వెల్లడించినారు. మాకు వెంటనే సూత్ర వస్త్రములు ఇవ్వవలయును అని ప్రాధేయపడినారు. సూత్ర వస్త్రములు ఇచ్చుశక్తి సదాశివునికి లేదు.తమకే దేవలబ్రహ్మము ఇచ్చినాడు కావున ఈ దేవతలందరికి కూడా వస్త్రములు యజ్ఞోపవీతములు ఇవ్వగలిగిన శక్తి ఆ దేవల పరబ్రహ్మమునకే వున్నదని గ్రహించి



తనసహస్రారములో ప్రతిష్ఠితమైవున్న నిర్గుణ దేవల పరబ్రహ్మమును సదాశివుడు ధ్యానించినాడు. అప్పుడు ఆ నిర్గుణ పరబ్రహ్మదేవలుడు సాకార పరబ్రహ్మముగా అనగా దేహధారియై వెలుపలికి వచ్చినాడు. సదాశివునితో నన్ను ఎందుకు ధ్యానించినావు. నీకుకావలసిన పని ఏమిటి అని సాకార పరబ్రహ్మ అయిన దేవలుడు అడిగినాడు.అప్పుడు సదాశివుడు అత్యంత భక్తి శ్రద్ధలతో ఆ సాకార దేవల పరబ్రహ్మమునకు నమస్కరించి ఓ మహాత్మా!నీవు సకల లోకములకు కారణభూతుడవు. నీయొక్క శక్తిచేతనే బ్రహ్మాదులము అగు అనగా బ్రహ్మ,విష్ణు,రుద్రులము నేనును (సదాశివుడు) జన్మించినాము. మాకు ఇంతకు పూర్వమే వస్త్రములు యజ్ఞోపవీతములు ఇచ్చియున్నావు. ఇప్పుడు తమ ఆజ్ఞ ప్రకారము బ్రహ్మ సృష్టికార్మము నెరవేర్చినాడు. ఈ సృష్టిలో నున్న అన్ని లోకములయందును అనగా చతుర్దశ భువనముల యందుండు దేవతలు, మనుష్యులు, యక్షులు, గంధర్వులు, కిన్నరలు, కింపురుషులు, గుహ్యలు,సిద్ధులు సాధ్యులు, విద్యాధరులు, సురలు, అసురులు, నాగులు, రాక్షసులు, దానవులు మొదలగు వారందరికి అనగా స్వర్గలోకములో నుండు వారికిని, మనుష్యలోకములో వుండువారికిని యజ్ఞోపవీతములు, వస్త్రములు లేకుండా యుండినారు. యజ్ఞోపవీతము లేకుండుట వలన వైదిక కర్మాచరణ చేయజాలక యుండిరి. వస్త్రములు లేకుండుట వలన మిక్కిలి సిగ్గును కలిగి మానములను కాపాడుకొనుటకు శక్తి లేనివారై విచారముతో వుండినారు. సృష్టికార్యము నెరవేర్చిన చాతుర్ముఖ బ్రహ్మ యజ్ఞోపవీతములను, వస్త్రములను నిర్మించు శక్తి లేనివాడై వున్నాడు. అందువలన మిమ్ములను ప్రార్థించుచున్నాను. స్వర్గలోక వాసు లందరికి సూత్ర వస్త్రములు నిర్మించుటకు శాశ్వతముగా స్వర్గలోకములో వుండుటకు ఒకరిని మరియు భూలోకవాసులందరికి వస్త్ర సూత్రములు ఇచ్చుటకు మరొకరిని సృష్టించ వలయునని ఆ దేవల పరబ్రహ్మమును సదాశివుడు ప్రార్థించినాడు. ఇది దేవలోపనిషత్తు నందలి రెండవ భాగము. ( ద్వితీయ భాగము)

## సూత్ర వస్త్ర నిర్మాతగా దేవల పరంజ్యోతి స్వరూపము

**తృతీయ ఖండః : అథ నిరంజన స్వరూపో దేవల ఉవా చ. శివం త్వ దిచ్ఛానుసా రేణ మదంశ సంయుత మేకం పురుషం సృజామి. సతు దేవతా కార్యం కరోతి. తద్వం శీయాః మనుష్య కార్యం కుర్వంతు. సతు దేవాంగ నామ్నా ప్రసిద్ధస్సన్ త్వ దాజ్ఞా ధారకో భూత్వా త్వ ద్భక్తి విశిష్టో వర్తత. ఇత్యంతర్ధాత్. తతోమహా**

**దేవాంగాత్ కోటిసూర్య ప్రభాభాసమాన ఏకః పురు
షోఽ జాయత. దేవస్యఅంగాత్సంజాతత్వా ద్దేవాంగ
ఇతి, సర్వదేవ ప్రార్ధనాం లాతీతి తస్య దేవల ఇతిచ
నామధ్వయ మభూత్. దేవాంగోపి శివం నత్వా
ఆజ్ఞకా భవతీ త్యప్రార్ధయత్. శివోపి సర్వేషాం
దేవానాం సూత్ర వస్త్రాదికం నిర్మాయ, తత్త న్మంత్ర
పూర్వకం దేహీ త్యాజ్ఞాపయామాస. శివా జ్ఞాను
సారేణ దేవాంగోపి సూత్ర వస్త్రౌ నిర్మాయ దేవేభ్యో
దత్వా శివాజ్ఞాయా దేవదత్తా ముద్వాహ్యా తస్యాం
త్రీన్ పుత్రాన్ ఉత్పాదయామాస. తద్వంశీ యైవ
అప్రాకృత బ్రాహ్మణాః దేవాంగా ఇతి విశ్రుతాశ్చ
భూలోకే తత్ర తత్ర వసంతో వస్త్ర సూత్రాధీన్ నిర్మా
య ఉచితవిధానేన సర్వేభ్యో యచ్ఛంతి.**

తా॥ అప్పుడు నిరంజన స్వరూపుడును పరిశుద్ధాత్మకుడు పరంజ్యోతి స్వరూపుడైన దేవలుడు సదాశివునితో ఇట్లుచెప్పినాడు. నా అంశతో కూడిన ఒక పురుషుడిని సృజియించెదను. అతను నీ ఇష్టానుసారముగా నడచుకొనును. నీయందు భక్తి కలిగి యుండును. ఆ పురుషుడు దేవతలకు సూత్ర వస్త్రములు నిర్మించుచుండును. దేవతలందరికి తాను నిర్మించిన వస్త్రములను వారికి ఇచ్చుచుండును. ఈతడు పూర్తిగా దేవతలకు సంబంధించిన సూత్రవస్త్రనిర్మాణ పనిని నిర్వర్తించుచుండును. ఈ పురుషుడు యొక్క సంతానము మనుష్యలోకములో మానవులకు అవసరమైన యజ్ఞోపవీతములు, వస్త్రములను నిర్మించుచుందురు. ఈ విధముగా దేవలోకం వారికి ప్రత్యేకముగను,మానవ లోకమునకు ప్రత్యేకంగా వస్త్ర నిర్మాతలు వుండెదరు. అని పరంజ్యోతి స్వరూపుడు అగు దేవలుడు సదాశివునితో చెప్పి అంతర్ధానం చెందినాడు. కొద్దిసేపట్లో మహాదేవుడు అయిన పరంజ్యోతి స్వరూపుడు అయిన దేవల బ్రహ్మ యొక్క అంగమునుండి ఒకానొక దివ్యపురుషుడు కోటి సూర్యుల కాంతి వంటి తేజస్సుతో ఉద్భవించినాడు. ఈదివ్య పురుషుడు సాక్షాత్తు పరంజ్యోతి స్వరూపుడైన దేవలమనుబ్రహ్మ పురుషాకారం పొందినప్పుడు ఏర్పడినప్పటి శరీరం నుండి ఈ దివ్యపురుషుడిని సృజియించినాడు. అందువలన ఈ దివ్యపురుషుడును దేవునియొక్క శరీర అంగంనుండి పుట్టినందువలన దేవాంగః అని పిలువబడతాడు. ఈ విధముగా దేవలబ్రహ్మచే జనించబడిన దివ్యపురుషుడును సకల దేవతలు తమ ప్రార్ధనలచేత లాలించిరి. దేవతలు అందరు తమకున్న దిగంబరత్వాన్ని తొలగించుటకు ఏర్పడిన



సాక్షాత్ మహాదేవుని అంగంనుండి జన్మించిన ఆ దివ్య పురుషునిచూచి మహా సంతోషము చెందినారు. ఎంతయో ఆనందపడినారు. తమ మానమును కాపాడుటకు అవతరించిన ఆ దివ్య పురుషుని దేవతలందరు తమ వేయినోళ్ళతో ప్రార్ధనలతో లాలింపబడుటచేత దేవలః అను మరొక పేరు ఏర్పడినది. ఇచ్చట బ్రహ్మ విష్ణు రుద్రులను మరియు ఈ ముగ్గురిని అజమాయిషీలో వుంచుకొని సృష్టి ఏర్పడుట, సృష్టిపాలన, సృష్టి లయము చేయుటకు దేవల పరబ్రహ్మ తన సంకల్ప శక్తిచేత వారిని సృష్టించినాడు. కాని దేవాంగుడుని తన సంకల్పముతో సృష్టి చేయకుండా తన దేహంనుండి సృష్టించినాడు. అనగా సాక్షాత్తు నిర్గుణ, నిరామయ, నిరంజన దివ్యజ్యోతి స్వరూపుడు అయిన దేవలబ్రహ్మ సాకార రూపముగా దివ్యపురుషుడుగా వెలువడి తన దేహంనుండి ఈ విశిష్ట పురుషుని సృష్టించినందున ఈతనికి ప్రత్యేకతలు వుండినాయి. అందువలన దేవతలందరికి సూత్ర వస్త్రములు ఇచ్చుటకు అర్హతపొందినాడు. ఇక ఎవరికి ఇటువంటి అర్హత దేవతలలో లేనేలేదు. సదాశివుడు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు తానే స్వయంగా వచ్చి వారికి యజ్ఞోపవీతములను, వస్త్రములను ఇచ్చినాడు. తన శరీరంనుండి జన్మించిన దేవాంగునికే సూత్రవస్త్రములు ఇచ్చుటకు అర్హత వున్నట్లుగా తెలియజేసినాడు. అయితే బ్రహ్మ విష్ణు రుద్రులను సృష్టించి వారిని అజమాయిషీ చేయుటకు సదాశివుని సృష్టించినాడు. ఆ సదాశివుని సహస్రారమునందు నిర్గుణ పరబ్రహ్మ రూపముగా ప్రవేశించినాడు. ఈసృష్టించబడిన దేవలుడు సదాశివునియందు భక్తికలిగి అతని ఆజ్ఞానుసారముగా వర్తించునట్లు దేవలబ్రహ్మతెలిపినాడు. సదాశివుని సహస్రారంలోతను వుండుట వలన తనచే జన్మించిన దేవాంగుడును సదాశివుని అదుపు ఆజ్ఞలలోవుంచినాడు. దేవతలకు సూత్ర వస్త్రముల కొరకు సృష్టించబడిన దేవాంగుని వంశంవారు మానవజాతికి సూత్రవస్త్రములు ఇవ్వగలవారు. అందువలన దేవాంగునికి దేవదత్తతో వివాహమును దేవతలు చేసినారు. ఈ దేవదత్త దేవాంగునికి ముగ్గురు కుమారులు కలిగినారు. ఈముగ్గురు కుమారులకు సూర్యభగవానుని కుమార్తెలు ముగ్గురితో వివాహం జరిగినది. దేవల వంశం ఆవిర్భవించి విస్తరించినది. ఈదేవల వంశంవారు భూలోకములో మానవ సమాజానికి సూత్రవస్త్రములు ఇచ్చుటలో నిమగ్నులైనారు. ఈ దేవాంగునికి జన్మించిన పుత్రుల వంశం వారిని అప్రాకృత బ్రాహ్మణులు అని పిలిచెదరు. అప్రాకృతమనగా సహజ సిద్ధమైన అని భావము. ఈ వంశీయులకు పుట్టుకతోనే సహజసిద్ధంగా వీరికి బ్రాహ్మణత్వం వుంటుంది. పుట్టుకతోనే ఏర్పడిన బ్రాహ్మణత్వం కావుటవలన వీరికి బ్రాహ్మణత్వం క్షీణించుట అనేది వుండదు. వీరు ఎల్లప్పుడు బ్రాహ్మణులుగా చెలామణి అయ్యెదరు. మరి వీరు అప్రాకృత బ్రాహ్మణులు

అనగా సహజసిద్ధంగా పుట్టుకతోనే బ్రాహ్మణత్వం వచ్చుటకు ప్రధాన కారణము వీరు నిర్గుణ నిరంజన నిరాకార పరంజ్యోతి స్వరూపమైన దేవల పరబ్రహ్మ సాకార రూపముగా యజ్ఞోపవీతము కలిగి పురుష రూపము ధరించి తన దేహంనుండి సృష్టించబడిన దివ్యపురుషుడు దేవాంగుడునకు జన్మించిన ముగ్గురు పుత్రులయొక్క వంశం వారు కావడమే. అందువలన దేవాంగవంశమునందు జన్మించినవారు అప్రాకృత బ్రాహ్మణులుగా భూలోకములో వుండెదరు అని నిర్గుణ నిరంజన స్వరూపుడు దేవల పరంజ్యోతి స్వరూప దేవల పరబ్రహ్మ నిర్ణయించినాడు. దేవతలందరు తమ దిగంబరత్వాన్ని తొలగించుటకు ఆవిర్భవించిన దివ్యపురుషుని తమతమ ప్రార్థనలద్వార లాలించుటవలన దేవలుడుగా అని ఇంకొక పేరుతో పిలువబడినాడు. అదే విధముగ మానవ సమాజానికంతటికి సూత్రవస్త్రములు ఇచ్చి వారియొక్క దిగంబరత్వాన్ని పోగొట్టగలిగిన వంశం వారిని మానవులందరూ తమ కృతజ్ఞతలు తెలుపవలని యున్నందున ఆ దివ్యజ్యోతి స్వరూపంనుండి వెలువడి వెలుగొందబడిన దేవాంగుని మానవులందరు తమతమ ప్రార్థనలచేత లాలింపబడాలి. దేవతలచేత లాలింపబడినాడు కావున దేవలః అని పిలుబడినట్లుగానే మానవులచేతగూడ లాలింపబడుటచే మానవాంగః అని విశ్వజననాంగః అని పిలువబడాలి.

కాని దేవాంగ పురాణంలో దేవతలయొక్క శరీర అవయవములను తన వస్త్రముచేత అలంకరించి వారి మానములను కాపాడినందున దేవాంగుడు అని పిలువబడతాడు అని చెప్పబడినది. దేవలోపనిషత్తునందు మహాదేవుని అంగంనుండి పుట్టినవాడు కావున దేవాంగుడు అని పిలిచినారు అని చెప్పబడినది. ఈ తేడాను గమనించవలయును.

## సకల బ్రహ్మాండ స్వరూపుడు దేవలపరబ్రహ్మ

**జట. స దేవలోనిత్య శ్శుద్ధో నిరంజనో నిరామ యోనిరా**
**కులో నిర్గుణో నిరుపాధిక స్సచ్చిదానంద స్వరూపోఽ**
**ద్వితీయ పరబ్రహ్మ స్వరూప ఇతి మంతవ్యః. దేవలోప**
**నిషదం యోఽధీతే సదేవపూజ్యోభవతి. సురాపానా**
**త్పూతో భవతి. స్వర్ణస్తేయా త్పూతో భవతి. బ్రహ్మ**
**హత్యా త్పూతో భవతి. కృత్యాకృత్యా త్పూతో**
**భవతి. అగమ్య గమనా త్పూతో భవతి. స సర్వా**
**వేదా నధీతో భవతి. సశుద్ధో భవతి. న స పున రావ**
**ర్తత. న స పునరావర్తత. ఇత్యుపనిషత్.**



ఆ దేవల పరబ్రహ్మం శాశ్వతుడు, నిర్మలుడు, దోషరహితుడు, మాటకు అతీతుడు, సత్సంకల్పములు గలవాడును, త్రిగుణములైన సత్త్వ,రజో, తమో గుణములు లేనివాడై ఎటువంటి దేహము నందుండకుండా నిర్గుణ జ్యోతి స్వరూపముగా వెలుగొందుచున్నాడు. సచ్చిదానంద అనగా శక్తి జ్ఞానములతో ఆనంద స్వరూపుడుగా వుండినవాడు. తనకంటే ముందును, తన తరువాతను తనంతటి శక్తి వంతుడు ఎవ్వరు లేనివంటి వాడును తనకన్నముందు, తనుఆవిర్భవించిన తరువాత ఈబ్రహ్మాండమంతటా ఈతనే వ్యాపించివున్నాడు. ఈబ్రహాండములోని సకల చరాచర జీవప్రపంచ మందును సర్వము తానే వ్యాపించివున్నాడు. 14లోకములన్నియు ఆతని స్వరూపమై వుండినవి. ఆ14లోకములయందున్న సమస్త జీవరాశి జడరాశులు సమస్తము ఈ దేవల పరబ్రహ్మంతో నిండి వున్నది. తానుకూడా ఆ దేవల స్వరూపముతోనే వున్నాను. సకల దేవతలందరు ఆ దేవల పరబ్రహ్మ స్వరూపముతో నిండియున్నారు, నాలో వున్న స్వరూపం దేవల స్వరూపము. కావున నేను ఆ దేవల స్వరూపమే. నాలోవున్న చైతన్య స్వరూపము ఆదేవల స్వరూపమే. నేను ధరించివున్న ఈదేహం కూడా పంచ భూతాత్మకమైనది. పంచభూతాలు మొత్తం దేవల స్వరూపముతో నిండివున్నది. కాబట్టి నాలోని చైతన్యశక్తి అయిన ప్రాణవాయువు దేవల స్వరూపమే. నా దేహములోవున్న పంచభూతములు దేవల స్వరూపమే. ఈ సృష్టిలోని సమస్త జంతువులు, వస్తువులు స్థావరజంగమములు, మానవ పశు పక్షాదులన్నియు దేవల స్వరూపమే. తనకు వాటికి బేధము ఏమియును లేదు. ఎందువలననగా అన్నియు దేవల స్వరూపముతో నిండివున్నవి కాబట్టి. సృష్టి, స్థితి, లయము ఇవన్నియు దేవల ఆజ్ఞ ప్రకారం నడుచుకొను చున్నవి. తనుకూడ దేవల ఆజ్ఞ ప్రకారం నడచుకొను చున్నందునను, యావత్ సకల చరాచర సృష్టి అంతయు నిర్గుణ నిరంజన నిర్మల జ్యోతి స్వరూపుడైన దేవల ఆజ్ఞ ప్రకారము నడచుకొనుచున్నది అని దేవలోపనిషత్తు ద్వార ఈ సృష్టి రహస్యములు తెలుసుకొన్నవారికి ఈ దేవలోపనిషత్తు పారాయణంచేయువారు దేవతలచేత పూజింపబడుదురు. బంగారము దొంగిలించుట, సురాపానము, బ్రాహ్మణ హత్యలాంటి మహాపాతకములనుండి విముక్తుడై పరిశుద్ధుడగును. వ్యభిచార దోషము పోగొట్టును. నిత్య నిర్మలుడై సమస్త వేదములు అధ్యయనము చేసినంతటి వాడగును. ఇటువంటివారు ఎప్పటికిని మరల జన్మింపని మోక్షమును పొందుదురు అని దేవలోపనిషత్తు తెలియపరచుచున్నది. ఇది దేవలోపనిషత్తునందలి 3 వ భాగము. ఈ దేవలోపనిషత్తు సామ వేదమందలి 317 వ శాఖకు చెందినది.

## దేవాంగుని సప్తావతారములు

శ్రీ దేవాంగ సప్తావతార కాల నిరూపిత బ్రహ్మాండ పురాణోక్తమ్.

శ్లో॥ నభస్త్రయంచ వసవో నేత్రర్షి శశినో గతాః
శ్వేతవారాహ కల్పాద్య సంధౌ కృత యుగాబ్దకాః
చత్వారి సురవర్త్మానితర్కాంక నయనేందవః
మహాయుగ త్రయస్యే మే దీర్ఘా స్సంవత్సరా గతాః
తథా కృతయుగాబ్దాశ్చ చతుర్థంతు మహాయుగే
త్రిశ్శూన్యం వసవో నేత్ర సాగర శ్శశినో గతాః
త్రేతాది మార్థే త్రిశ్శూన్యం వసు వేదర్తవో గతాః
శూన్యత్రయం వేదతర్క శూన్య సప్తేందవ స్సమాః
సర్జనాత్ ప్రాక్ జగత్స్రష్టు స్తస్సమాఃతో వత్సరా ఇమే
కల్పాబ్ద పిండాత్తే త్యాజ్యాఃశేషా స్సృష్ట్యాదివత్సరా.
తతో పరార్థే త్రేతాయాః సజ్జనారంభ ఉచ్యతే
గ్రహర్ష దేవదైత్యాది స్రక్షతోఽస్యచరాచరం
కల్పకల్పాంతరే ష్వేవం ప్రపంచేతు ప్రకాశితాః
సదా సాయుజ్య పీఠాఢ్యో సహస్రాంతర స్థితః
దేవాంగః ప్రథమా సృష్టిః శంకరస్య మహాత్మనః
విద్యాధరో ద్వాపరాదౌ మధ్యేఽభూ త్పుష్పదంతకః
అంతే ఽవతీరో బేతాళః కలౌ వరరుచి స్తథా
చిత్రయోగీ దేవశాలీ దేవదాసోఽభవం స్తతః
జాతే శుక్లే పూర్ణిమాయా మూర్జే విద్యాధ రోద్భవః
పుష్పదం తోద్భవ శ్చైవ పంచమ్యా మశ్వయుక్ సితే
పూర్ణిమాయాం సితే రాధే బేతాళస్య సముద్భవః
మార్గే శుక్ల దశమ్యాంతు జాతో వరరుచి స్తథా
దశమ్యా శుక్లనభసీ చిత్రయోగి సముద్భవః
మాఘే శుక్లే హరితిథౌ దేవశాలి సముద్భవః
దేవదా సోద్భవ శ్శుక్ల పంచమ్యాం మధుమాసకే
సప్తావతారా ఏతే వై దేవాంగ బ్రహ్మణ స్మృతాః

తా॥ శ్వేత వారాహ కల్పముయొక్క సంధియందు గతమైన అనగాజ రిగిన కృతయుగ సంవత్సరములు 1728000 సంవత్సరాలును, మూడుమహాయుగములు కాలమును మహాయుగము అనగా కృత,త్రేత, ద్వాపర, కలి యుగములు నాలుగును కలిపిన కాలమును మహాయుగమందురు. అనగా 4320000 సంవత్సరాల కాలము



ఒక మహాయుగము అందురు. ఆ మూడు మహాయుగముల కాలము అనగా 12960000. దీనిలో కృతయుగ కాలము 1728000 సంవత్సరాలు కలుపగా 14688000 అయినది. త్రేతాయుగ కాలమైన 1296000 సంవత్సరాల కాలంలో సగము 648000 సంవత్సరాల కాలమునుకూడ కలుపవలెను. అప్పుడు 15336000 సంవత్సరాల కాలము అగును. 1728000+ 12960000+ 1728000+ 648000=17064000 సంవత్సరాలు. కాలాన్ని సృష్టికర్తయగు బ్రహ్మదేవుడు సృష్టి చేయడానికి ధ్యానించిన కాలము. ఈధ్యానించిన తరువాత సృష్టి ఏర్పడుట ప్రారంభమైనది. కావున సృష్టి ఏర్పడి ఇప్పటివరకు జరిగిన సంవత్సరాలను లెక్కించునప్పుడు ఈ బ్రహ్మధ్యాన కాలమైన 17064000 సంవత్సరాల కాలమును తీసివేసి మిగిలిన కాలాన్ని సృష్టి ఏర్పడి నేటివరకు జరిగిన కాలముగ చెప్పవలయును. కావున త్రేతాయుగమును రెండు భాగములు చేయగా పూర్వ భాగకాలం కల్పాదిసంధియందు అనగా బ్రహ్మధ్యాన కాలమునందు కలిసి పోయినది. కావున సృష్టి క్రియ త్రేతాయుగ ఉత్తర కాలంలోనే ప్రారంభమైనదిగా తెలియుచున్నది. అనాదిగను ప్రాచీనముగను సమస్త జంగమ స్థావరాత్మకమైనటువంటిది అయిన ప్రపంచము మహాప్రళయాంతములయందు లీనమయ్యెడు (సంజార) సర్వలోక సముదాయము మరల గ్రహ నక్షత్ర దేవదానవాదిక సమూహములతోడ కల్పింపబడును. ఈ విధముగ సమస్త ప్రపంచములు సర్వ కల్పకల్పాంతములందు నేర్పడుచుండును. అట్లు సృష్టి ప్రారంభమైన త్రేతాయుగ రండవ భాగకాలము ప్రారంభమునందు సాక్షాత్ పరశివుడు తన సహస్రార పద్మాంతరాళంబున సాయుజ్య పీఠాఢ్యుడై జ్యోతిరూపమున తేజరిల్లుచున్న దేవాంగ బ్రహ్మమును సూత్రవస్త్ర నిర్మాణముకొరకై సాకార రూపము బ్రహ్మముగా కావించెను. ఆ దేవాంగ బ్రహ్మయే లోకోపరార్థము భూలోకమున ద్వాపర యుగారంభమునందు విద్యాధరుడుగాను, ద్వాపర యుగ మధ్య కాలమున పుష్పదంతుడుగను, ద్వాపర అంతమున బేతాళుడుగను అవతరించెను. మరియు లోకారాధ్యుడైన దేవలుడు కలియుగమున వరరుచియు, చిత్రయోగియు, దేవశాలి, దేవదాస నామములతో అవతరించినాడు. అట్టి సప్తావతార క్రమము ఈ విధముగా వున్నది. కార్తీక మాస శుద్ధ పూర్ణిమ యందు విద్యాధరుడును, ఆశ్వయుజ శుద్ధ పంచమి యందు పుష్పదంతుడును, వైశాఖ శుద్ధ పూర్ణిమ యందు బేతాళుడుగను, మార్గశిర శుద్ధ దశమి యందు వరరుచియును, మాఘ శుద్ధ ఏకాదశి యందు దేవశాలియును, చైత్రశుద్ధ పంచమి యందు దేవదాసుడును ఉద్భవించినారు. ఈ విధముగ శ్రీ దేవాంగ బ్రహ్మయొక్క సప్తావతార కాల నిర్ణయము ప్రపంచమున ప్రకీర్తి చెందుచున్నది అని బ్రహ్మాండ పురాణమున శ్రీ దేవాంగ సప్తావతార కాల

నిర్ణ యోపాఖ్యానము నిరూపించబడినది.

సప్తావతార నిర్ణయ వేదసారోపనిషత్ ప్రమాణము.

**జట. నిరతిశయ గుణగరిష్ఠ శ్శాండిల్యో నిఖిల జగన్నిర్మాణ కారణం చతురాననం పరి స మేత్యోవాచ. అధీహి భగవన్ దేవాంగ సప్తావతార స్వరూపం యద్య దవ తారే యద్య త్కృతం తత్సర్వం సమగ్రేణేతి. సహో వాచ పితామహశ్చ. ఈశాన స్సర్వవిద్యానా మితి శివోహి సకల విద్యాధీశ్వర త్వేన విద్యమానత్వాత్, భూలోకే విద్యా ప్రాచుర్యార్థం దేవాంగం సప్తావ తారం భూమౌ జన్మ ప్రాప్నుహీతి ఆజ్ఞాం దత్తవాన్. త జ్జన్మ కారణ వృత్తాంతస్తు సామవేదాంతర్గత చతురధి. కాశీతిశత తమ శాఖీయ ధర్మతత్త్వోపనిషది స్పష్టం తదా దేవాంగో విద్యాధరాది సప్తస్వరూపైః భూమా వవతీర్యసకలముని పూజితస్సన్ కాంశ్చిత్ గ్రంథాన్ చకార.**

తా॥ పూర్వము నిరుపమాన సద్గుణ వరిష్ఠుడైన శాండిల్య మునీశ్వరుడు సకల లోక నిర్మాణ కారకుడైన చతుర్ముఖ బ్రహ్మను గాంచి ఓ స్వామీ! దేవాంగునియొక్క సప్తావతార స్వరూపమును నేను తెలిసుకొనవలయునని అనుకొనుచున్నాను. కావున దాని నంతయు వివరముగ నాకు తెలుపవలయును అని ప్రార్థించినాడు. అప్పుడు పితామహుడు శాండిల్యునితో ఇట్లు చెప్పినాడు. ఓ మునీంద్రా! "ఈశాన సర్వ విద్యానాం" అనెడి ప్రమాణమును బట్టి సాక్షాత్ మహేశ్వరుడే సకల విద్యలకు అధీశ్వరుడని తెలియుచున్నది గదా అట్టి పరమేశ్వరుడు సమస్త విద్యలను భూలోకమున వ్యాపింపజేయుటకు నిశ్చయించుకొని ఆ కార్యమును నెరవేర్చుటకొరకై దేవాంగుడుని సప్తావతారములచేత భూలోకమున జన్మించుటకు ఆజ్ఞ ఇచ్చినాడు. ఈ దేవాంగ జన్మ కారణ వృత్తాంతము సామ వేదమున 184 వ శాఖకు చెందిన ధర్మతత్త్వోపనిషత్తునందు స్పష్టముగా తెలుపబడివున్నది. అట్లు పరమేశ్వరుని ఆజ్ఞానుసారముగా దేవాంగుడు భూలోకమున విద్యాధర, పుష్పదంత, బేతాళ, వరరుచి, చిత్రయోగి, దేవశాలి, దేవదాస నామమునతోడ సప్తావతారములు వహించి సకల మునిగణ పూజితుడు అగుచు ఆయా అవతారములయందు కొన్ని కొన్ని గ్రంథములు రచించినాడు. ఆ గ్రంథ వివరణము తెలిజేసెదను వినుము.

**శ్లో॥ ఋగ్భాష్యం మనుసూత్రం సంధ్యా సూత్రం మనుస్మృతిం<br>దేవలోపనిధిం దేవరాజ ఛంద స్తథైవచ<br>వాదం దేవలజైమిన్యోః వర్ణాశ్రమ మహోదధిం<br>బ్రహ్మసూత్ర నిఘంటుచ మనుజ్ఞాన శిఖామణిం<br>చకార దశ చైతాని విద్యాధర మహామనుః.**



**శ్లో॥ దేవీభాగవతం చైవ దేవరత్నాకర స్తథా<br>తథా మేరు చరిత్రంచ వేదాంతాకుశ మేవచ.<br>బ్రహ్మోపదేశ సిద్ధాంతం దేవరాజ సుశేఖరం<br>సుజ్ఞానదీపికా చాపి మహిమ్న స్తోత్ర మేవచ<br>తథైవోత్తర మీమాంసా మగ్ని సూక్త మిమేదశ<br>పుష్పదం తావతా రేతు దేవాంగేన వనిరి**

**శ్లో॥ చతుష్షష్ఠి కళాసూత్రం ధనుశ్శాస్త్రం తథైవచ<br>బేతాళ పంచతంత్ర బేతాళాఖ్యాన మేవచ<br>భూసూక్తం స్మర శాస్త్రంచ మల్ల సాధననిర్ణయం<br>మహాభైరవ సూక్తంచ మంత్ర శాస్త్రం తథైవచ<br>తథా మంత్ర నిఘంటుశ్చ బేతాళేన వినిర్మితమ్.**

**శ్లో॥ సూత్ర తత్త్వ నిఘంటుశ్చ గణితశాస్త్రకం<br>తథాచ చంద్ర సిద్ధాన్తం సూర్య సిద్ధాన్త మేవచ.<br>త్రిలింగం దత్తమీమాంసాం శ్రుతి షట్సూత్ర నిర్ణయం<br>కౌముదీ శబ్దశాస్త్రంచ వస్త్వాయు ర్నిర్ణయం తథా<br>భాగశాస్త్రం యోనితంత్రం పిండోత్పత్తి శ్రుతం తథా<br>ఛందోజ్ఞం సంధిసూత్రంచ కాణాద న్యాయబోధినీం<br>నరపింగళి శాస్త్రంచ తథా లక్షణ దర్పనం<br>స్వరశాస్త్రంచ వేదాంగ మాలాయుర్వేద మేవచ<br>యేత ద్వింశతి శాస్త్రాణి దేవాంగేనా మితౌజసా<br>వరరు చ్యవతారేతు నిర్మితాని మహీతలే.**

**శ్లో॥ మనుకల్పం మంత్రశాస్త్రం నిగమాంత మహోదధిం<br>శ్రీ దేవల జయస్తంభం మనుశిల్పం తథైవచ<br>సద్వేదాంతకుఠారంచ దేవలాఖ్యాన మేవచ<br>తథా శంభు శిఖాసూత్రం గాయత్రీభాష్య మేవచ.**

**శ్లో॥ దేవస్మృ త్యోంకారసూక్తే పంచయజ్ఞ వినిర్ణయం<br>యజ్ఞోపవీత సూక్తంచ సంధ్యాభాష్య తథైవచ<br>దేవీమాహాత్మ్యకం చైవ రుద్రభారత మేవచ<br>గిరిజోద్వాహ మి త్యేతే నిర్మితా శ్చిత్ర యోగినామ్.**

శ్లో॥ ప్రామాణ్యవాద స్సుజ్ఞానదీపికా జ్ఞానమంజరీ
సుజ్ఞానరత్నమాలాచ సద్వాదజ్ఞానమంజరీ
పంచశిఖా నిర్ణయశ్చ దేవకల్పాత్మ దర్పణం
పూర్వాపర ప్రయోగశ్చ తథా దేవ రహస్యకం
ఏతద్ధి శాస్త్ర దశకం సత్కర్మ జ్ఞానబోధకం
దేవశా ల్యవతారేతు దేవాంగేన వినిర్మితమ్.

శ్లో॥ అంబాస్తుతిం గురుస్తోత్రం తథా శృంగారనిర్ణయం
తంతుసూత్రం తథా శ్రావణాంకుశం కాలవేదనాం
ఏకవింశతి సద్దీక్షా విధిర్ల క్షణనిర్ణయః
పండితారాధ్య చరితం శైవసిద్ధాంత మేవచ
తథా ప్రభుశిఖారత్నం మూలస్తంభన భాష్యకం
తథా వీరాగమవ్యాఖ్యాం టీకాంశైవాగమస్యచ
ఏత చ్చతుర్దశ గ్రంథాౣ తత్త్వజ్ఞాన ప్రబోధకాౣ
దేవదాసావతా రేతు దేవాంగః కృతవా నభూత్.

శ్రీమత్ బ్రహ్మాండపురాణాంతర్గత శ్రీ చౌడేశ్వరీ సంభవమ్.

శ్లో॥ ఆషాఢాఽమాఽర్థరాత్రాం తేదైత్యైస్సంపీడితో భృశం
పునర్జాతవ దాసీస్త్వం యస్మాన్మాం స్మృతవా నసి
మమ జన్మదినం మత్వా నియమే పరమే స్థితః
మత్పూజాం కృతవాౣ భూయాః కృతకృత్యో భవిష్యసి
రిపుక్షయో భవేద్వత్స వంశవృద్ధిః ప్రజాయతే
త్వద్వంశ సంభవా యేచ తేఽతిభక్తి సమన్వితాః
వయనాది విహాయోఽత్ర నియమే పరమే స్థితాః
మత్కథా శ్రవణంకృత్వాస్తుత్వా నత్వార్చనాదిభిః
తోషయిత్వా భజేయుశ్చేత్తేషాం వృద్ధిందదామ్యహం
ప్రమాదాద్యది లుప్యేత తేషాం దుఃఖం పదేపదే
ఇత్యుక్త్వా సా మహాదేవీ తత్రైవాంతర ధీయత.

ఇతి శ్రీ బ్రహ్మాండపురాణేదేవాంగచరితే శ్రీ చౌడేశ్వరీ వరప్రసాద రాక్షసోపాఖ్యానం నామ ద్వితీయోధ్యాయః.

చౌడేశ్వరీదేవి వజ్రముష్ట్యాది పంచరాక్షసులను వధించినది. దేవలుడు తన వద్దనున్న తంతువులను వజ్రముష్ట్యాది రాక్షసుల రక్తము ఐదు రంగులలో ప్రవహిస్తూవుంటే వాటిలో తంతువులను తడిపి తంతువులకు ఐదు రంగులు కల్పించి



చిత్ర విచిత్ర వర్ణములుగల వస్త్రములకు మార్గం కల్పించినాడు. అప్పుడు చౌడేశ్వరీ మహామాత దేవలున్ని చూచి వత్సా, పుత్రా ఈ రోజు నిన్ను రాక్షసులబారినుండి కాపాడినాను. నీకు ప్రాణదానము చేసినదానిని అయితిని. నీవు ఈక్షణమున పునర్జన్మ పొందినట్లుగా భావింపుము. ఆపదలోవున్న నిన్ను రక్షించుటకు ఈ క్షణమున నేను ఆవిర్భవించితిని. ఈ క్షణము ఆషాఢమాస అమావాస్య పుష్యమీనక్షత్రముతోకూడి అర్ధరాత్రి చివరి సమయములో నేను ఈరూపములో ఆవిర్భవించినాను. ఈ రూపముతోనే కదా నీకు పునర్జన్మ ఇచ్చినది. ఈ కాలము నీకు పరమ పవిత్రమైనది. నీవు పునర్జన్మ పొందినటువంటి పర్వ దినము. కావున ఈ పర్వ దినమున ఈ రూపముతో అనగా చౌడేశ్వరీ రూపములో నన్ను నీవు, నీ వంశమువారు పూజింపవలయును. ఈ అమావాస్య రాత్రిపూట నాకు పూజలు చేయవలయును. నా కథను నీవును, నీ వంశీయులందరు వినవలయును. నాకు ప్రీతికలుగు విధముగా భజనలు జరుగవలెను. నాకు నమస్కరించవలెను. ఈ పర్వదిన విశిష్ఠతను నీ వంశస్థులందరు గుర్తుంచుకొనవలెను. ఈ పర్వ దినమున లౌకికి వృత్తులను విడచి నన్నే పూజించవలయును. ఆ విధముగా కొలిచిన వారందరికి వారివారి కోర్కెలను తీర్చెదను. వారి వంశము వృద్ధి చెందును. వారి ఇంట సుఖసంతోషములు కలుగజేసెదను. అట్లుగాక ఈ పర్వదినమునందు నాకు పూజలు స్తోత్రములు చేయనివారికి మాటమాటికి కష్టములు వచ్చుచుండును. వారి వంశము అభివృద్ధి చెందదు. సుఖసంతోషములు లోపించును. కావున ఆరోజు నీ వంశస్థులందరు నేతనేయటనువిడిచి సంతోషముతో భక్తిప్రపత్తులతో నన్ను ఈరూపములోనే కొలవవలెను. ప్రమాదవశాత్తు ఈ పర్వదినాన నా పూజలు చేయనివారు మిగుల కష్టములు పడెదరు అని దేవలునికి చౌడేశ్వరీదేవి చెప్పినది. మరి దేవాంగ వంశానికి ఆది పురుషుడును అయిన దేవలున్ని అమ్మవారు రక్షించారు. అందువలన దేవలుడు చేనేత వృత్తిచేసి సూత్రవస్త్రములు నిర్మించి మిక్కిలి కీర్తిని పొందినాడు. అతని వంశీయులైన దేవాంగులు తమ ఆది పురుషునికి ప్రాణదానం చేసిన ఈ రోజున చౌడేశ్వరీదేవిని స్మరించుట పూజించుట అమ్మవారికి కృతజ్ఞత చూపినట్లుగా భావించవలయును.



శ్రీరస్తు

# శ్రీ దేవాంగ పురాణము

*మూల బ్రహ్మాండ పురాణములోని దేవాంగ చరిత యందలి సంస్కృత శ్లోకి*
*నెల్లూరు జిల్లా సంతపేట వాస్తవ్యులు శ్రీ గోమేధికం ఓం శ్రీశంకర స్వాములు*
*గోదావరి జిల్లా పుల్లేటికుర్తి వాస్తవ్యులు శ్రీ మళ్ళ లక్ష్మీశ్రేష్టి (కాళహస్తి సిద్ధా*
*సంకలనము చేసినారు. దీనిని శ్రీ పమ్మి త్యాగరాయశెట్టిగారు తన శ్రీరాజ*
*నికేతన ముద్రాక్షరశాలయందు 1914 వ సంవత్సరములో ప్రచురించిన*
*దీనిని యధావిధిగా ప్రచురించుచున్నాను.*

## పురాణములకన్నిటికి మొదట వ్రాయు ధ్యాన శ్లోకములు

**1 శ్లో॥ :** అగజానన పద్మార్కం గజాననమహర్నిశం ।
అనేకదంతం భక్తానామే కదంతము పాస్మహే ॥

**2 శ్లో॥ :** యస్యాఃపాణితలే సరోజమమలం తస్యాంతరాళౌరమాదేవీ తన్నికటె పుర
స్తన్నాభిదెశెవిధిః । తత్కంఠెనిగమావళీవిలసనం తెనక్రతూనాం క్రియాః సా
సరస్వతీ భగవతీ నిశ్శేష జాడ్యాపహా॥ **3 శ్లో॥ :** శారదా శారదాంభోజ వదనావ
సర్వదా సర్వదాస్మాకం సన్నిధి స్సన్నిధిం క్రియాత్॥ **4 శ్లో॥** శాంతాకారం భుజ
పద్మనాభం సురేశం విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం । లక్ష్
కమల నయనం యోగి హృద్ధ్యాన గమ్యం వందేవిష్ణుం భవభయహరం సర్వలో
**5 శ్లో॥** శివాయ శంకరాయ చిన్మయాయ చంద్రమౌళయే భవాయ ఫాల
పంచబాణహారిణే । మృడాయ భక్త పాలనాయ భుక్తి_ముక్తిదాయి నేగి
శంభోనమోస్తు శూలపాణయే॥ **6 శ్లో॥ :** వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేఃపౌత్రమ
పరాశరాత్మజం వందేశు కతాతం తపోనిధిం॥

శ్రీరస్తు

శ్రీ చౌడాంబాయైనమః

# దేవాంగ పురాణ ప్రారంభః

## దేవాంగ సంభవో నామ ప్రథమోధ్యాయః

**1 శ్లో॥** పురానారద మౌనీంద్ర స్సత్యంగ త్వాపితామహం । నమస
వీద్వాక్యంలోకానుగ్రహకాంక్షయా ॥ **2 శ్లో॥** నారద ఉవాచ-యస
బ్రహ్మాముకుందకాలరుద్రాః ప్రభావస్థితిసం హృతీనాం । కర్తృత్వమాపుర్జ గ
వందే శివం శంకరమాత్మ రూపం ॥ **3 శ్లో॥** యత్పుణ్యం పరమం లోకే
హారంశుభం । యచ్ఛ్రుత్వా కృతకృత్యా స్స్యుస్తన్మే వదపితామహ॥ **4 శ్లో॥**బ్ర

శ్రుణనారదవక్ష్యామి దేవాంగ చరితంశుభం । రహస్యం హర్షజనకం పవిత్రం పాపనాశనం॥**5 శ్లో॥** పురాతనం మహాదేవ మాహాత్మ్య ప్రతిపాదకం। యచ్ఛ్రుత్వాసు మహత్పుణ్యం కృతకృత్యోభవిష్యసి ॥**6 శ్లో॥** :ఆసీత్సర్వత్ర య శ్శంభు స్సచ్చిదానంద విగ్రహః । శాశ్వతస్సర్వ లోకేశ స్సర్వవ్యాపీపరాత్పరః ॥ **7 శ్లో॥** అప్రమేయోదురాధర్షా నిర్గుణోనిరుపద్రవః । ఏకదాసమహాదేవః ప్రపంచం స్రష్టుమైచ్ఛత ॥ **8 శ్లో॥** ఇచ్ఛాయాస్తస్య సంజాతాయాశక్తీస్త్రి గుణాత్మికా। చాద్రా క్షీద్యోగినీం మాయాంజ్వ లంతీంతాం మహేశ్వరః ॥ **9 శ్లో॥** ఆదిశక్తింభగవతీం యయెదంధార్య తేజగత్। దృష్టమా త్రేణదేవేన శివేనాథమహౌజసా ॥ **10 శ్లో॥** తస్యారజోవిశిష్టాయా జాతోహంమునిసత్తమ। సాత్వికా యాస్తతో విష్ణుర్జాతో నారాయణః ప్రభుః ॥ **11 శ్లో॥** తామస్యాః కాలరుద్రోయం ప్రాదురాసీ న్మహాబలః **12 శ్లో॥** నారదః ॥ దేవదేవ జగత్స్వామిన్ పరమేష్ఠిన్ పితామహ । తయాప్రకృత్యా జనితో మాయయాత్వంతతో నఘ । కించకర్థ త్వ యా తాతనిశ్చితం కిం విశేషతః ॥ **13 శ్లోకము** : కథంప్రపంచకర్తృన్ త్వ మాప్తవాన్వై మహామతె । ఏతత్సర్వం మహాభాగవిస్తరాద్వక్తుమర్హ సి॥ **4 శ్లో॥** బ్రహ్మోవాచ ॥ శ్రుణనారదవక్ష్యామి దేవాంగ చరితంశుభం । రహస్యం హర్షజనకం పవిత్రం పాపనాశనం ॥ **5 శ్లో॥** పురాతనం మహాదేవ మాహాత్మ్య ప్రతిపాదకం । యచ్ఛ్రుత్వాసుమహత్పుణ్యం కృతకృత్యోభవిష్యసి ॥ **6 శ్లో॥** ఆసీత్సర్వత్ర య శ్శంభుస్సచ్చిదానంద విగ్రహః । శాశ్వతస్సర్వ లోకేశ స్సర్వవ్యాపీపరాత్పరః ॥ **7 శ్లో॥** అప్రమేయోదురాధర్షా నిర్గుణోనిరుపద్రవః । ఏకదాసమహాదేవః ప్రపంచం స్రష్టుమైచ్ఛత ॥ **8 శ్లో॥** ఇచ్ఛాయాస్తస్య సంజాతాయాశక్తీస్త్రి గుణాత్మికా। చాద్రా క్షీద్యోగినీం మాయాంజ్వ లంతీంతాం మహేశ్వరః **9 శ్లో॥** : ఆదిశక్తింభగవతీం యయెదంధార్య తేజగత్। దృష్టమా త్రేణదేవేన శివేనాథమహౌజసా ॥ **10 శ్లో॥** తస్యారజోవిశిష్టాయా జాతోహంమునిసత్తమ । సాత్వికాయాస్తతో విష్ణుర్జాతో నారాయణః ప్రభుః ॥ **11 శ్లో॥** తామస్యాః కాలరుద్రోయం ప్రాదురాసీన్మహాబలః **12 శ్లో॥** నారదః దేవదేవ జగత్స్వామిన్ పరమేష్ఠిన్ పితామహ । తయాప్రకృత్యా జనితో మాయయాత్వంతతో నఘ। కించకర్థ త్వ యా తాతనిశ్చితం కిం విశేషతః॥**13 శ్లో॥** కథంప్రపంచకర్తృన్ త్వ మాప్తవాన్వై మహామతె । ఏతత్సర్వం మహాభాగవిస్తరాద్వక్తుమర్హ సి॥ **14 శ్లో॥** బ్రహ్మ ॥ సాధుపృష్టం మునిశ్రేష్టత్వ యా బుద్ధివిశారద। వక్ష్యామిపృష్టం తత్సర్వం శ్రుణునారదతత్వతః॥ **15 శ్లో॥** సోహంతతో వినిశ్చిత్య దేవ దేవం మహేశ్వరం । సచ్చిదానందనిలయం పరంబ్రహ్మేతి చధ్రువం॥**16 శ్లో॥** తప్తవాన్ సుచిరంకాలం శంకరానుగ్రహేచ్ఛయా । తతస్తుష్టో మహాదేవః ప్రససాదజగత్ప్రభుః ॥**17 శ్లో॥** తం ప్రసన్నం శివం దేవం శంకరం భక్తవత్సలం । అస్తువం పరమప్రీత్యా హర్ష బాష్పాకులేక్షణః ॥ **18 శ్లో॥** : నమస్తే దేవదేవేశ నమస్తే పార్వతీపతె । నమస్తే నీలకంఠాయ నమస్తే శూలపాణయే ॥**19 శ్లో॥** నమస్తే నాగభూషాయ నమస్తే చంద్రమౌళయే । నిత్యాయ నిర్వికారాయ సదానందాయధీమ తె॥ **20 శ్లో॥** వేదవేదాంత వేద్యాయ నమస్తే పరమాత్మనే। ఏవం స్తుతో మహాదేవ శ్శివస్సర్వేశ్వరేశ్వరః॥**21 శ్లో॥** ప్రోవాచ సాదరం యన్మాం

శ్రుణుతన్మునికుంజర। శ్రీశివః॥ సాధుసాధు మహాభాగ ప్రీతోస్మితపసస్తవ॥ **22 శ్లో॥** : వరం వృణీష్వదాస్వామియత్తె మనసిరోచతె। ఏవముక్తో భగవతా ప్రహృష్టోహంజగాదతం ॥ **23 శ్లో॥** మహాదేవదయా సింధోపురాణ పురుష ప్రభో। జగత్స్రష్టాభవిష్యామి శంకరాహంతవాజ్ఞయా ॥ **24 శ్లో॥** : మయాత దైవముక్తస్తు మహెశః ప్రా బ్రవీద్వచః । యదుక్తంభవతా బ్రహ్మన్ తత్తథైవభవిష్యతి॥ **25 శ్లో॥** అద్యాతితశ్చతుర్వక్త్ర ప్రపంచం సచరాచరం । సృజానఘజగత్స్రష్టా భవిష్యసిమమాజ్ఞయా

**26 శ్లో॥** ఏవమాదిశ్యమాంశంభుస్తత్రైవాంతరధీయత । అథాహం వైప్రసాదేన దేవదేవస్యశూలినః ॥ **27 శ్లో॥** సృష్టవానస్మి సహసాప్రపంచం సచరాచరం । తతస్సృష్టాః ప్రజాస్సర్వాదేవాద్యా స్సర్వతో ముఖాః ॥**28 శ్లో॥** చెరుర్గోవృత్తివన్నిత్యం వస్త్రహీనాదిగంబరాః ప్రకాశమాన సర్వాంగా స్త్రీపుంసా మానవర్జిన్ **30 శ్లో॥** అలంకారాయ సర్వేషాం వస్త్ర నిర్మాణ కారణం । బుభత్సుః పార్వతీనాథం కైలాసమగమంతతః ॥ **31 శ్లో॥** తతఃకైలాసశిఖరే వజ్రసింహాసనస్థితం । ప్రమథైర్దేవగంధర్వై స్సేంద్రై రాక్షస కిన్నరైః **32 శ్లో॥** గరుడైశ్చారణైస్సిద్ధైర్నాగై విద్యాధరైరపి । ఆదిత్యైర్వసుభిశ్చైవ రుద్రైరప్యుగ్రమూర్తిభిః ॥ **33 శ్లో॥** కేశత్వక్పర్ణ వసనైస్సేవ్యమానం మహేశ్వరం । దృష్ట్వా హర్ష సమావిష్టః ప్రణమ్యశివమవ్యయం॥ **34 శ్లో॥** అస్తువం పరమప్రీత్యా శంకరం లోకశంకరం । నమస్తే దేవదేవేశ నమస్తే విశ్వమూర్తయే ॥ **35 శ్లో॥** నమస్తే జ్ఞానగమ్యాయ నీలకంఠాయశంభవే । పురాతనాయనిత్యాయనిరాతం కాయధీమ తె॥ **36 శ్లో॥**ఏడంస్తుతో మహాదేవఇదంవచనమబ్రవీత్ । కుశలగ తెచతుర్వక్త్రకుశలంజగతఃఖలు ॥ **37 శ్లో॥** : వినిర్మిన్ తస్త్వయాబ్రహ్మన్ ప్రపంచస్స చరాచరః । దృశ్యంతేతత్ర దేవాద్యానగ్న వేషాశ్చకుత్సితాః ॥ **38 శ్లో॥** తతస్తేషామలం కాశహెతవేఛాడనాయచ । వస్త్రనిర్మాణకర్తారం సృజత్వంచతురానన॥ **39 శ్లో॥** చింతయిత్వాత్మనో బుధ్యాయతోలోకోజుగుప్సితః । తస్యతద్వచనం శ్రుత్వా మహెశస్య మహాత్మనః ॥ **40 శ్లో॥** నారదేదంజగాదాహంబద్ధాంజలిపుట స్తతః । మహాదేవ జగన్నాథ నీలకంఠదయానిధే ॥**41 శ్లో॥** చంద్రశేఖర సర్వజ్ఞభోగిరాద్భూషణ ప్రభో । త్వదాజ్ఞయా జగత్సర్వం సృష్టవానస్మి శంకర ॥ **42 శ్లో॥** వస్త్రనిర్మాణకర్తారం శక్నుయాం నహినిర్మితుం । స్రష్టాపాలయితాహర్తాత్వమేవజగదీశ్వర ॥ **43 శ్లో॥** త్వత్కింకరాణా మస్మాకమసాధ్యం కర్మతాదృశం । ఏవం మయిబ్రువాణేతుశంకరః పునరబ్రవీత్ ॥ **44 శ్లో॥** ఆశ్చర్యం కిమిదం బ్రహ్మన్ విశ్వకర్తుర్మహాత్మనః । అస్మిన్ స్తుకింతనాశక్యం కథమిత్థం త్వయోచ్య తె॥ **45 శ్లో॥** పునర్జగాదతందేవం పార్వతీవల్లభం శివం । మయాకిమస్తి వక్తవ్యం సర్వజ్ఞాయామృతాత్మనే॥ **46 శ్లో॥** : శక్యాశక్యం మమవిభోభవాన్వే దనసంశయః । మనుర్వస్త్ర ప్రదాతాయః పురాసర్గె దివౌకసామ్ ॥ **47 శ్లో॥** సాయుజ్యమాప సయత స్త్వయిదేవముని ప్రభుః । తతో పహాయతం వస్త్ర కర్తారం చంద్రశేఖర ॥ **48 శ్లో॥** నయుజ్య తెన్యం నిర్మాతుం మయాఖలు మహేశ్వర । అమరాదిషులోకేషు దయాం కృత్వా త్వయా ప్రభో। **49 శ్లో॥** కల్పిత వ్యోవస్త్ర



కర్తా శక్యతె నెతరైర్హి తత్ । ఇత్యుక్త్వా పార్వతీనాథం తూష్టీమాసంచనారద ॥**50 శ్లో॥** తతశ్శివఃప్రసన్నాత్మా చింతయా మాసమానసె । తదాసేవాలయశ్శంభో ర్ని శ్శబ్దోభూతక్షణంమునె॥**51 శ్లో॥** ఏవంచితయతస్తస్య శంకరస్య మహాత్మనః । ఆవిర్భూతం మహజ్జ్యోతిః క్షణాత్పురుష తాగమాత్ ॥ **52 శ్లో॥** జటిలోవల్కలధరో దండాజిన కమండలుః । బిభ్రాణః పటుతేజస్వీదర్భ యుక్తాంగు ః ప్రభుః ॥ **53 శ్లో॥** రుద్రాక్షకృత కేయూరహారకంకణ శోభితః । వినీతిర్విమలజ్ఞానోమెధావీవిజితేంద్రియః । సూర్యకోటి ప్రతీకాశః తేజసాభా సర్య దిశః యజ్ఞోపవీతం భిభ్రాణః సర్వకర్మ సుసాధనం ॥ **54 శ్లో॥** ఉదారగుణసంపన్నస్సత్య వాదీదృఢవ్రతః । చాతుర్య యుక్తినిపుణః కుశలీ కీర్తి భూషణః **55 శ్లో॥** వశ్యతాం చైవ సర్వేషాం విసయం జనయ తదా । తతశ్శివో మహాదేవః శ్రుణ్వత్సుసకలేష్వపి ॥ **56 శ్లో॥** అకరోన్నామకరణం దేవలోయం భవత్వితి । తతస్తుదేవలశ్శ్రీ మా పురస్తిష్ట మహేశితుః ॥ **57 శ్లో॥** బద్ధాంజలిః ప్రతుష్టావ సదాశివనామమయం। దెవలః॥ నమస్తె దేవదేవేశ నమస్తె చంద్రశేఖర॥ **58 శ్లో॥** : నమస్తె ఫాలనేత్రాయ నమస్తెస్తుక పర్దినె। నమో గంగాధరాయాస్తు నమస్తె నాగకుండల॥ **59 శ్లో॥** : నమస్తె నీలకంఠాయ నాగహారాయ తెనమః । ఖట్వాంగధారిణేతుభ్యం నమస్తె శూలపాణయే॥ **60 శో॥** : పృథువక్షాయదివ్యాయయోగినె దీర్ఘబాహవే । యోగీశ్వరాయ యోగ్యాయ నిత్యాయాజినవాససె ॥ **61 శ్లో॥** : శుద్ధస్ఫటిక రూపాయ సోమసూర్యాగ్ని చక్షషే । నిర్మలజ్ఞానగమ్యాయ సచ్చిదానంద రూపిణే ॥ **62 శ్లో॥** : నవెూ వేదాంత వేద్యాయ శంభవెపరమాత్మనె । యజ్ఞాంగాయచయజ్ఞాయ యజ్వనెచాష్టమూర్తయె॥**63 శ్లో॥** : నమోస్తుహవ్యవాహాయ పురాణపురుషాయచ । నమోదురితదూతాయసత్యసంధాయతేనమః ॥ **64 శ్లో॥** : నమస్తె ధర్మరూపాయ నమస్తె నగకార్ముక । నమస్తె నిగమాశ్వాయ రుద్రాయామిత తెజసె ॥ **65 శ్లో॥** : నమఃపశూనాం పతయె ॥ కోటిసూర్యప్రభాయచ । నమస్తే సూక్ష్మరూపాయ నమస్తే నంతమూ ర్తయె ॥ **66 శ్లో॥** : నమస్తే పార్వతీనాథ నమస్తేమారఘాతినె । అజ్ఞానఘోరతిమిర భాస్కరాయ నమోస్తుతె ॥ **67 శ్లో॥ :** సర్వేశ్వరాయ సర్వస్మై నమ స్తే విశ్వమూర్తయె । దక్షయజ్ఞవినాశాయ నమస్తే నిర్మలాత్మ నే ॥ **68 శ్లో॥** : భక్తాధీనాయధీరా యశాంబరాయ నమోస్తుతె । పవిత్రమూర్తయెతుభ్యం సర్వగోప్త్రై నమోస్తుతె॥**69 శ్లో॥** : ఇతిస్తుత్వామహదేవం దేవలోవాక్యమబ్రవీత్ । కిమర్థమ సృజశ్శంభో కారణం మమజన్మనః ॥**70 శ్లో ॥ :** కింకార్యంవద దేవేశ భ క్తవత్సల శంకర । కిమర్థం కల్పితోదేహో చేతనోమెవినాశభాక్॥ **71 శ్లో ॥ :** దేహినో హిసదాదుఃఖ మశ్నంతోన సుఖం కదా। పంచభూతాత్మకో దేహః పంచప్రాణ సమన్వితః॥ **72 శ్లో॥ :** దశేంద్రియసమాదిష్టో మనోబుద్ధి తథైవచ । చిత్తమిత్య వ్యహంకార శ్చతుర్భిరపినంభృతః ॥ **73 శ్లో ॥ :** చతుర్వింశతితత్వానాం సమష్టిర్దేహ ఉచ్యతె । పంచవింశంతి తత్వస్థో జీవోనిత్య స్సనాతనః॥ **74 శ్లో ॥ :** వర్తతెతద్గతీ ఉభౌజీవోవిభుంనామయః । షట్చత్తు స్తత్వసంపన్నె హేమజ్జోవైభృశంతతః ॥**75 శ్లో॥ :** అజ్ఞానపాశసంబద్ధ స్సర్వదా దుఃఖమశ్నుతె । అజ్ఞానాదస్య నిర్వాచ్యాదవివేకః ప్రజాయతె॥



**1 శ్లో॥ :** బ్రహ్మ ॥ తతశ్శివాం ప్రణమ్యా సౌదెవలోవాక్య మబ్రవీత్ । దేవిలోకేశ్వరేభద్రె మాతమా ంపశ్య సాదరం॥**2 శ్లో॥ :**పయఃపారావార మహంగమిష్యామిసకౌతుకం । అనుగృహ్ణీష్వమాంనిత్యంసర్వేలోకాస్త్వదాశ్రితాః॥ **3 శ్లో॥ :** ఇత్యుక్తాదేవలెనాథ పార్వతీ వాక్యమబ్రవీత్ । గఛసౌమ్య సహాయం తెసమయె కరవాణ్యహం ॥ **4 శ్లో॥ :** శత్రవోయది బాధంతె త్వాంతదామాం భవా స్మరేత్ । తదా సన్నిహితా భూత్వానాశయిష్యామితా నహం **5 శ్లో॥ :** ఇత్యుక్తో దేవ దేవస్య ప్రియయాసమునిస్తదా । గమనాయమతించక్రె తంతుసంగ్రహ కామ్యయా । **6 శ్లో॥ :** ఇవి మాతృక పుస్తకమందు లేవు గనుక వీని లెక్క గ్రంథముతోఁ జేర్చఁబడదాయెన్ ॥

## రాక్షసోపాఖ్యాన కథనం నామ ద్వితీయోధ్యాయః

**1 శ్లో॥ :** సతుగత్వామహాతేజా దేవలఃక్షరసాగరం । సువర్ణ స్యా శ్రమేతస్థౌ తత్తీరేథ మనోహరె ॥ **2 శ్లో॥ :** రసాలసాల తక్కోల తమాలైనా రికేళకైః । సప్తపర్ణై ః కురవకైః రజు నైః పనసైరపి ॥ **3 శ్లో॥ :** అన్యైరపి మహావృక్షై ల తాభిరభిశోభితె । భృంగఝుంకార సంకీర్ణే కోకిలారావసంకులె॥ **4 శ్లో ॥ :** పారావారస్యవీచీనాం ప్రతిరోధేద్రుమాకులే । దేవలస్తత్ర వైతప్తుం చక్రైనై శ్చయికీం మతిం ॥**5 శ్లో ॥ :** అధాపశ్యం స్మహారావ సంకులం క్షీరసాగరం । యస్య ప్రమాణవైపుల్యే దుర మె వింధ్యతార్క్ష్య యోః ॥ **6 శ్లో ॥ :** బహు శైవాల సంకీర్ణంస్థలీవిభ్రమకారిణం । పునమ థనభీత్యేవ మంథానెనసురాసురైః ॥ **7 శ్లో ॥ :** డిండీరై స్తీ రపతితై ర్వ ప్రంకతు మివోద్యతం। మత్స్యపక్ష సముద్ధూత నభోగత పృషద్గణైః **8 శ్లో ॥ :** అమదైః పూజితై ము క్తా జాలై రివవిభూషితం । పూర్వామషా త్కుంభయోని మునీశ గ్రహణేచ్ఛయా ॥ **9 శ్లో ॥ :** ప్రసారయంత మాశాసు బాహుదండానివోర్మి భిః । అత్యాయతాభీరాజంతం రాజహంస నిషేవితం॥ **10 శ్లో ॥ :** దర్శయద్భిస్తత్ర తత్రమూర్ధ న్సాస్వ జలజంతుభిః । ఇతోమహంతివస్తూని నసంత్యే తైర్వినామయి ॥**11 శ్లో ॥ :** ఇతీవసర్వ దేవానాం దర్శయంతం మనోహరం । ప్రహర్ష మతులం లేభె దృష్ట్వాబ్ధిం దేవలస్తదా॥ **12 శ్లో ॥ :** తపస్తెపేసశుద్ధాత్మా మాధవానుగ్రహెచ్ఛయా । యమాదిభిర్దృఢప్రజ్ఞా నిశ్చలోవిజితేంద్రియః ॥ **13 శ్లో ॥ :** అనన్య మానస శ్రీమా యోగాసన సమాహితః । తతస్తుష్టొ హరిస్తస్మై భగవా ప్రససాదహ॥**14 శ్లో ॥ :** తంప్రసన్నం జగన్నాథం తుష్టా వహరిమవ్యయం ॥ దేవలః ॥ నమస్తె దేవదేవేశ నమస్తె భక్తవత్సల ॥ **15 శ్లో ॥ :** నమస్తె పుండరీకాక్ష నమస్తె మధుసూదన । నమస్తే మాధవానంత నమస్తే పురుషోత్తమ ॥ **16 శ్లో ॥ :** నమస్తే సర్వలోకేశ నారాయణ నమోస్తుతే । చతు భు జాయ దేవాయ శార్ఙ్గ చాపధరాయచ ॥ **17 శ్లో ॥ :** నమః కౌస్తుభ భూషాయ శంఖచక్ర గదాభృతే । నమఃపక్షీ శపత్రాయ నమస్తె శేషశాయినె ॥**18 శ్లో ॥ :** లక్ష్మీ ప్రియాయ సేవ్యాయ నమస్తె పుణ్యమూర్త యె। నమోదురిత దూరాయ దైత్యదర్ప ప్రహారిణే ॥ **19 శ్లో ॥ :** వేదవేదాంత వేద్యాయ జ్ఞానగమ్యాయధీమతె । ఇంద్రనీల ప్రతీకాశా యార్త త్రాణపరాయచ ॥ **20 శ్లో ॥ :**

